ఆచంట జానకిరామ్




# సాగుతున్న యాత్ర

(రెండవ భాగము)

ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ - 2



యాత్రికుడు　　　　జానకిరామ్

"నీ వెక్కడున్నా నీ వద్దకేవస్తాను
భిక్షాపాత్రతోగాని, నవరత్నాలు కూర్చిన కంఠమాలతోగాని !"

జా న కి రా మ్

# మనవి మాటలు

నా ఆత్మకథను గురించిన వ్యాసాలు 'నా స్మృతిపథంలో' అనే పేరుతోనూ, ఆ తరువాత, 'సాగుతున్నయాత్ర' అనే పేరుతోనూ ఎలా అవతరించాయో ఇంతకుముందు వచ్చిన సంపుటాలలో వర్ణించాను. ఆ ప్రసక్తి మళ్లా తేవడము పునశ్చరణ అవుతుంది. కాని, ఆ వ్యాసాలు ఆరీతిని రూపుదాల్చడానికి కారణభూతులైన అన్నగారు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మనూ ఆప్తమిత్రులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావునూ మరీమరీ జ్ఞాపకంచేసుకోక తప్పదు. వారిప్రోత్సాహమే నాకు ఈ కృషిలో ఆసక్తీ, ఉత్సాహమూ, ఇచ్చినవి. శ్రీ నీలంరాజు వెంకటశేషయ్య నాకు ఆత్మీయులు; వారికి నా కృతజ్ఞతను మాటలలో చెప్పలేను.

ఈ నా రచనను శ్రద్ధతో చదువుతూ, అనేకసందర్భాలలో, నా ఊహలను తమఊహలుగానూ, నా అనుభవాలను తమ అనుభవాలుగానూ పాటించి, ఆనందిస్తూ వచ్చిన నా తెలుగుప్రజతో ఈవిధంగా ఏర్పడ్డ అవినాభావము నా జీవితానికి ధన్యతను గూర్చింది. వీరందరినీ ముఖాముఖి సందర్శించి, వారిచేతిలో నా చేయి నుంచాలనే గాఢవాంఛ కలుగుతూఉంటుంది నిరంతరమూ, నాలో.

కాని, ఇందుకు ఒక జీవితకాలము చాలదేమో. అప్పుడే, మొన్నటి జూన్, 16 కు నాకు అరవైఏండ్లు నిండినవి; మరి, ఇంకెప్పుడూ, వారినందరినీ కలుసుకొనుట ! ఐతే, 'సాగుతున్నయాత్ర' ఈ రెండవసంపుటముద్వారా వారిని పలుకరింపవచ్చునేమో అనే భావము కొంత సంతుష్టినిస్తుంది.

'సాగుతున్నయాత్ర' పుస్తకాన్ని అందమైనఆకారంలో మనవారికి అందజేయడానికి మిత్రులు, సహృదయులు, శ్రీ గద్దె లింగయ్య ఎంత సాయపడినారో చెప్పలేను। ఇంగ్లీషులో, 'బ్లాంక్‌చెక్' అంటారు; అలా, "మీ ఇష్టమొచ్చినట్టు చెయ్యండి - అందము విషయంలో మీ మనస్సుకు సంతుష్టిని కలుగజెయ్యడమే నా కోరిక !" అనే, వారిమాటలు ఇప్పటికీ నాకు వినిపిస్తున్నాయి.

పుస్తకప్రపంచంలో అటువంటి ఆదర్శజీవి ఇక మనకు లేకపోవడము మన దురదృష్టము. కాని, వారు నెలకొల్పిన ఆశయాలను తప్పక పాటిస్తూ, వీలైతే, ఒకఅడుగు ముందుకుకూడా వెళ్ళడానికి ప్రయత్నిస్తారు, ఇప్పటి ఆదర్శగ్రంథ మండలి నిర్వాహకులు అని, నా విశ్వాసము.

ఇదివరకులాగే, ఈ సంపుటము మొదటిప్రతినీ్న, కైలాసవాసి ఐనా, మన అందరి హృదయమందిరములలోనూ చిరనివాస మేర్పరచుకున్న నెచ్చెలి కొంపెల్ల జనార్దనరావుకు అందిస్తున్నాను, చంద్రునకో నూలుపోగుగా.

ఆచంట జానకిరామ్

*




# "అరవైయేళ్లు"

అరవై ఏళ్ళు.

ఈ రోజు నా అరవయ్యో పుట్టినరోజు.

అరవై ఏళ్ళే!

నిన్నటివిలా మురిపిస్తున్నాయి నా చిన్ననాటి స్నేహాలూ, ఆ అనుభవాలూ. తరువాత తరువాత ఇంకా స్నేహాలూ, ఇంకా అనుభవాలూ. ఆ తరువాత ప్రారంభము, ఆశలూ, నిరాశలూ ఆశయాలూ–ఆ ఆశయాలను అందుకోలేకపోయాము అనే నిస్పృహా. మరికొన్నేళ్ళకుగాని చేతకాలేదు కొంతవరకు సరిపుచ్చుకోవడము. ...అసంతృప్తి ప్రగతికి త్రోవచూపుతుంది అంటారు. నిజమే కావచ్చును. కాని, అలా కలిగిన ప్రగతికంటె సరిపుచ్చుకోవడమువల్ల కలిగిన మనశ్శాంతే ఎక్కువగా కాంక్షింపతగినదేమో అనిపిస్తోంది, ఇప్పుడు. "మనిషికి కావలసినది మనశ్శాంతి" అనుకుంటాను, మరీ మరీ ఈనాడు.

నిన్ననే అడిగారు నన్ను ఒకరు: "మీకు ఎప్పుడూ ఏదో దొరకలేదు అని ఉండదా? మీరు కోరినది జరుగలేదని బాధపడరా ఎప్పుడూ?" అని.

ఎందుకుండదూ; ఉంటుంది, తప్పకుండా, అనుకున్నది అనుకున్నట్టు జరుగలేదనీ ఈ జీవితంలో మనసార వాంఛించిన శుభములు చేకూరలేదనీ, వెల్తి ఉండనే ఉంటుంది, మరి.

కాని, ఇటీవల నేర్చుకున్నాను, ఇటువంటి భంగపాటువల్ల బాధపడి ప్రయోజనములేదని. రావలసిన శుభములు నా ఒక్కని ప్రయత్నమువల్లనే రాగలిగితే ఎన్నడో వచ్చిఉండేవి. అటువంటి మంచికి, నా ఉద్దేశంలో, నే నెంతగా అర్హుడనైనా, ఆ శుభములు చేకూరడము నా ఒక్కనిపైననే ఆధారపడిఉండలేదుగా! పరిస్థితుల ప్రభావము కొంతా, వ్యక్తుల దృఢమనోభావాలు కొంతా మన సంకల్పాలకు అడ్డుతగులుతాయి. ఒకసారి చేతులుకాల్చుకున్నాక తెలుస్తుంది, అలా సంకల్పించడము నిష్ప్రయోజనమని. కొందరు తమచుట్టూ ఒక గిరిగీసుకుంటారు. వారు, మనకోసం, ఆ గిరిదాటి వస్తే బాగుంటుంది అనుకుంటాము మనము. వారు అలా దాటలేరు— ఒకవేళ, దాటాలని వారికున్నా. ఇది తెలిశాక, మనము ఆశింపము కూడా. అలా ఆశింపకపోవడమే మనశ్శాంతికి మంచిమార్గము.

ఐతే, ఏ మాటకు ఆమాటే చెప్పాలి: లోకానికి నేను ఇచ్చిన దానికంటే లోకమే నాకు ఎక్కువ ఇచ్చింది. ఇందుకు ఏ మాత్రమూ సందేహములేదు. అందువల్లనే రవీంద్రుడు ఈ మాటలను నాకోసమే అనినట్లు ఊహించుకున్నాను, అనేకసార్లు, ఈమధ్య:

"రోజులు గడిచిపోతున్నవి.

నేను ఒక్కడనూ కూర్చొని చింతిస్తున్నాను:

ఈ జీవితములో నాకెన్ని కానుకలు వచ్చినవి?

వీనిలో, వినియోగింపలేక, ఎన్నిటిని వృథాచేశాను!

నాకు రావలసినది ఎంత వచ్చినది?

నేను ఇయ్యవలసినది ఎంత ఇచ్చాను?

నా చివరనిమిషాలలో ఆధారంగా ఏమి మిగిలింది?

నాకు చాలా సమీపముగా వచ్చినవారి అనురాగపు స్పర్శ నా హృదయాంతర హృదయములో ఏ రాగచ్ఛాయగా నిలచి పోయినది?

నన్నువిడచి, నాకు దూరమైపోయినవారిసంగతి?

ఏదో పరధ్యానములో ఉండిపోయి, కొందరిని నేను కన్నెత్తి ఐనా చూడలేదు.

ఇప్పుడు, దూరమవుతున్నవారి అడుగులసవ్వడి
నా గుండెలలో ప్రతిధ్వనిస్తూంది.
నా ఉదాసీనతను, నాకు తెలియకుండానే,
మౌనముతో వారు మన్నించి ఉండవచ్చును."

* * *

నాకు జ్యోతిష్యములో అట్టే అంత నమ్మకములేదు-నమ్మకముంటే, బాధలు చాలా వస్తాయికాబట్టి. కాని, నేను రేడియో ఉద్యోగమునుండి రిటైర్ అయ్యేముందు, ఒకానొక ప్రఖ్యాత జ్యోతిష్కుడు నన్నుగురించి ఇలా అన్నారు: "మీరు ఉద్యోగవిరమణ చేశాకనే, మీ అసలుజీవితము ప్రారంభిస్తుంది. అప్పటినుంచే శుక్ర మహాదశ మీ జాతకములో!" అని. అప్పుడు వారిమాట నేను నమ్మలేదు; కాని, వారుచెప్పినదే నిజమేమో ననిపిస్తోంది. నేను రిటైర్ ఐన ఆరునెలలలో నా 'స్వర్ణసీత' అవతరించింది. ఆ తరువాత నా 'నవభావ కుసుమాలు'. నేను ఇదివరకు అనుకోనిరీతిని, నా అంతర్వాణి మరీ మరీ అందమైన మాటలలో పలుకసాగింది ఇలా:

'క్రిందటి కెరటపు కౌగిలింతనుండి తేరుకుంటూనే అడుగుతుంది చెలియలికట్ట: "మళ్ళా ఎప్పుడొస్తావు కెరటమూ?" అని. రెట్టించిన ప్రేమతో మళ్ళా విరుచుకుపడుతుంది, కెరటము, అని తెలుసు; కాని, ఈ క్షణిక వ్యవధి భరించడమెలా?'

*         *         *

'కొలనులో జలకమాడుతూంటే, వికసించిన తామరపువ్వు వయ్యారంగా నావైపు వ్రాలి, రహస్యంగా, నా చెవిలో అంటుంది: 'నిజంచెప్పు, నాకంటె ఆమెముఖమే అందముగా ఉంటుంది కాదూ? ...కాదూ? నీ మనసులోనిమాట చెప్పు; నేను ఏమీ అనుకోనులే!' అని.

*         *         *

'...పొన్నలూ పొగడపువ్వులూ తెల్లగులాబీ ఎర్రగులాబీ, ఇందీవరాలూ ఎర్రతామరలూ, ఏ ఋతువులో పూసినవి ఆ ఋతువులో అర్పిస్తాను, నీకు, ప్రతి ఉదయమూ, నే బ్రతికినన్నాళ్ళు, నీకు. నీవు చిరునవ్వుతో అందుకుంటావుకదూ!

...చివరకు, ఒకనాటి ఉదయము నేను రాలేకపోతాను, నీవద్దకు. అప్పుడు నీవే వస్తావుకదూ, నా వద్దకు? తప్పక వస్తావు కదూ !!'

*         *         *

"చిత్రకారునితో, రాకుమార్తె:

'కాని, నీ కళ్ళకు కనిపించేది నేనుకాదు; నా అంతరాత్మ.

నీవు చిత్రించేది నన్నుకాదు; పురూరవునికి ప్రాణమిచ్చిన ఊర్వశి ఊపిరిని!' "

*         *         *

నవభావ కుసుమాలతోపాటు సాహిత్య విమర్శ. 'ఆరు తెలుగు నవలలు' అనే నా వ్యాసపరంపర చదువరులదృష్టిని ఆరికట్టినది. ఆ నవలల అందచందాలను ఈ తరము తెలుగువారికి తేటతెల్లముచేయడము వల్ల మనవారు ఆ గ్రంథములవిలువను పూర్తిగా తెలుసుకోగలిగారేమో. చిత్రమేమిటంటే, తరువాత కొంతకాలానికి ఈ వ్యాసముల ఆధారంగా ఆ నవలలనుగురించే నేను ఇంగ్లీష్‌లో వ్రాసినవ్యాసాలు మనవారిలో ఇంకా ఎక్కువమందిని ఆకర్షించినవి. మన భాషలోని అందాలనుగురించి ఇంగ్లీష్‌లో ప్రకటిస్తేనే మనలో చదువుకున్నవారు గమనిస్తారు, కాబోలు !

ఇలా ఉండగా, ఏదో కారణంగా, మరీ భూమిలోకి క్రుంగిపోయి, సాటివారిలో తలఎత్తలేనంత దుస్థితికివచ్చిన నాకు ప్రభుత్వ ఉన్నతోద్యోగిగా రవీంద్రప్రతిభను గురించి తెలుగుదేశమంతటా ప్రచారముచేసే అద్భుతమైన అవకాశము లభించినది. ఊరూరా రవీంద్ర ఉత్సవాలను జరిపించడమూ వానిలో పాల్గొనడమూ ఎంత అదృష్టము! ఇదేనేమో శుక్రమహాదశ !!

అందుచేతనే, ఒక పాతికఏండ్లుగా 'గుండె గొంతుకలోన కొట్లాడిన' నా తెలుగు గీతాంజలి ఈనాడు అవతరించినది! రవీంద్రుని ఇటువంటి భావాలు నా రచనద్వారా తెలుగువారికి ఎంతో ఆనందాన్ని కలిగించాయి:

"నీవు నన్ను పలుకరింపకపోతే, నీ నిశ్శబ్దముతోనే నా హృదయాన్ని నింపుకొని, ఏలాగో భరిస్తాను. నక్షత్రసమూహాలను చూస్తూ తలవంచుకొని ఓపికతో వేకువకై జాగరణచేసే నిశాదేవిలా అట్టే ఉండిపోతాను.

తప్పక తెల్లవారుతుంది; ఈ చీకట్లు మాయమవుతవి.

అప్పుడు, గంభీరమైన నీ కంఠస్వరము వినిపిస్తుంది. ఆకాశ వీధులను ప్రవహించివచ్చే అపరంజి కిరణపరంపరగా."

ఈ కృషితోపాటు నాకు చాలా ఇష్టమైన స్నేహసంపద, సౌందర్యసంపద, మంచితనము, నిజాయతీ అనే నేటి చతుర్విధ పురుషార్థములనుగురించీ జనులకు విశదీకరించే సదవకాశమూ కలిగినది. ఈ సందర్భములో జరిగిన ఒక సభలో నన్ను సభవారికి పరిచయంచేస్తూ అంతవరకూ నా రచనలద్వారానే నన్నెరిగియున్న సహృదయులు ఒకరు ఇలా అన్నారు: "మంచిగంధమూ మల్లె పువ్వుల సౌరభమూ వెన్నెలా పన్నీరూ ఇవి కలిపితే, 'జానకిరామ్ హృదయము' అన్నమాట!" అని. అల్లాగే, మరో సభలోను అదే మొదటిసారిగా ప్రత్యక్షముగా నన్ను కలుసుకొనిన సభాధ్యక్షులు నన్ను గురించి ఇలా అన్నారు: "స్నేహానికీ సౌందర్యానికీ పర్యాయపదము జానకిరామ్ పేరు!" అని.

ఇటువంటి మన్ననలవలన వ్యక్తిగా నేను ఏ మాత్రమూ గర్వింపను. ఇటువంటి ఆప్యాయత నా కన్నులను చెమ్మగిలచేసి, వర్ణింపనలవికాని కృతజ్ఞతతో నింపివేస్తుంది నన్ను. నే ప్రకటించే ఆశయాలను కొందరైనా ఈ విధంగా గుర్తిస్తున్నారు, అని సంతోషిస్తాను.

నాకు తెలుసు, ఏ ఒక్క మనిషీ లోకాన్ని మార్చలేడని. అందులోనూ, స్వాతంత్ర్యము వచ్చాక, అనేక కారణాలవల్ల అనేకవిధాల అధోగతికి పాలవుతున్న మన ఆంధ్రజనానీకము

ముందు కొన్నికొన్ని ఉన్నతాశయాలను ప్రతిపాదించడము వెర్రిగానే కనిపిస్తుంది. కాని, విసుగూ విరామమూ లేకుండా ఇటువంటి ఆశయాలను ప్రచారముచేయడము నా వంటివానికి తప్పనిసరి. అందుకే నా శేషజీవితాన్ని ఈ కృషికై అంకితముచేస్తున్నాను.

ఏది ఎలాఉన్నా, నాలో ఇప్పుడు ఏ మాత్రమూ నిరుత్సాహము లేదు. నిరాశాభావము అణువంతైనా లేకపోవడమే గాక, గొప్ప ఆశాభావ మున్నది, నాలో. ఎప్పటికైనా శుభమే చేకూరుతుంది అనే దృఢవిశ్వాసమున్నది నాలో ఇప్పుడు. ఎన్ని అవరోధాలున్నా, మనిషికీ మనిషికీ మధ్య పరస్పర విశ్వాసము ఇంకా ఇంకా పెరుగుతుందనే, నేను మనసార నమ్ముతున్నాను. ఎందరెంత వికృతంగా ప్రవర్తిస్తూన్నా, కొంతకాలానికైనా జనులు త్యాగమహిమను పూర్తిగా గుర్తిస్తారనీ, "అన్ని పువ్వులు నాకేనా?" అనే చిన్నమాటలోని సత్యాన్ని గ్రహించి, తమ నిత్య జీవితాన్ని ఆ విధంగా మలచుకుంటారనీ నేను నమ్ముతాను. సత్యానికీ సౌందర్యానికీ ఇప్పటికంటే ఎక్కువ విలువకలుగుతుంది, తప్పకుండా. పూర్తిగా మంచివారైనవారిని గురించి లోకులు జాలిపడరనీ వారిని మార్గదర్శకులుగా పాటిస్తారనీ కూడా నేను మనసార ఎదురుచూస్తున్నాను.

నా నలుబదియవఏట నా మనస్థితి నాకు బాగా జ్ఞాపకం. అప్పటి నా అవస్థను కాళిదాస మహాకవి మాటలలో ఇలా వర్ణింపవచ్చును:

ధృతిరస్తమితా రతిశ్చ్యుతా
విరతం గేయమృతు ర్నిరుత్సవః

గతమాభరణ ప్రయోజనమ్
పరిశూన్యమ్ శయనీయమద్య మే॥

కాని, ఇన్నేళ్ళ అనుభవంలోనూ అటువంటి నిస్పృహ నన్ను పూర్తిగా వదలివేసింది. ఆ స్థానంలో రవీంద్రుని ఈ అమృత వచనము సుస్థిరస్థానాన్ని ఏర్పరచుకున్నది:

"ఎంత మధురమైనదీ ఈ ప్రపంచము!
మధురాతి మధురము ఈ ధూళి!!

ఎన్నిసార్లు జపించుకుంటున్నానో ఈ మంత్రాన్ని నేను:

ఎంత మధురమైనదీ ఈ ప్రపంచము!
మధురాతి మధురము ఈ ధూళి!!

ఈ భావనయే నామనుగడకు అర్థాన్ని కల్పిస్తున్నది.

నానాటికి అతిశయించే క్రొత్త కాంతులను విరజిమ్ముతూ నవరత్నముల కానుకవలె సత్యము స్ఫురిస్తూ ఉంటుంది, నా అంతరంగమున, రోజుకు రోజుకు."

ముందు ఏమి కానున్నదో, ఇకముందు ఈ జీవితము ఎలా పరిణమిస్తుందో అనే ఆలోచన ఏ మాత్రమూ లేదు, నాలో ఇప్పుడు. రవీంద్రుడు ప్రకటించిన పరమవిశ్వాసము నా భావిజీవితాన్ని ఉత్సాహముతో ఎదురుచూచే ఆత్మబలము నిస్తుంది నాకు:

"నా నిత్యజీవితములో అనుక్షణమూ నా ప్రతి ఆలోచనలోనూ నా ప్రతి చేష్టలోనూ నా ప్రతిఅనుభవములోనూ నా కట్టెదుట జరిగే బహుముఖమైన సౌందర్యసాక్షాత్కారణలోనూ, ఆ దైవమే చైతన్యమయుడై, శతసహస్రరూపమున ప్రతిబింబిస్తాడు.

'నేను ఉన్నాను' అనే భావమే సాక్ష్యము అతని ప్రేమ శాశ్వతమని నిరూపించడానికి!"

నా బ్రతుకు నేడు నందన చైత్రవనమవునో
ప్రాభాతగగన పూర్వప్రాంగణమ్మవునో
చెరదొరగు జీవమో, మరపువిడు తేజమో
నడక నెరుగని తేనె ఎరకఎరుగని త్రావి
కై సేసికోలేక కలతబడు సోయగము
పాటయై, పక్షియై, ఆశయై, హాయియై,
దెసదెసల మీరునో, కొసకొసల కూరునో!

దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి

ముందు ఏమవుతుందో మనకు తెలియదు. ఒక ఇరవై ఏళ్ళపాటు, ఈ జీవితాన్ని వింతవింత అనుభవాలతో నింపివేసి, వేలాది జనానీకానికి నిరంతర సంతోషాన్ని ఇచ్చే ఒక మహాకృషిలో పాల్గొనే అవకాశమిచ్చి, కవులతో గాయనీ గాయకులతో చిత్రకారులతో మహారాజకీయవేత్తలతో పరిచయమూ వారిలో కొందరితో అనిర్వచనీయమైన ఆత్మీయతా కలిగించిన 'ఆకాశవాణి'వ్యాసంగము నాకు లభిస్తుందని నేను నా ఇన్సూరెన్స్ఉద్యోగము పోయినపుడు ఊహించనైనా ఊహించలేదు. ఎన్నెన్ని నాటికలు, ఎన్నెన్ని ప్రసంగాలు, ఎన్నెన్ని స్వీయకవితలు, ఎన్నెన్ని కవిసమ్మేళనాలు, అంతంత అందంగా అమర్చి, మనతెలుగు సంస్కృతిని, సహస్రముఖాల వెల్లడిచేయగల అపూర్వమైన మహాభాగ్యము నాకు లభిస్తుంది అనుకున్నానా, మరి, అప్పుడు నేను!

స్నేహితునితో యథాలాపముగా అనిన ఒక్కమాట జీవితాన్నే ఎంత వింతగా మార్చివేయకలదో! ఎంతటి నవచైతన్యము, ఎంతటి నూతనోత్సాహము, ఎంతటి నిరంతరానందము కలుగజేయకలదో, ఆ ఒక్కమాటా కదలించిన కార్యకలాపము!

# సాగుతున్న యాత్ర

"మరి, ఇప్పుడేమి చేయదలచుకున్నావు?" అని ప్రశ్నించాడు రావ్, నా చిరకాలమిత్రుడు, 1938, డిసెంబర్ నెలలో, ఒకానొకరోజున, ఢిల్లీలో వారిఇంట నన్ను. ఆల్మోరాఅమ్మాయి, నిర్మల, అతనిభార్య — అప్పుడెప్పుడో, నేను వారితో కలిసి, అలహాబాద్‌వద్ద, యమునానదీవిహారంచేసి వచ్చాక, వారివద్ద సెలవుపుచ్చుకుంటూండగా, నాచేతిలో పన్నెండుజతల సన్నని గాజులు, జాజిరేకులకంటే సన్ననిగాజులు, ఉంచిన ఆ నిర్మలే — చేరువనే కూర్చొని, పిల్లకు జడవేస్తూ, మా మాటలు వింటున్నారు, ఆమె.

"ఏముంది? ఏదో ఉద్యోగంకోసం ప్రయత్నించాలికదా, మరి! .... ఈస్ట్‌ఇండియన్‌రైల్వేలో టికెట్‌కలెక్టర్‌ఉద్యోగానికి దరఖాస్తు పెట్టాను" అన్నాను, నేను.

నిర్మల ఫక్కున నవ్వారు. "మీరా! టికెట్‌కలెక్టరా! 'బాబూ! బీద వాళ్ళం, డబ్బు ఇచ్చుకోలేం' అంటే, మీజేబులో పైకముతీసి, టికెట్‌కొనిపెట్టి, గేట్‌దాకా సాగనంపి వస్తారు, మీరేమిటి, టికెట్‌కలెక్టర్ పనేమిటి!" అని, మళ్ళీ నవ్వారు, ఆమె.

రావ్ అన్నాడు: "కాదుగానీ, నాకో ఆలోచన తోస్తోంది. క్రొత్తగా వెలసిన ఆల్‌ఇండియారేడియోసంస్థవారికి నీవంటివారు ఎంతైనా ఉపయోగపడవచ్చును. కంట్రోలర్ ఆఫ్ బ్రాడ్‌కాస్టింగ్, లయొనెల్ ఫీల్డెన్, నాకు స్నేహితుడు. ఆయనను చూద్దాము, రా నాతో." అని, నా దుస్తులకేసి చూస్తూ, "ఇంకా అడయార్‌దుస్తులేనా? తెల్లలాల్చీ, తెల్లపైజామా, జరీఖండువా. అవి ఇక్కడ చలా మంచికావు!" అంటూ నిర్మలను ఉద్దేశించి, అన్నాడు: 'చూడు! నా షర్‌వానీ, కాఫీరంగుది, ఇస్త్రీచేయించి ఉంచుతావా, ఇతనికి సరిగ్గా సరిపోతుంది, టోపీకూడా ఇస్త్రీచేయించు. మధ్యాహ్నమే ఫీల్డెన్‌వద్దకు తీసుకువెళతాను, మన జానకిరామ్‌ను. ఇప్పుడే ఫోన్‌జేస్తాను" అన్నాడు రావ్.

"నేను టోపీ పెట్టుకోనే, ఎప్పుడూ" అన్నాను నేను.

"అబ్బే! టోపీ పెట్టుకోనక్కరలేదు. ఊరికే అలా చేతులో ఉంచుకుంటే చాలు, హస్తభూషణంగా!" అని నవ్వాడు.

అక్కయ్య ఇంటికి వచ్చి, ఆమెతో చెప్పాను, మధ్యాహ్నం కంట్రోలర్ ఆఫ్ బ్రాడ్‌కాస్టింగ్ వద్దకు రావ్ నన్ను తీసుకువెళుతున్నాడని.

"కంట్రోలరే! ఏమో! ఏమవుతుందో! ఐనా, ప్రయత్నం చెయ్యాలిగా. వెంటనే భోజనము చెయ్యి!" అన్నది అక్కయ్య ఆప్యాయంగా.

.... ఇది రెండవసారి, ఇలా ఉద్యోగంపోగొట్టుకుని, ఏకాకినై, కట్టుగుడ్డలతో నేను అక్కయ్యవద్దకు రావడము. పట్నంనుంచి బయలుదేరేముందు వ్రాశాను, ఆమెకు — అప్పుడు నాకు చాలా ఇష్టమైన అక్షన్‌బ్రిడ్జ్‌పరిభాషలో — "అక్కయ్యా! మూడు కళావర్లకుకూడా పనికిరాని పేకముక్కలు చేతిలో నుంచుకొని, నాలుగు నోట్రంప్‌లు పాడి, ఓడిపోయాను అక్కయ్యా! .... జీవితమే నన్ను మోసంచేసిందో, నన్ను నేనే మోసంచేసుకున్నానో చెప్పలేను. కాని, నేను మళ్లా, నిరుద్యోగినీ ఏకాకినీ ఐనాను. నాన్నగారు, మళ్లా, నన్ను నీవద్దకు వెళ్ళమన్నారు. బయలుదేరి వస్తున్నాను" అని వ్రాశాను. కలకత్తాకు అవతల, భగల్‌పూర్‌కు సమీపాన, ఉన్న ఆమెకు. నేను ఆమెవద్దకు వెళ్ళాక, వారికి ఢిల్లీ బదిలీ ఐంది.

ఇన్సూరెన్స్ పని అటువంటిదే. ఏదో పెద్దలాభంవస్తుంది అనుకుంటాము. కొండంత ఆశ కల్పిస్తారు ఏజంట్లూ తదితరులూను. కళ్ళుమూసుకు ఖర్చుపెట్టాలి — అంతఖర్చు రెండింతలు మూడింతలు ప్రతిఫలిస్తుందనే ఊహతో. పెద్దపెద్ద ఉద్యోగస్తులనూ పలుకుబడిగల పెద్దమనుష్యులనూ నా కార్‌లో వేసుకొని మా కంపెనీ తరఫున విశేషప్రచారం చేశాను. నా కృషి కంపెనీకి లాభించింది. కాని, నాకుమాత్రము చివరకు మిగిలినది ఆశాభంగమూ ఆర్థిక సమస్యా. కొన్నిఏళ్ళపాటు నాతో వీడని స్నేహంతో దేశము నాలుగుమూలలా తిరిగిన నా మోటార్‌కార్‌ను, స్నేహితునికంటె ఎక్కువ ఆప్యాయమైన ఆ కార్‌ను

హైర్‌పర్చేస్ కంపెనీ వారికి అప్పగించివేసి, మిట్టమధ్యాహ్నం, మవుంట్ రోడ్‌లో కాలినడకను వెళ్ళిపోయాను. పట్నంలోనే కొంత ఉద్యోగప్రయత్నం చేశాను.

నాకు, అప్పుడూ ఇప్పుడూ కూడా, ఎవరైనా గొప్పవ్యక్తికి ఆంతరంగిక కార్యదర్శిగా ఉండాలనే గొప్ప కుతూహలము. అదేమిటో వెర్రినమ్మకము, నా చాకచక్యంవల్లా నా కృషివల్లా వారి గుణగణాలు లోకానికి మరింత ఎక్కువగా వెల్లడికాగలవనే వెర్రినమ్మకము. ఈ అభిప్రాయంతో తిన్నగా, జిడ్డు కృష్ణమూర్తి ఉపదేశాలను ప్రచారంచేసే సంస్థఉన్న వసంతవిహార్‌కి వెళ్ళి, ఆఫీస్ మానేజర్‌గా ఉన్న ద్వారకనాద్ తిలంగ్‌ను దర్శించాను. ఆయన చాలా బాగా చదువుకున్నారు, ఆక్స్‌ఫర్డ్ ఎమ్. ఏ. నేను అడయార్‌లో విద్యార్థిగా ఉన్నప్పుడు మాకు ఇంగ్లీష్ సాహిత్యంగురించి ఉపన్యసించేవారు, తిలంగ్. నన్ను చాలా ప్రేమతో పలుకరించి, యోగక్షేమాలడిగారు. కాని, శ్రీ కృష్ణమూర్తికి ఆంతరంగిక కార్యదర్శిగా ఉండడముకోసము వచ్చానని చెప్పేసరికి, ఆయన అన్నారు: "నీవంటి బుద్ధిమంతుడూ,కార్యదీక్ష కలవాడూ ఆయనకు కార్యదర్శిగాఉంటే చాలా బాగుంటుంది, నిజమే. కాని, మరి, నేను ఉన్నానుగా — నేను ఉన్నంతకాలమూ ఇద్దరకు పని ఉండదు, ఇక్కడ" అన్నారు. తలవంచుకు వచ్చివేశాను.

ఆ సాయంత్రము, స్నేహితుడు, ప్రఖ్యాత చిత్రకళావేత్త, వి. ఆర్. చిత్రాను చూడడానికి వెళ్ళాను, ఇల్లా కలకత్తా వెళుతున్నానని చెప్పడానికి. నా సంగతి విని, "అన్నట్టు అంతదూరం వెళుతున్నావు, లక్నోకూడా వెళ్ళరాదా? లక్నోలో నా స్నేహితుడు అసిత్‌కుమార్ హాల్‌దార్ చిత్రకళాశాల ప్రిన్సిపాల్‌గా ఉన్నాడు. నీవంటి కళాప్రియుడూ రచయితా విమర్శకుడూ అతనికి చాలా అక్కరకు రావచ్చు. నేను ఉత్తరం వ్రాస్తాను అతనిపేర. తప్పక వెళ్ళిచూడు," అన్నాడు చిత్రా. లక్నో! ఇదివరకు ఒకపర్యాయము చూచాను, ఆ ఊరు. సుందర నగరము. హిందూ, మొగల్, పాశ్చాత్య సంస్కృతీ లక్షణాలు అన్నీ, ఒకేచోట, ప్రక్క-ప్రక్క-నే కనిపిస్తూంటాయి, లక్నోలో. అద్భుతమైన జంత్రగాత్ర ప్రవీణతకు పుట్టినిల్లు, లక్నో. కాని, నేను లక్నో వెళ్ళలేకపోయాను.

# సాగుతున్న యాత్ర

నేనూ, నా వయొలిన్‌పెట్టే,—సాధకము మానినా, పదేళ్ళగా నాతోనే ఉన్నది, బెంగుళూరులో కొనిన నా వయొలిన్, మనసొచ్చి ఏ నిమిషమైనా మళ్లా ప్రారంభింపవచ్చుననే ఆశతో, కూడానే ఉంచుకున్నాను — కొన్ని ఉదయిని కాపీలూ నా రచనలుగల త్రివేణి ఆంగ్లపత్రిక కాపీలు కొన్నీ, వీనితో దిగాను, కలకత్తాలో. బెంగుళూర్‌లో నాతోకలసి శాస్త్రపరిశోధనచేసిన చటర్జీ నన్ను స్టేషన్‌లో కలసికొని, తనబసకు తీసుకువెళ్ళి సత్కరించి, ఆ సాయంత్రము భగల్‌పూర్‌కు రైలు ఎక్కించాడు.

అక్కయ్యా బావా నన్నుచూచి చాలా సంతోషించారు. మా బావ, మీర్‌చందానీ ఎక్కువ మాట్లాడడు. చిరునవ్వుతో అడిగాడు నన్ను: "కొత్తగా పద్యాలేవైనా వ్రాశావా?" అని. త్రివేణి కాపీలు అతనిచేతి కిచ్చాను, ఆ నా రచనలు అతను ఇదివరకు చూచిఉండలేదుగనుక.

ఆ సాయంత్రము అలా చెరువుగట్టుపైన షికారువెళుతూండగా, అక్కయ్య అన్నది: "నీవు మాకు భారముకాదు, ఎప్పటికీ. కాని, 'ఉద్యోగం పురుషలక్షణం' అన్నారుకదా! పైగా, ఏదో నియమితమైన వ్యాపకము లేకపోతే, మానసికంగా నీవు కలతపడతావు. ఏదైనా ఉద్యోగంకోసం ప్రయత్నించు. జీతం ఎంత తక్కువైనా ఫరవాలేదు. మేమున్నాముగా, నీ యోగక్షేమాలు కనుక్కోడానికి," అన్నది.

మరునాడు ఉదయమే స్టేట్స్‌మన్ పత్రికనుజూస్తూ ఈస్టిండియన్ రైల్వేవారి ప్రకటనను చదివి టికెట్‌కలెక్టర్ ఉద్యోగానికి దరఖాస్తుపెట్టాను.

ఆ మరునాడే నాన్నగారివద్దనుంచి ఉత్తరం వచ్చింది. "మీ పినతల్లి రుక్మిణమ్మా, నేనూ కలకత్తా వస్తున్నాము, కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీ సమావేశమున పాల్గొనడానికి ఆమె, ఇన్సూరెన్స్‌పనిమీద నేనూ. నీవూ, జానకిరామూ కలకత్తావచ్చి మమ్మల్ని కలుసుకుంటే బాగుంటుంది" అని వ్రాశారు, నాన్నగారు.

అక్కయ్యా, నేనూ కలకత్తా వచ్చాము, భగల్‌పూర్‌నుంచి. విశ్వప్రఖ్యాతిగాంచిన కవిరాజ పండిత గణనాద్‌సేన్‌వారి ఐదంతస్థుల చలువరాతిభవన

ములో మా బస. గణనాద్‌సేన్ నాన్నగార్కి ఆప్తస్నేహితుడు. నేనంటేనూ చాలా ఆప్యాయము, వారికి. ఆయన గొప్పవైద్యుడు. ఆయనకున్న ఆయుర్వేద విజ్ఞానాన్ని, ఆయన మంచిహస్తాన్ని పాటించి వంగదేశీయులేగాక, ఇతరప్రాంతాల వారున్నూ వేలకువేలు గ్రుమ్మరిస్తారు, ఆయన వైద్యంకోసము.

నాన్నగారితోను రుక్మిణమ్మ పిన్నిగారితోనూ కలసివెళ్లాము అక్కయ్యా నేనూ వర్కింగ్‌కమిటీ సమావేశం చూడడానికి. ఆ సభ చరిత్రాత్మకమైనది.

ఆ సభలోనే అనుకుంటాను, సుభాష్‌చంద్రబోస్‌కీ జవహర్‌లాల్ నెహ్రూకీ ఘర్షణ జరిగినది. అప్పుడే నేను సుభాష్‌చంద్రబోస్‌ను మొదటిసారీ, ఆఖరుసారీకూడా, చూస్త. సభాప్రాంతంలో ఏదో కారణమువల్ల గల్లంతై, వాలంటీర్లూ ప్రజలూ కొట్టుకోడానికి సిద్ధమయ్యారు. ఆ మిషమీద పోలీసులు చెయిజేసుకోబోతున్నారు. పచ్చగడ్డివేస్తే భగ్గుమనే స్థితిలో ఉన్నది, వాతావరణం. ప్రేక్షకులు ఊపిరిబిగబట్టి చూస్తున్నారు, ఏమి అవుతుందోనని. ఆ నిమిషాన కాలినడకను అక్కడకు వచ్చారు ఒక వ్యక్తి. తెల్లని ఖద్దరుదుస్తులు, అందమైన ఖద్దరుటోపీ, పదహారువన్నెల బంగారుఛాయ దేహకాంతి. ఆ కళ్ళలో విపరీతమైన ఆకర్షణాశక్తి! లక్షమందిలో ఆ వ్యక్తిని విడమరచి గుర్తింపవచ్చును. వేయికంఠస్వరాలలో విడిగా వినవచ్చు, ఆయన కంఠస్వరము. బెంగాలీ భాషలోనే అన్నారు, ఒక్కమాటే: "ఏమిటిది?" అని. ఒక్కక్షణం ఆగి మళ్లా అన్నారు: "చేయవలసినపని చాలా ఉన్నది, ఇలా కాలయాపనచేస్తే ఎలాగ?" అని.

అంతే! మత్తుమందు చల్లినట్టు అల్లరి అణగిపోయింది. ఈవైపు వాలంటీర్లూ ఆవైపు ప్రజా ఎవరితోవను వారు వెళ్ళిపోయారు, గప్‌చిప్ మనకుండా.

అప్పుడు రుక్మిణమ్మ పిన్నిగారు అన్నారు, మాతో: "అతనే, సుభాష్ చంద్రబోస్, చూశారా, ఆ ఠీవీ ఆ దర్జా అద్భుతమైన ఆ ఆత్మవిశ్వాసమూ!" అని.

....అక్కయ్యా నేనూ భగల్‌పూర్ తిరిగి జేరేసరికి ఢిల్లీనుంచి ఆర్డర్ వచ్చి ఉన్నది మా బావ మీర్‌చందానీని ఢిల్లీకి బదిలీచేస్తూ. మరునాడే, మా ఢిల్లీ ప్రయాణము.

# సాగుతున్న యాత్ర

మళ్లా, ఢిల్లీ. మళ్లా చిరపరిచితమైన ఢిల్లీ వాతావరణం. ఒకవంక ఇంద్ర ప్రస్థ, హస్తినాపుర ప్రాచీనగాథల ఆనవాళ్ళు, ఒకవంక మొగలాయి ఢిల్లీ, ఒక వంక ఇరవయ్యోశతాబ్దపు నాగరికతా లక్షణములతో బ్రిటిష్‌వారి న్యూఢిల్లీ. న్యూఢిల్లీ లోని సౌధాలనిర్మాణంలో చాలవరకు ఆధునిక శిల్పులు తమ ఊహనంతా ఉపయో గించి హిందూ శిల్పరీతులకూ మొగల్‌శిల్పరీతులకూ ప్రాధాన్యమిచ్చారు.కాని, వాతా వరణ మాత్రము పూర్తిగా తెల్లవారిదొరతనపు వాతావరణే!

క్రిందటిపర్యాయము అక్కయ్యతో న్యూఢిల్లీలో ఉన్నాను—అప్పు డామె హాస్పిటల్ ఆవరణలో ఒక బంగళాలో ఉండేది. ఇప్పుడు పాతఢిల్లీకి ఆవల, బ్రిటిష్‌వారు నిర్మించుకున్న ప్రభుత్వభవనాలలో ఒక చిన్నఇల్లు ఇచ్చారు మా బావకు. అక్కడ మా బస. యమునానదీ తీరాననే; చాలా హాయిగా ఉండేది.

ఊర్లోకివచ్చిన మరునాడే, న్యూఢిల్లీలో ఉన్న నా స్నేహితుడు ఆర్.ఎల్.రావును చూడడానికి వెళ్ళాను.అత డిప్పుడు మంచిఉద్యోగంలోఉన్నాడు. చాలారోజులైంది చూచి, అని, పలుకరించి రావడానికి వెళ్లాను వారి బసకు.

ఆ పలుకరించడము మూలాననే అతనితోకలసి కంట్రోలర్ ఆఫ్ బ్రాడ్ కాస్టింగ్ ఐన లయొనెల్ ఫీల్డెన్‌ను దర్శించడము సంభవించినది, నా ఉద్యోగం కోసం.

బ్రిటిష్‌ప్రభుత్వపు కట్టుదిట్టాలు ప్రబలంగా ఉండే రోజులవి. రావ్‌తో కలసి వెళ్ళబట్టిగాని, లేకపోతే నాకు కంట్రోలర్ దర్శనమై ఉండేది కాదు. కాని, రావ్ నన్ను వారికి పరిచయము చేసీచేయడముతోనే ఫీల్డెన్ నన్ను కూర్చోనియ మించి ఆప్యాయంతో పలుకరించారు:

"రావ్ చెప్పాడు నీ విషయము, ఇంతకుముందు ఏమి పనిచేస్తూఉండే వాడవు?" అని.

నేను తాపీగా చెప్పివేశాను, నా ఇన్సూరెన్స్ కృషిగురించీ, అంతకు ముందు కేంద్ర శాసనసభికుడు రామేశ్వర్‌ప్రసాద్ బగ్లాకు కార్యదర్శిగా పనిచేసిన

విషయంగురించీ అంతకుముందు ఒక ఏడేళ్ళు బెంగుళూర్‌లో నా విజ్ఞానశాస్త్రి పరిశోధనగురించీ ఇంకా అంతకుముందు నా అడయార్ చదువుగురించీ.

నా చరిత్ర ఓపికతో విని అతిస్నిగ్ధదరహాసంతో అడిగారు, ఫీల్డెన్: "నీవు దివ్యజ్ఞానసమాజ సభ్యుడవా!" అని.

"సభ్యుడను గాను; కాని, నేను పెరిగిన వాతావరణం అంతా ఆ వాతావరణే! జేమ్స్ కజిన్స్ మా గురువు, బెసెంట్ మాకు మార్గదర్శకురాలు—ఆమె నా రచనలు కొన్ని చదివి ఆనందించారు కూడాను" అన్నాను.

ఫీల్డెన్ నవ్వుతూ అన్నారు: "ఓహో! నీవు కవివికూడానా! నీ రచనలు ఏమైనా తెచ్చావా?" అని.

త్రివేణి సంచికలు వారిచేతి కిచ్చాను.

ఆసక్తితో చదివారు ఆయన: 'కన్నీరు' అనే రచన, 'దివ్యమందిరము' అనే రచన, కృష్ణశాస్త్రి గేయానికి నా అనువాదమూను.

పుస్తకాలు నా చేతికిస్తూ రావ్‌ను ఉద్దేశించి అన్నారు ఆయన: "మాకు ఇటువంటివారే కావాలి. పెద్ద పెద్ద పరీక్షలిచ్చి కేవలం విజ్ఞానవంతులూ మేధావులూ ఐనవారికంటె ఇలా జీవితపు ఒడుదుడుకులకు ఎన్నో అనుభవించి, ఆశ, నిరాశ రుచిచూచి, భావిజీవితాన్నిగురించి కొంత ఉత్సాహంతో, కొంత భయంతో చూసేవారే కళానిలయమైన ఈ సంస్థకు అక్కరకు వస్తారుసుమా!" అని.

నావైపు జూస్తూ అన్నారు, ఫీల్డెన్:"నిన్ను ఆల్ ఇండియా రేడియో ఢిల్లీ కేంద్రంలో ప్రొబేషనర్‌గా తీసుకుంటాము. కాని, జీతము చాలా తక్కువ, ఏబది రూపాయలే, అంగీకారమేనా?" అని.

నేను వెంటనే అన్నాను! "నాకు చాలు, అసలు ఈ వ్యాపకము నాకు చాలా ఇష్టమైనది. ఇందు పాల్గొనాలని నాకు ఆసక్తి, అభిలాషా ఎక్కువ!"

అంటూ, వారిని చూడటానికి బయలుదేరేముందు "భారతదేశంలో భావి రేడియో విధాన వికాసము" నుగురించి వ్రాస్తూ, ఇంటింటా రేడియో వెలసి భారతీయ సంస్కృతిని నేల నాలుగుమూలలా వ్యక్తపరుస్తూ జనుల నిత్యజీవితాన్ని అద్భుతమైన ఆనందంతోనూ విజ్ఞానంతోను నింపివేసే అవకాశం ఎంత ఉన్నదో వివరిస్తూ నేను వ్రాసిన చిన్నవ్యాసాన్ని వారిచేతి కందిచ్చాను.

నా రచన పారజూచి మళ్ళీ ఆ అందమైన మందహాసంతోనే ఫీల్డెన్ అన్నారు: "ఎంతటి ఆశావాదిని నీవు! నీవు అనుకున్న స్వర్ణయుగం ఇప్పటిలో అవతరిస్తుందో లేదో చెప్పలేము. సరే, ఇదిగో ఈ కార్డ్ తీసుకువెళ్ళి ఢిల్లీ కేంద్ర డైరెక్టర్‌కి ఇయ్యి" అంటూ, తన విజిటింగ్ కార్డ్‌పైన పెన్సిల్‌తో రెండుపంక్తులు వ్రాసి కవర్‌లోఉంచి నా చేతికిచ్చారు.

తరువాత రావ్‌తో ఇష్టాగోష్టిలో మునిగిపోయారు, ఫీల్డెన్,

....ఫీల్డెన్ ఇచ్చిన కవర్ స్టేషన్ డైరెక్టర్‌కు ఇచ్చాను. ఆకార్డ్‌పై వ్రాసిన మాటలను ఇలా బిగ్గరగా చదివారు ఆయన:

"ఇతను, జానకిరామ్, మద్రాస్‌నుంచివచ్చాడు. మీస్టేషన్‌లో పనినేర్చుకునే అవకాశ మియ్యవచ్చేమో చూడవచ్చు. జానకిరామ్ మనకు అక్కరకు వస్తాడనుకుంటాను, నేను"—అని ఉన్నది.

ఆ విజిటింగ్ కార్డే, నా ఉద్యోగపు ఆజ్ఞాపత్రంగా పరిణమించింది. వెంటనే పనిలో ప్రవేశించాను.

ఇప్పుడు తలచుకుంటే వింతగా ఉంటుంది, అప్పటి స్టూడియో నిర్మాణమూ, అప్పటి ప్రసార సౌకర్యాలూ గురించి. కాని, ఎంతటి అద్భుతమైన కృషి జరిగేది, ఆ స్వల్ప సౌకర్యాల సహాయముతోనూ!

స్టూడియోలో నేను మొట్టమొదట చూసినవారు నారాయణరావ్ వ్యాస్. ఆయనే నన్ను పలుకరించారు, "నీవు ఆంధ్రుడవు కాదా?" అని. ఆయన చెప్పారు,

అంతకు కొన్నాళ్ళముందే జరిగిన తమ గుంటూరు సంగీతసభలనుగురించీ ఆంధ్రులకు ఆయనబాణియందుగల ప్రత్యేకమైన ఆసక్తిని గురించీ.

ఆరోజులలో. అఖ్తరీబాయ్ పదహారేళ్ళబాలిక. సుశ్రావ్యమైన కంఠస్వరము, ఆమెది. సౌజన్యశీలి, ఆమె. హిందూస్థానీబాణిలోనే ఉన్నదేమో ఆ ఆర్ద్రిత—ఎంతో హృద్యంగానూ మనోహరంగానూ ఒక్కొక్క మాటా ఒక్కొక్క భావమూ, పూర్తిగా అనుభవిస్తూ, గానముచేసేది ఆమె. ఉమ్రాజియా బీగమ్ లలితసంగీతము పాడేవారు. ఆవిడ ప్రోగ్రామ్ ఉన్నరోజు ఉదయం ఒక నూరు టెలిగ్రాములూ ఉత్తరాలూ వచ్చిఉండేవి. ఆమెను "మేరే సలామ్ లేలేవ్!" అనే పాట పాడమని కోరుతూ, శ్రోతలవద్దనుంచి. అద్భుతమైన భక్తిరసానందము కలిగించేది, ఆ చిన్నపాట. మక్కా-ముసల్మానులకు అతి పవిత్రస్థలము. మక్కాను సందర్శింప కలిగితే జన్మతరించినట్టే! మక్కా-సందర్శనము జీవితపరమావధి, వారికి. తాను స్వయంగా ఆయాత్రపై వెళ్ళలేని ఒక భక్తుడు, ఆవేపు వెళుతూన్న ఒక ఒంటెలను తోలువానిని ప్రాధేయపడుతూ అనేమాటలు అవి: "దయఉంచి నా సలాములు తీసుకువెళ్ళా, మక్కాకు!" అని. ఈ 'సలామ్ పాట' రేడియోలో ఉమ్రాజియా బీగమ్ వినిపిస్తూంటే, ఇళ్ళల్లో, వీధుల్లోఉన్న వేనకువేల జనం అట్టే ఆగి వినేవారు. కొందరు కన్నీరు రాల్చేవారుకూడా, భక్తిపారవశ్యంచేత. అంతటి అనుభూతిని కలిగించేది, ఉమ్రాజీయా ఆ పాటద్వారా,

నేను పనిలో ప్రవేశించిన మూడవనాడే ఆల్ ఇండియా రేడియోవారు దక్షిణప్రాంతాలకు ప్రత్యేక ప్రసారం ప్రారంభించారు, ఢిల్లీ కేంద్రమునుంచి. భారతీయ బ్రాడ్‌కాస్టింగ్ విధానంలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమన్నమాట.

సాయంత్రం సరిగ్గా ఆరున్నరకు, నేను మైక్రోఫోన్ ఎదుట కూర్చుని అన్నాను: "ఆల్ ఇండియా రేడియో, ఢిల్లీకేంద్రము, దక్షిణప్రాంతాలకు ప్రత్యేక ప్రసారము, కుమారికమల గానము" అని.

ఆ మాటలు అంటూఉంటే, ఒకవింత విద్యుచ్ఛక్తి నాలోని ప్రతి అణువునూ వింతగా స్పందించింది.

## సాగుతున్న యాత్ర

ఏదో అద్భుతమైన ఉత్సాహంతో త్రుళ్ళింతలాడాయి నా నరాలు! మేలు కిన్నెర కంఠస్వరంతో పన్నెండేళ్ళ కుమారి కమల పాడ నారంభించింది. "యోచనా, కమలాలోచనా!" అంటూ.

అప్పుడో తమాషా జరిగింది: ఆ సమయానికి, తంబూరావేసే అతను దగ్గర లేకపోగా, నేనే తంబూరా మీటవలసి వచ్చింది. ఇంతవరకూ ఏమాత్రమూ అనుభవం లేనందున్న, శ్రుతి సరిగ్గా అందియ్యలేకపోయాను. బాలగాయకి బిత్తర బోయింది. కాని, వెంటనే, తరువాతవచ్చే తన కార్యక్రమానికై సంసిద్ధురాలై మాప్రక్కనే వేచిఉన్న గాయనీమణి ఒకామె తంబూరా అందుకుని మీటనారంభించారు. అనిర్వచనీయమైన మాధుర్యంతో ఓంకార నాదమువంటి నాదము స్టూడియో అంతటా వెల్లువలా విరిసింది. కుమారి కమల ముఖము వింతగా వికసించింది. మెరిసే కళ్ళతో ఆమె తన పాట ముగించింది.

ఆ తంబూరా మీటిన ఆమె, షోలాపురపు మెహబూబ్ జాన్! కార్యక్రమానంతరము, ఆమె కుమారి కమలను చాలా బుజ్జగించి, మాతో ఎంతో చనువుగా మాట్లాడారు. నేనూ చెప్పాను ఆమెతో బెజవాడలో ఉండగా, నేను ఆమె పాటలు రికార్డ్లు అన్నీ సేకరించాననీ, గంటల తరబడి ఆమెపాట వింటూ తన్మయుడనై పోతూ ఉండేవాడనని.

....రాత్రి పదకొండు గంటలకు ఆనాటి రేడియో ప్రసార కార్యక్రమాన్ని ముగించుకుని బ్రాడ్‌కాస్టింగ్‌లో నా తొలి అనుభవాన్నిగురించి నెమరు వేసుకుంటూ, ఇంటికి వెళ్లాను, "ఎంతగొప్ప అవకాశము! ఎంత గొప్ప అవకాశము!" అనుకుంటూ.

అప్పటి నాలోని అవేశాన్నీ ఉత్సాహాన్నీ, స్నేహితుడు కొండేపూడి సుబ్బారావు కవితలో ఇలా వర్ణింప వచ్చేమో:

## సాగుతున్న యాత్ర

ఉదయకాంతుల పసిడితీగొకటి మెరసినది
మృదుపుష్ప గర్భమున రేకొకటి విరిసినది
లలిత సుందర దివ్య లావణ్య నవజీవ
మధుమాస సుధలలో హృదయమే పొంగినది!

## ౨

కన్నియగాని వేరొకతెగాను
మనోహరరూప! నీకు నే
జన్నియ వెట్టి యుంటి నెల
జవ్వనమంతయు నేటిదాక నా
కన్నులయాన, నా వలపుగస్తురి
నామముతోడు నమ్ము కా
దన్నను నీదు మోవి మధురా
మృత మానిట బాససేసెదన్ !!

చేమకూర వేంకటకవి

యమునావది ఒడ్డున కూర్చుని, చేమకూర వేంకటకవి రచించిన విజయ విలాసము చదువుతున్నాను. ఈ ఉలూచి కథ నాకు చాలా ఇష్టము. వేంకట కవి చేసిన చక్కని, అతి స్వాభావికమైన, వర్ణనల వలన ఉలూచి నామనోవీధిని ఒక ప్రస్ఫుటమైన ఆకారంతో మసలుతోంది, కొంతకాలమునుంచి.

ఎంత అందమైన ఒట్టు! "నాకన్నులయాన", "నా వలపు కస్తురి నామము తోడు!!" ....ఎవరు నమ్మకుండా ఉంటారు, అట్టి అనురాగ ప్రకటనను! విజయ విలాసములోని ఉలూచీ పారిజాతాపహరణములోని సత్యభామా, నాకు అత్యంత ప్రీతిపాత్రులు. సత్యాదేవి పాత్రను ఎంత చక్కగా పోషించాడు, కవి!

రుక్మిణీదేవి అంటే ఒకవిధమైన గౌరవమూ, ఒకమోస్తరు భక్తీని నాకు. సత్యఅంటే సానుభూతితోగూడిన స్నేహభావమూ ఆప్యాయతాను, నాకు. అందుకే, ఇష్టాగోష్టిలో నున్నప్పుడు, వారిద్దరిని గురించీ వేరువేరుగా వర్ణిస్తూ

అంతరాయాలు విడమరచి చెపుతూ, వినేవారికి కొంత ఉల్లాసము కలుగజేస్తూ ఉండేవాడను. సత్య సన్నంగా బక్క పలాచగా ఉంటుంది. రుక్మిణి కాస్త లావు. సత్య ముఖము కోలగా ఉంటుంది. రుక్మిణి ముఖము గుండ్రము. రుక్మిణి దేహచ్ఛాయ పదహారు వన్నెల బంగారపు చాయ, ఏనుగు దంతపు తెల్లదనంతో కాస్త గులాబీ ఎరుపు కలిగి ఉంటుంది సత్య మేనికాంతిలో. సత్య చంద్రకాంతపు పువ్వులాంటి ఎరుపూ ఊదా కలసిన రంగు పరికిణీ పైన తెల్లజరీచీర వల్లెవాటుగా వేసుకుంటుంది. రుక్మిణి నెమిలిపింఛపు రంగులో బెంగుళూరు పట్టుచీర కట్టుకుంటుంది. సత్యకు పల్చని వెడల్పయిన మువ్వల వడ్డాణమూ ఒంటిపేట బంగారపు గొలుసూ ఇష్టము. రుక్మిణికి కంటే కాసులపేరూ ఇష్టము. కృష్ణుడు తన ఇంటికి వస్తున్నాడని సత్య అతనికోసం మామిడికోరు పెరుగు పచ్చడి చేస్తుంది — ఈ ధోరణిని చెప్పుకు పోతూ ఉండేవాడను. స్నేహితులు ఆనందిస్తుండేవారు. అన్నట్టు, సత్య, నక్షత్రంలా, కనిపించీ కనిపించకుండా, చిన్నకల్యాణపుబొట్టు పెట్టుకుంటుంది— బుగ్గనుకూడా! రుక్మిణి అరకాసంత కుంకుమ బొట్టుతోగాని కనిపించదు, ఎప్పుడూను!!

ఉలూచీ నాకు సత్యాదేవంత ప్రియమైన ప్రబంధనాయిక. అందులోనూ, నాగకన్యక కూడానా మరి, నాలోనేను నిర్మించుకున్న ఉలూచీరూపము ఎంతో ఆకర్షణీయముగా అమరింది. ఆమె కన్నులలో వింత ధగ ధగ కనిపించేది, నాకు. శలాకలా ఉండే ఉలూచి గిరగిరా తిరుగుతూ నదీగర్భములోంచి పైకివచ్చి, స్నానమాడుతూన్న అర్జునుని అమాంతగా నాగలోకములోకి ఎత్తుకుపోవడము నాకు ఎంతో నచ్చింది. తరువాత, ఆమె సంభాషణ చాలా హృద్యంగా ఉంటుంది.

అసలు, నాకు విజయవిలాసముతో పరిచయము కలిగించిన పుణ్యము ఆప్తులూ, స్నేహితులూ ఐన తాపీ ధర్మారావుకు చెందినది. ఏడాదిక్రితము మద్రాస్‌లో వారిని తరుచు కలుసుకుంటూ ఉండేవాడను —కేవలమూ, సాహిత్యగోష్ఠి కోసము. సాహిత్య విషయాలలో ఆయన వజ్రాలగని వంటివారు. వారు చెప్పగా, ఎన్నెన్ని క్రొత్త క్రొత్త విషయాలు వినినా, ఇంకా ఎన్నో ఎన్నో క్రొత్త సంగ

తులు వినాలనిపించేది. వారుపదిలపరచినసాహిత్యనిక్షేపము అటువంటిది! వారుచెప్పే తీరూ అటువంటిదే. ఎంతో ఉత్సాహము, ఎంతో ఉల్లాసము. ఎప్పుడూ నవ్వుతూ, ఎంతో సులాసాగా మంచికబుర్లు అంత బాగా చెప్పగలిగేవారు చాలా అరుదు. ఒకనాడు, ఏదో మాటల సందర్భాన, విజయవిలాస ప్రతిభను గురించి చెప్పారు, ధర్మారావు, నాతో. ఆ తర్వాత చాలాపర్యాయాలు నాకు నేనే చదువుకున్నాను, ఆ రచనను. ముఖ్యంగా, ఉలూచి వృత్తాంతము నన్ను చాలా ఆకర్షించింది. హేమంతఋతువు కాబట్టి నాయెదుట యమున అతి సన్నగా ప్రవహిస్తోంది. అతిస్వచ్ఛమైన ప్రవాహము. ఎప్పుడో ఒకనాడు, ఇటువంటి నీటనే జలకమాడుతున్నాడు, అర్జునుడు. అప్పుడే ఉలూచి అతనిని తన కౌగిలిలో హత్తుకొని, ఎత్తుకుపోయింది .... ఆమె వచనాచమత్కృతికీ, ఆమె అసమానరూపలావణ్యానికీ, అన్నిటికంటె ఎక్కువగా ఆమె ప్రకటించే అనురాగానికి లొంగిపోయి అర్జునుడు, మొదట కాదన్నా, చివరకు ఆమెప్రేమను అంగీకరిస్తాడు.

చక్కెరబొమ్మ నా వ్రతముచందము
    దెల్పితి నంతెగాక నీ
చక్కదనంబు గన్న నిముసంబయి
    నన్నిలుపోప శక్యమే
యక్కన జేర్పకంచు దయ
    నానతి యీ దలవంచె సంతలో
నెక్కడనుండి వచ్చె దరలే క్షణకున్
    నునుసిగ్గు దొంతరల్ !

"చక్కెరబొమ్మ!" ఎంత బాగున్న దీమాట! ఎక్కడనుంచో వచ్చాయట, సిగ్గు దొంతరలు! అంతసేపూ అతనిని తన దెసకు ఆకర్షించుకోవాలి అని విశ్వప్రయత్నంచేస్తున్న అమ్మాయికి అతను తన ప్రేమను అంగీకరించేసరికి, ఎక్కడనుంచో ముందుకు వచ్చిందట, ముగ్ధకు అతిస్వాభావికమైనసిగ్గు! నా

ఉలూచి కన్నులకు కట్టినట్టు కనిపించింది, నా ఎదుట, ఆ ఉదయాన, యమునానదీ తీరాన ........

....ఎవరో పిలుస్తున్నారు నన్ను — అవును, మాఆఫీస్ జవాను. అక్కయ్యపంపించి ఉంటుంది—ఆవేపు యమున ఒడ్డున కూర్చున్నాడు, అతనే, వెళ్ళమని.

స్టేషన్ డైరెక్టర్ నన్ను వెంటనే రమ్మనారట. చప్పుచప్పున స్నానం చేసి, ఆఫీస్ దుస్తులు తగిలించుకొని హాజరయ్యాను, వారిముందు, వీలైనంత త్వరగా. ఆ మధ్యనే అఫీస్‌లో కొన్నిమార్పులు జరిగి క్రొత్త ఆయన మాకు అధిపతిగా వచ్చారు. వీరు దక్షిణదేశమువారు—నాన్నగారిని బాగా ఎరుగుదురు. ఆఫీస్ ఆవరణలోనే వారిబస. అందుచేతనే ఇంత పెందరాళే నాకు కబురుచేశారు. ఏమిటో ఆ ముఖ్యవిషయము........

తోటలోనే నన్ను కలుసుకొని, అడిగారు, ఆయన. "ఏం? నాతో చెప్పావు కాదేమీ?" అని.

ఏమిటో నాకు అర్థము కాలేదు. ఆయన ఆ ఉదయపు హిందూస్థాన్ టైమ్స్ నాచేతికిచ్చారు, చూడమని. వార్తలలో ముఖ్యవార్తగా కనిపించింది, మద్రాస్ శాసనసభ ఉపాధ్యక్షురాలు, శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి అఖిలభారత శాసనసభాధక్ష్యులసభకు హాజరయ్యే నిమిత్తం ఢిల్లీ వచ్చి ఉన్నారని.

"అదా! ఆమె ఈ ఊరు వస్తారని నాకే తెలియదు!" అన్నాను, నేను.

డైరెక్టర్ అన్నారు: "సరే! ఆమె మన రేడియోలో మాట్లాడాలి. ఏ విషయమునుగురించి మాట్లాడితే బాగుంటుందో నేవే ఆలోచించి, ఏర్పాటు చెయ్యి. వీలైతే ఈరాత్రే, తప్పితే, విధిగా రేపురాత్రి 9-30 కు ఆమె ప్రసంగము!" అన్నారు.

నేను ఆలోచిస్తుంటే, ఆయన మళ్లా అన్నారు: "డ్యూటీ ఆఫీసర్‌కు ఫోన్ చేస్తాను; ఆఫీస్ కార్ తీసుకువెళ్లి, పని ముగించుకురా!" అని.

# సాగుతున్న యాత్ర

మాపిన్ని నన్ను చూచి "ఇక్కడున్నావా!" అంటూ, ఆశ్చర్యపోయారు. నేను ఆమెవద్దకు వచ్చిన పనినిగురించి విని, అన్నారు: నేను ఉపన్యాసములు ఇయ్యవలసిన అవసరం ఉంటుంది అనుకోలేదు, ఈ నా ఢిల్లీ ప్రయాణములో. ఉన్నపళాన, పదిహేను నిమిషాలు దేనిని గురించి మాట్లాడను? పైగా, కాంగ్రెస్ సంబంధమైన రాజకీయవిషయాలు మీకు బొత్తిగా అంటరానివయ్యేను! మరి, నేను ఏమి మాట్లాడను? అసలు, వ్యవధి ఏది?" అన్నారు.

కాని, ఉత్తరక్షణమే, నాకు ఆశాభంగము కలిగించడము ఇష్టములేక, మళ్ళీ అన్నారు: "సరే! నీ సలహా ఏమిటి?" అని.

....మరునాడు రాత్రి 9-30 కు, మద్రాస్ శాసనసభ ఉపాధ్యక్షురాలు శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి "భారతీయ రేడియోవిధాన వికాసము"ను గురించి ముచ్చటింపగా, ఢిల్లీ రేడియో కేంద్రముద్వారా లోకమంతా విన్నారు. ఈ ప్రసంగమును పొందుపరచడానికి ఆధారము ఆనాడు నేను ఫీల్డెన్ చేతికందిచ్చిన నా వ్యాసము! రుక్మిణమ్మగారు మంచివక్త. ఆమె ఇంగ్లీష్‌ఉచ్చారణ ఎంతో విననింపుగా ఉండేది. ఆమె బ్రాడ్‌కాస్ట్ చేసిన ప్రసంగమునుగురించి మా డైరెక్టర్ సహా, వినిన వారందరూ చాలా మెచ్చుకున్నారు.

ప్రసంగము ప్రసారమైన అరగంటలోనే ప్రసంగపు ప్రతి ఒకటి తీసుకువెళ్లి హిందూస్థాన్ టైమ్స్ పత్రిక సహాయసంపాదకుని చేతికిచ్చాను. ఆయన తమిళులు, మా కుటుంబాన్ని బాగా ఎరుగురు.

"ఇంతకు ముందే విన్నాను, ప్రసంగము. చాలా బాగుంది. ఆమె భాషా, ఆమె ఉచ్చారణా మరెవ్వరికీరాదు! మావద్ద ఫోటోకూడా ఉన్నట్టుంది. వెంటనే ప్రచురిస్తాము. రాత్రికి రాత్రే వచ్చావే, ఫరవాలేదే!" అన్నారు.

నేను వచ్చివేస్తూంటే నన్ను మళ్లా తనగదిలోకి పిలిచి, "మాట!" అంటూ, అనుభవజ్ఞులైన వారు నాకు అమూల్యమైన సలహాను ఇచ్చారు.

## సాగుతున్న యాత్ర

"ప్రొఫెసర్ శేషాద్రి కొడుకూ, నీవూ, మరికొందరూ మనప్రాంతాల వారూ, క్రొత్తగా వెలసిన ఢిల్లీ కేంద్రములో జేరి ఆ సంస్థకు గొప్పపేరు తెస్తున్నారు, ప్రారభంలోనే. కాని, నీవు ఎరుగవు. కాస్త జాగ్రత్తగా ఉండాలి. అమితమైన ఉత్సాహాన్ని అందరూ అంతటి ఔదార్యంతో చూడరు. ఇంగ్లీష్‌లో ఒక లోకోక్తి ఉన్నది: 'మెల్లిగా పరుగెత్తు సుమా!' అని. ఈ ఆరంభఉత్సాహము ముప్పు తేవచ్చును. అసహనము మానవస్వభావముతోనే ఉన్నది. ఇప్పటి ఇప్పటి వాతావరణ మీ వంటివారికి అంత అనుకూలంగాలేదు. అప్పుడే, విమర్శలు బయలు దేరినవి. ముందువచ్చిన చెవులకంటె తరువాత మొలచిన కొమ్ములు వాడికదా?, అంటూ. కాస్త పదిలంగా ఉండండి. కృషిచెయ్యవలసినదే. కాని, అట్టహాసమూ అనవసర ఆర్భాటమూ అపకారము," అన్నారు ఆయన. నిత్యమూ ఎందరినో చూస్తూ ఉంటారు ఆయన. ఎక్కడెక్కడనుంచో వార్తలూ అభిప్రాయాలూ జేరుతూ ఉంటాయి. చాలా నిజము: కృషి ఎంతైనా చేయాలి. అట్టహాసం మాత్రం ఏ మాత్రమూ పనికిరాదు.

నాకు ఆ సలహా ఇచ్చిన ఆయననూ, వారి సలహాను నేను ఇప్పటికీ మరువలేను.ఆయన గొప్ప రాజకీయవేత్తగా తరువాతతర్వాత మంచిపేరుపొందారు.

రుక్మిణమ్మగారి ప్రసంగం ప్రసారమైనపిదప రెండు మూడు రోజులు నన్ను మా ఆఫీస్‌లో అందరూ చాలా అభినందించారు.ప్రసంగంలోని విలువనుబట్టి కొంతా,డెప్యుటీస్పీకర్ కుమారుణ్ణిఅనే గొప్పవల్ల కొంత నాకీ పొగడ్తలు.కానీ ఇందు వల్ల నేను గర్వపడేలోపుగానే ఉన్నట్టుండి నిర్మలాకాశంలోంచి భూమిమీదికి వ్రాలిన పిడుగులాగ కంట్రోలర్ ఆఫీసునుంచి ఒకకాగితం వచ్చింది. నాతో కలసి, పని నేర్చుకుంటూన్న ఒక ముగ్గుర్ని మరికొన్నినెలలు పనిలో ఉంచుతూ నాకూ మరిద్దరికీ ఆ నెలాఖరుతో మా ప్రొబేషన్ అంతముచేస్తూ పైవారు పంపిన ఆర్డర్ అది. నేను నిర్ఘాంతపోయాను.

నా చేతికిచ్చిన కాగితమును తీసుకుని తిన్నగా డైరెక్టర్‌వద్దకు వెళ్లాను. ఆయన చాలా ఆశ్చర్యపడుతూ "ఇదేమిటి! ఎప్పుడొచ్చిందీ కాగితం? నాకు తెలి

యనే తెలియదే! ఇల్లాగే ఉంటాయి, ఇచ్చటి చర్యలు. నాకు అర్థంకావడం లేదు.... పోనీ ఒకసారివెళ్ళి కంట్రోలర్‌నే చూస్తావా? ఆయన ఇచ్చిన విజిటింగ్‌కార్డే కదా, నీ అపాయింట్‌మెంట్ ఆర్డర్" అన్నారు నవ్వుతూ.

అల్లాగే కంట్రోలర్ లయొనెల్ ఫీల్డెన్‌నే వెళ్ళిచూచాను. ఆయన ఆఫీస్‌పని ముగించుకొని ఇంటికి వెళ్ళబోతున్నారు. కార్‌లో అడుగుపెడ్తూ నన్ను చూచి ఆగిపోయారు. "ఇలా వచ్చావేమిటి? ఏమి విశేషము!" అని ప్రశ్నించారు. అంత డస్సివున్నా చిరునవ్వు నవ్వుతూ.

బెంగతో నాచేతిలోని కాగితమును వారి కందిచ్చాను.

"అదా! ఫరవాలేదు! ఇది ఆఫీస్ పద్ధతి. త్వరలోనే మద్రాస్‌లోనూ, తిరుచినాపల్లిలోనూ, రేడియోకేంద్రాలు స్థాపింపనున్నారు. అచ్చట మీకు స్థానం ఉంటుంది" అంటూ కారు స్టార్ట్‌చేసి చెయ్యిఊపుతూ వెళ్ళిపోయారు ఫీల్డెన్.

నా సందేహాలు ఏమీ తీరనేలేదు. ఈ నెలాఖరునుంచీ నేను ఏమి చెయ్యాలి? ఊళ్లో గాయనీ గాయకులను, కొందరు కళావేత్తలను కలుసుకొని వచ్చేనెల కార్యక్రమాలగురించి ఏవేవో ఏర్పాట్లుచేశాను. ఇవి అమలు చెయ్యడానికి నేనుండనా మరి!....ఏదో ఈ వ్యాపకము చాలా బాగుంది. నాకు నచ్చినది ఈపని. ఇందు, నేను ఒక కొంత రాణించవచ్చును అనుకుంటూఉండగా ఈ ఒడిదుడుకు ఏమిటి? — అని చాలా ఆందోళనపడ్డాను.

అప్పటినుంచీ నెలాఖరువరకూ ఎలా గడిపానో! తర్వాత ఏమి కానున్నదీ అనే ఆలోచన చాలా కలతపెడుతూంది మనస్సును. ఆ నిమిషం చేతిలో ఉన్న పనిని సంతృప్తికరంగా చెయ్యనియ్యదు ఈ కలత. ఎంతో మనోనిబ్బరం కావాలి, ఏమీలేనట్టు ఎప్పటిపని అప్పుడు సక్రమంగా, జరుపుకుపోవడానికి. ఎంత గుండె దిటవుపరచుకొని మన పనిలో పూర్తిగా నిమగ్నులమైపోయినా, దిగులుతో కుములుతూనే ఉంటుంది మనస్సు. ఐనా రెట్టించిన ఉత్సాహంతో పని చేశాను, మిగిలిన ఆ పదిరోజులూను.

ఆఖరురోజున తతిమ్మావారికి ఉత్తరాలు వచ్చాయి. ఫిబ్రవరి 12 వ తేదీన మద్రాసులో, జరుగనున్న ఇంటర్వ్యూకి హాజరుకమ్మని, నాకు మాత్రము అటువంటి తాకీదు రాలేదు. అప్పటి నా కంగారు వర్ణింపలేను.

డైరక్టర్‌ను వెళ్ళిచూడగా ఆయన సానుభూతితో అన్నారు: "ఇప్పటివారిపద్ధతే అంత! ముగలాయి దర్బార్ అరాజకత్వము! అంతే, వీరిచర్యలు! నాకు అర్థమగుటలేదు. ఏ నిబంధనలు అనుసరించి నిన్ను ఇంటర్వ్యూకి పిలువలేదు?"

....మరునాడు వేకువనేలేచి, సిద్ధమయ్యాను. మంచిచలి! ఐనా లెక్కచెయ్యలేదు నేను. ఆఫీస్‌దుస్తులు గాక నాకు ఇష్టమైన నా అడయార్ దుస్తులే వేసుకుని స్టేషన్‌కు బయలుదేరాను. త్రోవలో గులాబీతోటవద్ద ఆగి కెంపులకంటే ఎర్రనిగులాబీలు, వెల్వెట్‌కంటే, మృదువుగా నిగనిగలాడేవి, అతిసుకుమారమైన ప్రేయసిపెదవి విప్పి ఏదో రహస్యం చెప్పబోతున్నట్టు వికసిస్తూ వికసిస్తూన్నవి ఒకపది పువ్వులు, మరీ అందమైనవి ఏరి, గుత్తికట్టించుకు తీసుకున్నాను. స్టేషన్‌లో ఫీల్డెన్ కార్ ఆగీఆగడంతోనే డవాలీ జవాను ఈవేపు పరుగెత్తుకువచ్చి తలుపు తీసేటంతలో, కార్‌లోంచి క్రిందికి అడుగుపెడుతూన్న ఆయన ఎదుట నుంచున్నాను, రెండుచేతులతోటి ఎర్రగులాబీలను అందిస్తూ. నన్నుచూచి నాచేతులలోని పువ్వులనుచూచి ఫీల్డెన్ పరమానందభరితులయ్యారు.

"ఎంతచక్కని పువ్వులు! నాకోసమే తెచ్చావా? ఇంత అందమైన పువ్వులు ఎక్కడ దొరికాయి, నీకు ఇంత ప్రొద్దున్నే! .... ఎంత బాగున్నాయి, నీ దుస్తులు! ఈ చలిలోకూడా నీ అడయార్‌దుస్తులు మానలేదా!" అంటూ పువ్వులందుకొని, నాభుజంమీద తన కుడిచేతి నానించి ముందుకు నడువసాగారు ఆయన.

కంట్రోలర్ వెనుకనే స్టేషన్‌డైరెక్టరూ తదితర సిబ్బందీ వచ్చారు. తాను ఎక్కవలసిన కంపార్ట్‌మెంట్‌వద్దకుచేరి "ముందు పువ్వులను పదిల పరచి వస్తాను!" అంటూ లోనికివెళ్ళి గులాబీపువ్వులను సజ్జలో ఉంచివచ్చారు ఫీల్డెన్. మళ్ళీ నాచెంతచేరి అన్నారు ఆయన. "రైలు వెళ్లేవరకూ ఎందుకు ఉంటావు అనవ

సరంగా, నీవు ఆఫీస్‌కు వెళ్లాలిగా. వెళ్ళిరా! మనము మళ్ళీ మద్రాస్‌లో కలుసు కుంటున్నాము కదా!" అని.

బిక్క-మొహంతో నేను అన్నాను. "నన్ను, మీరు మద్రాస్‌కు రమ్మన లేదుగా! నాకు ఇంటర్వ్యూ ఉత్తరువు రాలేదు!!" అని.

ఫీల్డెన్ ఆశ్చర్యపోయారు."అల్లాగా! ఏదో పొరపాటు జరిగిఉంటుంది. నీవు మద్రాస్‌కు రాకపోవడమేమిటి?" అంటూ మాకు కాస్తదూరంలో ఎడమగా నిలుచున్న స్టేషన్ డైరెక్టర్‌ను తనవద్దకు రమ్మని "ఇదేమిటి! ఇతనిని మద్రాస్‌కు రమ్మనలేదా?" అని ప్రశ్నించారు. "లేనట్టుంది" అని డైరెక్టర్ అనగా ఫీల్డెన్ అన్నారు ఆయనతో. "ఏదో ఆఫీస్‌వారి పొరపాటయి ఉంటుంది. మీరు ఆఫీస్‌కు జేరిన వెంటనే డెప్యుటీకంట్రోలర్‌తోమాట్లాడి నా మాటగా చెప్పండి.ఇతనిని తప్పక మద్రాసులో జరుగనున్న ఇంటర్వ్యూకి పంపమని. వెంటనే ఈ పని చూడండి!" అన్నారు ఫీల్డెన్.

తిరిగి, అతిప్రసన్నవదనముతో నన్ను పరికిస్తూ అన్నారు ఆయన, "చేయవలసినవన్నీ మీ డైరెక్టర్ చేస్తారు. మనము తప్పక కలుసుకుంటాము కనూ మద్రాసులో!" అని.

ఫీల్డెన్‌కు నా కృతజ్ఞతను ఎలా తెలుపాలో నాకు తెలియలేదు. ఎంత బెంగతీరింది నా మనస్సులోనుంచి! రైలు కదలబోతూంటే, ఎంత మంచిమాట చెప్పారు ఆయన! వారికి నా కృతజ్ఞతను ఎలా వెలువరించగలను! వంగి నమస్క-రించాను. అంతే! నా కన్నులలో విరసిన అంతులేని కృతజ్ఞతాభావము ఆయన తప్పక గుర్తించివుంటారు. ప్రతినమస్కా-రంచేసి చేయిఊపుతూ లోనికి వెళ్ళి పోయారు ఫీల్డెన్....

....తరువాత కొన్నాళ్ళకు తిరిగి గ్రాంట్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో మద్రా స్‌కు ప్రయాణముచేస్తూ మరీమరీ జ్ఞాపకము చేసుకున్నాను ఆయన సౌజన్యమూ, నాయందు వారికున్న అభిమానమూ. ఎలా కలుగుతాయో ఇటువంటి అనుబంధాలు!

## సాగుతున్న యాత్ర

ఉద్యోగవిషయంలో మళ్ళీ మళ్ళీ అనుకుంటూనే ఉన్నాను రైలు ప్రయాణం అంతసేపూను. "ఎన్నివడుదుడుకులు! ఎన్నివడుదుడుకులు!! ఘుమ ఘుమలాడుతూ కొమ్మను ఎంత అందముగా వున్నదీ సంపెంగపువ్వు! అందుకో బోతే మాత్రము దూరమవుతుంది! ఇంతేనా జీవితమంతా! జీవితమంతా ఇంతేనా? ఎన్నాళ్లో ఈవెర్రి అన్వేషణ! ఇట్టే చేయిచాచి అంది పుచ్చుకోవచ్చు పుష్పాన్ని అనుకుంటాము, ఆశతో చేయి చాస్తాము—మంత్రించిన పువ్వులా పుష్పము పైకి పైకి ఎగసిపోతుంది. పోనీ! ఈ పుష్పము మనకోసముకాదు అని నిరాశచేసు కోనూలేము. ఆశించాలి, తప్పదు. ఆశించి ప్రయత్నించాలి, తప్పదు. అదే జీవి తము: ఆశ, ప్రయత్నము; నిరాశా ప్రయత్నమూ మళ్లా ఆశా! ఇల్లాగే మరి. ఇంతకీ మనజీవితంలో మన ప్రయత్నమెంత—అదృష్టమెంత? అదృష్టమున్నా మన ప్రయత్నము తప్పేదేమో!....చివరకు భవభూతి అంతటి అనుభవముతో అనినదే నిజమేమో:

సలిలము జొచ్చినం గనక
  శైలముజేరిన వైరి వీరులం
గెలిచిన రాజసేవ దిలకించిన
  వేదము లభ్యసించినం
గళల తెరంగెరింగిన ఖగత్వము
  దాల్చిన గర్మ నిష్కృతా
కలన నభావ్యమైన పనిగాదు,
  వినాశము లేదు భావికిన్!

వినాశములేదు భావికిన్! ఎంతనిజము!

## 3

ఇయంగేహే లక్ష్మీ రియ మమృత
వర్తిర్నయనయో
రసా వస్యా స్స్పర్శో వపుషి బహుల
శ్చన్దనరసః
అయంకంఠే బాహుశ్శిశిరమసృణో
మౌక్తిక సరః
కిమస్యాన ప్రేయో యది పరమసహ్యో
స విరహః!!

ఢిల్లీనుంచి తిరిగి మద్రాస్‌వస్తూ, రైల్లో ఏమీ తోచక, నావద్దఉన్న ఉదయిని ప్రతులు చూస్తున్నాను. భవభూతి చిత్రించిన సీతను గురించిన చక్కని వ్యాసము చదువుతూ నేను రైలులో ఉన్నమాటే మరచిపోయాను. అయోధ్య, శ్రీరాములు, రాచనగరు, సీతారాముల లోకోత్తర ప్రేమ — వారి ఆదర్శదాంపత్యము, అలా అలా అల్లుకుపోయాయి నా ఆలోచనలు. ఎంతటి అన్యోన్యమైన స్నేహమూ వారిద్దరి స్నేహమూను !!

లక్ష్మణుడు చూపిస్తున్న చిత్రపటాలను చూస్తూ చూస్తూనే, నిండు చూలాలు సీతాఅమ్మవారికి అలసట కలిగి, అతను బొమ్మలు చూపడం ఆపివేసి, వెళ్ళిపోగానే, ఆమె భర్తవైపు ఒరుగుతూ "నాకు నిద్రవస్తోంది!" అంటుంది. అని, అక్కడే పడుకోబోయి, తలగడకోసము ఇటూ అటూ పరికిస్తున్నది. అపుడు రాములవారు అంటారు: "ఏమి వెతుక్కుంటున్నావు? ఉన్నదిగా, ఎప్పటికీ, నీకోసము సిద్ధముగా, అయోధ్యలోనైతేనేమి, దండకారణ్యములోనైతేనేమి నీకు తలదిండుగా రామహస్తము!" అంటూ, తన భుజము ఆసరాగా, ఆమెను అతి

పదిలంగా పవ్వళింపజేస్తారు. క్షణంలో, నిద్రపోతుంది సీత. అల్లా, రాముని వక్ష స్థలాన తలపెట్టుకొని, అట్టే నిద్రపోతుంది. అపుడు రాములవారు అనుకునే మాటలు :

"ఈమె నా ఇంటి మహాలక్ష్మి! నా కన్నులకు అమృతమువంటిది. మంచిగంధపు మైపూతకంటేకూడా చల్లగా,ఎంత హాయిగా ఉన్నదీ ఈమె స్పర్శ! మంచిముత్యాల హారంలా ఎంత అందముగా కవుగిలించుకున్నదీ, ఈమెచెయ్యి, నామెడను! .... సీత! నా సీత!! ఎంతప్రియతమైనదీ సీత!! ఎంతప్రియత మైనది!! ఈమెలో ప్రియముకాని అంశమేది! అంతా, అంతా, ప్రియమైనదే — ఒక్క ఆమె వియోగము తప్ప!!" అని.

— ఆ క్షణమే వస్తాడు, దుర్ముఖుడు; వెంటనే కలుగుతుంది, వారికి వియోగము. అదే భవభూతి నాటక ప్రతిభ.

కాని, ఎంతగొప్పగా వర్ణించాడు, భవభూతి, వారిద్దరి గొప్పప్రేమా!.... అంతకు కొంచముముందే, సీతాఅమ్మవారి ప్రియవచనములు వింటూ, శ్రీరాములు అంటారు :

మ్లానస్య జీవకుసుమస్య వికాసనాని
సన్తర్పణాని సకలేన్ద్రియ మోహనాని
ఏతాని తాని వచనాని సరోరుహాక్ష్యాః
కర్ణామృతాని మనసశ్చ రసాయనాని.

"ఎంతప్రియముగా మాట్లాడుతున్నావు, సీతా! నీ మాటలలో ఎంత హాయి ఉన్నదీ! పూర్వవియోగ గాథల జ్ఞాపకంవల్ల వాడిపోయిన నా జీవితపు ప్రసూనాలు చల్లని హిమబిందువులు తాకినంతనే వికసించే కొండపువ్వులలాగ క్రొత్తప్రాణంతో వికసిస్తున్నాయి. ఇంతవరకూ మగతగమ్మి నిద్రాణులైఉన్న ఇంద్రియాలకు నవచైతన్యమును కలిగిస్తున్నవి, నీ ప్రియవచనాలు. నా చెవుల

కెంతటి ఆనందాన్నిస్తున్నవీ తేనెసోనలుజిమ్మే నీ పలుకులు! నా మనసుకు దివ్య ఔషధమువంటిది నీ సంభాషణ — జానకి! జానకీ!!" అని.

ఇంతగా ప్రేమింపగలిగిన ప్రియుడుకాబట్టే, అప్పుడు, ఆ దండకారణ్యంలో అతనికి కలిగిన వియోగబాధనుచూచి సహింపలేక సర్వ చరాచర ప్రపంచమూ కంట తడిపెట్టుకున్నదట. ఆ సానుభూతిని లక్ష్మణుని మాటలుగా ఇలా వర్ణిస్తాడు భవభూతి :

...జనస్థానే శూన్యే వికలకరణై
రార్యచరితై
రపిగ్రావా రోదిత్యపిదళతి
వజ్రస్య హృదయమ్.

నిర్మానుష్యమైన ఆ ప్రదేశంలో, మీ బాధనుచూచి రాళ్ళు కన్నీరు కార్చినవి, వజ్రాల హృదయాలున్నూ పెటిల్లు పెటిల్లుమని పగిలినవి!!" అంటూ.

గొప్పవారితో, మహనీయ పురాణ పురుషులతో పోల్చుకోవడము సాహసమే — కాని, అంతటి అద్భుతమైన ప్రేమా, ఆ ప్రేమను అనుసరించే హృదయాన్ని డొల్చివేసేటంతటి బాధా అవతరిస్తాయి సాధారణమానవులజీవితంలోకి కూడా — కొందరి జీవితాలలోకి. అంత అతీతంగా ప్రేమిస్తారు కాబట్టే, కాబోలు, కారణాంతరాలవల్ల కలిగిన వియోగమున్నూ అంతగా వేధిస్తుంది అటువంటి వారిని.

కాకినాడలో ఉండగానే, నా "మిథిల" సీతలేనిదైనది. అందుకు నేనే ముఖ్యంగా బాధ్యుడను అనుకోక తప్పదు. నామీద పక్షపాతంవలన కొందరు మిత్రులు "కారణము పరిస్థితుల ప్రభావము" అన్నారు. కాని, నిజానికి పరిస్థితులకు లొంగిపోతే, ఇక మన ప్రయోజకత్వ మేముంది! ఐతే, నేను లోకపుదృష్టిలో "ప్రయోజకుడను" కాను అని ఎన్నడో తేలిపోయింది! ఉత్సాహము ఉండవచ్చు;

ఎంతో నిజాయితీ ఉండవచ్చు; కొండంత మంచితనమున్నా. విశ్వప్రపంచాన్నీ కవుగిటిలో బంధించుకోవాలీ అనే వెర్రి ఆప్యాయమూ ఉండవచ్చును. కాని, అవన్నీ వేరూ, ప్రయోజకునికి ఉండే లక్షణాలు వేరూ।

ఏమైతే నేమి— ఒంటరిగా నేను ఢిల్లీ వెళ్లాను. ఒంటరిగానే ఉంటూ, ఉద్యోగప్రయత్నము చేశాను. ఆ ఉద్యోగప్రయత్నపు పరిణామమును గురించే ఇప్పుడు మద్రాస్‌కు వచ్చినది. ఒంటరిగా; ఇల్లూలేదూ; వాకిలీ లేదూ.

మద్రాస్‌లో నాకు చాలా స్నేహితులైన శాస్త్రిగారింటికి వచ్చాను, చనువుగల అతిధిగా. అంతకుముందు, నా ఇన్సూరెన్స్ ఉద్యోగము ఫెళ్ళుమని వెలిగే రోజులలో, మద్రాస్ వచ్చినప్పుడల్లా, వీరి ఇంటనే, తరుచు బసచేస్తూండే వాడను. వారు చాలా స్నేహప్రియులు, భార్యా భర్తాకూడా. నిత్యమూ వారింటికి వస్తూండేవారు, ఎందరో స్నేహితులు— దంపతీయుతంగా. ఈ,వారి స్నేహితులున్నా నన్ను తమ స్నేహితునిగా భావించి, చాలా ఆదరించేవారు. ఎంతో కలసి మెలసి ఉండేవారము, ఒక జట్టుగా. కాని, ఎక్కడకు వెళ్ళినా పాదచారులమై వెళ్లేవారముకాము. మా బృందము ఒక ఏడెనమండుగురకూ మూడుకార్లు ఉండేవి, నాకారుతోసహా. సాయంత్రమైతేసరి, కార్ షికార్లు, సముద్రతీరమువైపు ఎంతో ముచ్చటగా ఉండేది. వెన్నెలరాత్రులు ఇక చెప్పనే అక్కరలేదు. సముద్రపు కెరటాలపైన కరుగబోసిన వెండి, బంగారులా వెన్నెల మెరుస్తూఉండగా చూచి ఆనందిస్తూ, వెన్నెల భోజనము। ఒక్కొక్క పర్యాయము, ఒక్కొక్క ఇంటివారు ఏర్పాటుచేసేవారు. అప్పుడప్పుడు, ఈ ఉల్లాస సమావేశాలలో, ఇప్పుడు లోక ప్రఖ్యాతిగడించిన, అద్భుత గాయకి సుబ్బులక్ష్మి,ఆమె భర్త సదాశివమూ పాల్గొంటూ ఉండేవారు. మూర్తీభవించిన సౌజన్యరాశి ఆమె, తన మృదువచనాలతో ఎంతో ఆదరించేవారు. ఆమెలా కాకపోయినా, అంతో ఇంతో, పాడగల ఇల్లాండ్రు ఉండేవారు మా బృందములో. వారిని ఎలా ఎలాగో లాలించి, వారిచేత పాడించేవారు, సుబ్బులక్ష్మి. తానూ గానముచేసేవారు - ఆ సముద్రపు ఒడ్డున, చంద్రుడే తన ఆకాశప్రయాణాన్ని రవంతసేపు ఆపి, చెవియొగ్గి వినేటంతహాయిగా।

ఈ మా బృందానికిచేరినవారే ఖాసా సుబ్బారావు. అంతకు కొంతకాలము నకు ముందు జరిగిన అసహాయోద్యమసందర్భాన పికెటింగ్‌చేసిన ఆ యోధుని వీపు తట్టుతేరేటట్టు తెగబాదారు, నిర్దాక్షిణ్యంగా, పోలీస్‌లు. స్పృహతప్పి పడి పోయిన ఆయనను జనరల్ హాస్పిటల్‌కు తీసుకువెళ్ళగా, హాస్పిటల్ అధికారి, తెల్లదొర, ఆయనకు తగిలిన దెబ్బలగాయాలను చూచి "ఇంతట అమానుషమా!" అని ఆశ్చర్యపోయాడట. సుబ్బారావు త్యాగమే అప్పట్లో మద్రాస్‌లో పోలీస్ "జులుమ్"ను కొంత అరికట్టుత! ఈ సాహసమువల్లా, ఆయనలోఉన్న సహజస్నేహ శీలత్వమువల్లా, మా బృందములో అందరికీ ఖాసా సుబ్బారావు అంటే, విపరీతమైన ప్రేమ. అప్పుడప్పుడు, నాకు రవంత అసూయకలిగేదికూడా, వారందరూ అతని యెడ ప్రకటించే పక్షపాతమును చూచి. కాని ఎంతో స్నేహంతోనూ మెప్పుదల తోనూ కూడినది ఈ నా క్షణికమైన ఈర్ష్యాభావము!

నేను ఢిల్లీనుంచి వచ్చేసరికి, ఖాసా సుబ్బారావు ఒక ఆంగ్ల దినపత్రి కకు సహాయ సంపాదకునిగా పనిచేస్తున్నారు. మేము చాలా చాలా అన్యోన్యంగా మెలుగుతూండేవారము. ఆ పత్రికలో ఆయన రోజూ రోజూ "కిరణాలు" (సైడ్ లైట్స్) అంటూ అతి చలాకీగల విమర్శలు ప్రకటింప ఉపక్రమించారు. నిత్యమూ మన ఎదుట తారసిలే విచిత్రవ్యక్తులగురించీ, వారి అభిప్రాయాల గురించీ, వారి చర్యలను గురించీ, కొంత నవ్విస్తూ, కొంత తీవ్రంగా పాఠంచెపుతూఉండేవి ఆ విమర్శలు. అంతకు ముందుటిరోజు జరిగిన ఏదో ఒక సంఘటననుగురించి అతి చమత్కారమైన విమర్శా, ఉండేది. సమకాలిక అభిప్రాయాలను కొన్నిటిని తీవ్రంగా ఖండిస్తూ, అవసరమైతే, ప్రముఖవ్యక్తుల చర్యలను నిర్మొఖమాటంగా అధిక్షేపించే ఈ విమర్శల శీర్షికక్రింద తమ సంతకము బదులు, చక్కని ఒక మారు పేరు ఉండాలి అన్నారు, ఖాసా సుబ్బారావు, తమ మొట్టమొదటి "సైడ్‌లైట్" ను మాలో కొందరికి చదివి వినిపిస్తూ. మా నలుగురిలో ఒకొక్కరు పేరును సూచిం చాము — ప్రాచీన గ్రీకుపేరు ఒకరూ, నక్షత్రాల పేరు ఒకరూ, గోత్రము పేరు ఒకరుసూ. నేనుమాత్రం ఒక్కక్షణము ఆలోచించి అన్నాను: "సైడ్‌లైట్స్ బై సాకా" బాగుంటుంది. మీ మారుపేరు "సాకా" అన్నాను. ఖాసా సుబ్బారావు

"ఖాసా—సాకా", "సాకా—ఖాసా" అని రెండు మూడుసార్లు వల్లించి "భేష్! నాకు నచ్చింది ఈ పేరు!" అంటూ, ఆ సాయంత్రమే, ఆ మారుపేరుతోనే ఆ శీర్షికను ఉపక్రమించారు. నేను చేసిన నామకరణము స్థిరమైంది. ఇప్పటికీ, వారి "సైడ్ లైట్స్" ఆ పేరుతోనే వస్తున్నాయి. ఒక కొన్ని ఏళ్ళవి, ఒక పుస్తకంగా కూడా కూర్చబడి శాశ్వతరూపమును దాల్చినవి.

ఖాసావారి "సైడ్‌లైట్స్" ప్రసరించినది, తొలుదొల్త నా మీదనే! "ఈ ఊరిలో ఒక ఆకుపచ్చని కార్ ఉన్నది. ఆ కార్ లక్షణము ఏమిటంటే: ఎంత వేగంగా వెడుతున్నాసరే, ఎదుట రోడ్‌మీద అందమైన చీర కనిపిస్తేచాలు, టక్కున ఆగిపోతుంది ఆ కార్!" అని ఒక విసురు విసిరారు. "ఆ కార్‌లో తరుచు మీరూ ఉంటూ ఉంటారని వ్రాయలేదేమి?" అన్నారు, ఆయనతో ఆ విమర్శ చదువుతూ, మాలో ఒకరు!!

మరొక పర్యాయం "ఈ ప్రేమించడం" అంటూ చలాకీగా వ్రాస్తూ, మరో విసురు విసిరారు, ఖాసా సుబ్బారావు. "మనలో కొందరికి ప్రేమించడము అనేది ఒక అలవాటైపోయింది! ఈ అలవాటు ఎంత తీవ్రంగా పరిణమించినదీ అంటే— వీరిలో హృదయము ఉండవలసినంత మేరా, గుచ్చుకుపోయిన బాణాలే ఉండిపోయాయి" అని వ్రాశారు.

మిక్కిలి ప్రీతిపాత్రుడు, ఖాసా సుబ్బారావు. ఎటువంటి పరిస్థితులలోనూ మంచితనాన్ని పాటిస్తారు, ఆయన. మంచితనమూ నిజాయితీ—ఈ రెండూ రెండు చక్షువులవంటివి ఆయనకు. నిజాయితీకోసము ఆయన, అవసరమైతే తనకు ఆప్తస్నేహితులనతగినవారినికూడా త్యజింపకలిగిన శక్తికలవారు. ఈ నిజాయితీని గమనించే, ఆయనతో పూర్తిగా వైరుధ్యంకలవారున్నూ ఒక్కొక్కప్పుడు ఆయనవద్దకే వెళుతూ ఉంటారు, ఆయన సలహాకోసము. ఆయన మాటకు, ఆయన ఆలోచనకు, అంతటి విలువను ఇస్తారు, ఆయనతో భేదాభిప్రాయముకలవారున్నూ.

ఐతే, నిర్మొహమాటంగా నిజము చెప్పివేసే అలవాటువల్లనే కాబోలు, ఖాసా సుబ్బారావు - లోకపు దృష్టిలో - అంత "ప్రయోజకుడు" కాలేకపోయారు. ప్రయోజకుడు కాలేకపోయినా ఎందరికో పూజనీయు లయారు ఆయన.

ఆ మధ్య నేను ఒక వ్యాసం వ్రాస్తూ ఇలా అన్నాను: "లోకంలో, నాకు తెలిసినంతవరకు, ఇద్దరే మంచివారు ఉన్నారు; మల్లంపల్లి సోమశేఖరశర్మ, ఖాసా సుబ్బారావూను. మల్లంపల్లివారికి మంచితనము ఒక్కటే తెలుసును; చెడుగు అంటే ఏమిటో తెలియదు ఆయనకు అసలు. అందుచేత, ఆయన మంచివారు. ఖాసా సుబ్బారావుకు లోకపురీతులు బాగా అవగాహన. లోకంలో ఉండే మంచీతెలుసు, చెడుగూ తెలుసు ఆయనకు. ఈ చెడుగులను ఖండించడమే నిరంతర వ్యాపకంగా పెట్టుకున్నారు కాబట్టి ఆయన మంచివారయ్యారు!" అని, వ్రాశాను.

వట్టి నిగర్వి ఖాసా సుబ్బారావు. గవర్నల్లతోనూ ప్రధానులతోనూ ఎంతటి హుందాగా ఎంతటి బాధ్యతతో ఎంతటి ఆత్మవిశ్వాశంతో మాట్లాడుతారో అంతటి హుందాగా, అంతటి బాధ్యతతో, అంతటి ఆత్మవిశ్వాసంతోనూ మాట్లాడ గలరు, మీతోనూ, నాతోనుగూడా! నాకు బాగా జ్ఞాపకం ఉంది: ఒక పర్యాయం, గవర్నర్‌గారిని చూడడానికి వెళుతూ, నేను కనిపించగా ఆగి, తాను గవర్నర్‌తో చర్చింపదలచుకొన్న కొన్ని విషయాలనుగురించి నాతో ప్రస్తావించారు. "గవర్నర్‌గారు వేసే ప్రశ్నలకు నేను ఇలా ఇలా జవాబుచెపుతాను, ఇది సరేనా, ఇది సరేనా?" అంటూ నా అభిప్రాయం అడుగసాగారు, ఖాసా సుబ్బారావు. నాకు ఆశ్చర్యమేసింది, తరువాత. "రాజకీయాలనుగురించి నాకు అంతగా ప్రసక్తిలేదు. కాని, నాతో చర్చించి తన అభిప్రాయాలను సరిజూసుకుంటున్నారు, ఆయన— ఇంతకంటే ఎక్కువ నమ్రత ఉంటుందా!" అనుకున్నాను నేను.

అల్లాగే, పత్రికకు ఏదో ముఖ్యమైనవ్యాసం వ్రాస్తూండగా ఆయనవద్దకు నేను వెళ్ళడము తటస్థిస్తే, చేతిలోనికలం అలా బల్లమీద ఉంచివేసి, వ్రాసినంత వరకు చదివి వినిపిస్తారు, నాకు—అడుగడుగుకూ నా అభిప్రాయం అడుగుతూ, నాకు తోచిన సవరణలు ఏవైనా చెబితే, వెంటనే వానిని పొందుపరుస్తూ అంటారు

ఆయన : "చూచావా, నీవు ఈ సమయంలో రావడము ఎంత మంచిదైనదో!" అని. ఐతే ఒకటి : ఇలా, నమ్మిన స్నేహితులవిమర్శకు ఎంతో విలువ నిస్తారే గాని, ప్రతివిషయంలోనూ, చిన్నవిషయమైనా సరే, పెద్దవిషయమైనా సరే, తుది నిర్ణయముమాత్రము వారిదే! ఆ నిర్ణయాన్ని బ్రహ్మరుద్రులు మార్చలేరు.

ఇంగ్లీష్‌లో ఒక ప్రజ్ఞానిధి అన్నారు : "తాను కట్టిన మహాసౌధము, ఉన్నట్టుండి, నేలమట్టముగా కూలిపోయినా, అందుబాటులోఉన్న ఆయుధ పరికరాలన్నీ పూర్తిగా అరిగిపోయిఉన్నా, మళ్ళా పునాదులు త్రవ్వి, మళ్ళా మొదటి నుంచీ, ఇటుక ఇటుకగా పేర్చుకుంటూ వచ్చి, మళ్లా అంతటిదీ, అంతకంటేకూడా గొప్పదీ, ఐన మహాసౌధాన్ని తిరిగి నిర్మింపకలవాడే మనిషి!!" అని. ఖాసా సుబ్బారావు అటువంటి మనిషి.

*  *  *  *

ఇంక పదిరోజులకు మా సెలెక్షన్ అనగా, నేను క్రొత్తగా రేడియో కేంద్రము ఏర్పాటుగానున్న భవనానికి వెళ్లాను. చిత్రం! ఒక ఆరేళ్ళక్రితము నేను మోటార్‌కార్ కొనుక్కో-బోతూ, డ్రైవింగ్ నేర్చుకుని లైసెన్స్ తీసుకున్న పోలీస్‌కమీషనర్ ఆఫీస్ ఉండిఉన్న భవనమే ఇది. ఆ మాటే అన్నానుకూడా, క్రొత్తనిలయానికి డైరెక్టర్‌గా వచ్చిన ఆయనతో. ఆయన నవ్వుతూ అన్నారు : "ఈ పనిన్నీ ఒక మోస్తరుగా శక్తివంతమైన వాహనాన్ని నడుపడమే—ఎటొచ్చీ, కార్ డ్రైవింగ్‌లో ఎంతో కొంత విరామముంటుంది. ఈ ప్రాపకంలో నిమిషం విరామం ఉండదు, సుమా!" అని. వెంటనే ఆయన నన్ను లక్షపనులకు నియోగించారు. సంతోషముతో పూనుకున్నాను నేను, ఆయన నియమించిన పనులన్నీ నిర్వహించడానికి. ఆ నిమిషం ఆయనా సందేహించలేదు, నేనూ సందేహించలేదు, నా సెలక్షన్ పర్యవసానం ఏమవుతుందో అని—నేను సెలక్షన్‌లో ఆరితేరినట్టే భావించాము ఇద్దరమూను,మాలో మేము.

సెలక్షన్‌రోజు చాలా హడావిడిగా వుంది. ఢిల్లీనుండి కంట్రోలర్ ఆఫ్ బ్రాడ్‌కాస్టింగ్, లయొనెల్ ఫీల్డెనూ, బొంబాయినుంచి కేంద్ర నియంతా వచ్చారు.

ఇక, స్థానికులు కొందరు గొప్పవారు మెంబర్లగా హాజరయ్యారు. అప్పుడొక తమాషా జరిగింది. ఇక అరగంటలో సెలక్షన్ సమావేశం ప్రారంభిస్తారనగా, గుమాస్తా నావద్దకు వగర్చుకుంటూ వచ్చి "ఇదేమిటి! నీ అప్లికేషన్ లేదే!! అభ్యర్థులజాబితాలో నీ పేరు పొందుపరచి ఉన్నది. కాని, నీతాలూకు అప్లికేషన్ మాత్రము లేదు, ఫైల్‌లో!" అంటూ, వెంటనే మా డైరెక్టర్‌తో సంప్రతించి అప్పటికప్పుడు నాచేత దరఖాస్తువ్రాయించి తీసుకున్నాడు. ఆ దరఖాస్తులో నేను వ్రాశాను: "కొంతకాలము నేను ఢిల్లీకేంద్రంలో రేడియో ప్రసారవిధానంలో తరిఫీదు పొందాను" అని.

ఇంటర్‌వ్యూలో కంట్రోలర్ ఫీల్డెన్ ఆ ఒక్కమాటా పట్టుకుని, కొంత నవ్వుతూ, ఎంతో ఆదరణతో, కొంత పరీక్షతో, అడిగారు నన్ను: "ఏదో తరిఫీదు పొందానన్నావే, ఈ నీ దరఖాస్తులో, నీవుపొందిన ఆ తరిఫీదునుగురించి, ఈ పెద్దమనుష్యులకుగాను కొంచెము వివరిస్తావా!" అని. అందినదే అవకాశమని ఢిల్లీలోని నా కృషినిగురించి పూసగ్రుచ్చినట్లు చెప్పాను.

పెద్దమనుష్యులందరూ నాకేసి ఆసక్తితోను, ఆదరణతోనూ చూస్తున్నారు. నా కథ శ్రద్ధతో వింటున్నారు. హేమాహేమీ లున్నారు, నా ఎదుట. వీరినెలా మెప్పించాలో అనే ఆలోచనేలేదు, నాలో. నా సంగతి నేను చెప్పుకుపోతున్నాను: ప్రప్రథమంగా, దక్షిణభారతప్రాంతాలకోసము వెలసిన రేడియో ప్రసారవిధానంలో నేను చేయకలిగిన తొలిరోజులకృషినిగురించి ఉత్సాహంతో, ఉన్నది ఉన్నట్టు.

ఆ తర్వాత, ఫీల్డెన్ మళ్లా అడిగారు: "అక్కడ నీకు కలిగిన అనుభవం వల్ల, ఇక్కడ ఇకముందువెలిసే రేడియోవిధానంలో ఎటువంటిమార్పులు అవసరమైనవి అమలులోకితేవాలో చెప్పగలవా?" అని.

హిందూపత్రికాధిపతి కస్తూరి శ్రీనివాసన్ నాకేసి చాల ఆసక్తితోచూచారు, నేను యేమేమి ఆశయాలను వెలిబుచ్చుతానో అని కాబోలు. నేను ధైర్యంగా

చెప్పాను—నాకు తోచినది, ఎంతో ఉత్సాహంతో ఉద్రేకంతో. మనప్రాంతపు సంస్కృతినీ, మన సాహిత్యసంపదనూ, విలువ గణింపరాని మన సంగీతసంపదనూ అందరకూ ఏ ఏ విధాల అందుబాటులోకి తేవాలో. ఆకాశాన్ని అంటే నా ఆదర్శాలు వారిలో కొందరికి అశ్చర్యం కలిగించినవి.

తరువాత, ఒకరిద్దరు సభ్యులు కొన్నిప్రశ్నలు వేశారు, తగిన సమాధానాలే చెప్పాను. ఒక్కవిషయంలో మాత్రము పొరపాటు చెప్పాను: ముత్తుస్వామి దీక్షితులవారినిగురించి సరిగా చెప్పలేకపోయాను.

నా ఇంటర్‌వ్యూ పూర్తై, నేను ఇవతలకు వచ్చివేశాక, తరువాతఅభ్యర్థిని పిలిచేలోపుగా, నేనే, మళ్లా లోనికి వెళ్ళవలసివచ్చింది, అత్యవసరమైన ఆఫీస్ పనిమీద. అప్పుడు అధ్యక్షులైన ఫీల్డెన్‌తో కస్తూరి శ్రీనివాసన్ అంటున్నారు ఉత్సాహంతో, నన్నుగురించే, "వెరిగుడ్! వెరిగుడ్!!" అంటూ. ఇతర సభ్యులున్నూ వారిఅభిప్రాయంతో ఏకీభవిస్తున్నారు. ఆ నిమిషాన అకస్మాత్తుగా అక్కడ అవతరించిన నన్ను చూచి ఫీల్డెన్ ఎంతో కుతూహలంతో చిరునవ్వు నవ్వారు. తొలుదొల్త ఆయన ఒక్కరూ చేసిన సెలక్షన్‌ను వీరందరూ ఇంతగా ఆమోదించడము ఆయనకు సంతోషకారణమైనదని నేను భావించాను, ఆ చిరునవ్వు చూచి.

....ఈమధ్యనే, పూజ్యులు కస్తూరి శ్రీనివాసన్ ఇహలోకాన్ని విడిచి వెళ్ళడానికి కొన్నినెలలు ముందు, నేను వారిని దర్శించడము తటస్థించింది. నాకు బాల్యస్నేహితుడూ, చిరకాలమిత్రుడూ ఐన డాక్టర్ షెల్వాంకర్, లండన్‌లో హిందూపత్రికా ప్రత్యేకవిలేఖరిగా ఉంటూ, సెలవుమీద స్వదేశానికి వచ్చినపుడు నన్ను కలసికొని, నన్ను కస్తూరి శ్రీనివాసన్‌వద్దకు తీసుకువెళ్లాడు తనతోకూడా. నన్ను వారికి పరిచయం చేయడముతోనే నేనన్నాను: "నాకు రేడియో ఉద్యోగము ఇప్పించినది మీరేనండి!" అని.

"అలాగా! నాకు జ్ఞాపకంలేదు....ఎప్పటిమాటో! అవును: అప్పుడు నేను ఫీల్డెన్‌తో సెలక్షన్‌కమిటీలో ఉన్నాను కదూ!" అన్నారు. అప్పుడు నేను

వివరంగా చెప్పాను ఆయనతో, ఆ సందర్భంలో ఆయన నన్నుగురించి చెప్పిన ప్రశంసావాక్యాలను ఉదాహరిస్తూ. ఆయన నవ్వుతూ అన్నారు:"ఆ నా అభిప్రాయం మార్చుకోవలసిన అవకాశము కలుగలేదుగా !" అని.

....సెలక్షన్ ఐన సాయంత్రమే, ఆరితేరినవారి పేర్లనుగల పట్టిక కాపీలు నా చేతికిచ్చి, మా డైరెక్టర్ : "ఇవి పత్రికలవారికీ, ఏ. పీ. ఐ. వారికీ అందజేసి వివరాలు వెంటనే ప్రచురించే ఏర్పాటు చెయ్యి" అన్నారు. పత్రికల వారూ, అసోసియేటెడ్ ప్రెస్ ఆఫ్ ఇండియా వారూ అందరూ నన్ను ఎరిగిన వారే. నేను వారిచేతఉంచిన పట్టికలో నాపేరున్నూచూచి వారు నవ్వుతూ, నన్ను చాలా అభినందించారు. "నీ పెళ్ళికి శుభలేఖలు నీవే పంచిపెడుతున్నావా ?" అన్నారు ఒకరు నవ్వుతూ.

నాతోకూడా, మరి ఇద్దరు తెలుగువారున్నూ ఆరితేరారు, ఆ సెలక్షన్‌లో. ఆదిని, మా ముగ్గురి హోదాలలో కొంతతేడా ఉన్నా, రేడియోకేంద్ర కార్యక్రమాలు ప్రారంభించేసరికి ముగ్గురమూ ఏకహోదాలో పనిచేస్తూ, ఎంతోగా కలిసి మెలసి ఉండేవారము. ఒకరిఎడ ఒకరికి అపరిమితమైన గౌరవమున్నూ స్నేహభావ మున్నూ. మద్రాస్ రేడియోకేంద్రపు మొదటి స్వరూపము మా ముగ్గురి కృషి వలననే, దేదీప్యమానము కాజొచ్చినకొలదీ రేడియో కార్యక్రమాలతో సంబంధము గలవారు మమ్మల్ని ముగ్గురనూ "త్రిమూర్తులు" అనడము ప్రారంభించారు. ఆ వర్ణన అంతపూర్తిగా సమంజసము గాకపోయినా, వారి అభిమానము అటు వంటిదీ, మరి.

మేము ముగ్గురమూ కలసి మిక్కిలి శ్రద్ధాభక్తులతో పనిచేసేవారము. మాలో ఎవరికి ఏక్రొత్త ఆలోచన కలిగినా వెంటనే ఆ ఆలోచనను గురించి ముగ్గురమూ సంప్రతించేవారము. మా మా నైజములనుబట్టి, మా మా దృక్పథములనుబట్టి కొన్ని కొన్ని విషయాలలో కొంత కొంత అభిప్రాయభేదముండుట సహజమే. కాని, రేడియో కార్యక్రమవిషయాలలో ఈ విభిన్న అభిప్రాయాలు కొంత నూతనత్వమూ, ఓరీతి నవ్యతా రేకెత్తించడానికి సాయపడేవేగాని, అందుకు ఆటంక

మయ్యేవి కావు. ఇందుకు కారణము, మా ముగ్గురి ప్రధానఆశయమూ ఒకటే అగుట. బహుముఖమైన ఆంధ్రసంస్కృతిని ఇంటింటా వ్యాపింపజేయాలి అనీ, విశ్వప్రయత్నముచేసి ఐనా, రేడియోవిధానముద్వారా, జనులలోని అజ్ఞానాన్ని తొలగించి, ప్రాజ్ఞులుచేస్తూన్న సత్యాన్వేషణ, సౌందర్యాన్వేషణ, సౌభాగ్యాన్వేషణ అనే త్రివర్గమైన మహాకృషిలో ఉడుతాభక్తితో మేమున్నూ తోడ్పడాలి అనే, మా ముగ్గురి ఆశయమున్నూ.

మా ఇన్నేళ్ళకృషి, ఈ త్రివర్గాన్వేషణకే అంకితమైనది.

౪

విరిసిన తీవమల్లియల వెక్కసపాటును
దూరుకొంటి నీ
చిరునగవుల బసందులకు చెందిన
మోహాభరమ్ములోన, సుం
దరదరహాస తావక సుధామధురాధర
లక్ష్యసిద్ధి చే
ఉరవగుచున్న సాత్త్వికామహోదయ
లుప్త బహిఃప్రవృత్తినై.

'విరిసిన తీవమల్లియులు', 'చిరునగవుం బసందులు', 'సాత్త్విక మహోదయము'—సాహిత్యప్రియుల, భావుకుల సౌందర్యాన్వేషణాయాత్రలో కాస్తసేపు విరామము కల్పించి, ఆనందమిస్తూ సేదదీర్చే ఈ అందమైన మాటలు ఎవరివి? వేయిమంది కవులలో ఎవరో ఒకరుగాని చెప్పలేరు, నా భావాలను, తన మాటలుగా, ఇంతటి ఆర్ద్రితతోనూ, ఇంతటి నిజాయితీతోను! అందుకే, 1936-37 ప్రాంతాలలో నన్ను అంత గొప్పగా ఆకర్షించేది, పాటిబండ మాధవశర్మ కవిత:

నడకలలోననే త్రిభువనమ్ముల
బందెల వెట్టు నీదు రా
కడ పసికట్టె నా యెడద, గాటపు
నిద్దురలోన సైతమున్
వెడ వెడ లేతనవ్వు ప్రసవించును, రాగ
తృషాభరమ్మునన్
బడలిన ఈ సుధాధరముపై మృదు
చుంబనముద్ర లుంతువో.

మాధవశర్మను చూస్తే మాత్రము అతను ఇంతగా ప్రేమను గురించిన యాతనను అనుభవించే మనిషి అనిపించదు. అటువంటివారిలో సాధారణంగా, కనిపిస్తుంది, ఒకమోస్తరు అతిసుకుమారత్వము. మాధవశర్మలో ఆ నిస్పృహాయతా, ఆ అలసత్వమూ, దేనికోసమో వెతుక్కుంటూన్నట్టు కనిపించే బెంగా చూడము, మనము. అతనిలో, ధీరత్వముతోపాటు ఒక గొప్ప నిజాయితీ భావము కనిపిస్తుంది నాకు. నాకులేని, ఎన్నడూ నేనుఅందుకోలేని, మనోధైర్యాన్ని అతను ఇదివరకే సాధించాడు అనిపించేది, ఆరోజులలో నేను అతనిని చూచినప్పుడల్లా.

కాని, వట్టి ప్రేమికునిగా నేను చెప్పాలనుకుని, ఆరాటపడుతూన్న భావాలనే, ఎంత అందంగా, ఎంత సూటిగా, ఎన్నడూ మరువరానివిధంగా, ఎంతటి ఉదాత్తతను కలిగిస్తూ అనగలుగుతున్నాడు, కవిగా, మాధవశర్మ:

ఆ పతనాతిమోహనము, ఆ సుకుమార
కరమ్ము నీడె! ని
ద్రాపరతంత్ర మీాతనువు స్పర్శసుఖజ్ఞము
గుర్తు పట్టె! నా
లోపలి చూపులోపల వెలుంగు స్వరూపము
నీవ సుమ్ము నీ
రూపముగాని రూపము నెరుంగను
స్వప్నములందు సైతమున్.

"నాలోపలి చూపులోపల వెలుంగు స్వరూపము నీవసుమ్ము, నీ రూపముగాని రూపము నెరుంగను స్వప్నములందు సైతమున్"—అంటూ, నాలో నేను మననముచేసుకుంటూ, నేను అనుకునేవాణ్ణి 'ఆమె' తప్పకుండా ఈ మాటలు నామాటలుగా, వింటుంది కదా!" అని!!

# సాగుతున్న యాత్ర

ఆరోజులలో పాటిబండ మాధవశర్మా మరి ఇద్దరు స్నేహితులూ కలసి ఒక చక్కని సాహిత్య పత్రికను నడిపేవారు. ఆ పత్రిక కొన్నాళ్ళు 'ఉషస్సు' అనే పేరుతోనూ కొన్నాళ్ళు 'వీణ' అనే పేరుతోనూ నవ్యసాహిత్యరంగాన్ని అలంకరించింది. నా ఇన్సూరెన్స్ కృషిరోజులలో ఒకసారి వెళ్ళాను కూడా, తెలప్రోలు గ్రామానికి, మాధవశర్మనూ మిత్రులనూ పరిచయంచేసుకోడానికీ, వారు చేస్తున్న ఉత్తమకృషినిగురించి వారిని ప్రశంసించడానికీ. వారు ముగ్గురిలో ఒకరు వచ్చిన వ్రాతప్రతులను సరిదిద్దుతున్నారు. ఒకరు అచ్చుఅక్షరాలను ఏర్చి కంపోజ్ చేస్తున్నారు. ఒకరు చిన్ని చేతియంత్రంపైన ఒకొక్క ఫారమూ అచ్చు వేస్తున్నారు. వారిని చూచి నేను ఎంత సంతోషించానో చెప్పలేను! నేనుకూడా వారితోనే ఉండిపోయి నాలుగోవానిగా పనిచెయ్యాలనిపించినదన్నమాట!

ఏ గొప్పపని అయినా, ఇలా, ఉపక్రమింపవలసినదే. క్రొత్తగా రూపుదాలుస్తూన్న ఆల్ ఇండియా రేడియో మద్రాస్ కేంద్రమున్నూ ఇలాగే ఒక్కొక్క ఇటుకా శ్రద్ధతో, భక్తితో, చేర్చి కట్టినదే. తలా ఏదో ఒకపని చేస్తున్నా కార్యభారము, అనేకవిషయాలలో ఒక కొందరిపైననే పడుతుంది. వారు సంతోషంతోనూ ఉత్సాహంతోనూ, ఒకరీతి కృతజ్ఞతతోనూ ఈ భారాన్ని వహిస్తారు కాబట్టి. రేడియో కేంద్రము మద్రాస్‌లో ఉన్నా, మన ప్రాంతాలలోకంటే తమిళ జిల్లాలలోనే రేడియో వినేసౌకర్యాలూ, ఇంటింటా రేడియో సెట్లూ ఎక్కువ ఉన్నా, అప్పటి కృషి ఎక్కువగా తెలుగులో ప్రసారమయ్యే కార్యక్రమాలలోనే వెలుగొందినదేమో. ఈపనిలో నిమగ్నులమై ముగ్గురమూ ఏకదీక్షతో పనిచేస్తున్న మేము ఆఫీస్‌లో ఉన్నంతసేపూ, ఇంటికి వెళుతూన్నంతసేపూ, ఇంట్లో మసలుతూన్నంతసేపూ, ఆఖరికి, నిద్రిస్తూన్నంతసేపూ, రేడియోప్రసారవిషయమే ఆలోచిస్తూ ఉండేవారము. ఒక క్రొత్త పుస్తకం చేతికివస్తే, గ్రంథకర్త సూచించిన విషయాలను గురించి మనము ప్రసంగములు ఏర్పాటుచేస్తే ఎంత బాగుంటుందీ అనిపించేది. వీధిలో వెళుతూంటే ఒక బిచ్చగాడు ఏదో పాతపాట, జానపదగేయము పాడుతూంటే, అతనిచేతిలో రూపాయో రెండురూపాయలో ఉంచి, అతనిని రేడియోస్టేషన్‌కి తీసుకెళ్ళి ఆపాట రికార్డ్ చేయవలసినదే!

# సాగుతున్న యాత్ర

రేడియోకేంద్ర కార్యక్రమాలు ప్రారంభించడానికి ఇంకా నాలుగునెల లున్నా ఊపిరి సలుపకుండా పనిచేయవలసివచ్చేది. ప్రసంగాలు ఏర్పాటు చెయ్యాలి. నాటకాలనూ నాటికలను సమకూర్చాలి. తెలుగులో మంచి నాటకాలూ నాటికలు బహుతక్కువ. క్రొత్తవి, రేడియో ప్రసారానికి అనుకూలమైనవి వ్రాయాలి, వ్రాయించాలి. ఒక నాలుగునెలల తర్వాత ప్రసారము కానున్న కార్య క్రమం గురించి వ్యక్తులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపాలి. మాట్లాడ కలిగినా, మాట్లాడడానికి ఆసక్తిలేనివారిని ఎలాగో అలా ఒప్పించి, వారివద్దనుంచి మాట్లా డేందుకు అనుమతించినట్లు ఉత్తరం తెప్పించాలి. ఆఫీస్‌లో నిరంతరం, టెలి ఫోన్‌లో ఎవరితోనో, రాగల కార్యక్రమాలను గురించి మాట్లాడుతూనే ఉండాలి. ఒక్కొక్కప్పుడు, విచిత్రమైన అనుభవాలు కలుగుతూండేవి.

ఒకసారి టెలిఫోన్‌తీసి మద్రాస్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి మార్ష్ బాంక్స్‌ను పిలిచాను, నేను. నేను ఫలానా అని చెప్పి, "షేక్స్పియర్ నాయకు లలో ఉత్తమనాయకునిగురించి ఒక పదిహేను నిమిషాలు ప్రసంగిస్తారా, రాగల జులై 14వ తేదీన" అని అడిగాను, నేను. "ఏమిటి—ఎవరు మాట్లాడేదీ?" అని మార్ష్ బాంక్స్ అడిగారు నన్ను, ఆశ్చర్యపడుతూ, నేను ఏదో తప్పుపని చేసాను అనే భావముకలిగిస్తూ. నేను మళ్లా వివరించాను నా ప్రశ్నను. మార్ష్‌బాంక్స్ అన్నారు, అప్పుడు: "ఇలా టెలిఫోన్‌ద్వారా ఆహ్వానించడము క్రొత్తపద్ధతే! నాకు అలా టెలిఫోనుఆహ్వానాలు అలవాటులేదు!!" అని, కాస్త రోషంగానే. ఆయన రిసీవర్ పెట్టివేయబోతున్నారు. నేను చప్పున అన్నాను: "క్షమించండి, ఒక్క నిమిషం. ఇది ఆహ్వానం కాదు. మద్రాస్‌లో క్రొత్తగా రేడియో కేంద్రము నెల కొల్పుతున్నామని మీకు తెలుసు అనుకుంటాను. ఆ ప్రసారాలలో జరుగనున్న ఇంగ్లీష్ ప్రసంగాలనుగురించి ముందుగా ఏర్పాటుచేసే పని నాకు ఒప్పగించారు. మీకు షేక్స్పియర్ నాటకాలంటే చాలా ఆసక్తి అనీ, ఆవిషయంలో మీరు కొంత పరిశోధనకూడా చేశారనీ, మిత్రులద్వారా విన్నాను. అందుచేత, ఇలా మీతో టెలి ఫోన్‌లో మాట్లాడడానికి సాహసించాను. మీరు చాలా ముఖ్యమైన పనిలో ఉన్నా రని తెలుసు. కాని, నాకు కొన్ని నిమిషాలు అవకాశమిస్తే, స్వయంగా మీవద్దకు వచ్చి ఈ విషయంగురించి ప్రస్తావిస్తాను," అన్నాను.

మార్ష్‌బాంక్స్ వెంటనే అన్నారు: "అల్లాగైతే, ఒక పావుగంటలో వస్తావా, నీకోసం ఎదురుచూస్తూ ఉంటాను" అని.

ఒక పావుగంటలో, ఫోర్ట్ సెంట్ జార్జ్ కోటలో, ఆయన ఎదుట ప్రత్యక్షమైన నన్నుచూచి, మార్ష్‌బాంక్స్ చాలా సంతోషించారు. "సాధారణంగా, ఇచ్చటివారు ఇంత "పన్క్చువల్"గా ఉండరే! మీరు ఒక క్రొత్త పద్ధతి ఏర్పరుస్తునారన్నమాట. అవును, బ్రాడ్‌కాస్టింగ్‌లో నిమిషాలేగాక, సెకన్‌లుకూడా గణింపవలసి ఉంటుంది" అంటూ, తన ఆఫీస్‌పనిని ఆపూటకు కట్టిబెట్టి, నేను వచ్చిన విషయాన్నిగురించి నాతో ప్రస్తావించడము మొదలుపెట్టారు. వారు మాట్లాడవలసిన విషయాన్నిగురించి నాలుగుమాటలు చెప్పేసరికి ఆయన నవ్వుతూ అన్నారు: "షేక్స్పియర్ రచనలనుగురించి నాకంటె నీకే ఎక్కువ తెలుసులాగుందే— ఎక్కడ చదువుకున్నావు, నువ్వు!" అని. "డాక్టర్ జేమ్స్ కజిన్స్ మాకు ఇంగ్లీష్ సాహిత్యమును గురించి చెబుతూ ఉండేవారు, అడయార్‌లో" అన్నాను, నేను.

"అల్లాగా! ఇప్పుడు అర్థమైంది. నాకు ఈ అవకాశాన్ని ఇచ్చినందుకు చాలా సంతోషం. నేను కృతజ్ఞతతో అంగీకరిస్తున్నాను, నీవు కోరినట్లు ఒక పదిహేను రోజులలో నా వ్యాసము వ్రాసి పంపుతాను. నీవు ఒకసారి సరిజూచి, మళ్లా నాకు కనిపించు. ఏమైనా మార్పులు అవసరమైతే చూద్దాము" అని, లేచివచ్చి నన్ను ఆఫీస్ వరండావరకూ సాగనంపారు, మార్ష్‌బాంక్స్.

అల్లాగే, ఎందరితోనో మొదట టెలిఫోన్‌లోనే మాట్లాడి, తరువాత సముఖాన విషయం వారితో చర్చించి, ఏర్పాటుచేసేవారము. గెలెటి, అనగా గురుజాడవారి కన్యాశుల్కాన్నిగురించి లోకానికి తెలియపరచిన గెలెటి కుమారుడు, ఆయన మద్రాస్ ప్రభుత్వంలో ఒకశాఖకు కార్యదర్శి, ఆయనతోనూ, ఇలాగే. మొదట టెలిఫోన్‌లోనూ, తరువాత ముఖాముఖి పరిచయమైన తరువాత, ఆ పరిచయము స్నేహంగా కూడా పరిణమించింది.

రెవిన్యూబోర్డ్ మెంబరు బేజ్‌లీతోనూ ఇలాగే, సన్నిహితత్వము కలిగింది. ఆయినా, ఆయన భార్యకూడా మంచి సాహిత్యప్రియులు. స్నేహపాత్రులు.

నన్ను చాలా ఆదరించేవారు. బేజ్‌లీ మంచి అనుభవజ్ఞుడు. ఆయనతో సంభాషణ వల్ల ఇదివరకు నాకు ఏమీ తెలియని మనదేశపరిపాలనలోని విశేషాలు ఎన్నో తెలుసుకోకలిగాను, నేను.

ఇతరులతో టెలిఫోన్‌లో మాట్లాడుతూంటే, కొన్ని కొన్ని మర్యాదలను తప్పక పాటింపమంటూ ఉండేవారు మా డైరెక్టర్. "ఈ రేడియో సంస్థ గవర్నమెంట్ ఆఫ్ ఇండియావారిది. కనుక మీరు ఎవరిని టెలిఫోన్‌లో పిలచినా, "గవర్నమెంట్ ఆఫ్ ఇండియా, ఆల్ ఇండియా రేడియో, మద్రాస్ కేంద్రము నుంచి, ఫలానావారు మాట్లాడుతూంట, అని, ప్రారంభించాలి" అన్నారు. ఆప్రకారమే నేను ఒకసారి, శాసనసభ్యునిగా మద్రాస్‌కు వచ్చిఉన్న శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావును టెలిఫోన్‌లో పిలిచాను. నా పిలుపు విని ఆయన అన్నారు: "అబ్బో! చాలా ఉన్నదే!!....ఒక్కక్షణం ఉండు" అంటూ, రిసీవర్ చెంతనే ఉన్న మరి ఒకరికి ఇచ్చినట్లు చప్పుడైంది. ఆ మరిఒకరు, సన్నని కంఠస్వరంతో అన్నారు:

"ఎవరూ మాట్లాడేది?" అని. నేను మళ్లా, ఆర్భాటంతో నాకితాబులతో సహా నాపేరు చెప్పేసరికి, అవతలగొంతువారు ఫక్కున నవ్వి "నేను కమలాదేవిని, కాళేశ్వరరావుగారు, నీ పటాటోపం విని నవ్వుతున్నారు" అని, మళ్ళా, ఎంతో ఆదరణతో "ఎలా ఉన్నావు? నన్ను చూడడానికి ఎప్పుడు వస్తావు?" అంటూ అడిగారు. నేను వెంటనే వెళ్ళి వారిద్దరినీ చూచాను.

కమలాదేవి చటోపాధ్యాయను చూచివచ్చిన కొంతసేపటికి మిత్రుడు గూడవల్లి రామబ్రహ్మం నన్ను చూడడానికి వచ్చారు. నేనంటే ఆయనకు ప్రాణము. నాకూ వారంటే చాలా ఇష్టము. రేడియో ఆఫీస్‌లో కొంచెముసేపు ఉండి, నేను ఆఫీస్‌పని ముగించుకున్నాక, నన్ను తన కార్‌లో ఎక్కించుకొని బీచ్‌కు తీసుక్కువెళ్లారు. సముద్రపుటొడ్డున విశ్రమించి మాట్లాడుకుంటూ ఉండగా, ఆయన నన్ను చూస్తూ అన్నారు: "నీవద్దకు ఒక ముఖ్యమైన పనిమీద వచ్చాను, చేసిపెడతావా?" అని. నేను వెంటనే అన్నాను, అవశ్యం చేస్తానని. "ఎల్లుండి మా "మాలపిల్ల" సినీమా శతదినోత్సవము. ఫలానా థియేటర్‌లో గొప్పగా

చెయ్యాలని ఉన్నది. ఆ ఉత్సవానికి కమలాదేవి చటోపాధ్యాయ అధ్యక్షత వహిం చాలని ఉన్నది నాకు, చాలా. ఆమెను తీసుకువస్తావా?" అన్నారు, రామబ్రహ్మం. "అల్లాగే!' అన్నాను, నేను. ఆప్రకారమే కమలాదేవిని తీసుకువచ్చాను, అధ్యక్షు రాలుగా సభకు.

స్నేహితులలోకల్లా మిక్కిలి స్నేహపాత్రుడూ, సజ్జనుడూ గూడవల్లి రామ బ్రహ్మం. తనూ చాలా కష్టాలుపడి పైకివచ్చినవాడో, ఏమో, కష్టాలుపడ్డవారినీ, కష్టాలుపడుతూన్నవారినీ చూసి, అతని హృదయము కరిగి నీరవుతుంది. ఎంద రెందరో అతనివలన సహాయాన్నిపొందినవారు! మన చలనచిత్ర పరిశ్రమలో ముందడుగువేసి మార్గదర్శకుడైన అతను ఆ పరిశ్రమలోనే, ఎందరికో చేయూత నొసగి, వారిని ముందుకు తీసుకువచ్చాడు. జీవితము ఒకవిధమైన వైకుంఠపాళీ వంటిది. ఈ వైకుంఠపాళీ ఆటలో తరుచు అతని ఆశ్రయమువల్ల పైకి వస్తున్న వారికి మంచి పండెముపడి వారు నిచ్చెన నెక్కి పైకి వెళ్ళిపోయేవారు. పాముగడిలో తన పందెము పడి, క్రిందికి రావలసివచ్చిన గూడవల్లి రామబ్రహ్మం అలా తనను దూసుకుని పైకివెళ్ళేవారిని గూర్చి ఆవగింజంతైనా ఈర్ష్యపడేవాడు కాదు. మీదు మిక్కిలి, వారికి ఇంకా ఇంకా సహాయంచెయ్యాలి అనే అతని కోరిక.

సాహిత్యమంటే చెవి కోసుకొనేవాడు రామబ్రహ్మం. నేను ఏదైనా క్రొత్తకథ వ్రాసినా అతనికి వినిపిస్తేనేగాని తోచేదికాదు నాకు. అలా నా రచనను తీసుకుని అతనివద్దకు వెళ్ళగా, ఎంతటిపనిఉన్నాసరే, ఆ పనిని ఆపి, నా రచన వినేవాడు అతను. నేను అతనివద్దకు వెళ్ళినపుడు అతను రిహార్సల్‌లో ఉంటే, ఆ రిహార్సల్ అప్పటికి ఆపి, రామబ్రహ్మం ఆ నటీనటులతో అనేవాడు: "ఈ రచన వినండి— తుప్పుపట్టినచెవులకు మంచిది!" అంటూ నవ్వుతూ. నన్ను తన కుడి చేయివేపు కూర్చోపెట్టుకుని, నా రచన చదివించుకు ఆనందించేవాడు, సహృద యుడు అతను. ఒక పర్యాయం, నా ఒక రచన, అతి గాఢమైన ప్రేమభావంతో ప్రారంభించి, ఏవో ఏవో ప్రేమసంబంధమైన, బాధాకరమైన సంఘటనలను వర్ణించి, చివరకు భరింపరాని నిస్పృహతో అంతముకాగా, రామబ్రహ్మం నన్ను చూస్తూ అన్నారు:

"ఇల్లాగే ప్రేమసీమలో ఏదో అందరానిదానికోసము ఆరాటపడతావు నీవు, ఇల్లాగే ఈ సినీమా సీమలో ఏదో అందరానిదానికోసము ఆరాటపడతాను నేను. మన ఇద్దరికీ ఈ ఆరాటము తప్పదు కాబోలు!" అని.

కాని, అతనుతీసిన "మాలపిల్ల" ఆరోజులలో, ఉత్తమతరగతికి చెందిన చిత్రమే అని చెప్పాలి. శతదినోత్సవసభకు అధ్యక్షతవహించిన కమలాదేవి చటోపాధ్యాయకూడా అమాటే అన్నారు:

"ఈ చిత్రపు ఇతివృత్తము నాకు చాల ఇష్టమైనది. ఇటువంటి ఉత్తమ చిత్రాలద్వారా అత్యవసరమైన సంఘసంస్కరణ చేకూరగలదని ఆశిస్తున్నాను. ఇందు నటించిన కాంచనమాల, డాక్టర్ గోవిందరాజుల సుబ్బారావు తమ పాత్రలను చాలా చక్కగా పోషించారు. వారికిన్నీ చెలికత్తెగా నటించి, తన తీయని కంఠస్వరంతో మన కందరికీ ఎంతో ఆనందాన్నిగూర్చిన సుందరమ్మకూ నా అభివందనము. శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారి యత్నము ఎంతో విజయవంతమైనది!" అన్నారు ఆమె.

ఇంటికి వస్తూ సభవారు తన కంఠసీమ నలంకరించిన మనిషంత గులాబీ పూమాలను నాచేతికిస్తూ, కమలాదేవి అన్నారు: "నేను రాజకీయరంగులలోనో, ఏ సంఘసంస్కరణ ఉద్యమంలోనో మునిగితేలుతూ ఉంటాను. నా కెందుకీ దండ! నీవు నిత్యకవివి. ఈ దండ నీదగ్గరే ఉండాలి!!" అని బలవంతంచేసి, దండను నాకిచ్చారు, వారు వెళ్ళిపోయారు........

హోటల్‌లో నా గదిలో బల్లపైన ఆ గులాబీదండ ఉంచి, ఇలా పడకకుర్చీలో విశ్రమిస్తూ నేను మళ్లా ఒకసారి జ్ఞాపకంచేసుకున్నాను, ఆ పువ్వులకేసి అలాగే చూస్తూ, ఎప్పటిదో నా పూర్వజన్మ వృత్తాంతాన్ని స్మృతిపథానికి తెచ్చుకుంటూ. మళ్ళా ఒకసారి, పాటిబండ మాధవశర్మ, కవిగా, నా హృదయానికి మాటలను సమకూర్చారు.

సాగుతున్న యాత్ర

మది మృదులమ్ము, మాట లతి మంజులముల్,
క్రియ లార్ద్రభంగులై
గదిరిన గాక ప్రేమ మనగా ఒక డున్నె!
ప్రసన్న వాంఛమై
ఎదలు పరస్పరమ్ము పలికించు ప్రవృత్తి
య కాక ప్రేమ య
న్నది ఒక డున్నె? ఒండుగతి నైజ
మెరుంగునె ప్రేమభావముల్?

ఎంత చక్కగా చెప్పారు, కవి!.... ఎప్పటి విషయాలో, ఏనాటి అనుబంధమో.... ఎందుకో ఈ బాధ!

కనులు చెమ్మగిలక తప్పదు, ఎదుట బల్లమీద రాసిగా గులాబీపూమాలను అలా చూస్తూంటే!

౩

నీ మురళీరవమ్ము విని నీ కడకున్
జనుదెంచి చూతునా
స్వామి! యిదేమి నాగళము సన్నవడెన్
చెమరించె దేహమున్
సామి వినిర్గతాశ్రువులు జాలయి పారెను
ఫుల్లగల్లమున్
హ్రీమధురమ్ముగా పులకరించినదీ
మృదుమాలతీ గతిన్
స్వామి! పునః పునారచిత చంద్రక చారు
పురః ప్రసారముల్
నా మనమున్ హరించె పరిణద్ధకలాపి
కలాపకైశిక
శ్రీ మహనీయతల్ సతుల లే యెదలన్
హరియించుటల్వినా
ఏమిఘటించు నీకు కికురించుట
నీపని యయ్యొనే ప్రభూ!

"సంపత్"

నేనేగనుక యువకవినైతే, నాయెడనే గనుక సరస్వతీదేవి ప్రసన్నురాలయితే, నేను వాణిని అర్థించేది: ఎప్పటికీ, నా కవితలో నిత్యయవ్వనము స్ఫురించాలనీ, నా మాటలో నిత్యవసంతము ప్రతిబింబించాలనీ. ఇరవైయేళ్ళక్రితము, "సంపత్" అనే, శ్రీ రాఘవాచారి కవిత, ఇది. మరి ఇప్పుడూ ఇలా పద్యము

చెప్పగలరా, ఆయన అంటే యేమో!........ ఇప్పటి ధోరణి వేరు. రోజులు గడిచినకొద్దీ మనలో ఆధ్యాత్మిక భావం ఎక్కువగుతుందేమో. నిత్య జీవితపు మరలో నలిగిపోతవికూడా, కొన్ని సున్నిత భావాలూ మధురమైన కొన్ని ఊహలూను. కాని, ఆరోజులలో, రాధను గురించి అంతవరకు వచ్చిన రచనలలోకల్లా, "సంపత్" రచించిన ఈ "రాధ పిలుపు" నన్ను బాగా కదిలించినది.

"సంపత్", ఇంకా ఇలా అంటారు:

ఓ యదువంశపూళి! రుచిరోజ్వల
మీనపతాక మెత్తి ద
ర్పాయుత శింజినీ రవములన్ మదనాహ్వా
యుడేయు బాణముల్
నీ యెదతాకి తూలిపడునేమొ సుమమ్ము
లపోల్కి-రాధకున్
తీయని మంటలై యుసురు తీయునురా
జకదేకసుందరా!

"తీయని మంటలు!"....ప్రబంధ కవిత్వములోని ప్రౌఢత్వానికీ నవకవితలోని అతి లాలిత్యానికీ సామరస్యము కుదిరిందికదూ, మన "సంపత్" రచనలో, అని ఆనందించేవాడను, నేను. 1938లో క్రొత్తగా వెలసిన ఆల్ ఇండియా రేడియో మద్రాస్ కేంద్ర కార్యక్రమాలను గురించిన యేర్పాట్ల సందర్భములో, సమకాలిక సాహిత్యమును పరిశీలిస్తూ. ఆ తరువాత కొంతకాలానికి, ఈ "సంపత్" ఎవరో కనుక్కొని, ఆయనను కలుసుకున్నానుకూడా. మంచి భావనాబలమున్నూ ఉన్నది, ఆయన కవితలో:

శారదయామినీ మధుర చంద్రిక లిమ్ముగ
నింబవాటికన్

తీరిచి ముగ్గువెట్టి నవనీతలమున్
మలుపచ్చి ముత్యపున్
పేరుల నందగించె రజనీరమణీకచ
సక్తసూసక
శ్రీ రమణీయమై వెలిచె శీతమయూఖుడు
షోడశాంశుడై!

కాని, ఆ సందర్భములో రాధ కొంత తొట్రుపాటుతో, వెలిబుచ్చే భయాన్నిమాత్రము నేను పూర్తిగా ఆమోదింపలేకపోయాను. ఇంత ఆత్మవిశ్వాసము లేని ప్రేయసా, రాధ, అనిపించింది, నాకు—చెప్పొద్దూ!!

వలపులు ముర్మురించు రసవన్నవ
హృచ్చషకమ్ము నీకునై
నింపితి, త్రావిపొమ్ము నవనీతదయా
గుణశాలి! ఆవలన్
వలచిన నుండునో మరి రవంతయు
నుండక యెండిపోవునో
మొలచిన కూర్మి కన్ను గవ మూసిన
నేమగునో జగత్ప్రభూ!!

వట్టి బేల రాధ, నిజమే. కాని, అంతటి నిస్పృహ అవసరములేదేమో! యుగయుగాలుగా నిలచి, శాశ్వతమైన రాధికా ప్రేమ కాస్త ఆలస్యాన్ని సైరింప లేదూ?— అనుకున్నాను, నేను.... కాని, "నవనీత దయా గుణశాలి" — ఎంత బాగున్న దీ మాట!

ఐతే, ఇలా సాహిత్య మీమాంసలో పడి ఉండిపోడానికి అవకాశము లేదు అవతల; "యెల్లి స్వయం వరంబు" అన్నంత హడావుడిగా పనులు జరిగి

పోతున్నవి. ఈ సాహిత్యపు గొడవలలో ఉన్న నన్ను ఇంజనీయర్‌లు వెంటనే కంట్రోల్ రూమ్‌కు రమ్మని కబురు పంపారు.

ఇంజనీయర్ ముక్కవల్లి శాస్త్రి అన్నారు: "చూడండీ! మా ప్రసార యంత్రము తయారైంది. ఆంధ్రదేశమంతటా వివిధ ప్రాంతాలలో ఈ ప్రసారము ఎంతెంత ప్రస్ఫుటంగా వినిపిస్తుందో, తెలుసుకోవాలి మనము. ఆయా ప్రాంతాల వారు విని, వ్రాస్తారు, మనకు ఈ పరీక్షా ప్రసారాన్నిగురించి. అదుగో! ఆ రికార్డ్‌ల లోని కొన్ని మీకు నచ్చినవి తీసి ఇయ్యండి. అవి బ్రాడ్‌కాస్ట్ చేస్తూ అడుగడుగునకూ, ఒక ప్రకటన ప్రసారం చేస్తాము. ఆ ప్రకటనను మీరే చదివి రికార్డ్ చెయ్యాలి." అన్నారు.

రికార్డ్‌లను తీసి ఇచ్చాను. ప్రకటనా చదివాను— వారు నా ప్రకటనను రికార్డ్ చేశారు. ఆ తర్వాత ఒక పదిరోజులు, రోజుకు మూడు పర్యాయాలు,కొన్ని గడియలసేపు: "ఆల్ ఇండియా రేడియో, మద్రాస్ కేంద్రము.... 60. 98 మీటర్ల పైన, అనగా, 4920 కిలో సైకిల్స్‌పైన, పరీక్షా ప్రసారము—రికార్డ్‌ల సంగీతము" అంటూ నేల నాలుగుమూలలా మారు మ్రోగినది, నా కంఠస్వరము. ఊళ్లో కూడా తెలిసినవారి ఇంటికి వెళ్ళితే, ఆ ఇంటిపిల్లలు నేను మాటల సందర్భాన "ఆల్ ఇండియా రేడియో" అనేసరికి వారు వెంటనే "పరీక్షా ప్రసారము!" అనేవారు— "అమ్మగారీ ఇల్లు" అనేసరికి, "ధమ్మలోగిల్లు!" అనే రీతిని. అన్ని సార్లు ఆ పిల్లలు విన్నారన్నమాట, నేను చేసిన ప్రకటనను.

కార్యక్రమాల నియామకమును గురించి చేయవలసిన పని చాలా ఉన్నది. ప్రసంగాల వ్రాతప్రతులను ఒక పదిహేను రోజులు ముందుగా తెప్పించాలి. వ్రాసేవారికిన్నీ ఈ పద్ధతి చాలా క్రొత్త. గంట, రెండు గంటలూ గంభీరంగా ఉపన్యసించడానికి అలవాటుపడినవారు తాము చెప్పవలసిన ముఖ్యవిషయాలు ఒక పావు గంటలోకి కుదించి, ఆకర్షణీయంగా చెప్పాలి. పద్ధతీ, ధోరణీ రసవంతంగా ఉండాలి. గంభీరమైన ఉపన్యాసంలా గాక, ఆప్యాయమైన ఇష్టాగోష్ఠిలా ఉండాలి, ప్రసంగము. వ్యాసరచన అందుకు అనువైనదిగా అమరాలి, మరి. ఇది అంతా

మనవారికి క్రొత్త. అందువలన, వచ్చిన వ్యాసాలకు చాల మెరుగుపెట్టవలసి ఉండేది. విషయంకూడా ఏమాత్రం లోపంలేకుండా ఉండాలి. విషయపరిశీలనకు ఇదివరకు నేను చదువుకున్న చదువు నాకు చాలా ఉపకరించినది. ప్రసంగాలలో కొన్ని ఆర్థిక విషయాలను గురించి, కొన్ని రాజకీయ శాస్త్రవిషయాలను గురించి కొన్ని భౌతిక, రసాయన శాస్త్రాలను గురించి, కొన్ని సాహిత్యమును గురించి, కొన్ని నిత్యజీవితపు సమస్యలను గురించి పీనిని అన్నిటినీ పరిశీలించి ప్రసారానికి అనువుగా తయారుచేయడానికి కావలసిన జ్ఞానమూ ఇంతో అంతో అనుభవమూ నేను అడయార్‌లోను విజయనగరములోనూ బెంగుళూరులోనూ సంపాదించుకున్నాను. అందుకు తోడుగా, ఎన్నో పుస్తకాలూ ఎన్నో పత్రికలూ శ్రద్ధతో చదువడమున్నూ అలవాటైనది. ప్రాజ్ఞులతోటి సహవాసమున్నూ చాలా చాలా సాయపడినది.

ప్రసంగములు చెప్పేవారు ఆయా విషయాలలో నిపుణులు అనతగినవారే. కాని, వారున్నూ ఏదో విషయంగురించి చెప్పవలసినంత విశదంగానూ, ప్రస్ఫుటంగానూ ప్రస్తావించి ఉండకపోతే ఆ సంగతి వారికి చెప్పి, కావలసిన మార్పులు చేయించాలి—వేలాది జనము వారి ప్రసంగమును వింటారు కాబట్టి, ఈ పని చాలా బాధ్యతగల పని. ప్రసంగములో తీవ్రమైన వాదానికి అవకాశమిచ్చే అభిప్రాయము ఉండరాదు— వెంటనే ఆ అభిప్రాయాన్నిగురించి వ్యతిరేక అభిప్రాయమును తెలియజేసే అవకాశము లేదుకాబట్టి. చర్చలు వేరే ఉంటవి: ఒక విషయాన్నిగురించి విభిన్న అభిప్రాయాలను వ్యక్తపరచేందుకు ఒకానొక ప్రసంగములో అతి తీవ్రమైన వివాదాంశము ఉంచరాదు. ఇందుకు, ముందు జాగ్రత్త అవసరము. ఇదిన్నీ చాలా బాధ్యతగల పని. తెలివీ ఉండాలి. నేర్పూ ఉండాలి. హేమాహేమీలను తప్పుపట్టడం సాహసముకాదూ, మరి!

ఒక పర్యాయము, ఈ పనిలో నాకు ఒక వింత అనుభవము కలిగింది. మహనీయులు శ్రీ వి. ఎస్. శ్రీనివాసశాస్త్రి ప్రసంగము ఒకటి యేర్పాటుచేశాము— "నేటి మన విద్యావిధానము"ను గురించి. అప్పుడు పూనాలో ఉంటూన్న ఆయన ఏకారణమువలన ఐనా తాను స్వయంగా రాజాలకపోతే తన ప్రసంగపు

వ్యాసాన్ని వారి మిత్రులు ఫలానా ప్రొఫెస్సర్‌గారిచేత బ్రాడ్‌కాస్ట్‌చేయించవచ్చు అంటూ తమ వ్యాసాన్ని పంపారు, రేడియో నిలయానికి. అంతవరకూ బాగానే ఉన్నది కాని, ఆ రోజులలో రేడియో ప్రసారానికి ముందు ప్రసంగపు వ్యాసాలను అన్నిటినీ స్థానిక ప్రభుత్వపు సమాచారశాఖ మంత్రి శ్రీ ఎస్. రామనాథన్ పరిశీలించి ప్రసారానికి అనుజ్ఞనియ్యవలసిఉండేది. ఈ వ్యాసాలను వారికి చూపి వారి దస్కత్తు తీసుకునేపని నేను చెయ్యాలి. శ్రీ రామనాధన్ నాకు స్నేహితులు. వారు మంత్రి గాకముందు మాతో చాలా కలిసి మెలిసి తిరుగుతూండేవారు. మంత్రిగాకూడా చీటికీ మాటికీ ఏదో సందర్భంలో కలుసుకుంటూఉండేవారు మమ్మల్ని. ఆ చనువుకొద్దీ, నా యందలి విశ్వాసముకొద్దీ, చాలవరకు నామాట మీద, ఈ ప్రసంగపు వ్యాసాలను వెంటనే ఆమోదించేవారు; కాని, ఈ శ్రీ శ్రీనివాస శాస్త్రి ప్రసంగమును చూడడముతోనే "ఏదీ, నీకు శ్రమలేకపోతే, చదువూ, వింటాను." అన్నారు. నేను చదువసాగాను.

గొప్ప విద్యావేత్త శ్రీ శ్రీనివాసశాస్త్రి; అనుభవజ్ఞులు. కాని, వారి ప్రసంగములో వర్ధా విధానమును గురించిన ప్రస్తావన వచ్చేసరికి, ఇంతవరకూ కళ్ళు మూసుకుని ఆలకిస్తూన్న మంత్రి చటుక్కున లేచి కూర్చుని, నన్ను ఆ వాక్యాలు మళ్ళా చదువమనడమేగాక, ఆ కాగితమును తన చేతిలోనికి తీసుకుని తానే చదువుకున్నారు. చదువుకుని, "వర్ధా విధానమును గురించి శ్రీ శాస్త్రిగారు వెలిబుచ్చిన ఈ అభిప్రాయాన్ని ప్రసారము చేయడము కష్టము. ఇది మార్చాలి!" అని నా చేతికిచ్చారు. నేను ఆ వాక్యాలను మళ్లా చదువుకొని, చిన్న మార్పును సూచించాను. ఆయన వెంటనే ఆమోదించి, తతిమ్మా వ్యాసమంతా విని, దస్కత్తు ఉంచి, నా కిచ్చివేశారు. బ్రతుకు జీవుడా!—అంటూ బయటపడ్డాను, కాని, ఈవ్యాసాన్ని చూచిన శ్రీ శాస్త్రిగారి మిత్రుడు, ప్రొఫెసర్ "అబ్బే! అది ఎల్లాగ? శ్రీ శాస్త్రిగారి మాటలను మార్చడానికి మీకు యేమి అధికారమున్నది? ఆ ప్రసంగము ఉన్నది ఉన్నట్టుగానే ప్రసారంకావాలి. తప్పదు!" అన్నారు కాస్త కటువుగానే. నాకు ఏమనాలో తెలియలేదు. ఎవరి ఆదేశమువలన ఈ మార్పు అవసరమైనదో చెపితే పరిస్థితి మరింత క్లిష్టమగుతుంది. అందుచేత, నేను ధైర్యంచేసి ప్రొఫెస్సర్

గారితో ఇలా అన్నాను:"ఇది ఏమంత పెద్ద మార్పుగాదు. బాగా ఆలోచించి సూచించి నదే ఈ సవరణ. దయచేసి, మీరు అంగీకరించాలి. ఈ విషయమునుగురించి శ్రీ శాస్త్రిగారికి వ్రాసి, వారి అనుమతిని పొందడానికి వ్యవధిలేదు. మార్పులేనిదే ప్రసారానికి వీలుపడదు. ఇంతమాత్రంచేత లక్షలాది జనానికి ఆశాభంగముకలుగజేయ రాదు, మీరు" అన్నాను. ఆయన కొంతసేపు ఆలోచించి అన్నారు: "శ్రీ శాస్త్రి గారి రచనను దిద్దడానికి కావలసిన అర్హత నాలోలేదు. నీ బాధ్యతపైన నీవు ఆ సవరణచేస్తే చెయ్యి—పూర్తిగా నీ బాధ్యతపైననే సుమా!", అని. నేను "సరే! నా బాధ్యతపైననే ఈ చిన్న సవరణచేస్తున్నాను—మీతో చెప్పి మరీ చేస్తున్నాను!" అన్నాను. ఆ సవరణతోనే ప్రసంగము ప్రసారమైనది.

తర్వాత కొంతకాలానికి శ్రీ శాస్త్రిగారిని ముఖాముఖి సందర్శించినప్పుడు ఈ సంగతి వారికి మనవిచేశాను కాస్త జంకుతూనే. వారన్నారు:"నేనూ మార్పును గమనించాను. మంచిపని చేశావు. ప్రస్తుత పరిస్థితులలో ఆ సవరణ అవసరమే. బహిరంగసభలో ఉపన్యసిస్తూ మన నిశ్చితాభిప్రాయాలను వ్యక్తపరచడము వేరూ- రేడియో ప్రసంగము వేరూ. మంచిపని చేశావు!" అన్నారు.

తరువాత, తరువాత, శ్రీ శ్రీనివాసశాస్త్రిగారిచేత ఇంకా కొన్ని ప్రసంగాలు ప్రసారము చేయించాను నేను. వయోవృద్ధులైనా, ఎంతటివోపిక, వారికి! ఎంతటి శ్రద్ధ! ఒక అక్షరము తప్పుదొర్లదు. ఒక్క కామా లోపించదు.

శ్రీ శ్రీనివాసశాస్త్రికి శ్రీరాముడు అభిమాన వ్యక్తి. రామాయణము నందలి కొన్ని విశేషాలను గురించీ "పురుషోత్తముడై"న శ్రీరామచంద్రుని గురించీ అద్భుతమైన ప్రసంగాలు చేశారు, వారు. ఈ వారి రేడియో ప్రసంగాలు ప్రఖ్యాతిగాంచినవి, తదుపరి. ఇవి ప్రసారమయే సందర్భములో నేను శ్రీ శాస్త్రిని పువ్వులలో పెట్టినంత భద్రంగా తీసుకువచ్చేవాడను, నా కార్‌లో, రేడియో స్టేషన్‌కు. ప్రసంగము పూర్తి ఐనాక, పదిలముగా ఇంటికి తీసుకువెళ్ళేవాడను. అప్పుడు వారు నన్ను తమతో సమానునిగా భావించి జరిపే ఇష్టాగోష్ఠి ఎంతో హృద్యంగానూ ఎంతో జ్ఞానదాయకంగానూ ఉండేది. భీష్మాచార్యులతోటి సహవాసంలా ఉండేది, వారితో ఉన్నంతసేపూను.

## సాగుతున్న యాత్ర

నేను చదువుకున్న హైస్కూలుకు హెడ్‌మాస్టర్ ఒకప్పుడు, శ్రీ శ్రీనివాసశాస్త్రి. ఆ పదవి వదలి, పూనావెళ్ళి "సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ"లో సభ్యులై, తదుపరి ఆ సంస్థకు వారు అధ్యక్షపదవిని అలంకరించారు. వారు తిరిగి ఏదో పనిమీద మద్రాస్ వచ్చినప్పుడు మా హైస్కూల్‌కు వారిని ఆహ్వానించి సత్కరించాము మేము. "పూజ్య గోఖలే తరువాత గోఖలే అంతవారు!" మీరు కార్య దీక్షవలనా మీ ప్రతిభవలనా, భారతదేశానికి గోఖలే సంపాదించిన పేరు ప్రతిష్టలూ అంతటి కీర్తీ అంతకంటే గొప్పదైన కీర్తిన్నీ సంపాదిస్తారు మీరు, అని వ్రాశాము అప్పుడు మేము శ్రీ శ్రీనివాసశాస్త్రికి సమర్పించిన వినతిపత్రంలో. "బాలవాక్యం బ్రహ్మవాక్యమ్" అన్నట్లు, అల్లాగే, శ్రీ శ్రీనివాసశాస్త్రి భారతదేశానికి గొప్ప కీర్తినిదెచ్చారు. అటువంటివారితో పరిచయము ఎంతో విలువైనది; చిరస్మరణీయమైనది.

*   *   *   *

బెదరని లేడికళ్ళను ఎప్పుడైనా చూచారా, మీరు?

నేను చూచాను!

కాంచనమాలవి, ఆ కళ్ళు.... ఆ చూపులు ఆమెవే!!

మేము ప్రసారము చెయ్యబోయే అనార్కలి నాటకములో అనార్కలి పాత్రను నిర్వహించడానికి ఆహ్వానించే నిమిత్తము వారి ఇంటికివెళ్లాను, నేను. వారి ఆప్తమిత్రులూ శ్రేయోభిలాషి శేషాచారి నన్ను వారింటికి తీసుకువెళ్ళారు.

బెదురుతూ బెదురుతూ మా ముందు వచ్చి నిలబడిన ఆమెను చూచి నేను చకితుడనయ్యాను. తెరమీద తెలియదు, ఇంతటి బేల ఈమె, ఇంతటి అమాయకురాలు-అనుకున్నాను నేను.

ఆ నా మనస్సులోని అభిప్రాయాన్ని గుర్తించి, శేషాచారి అన్నారు: "పట్టి వెర్రిపిల్ల ఈమె. ఎట్లా సాధించుకువస్తుందో, ఈ లోకంలో!" అని.

## సాగుతున్న యాత్ర

మేము ఉన్నంతసేపూ నిలబడే ఉండిపోయింది కాంచనమాల. ఇది నా అలవాటుకు విరుద్ధము. ఎదుట ఉన్న కుర్చీలో కూర్చోమని చాలా బలవంతము చేశాను. ఆమె కూర్చోలేదు. అడిగిన మాటలకు సమాధానమూ చెప్పదు. ఎంత సేపూ ఆ లేడిచూపులే!

"రేడియోవారు ప్రసారము చెయ్యబోయే మొదటి నాటకము, ఈ అనార్కలీ. ఇందు ప్రధాన పాత్ర మీరు చక్కగా ఒప్పింపగలరనే విశ్వాసమున్నది మాకు!" అంటాను, నేను.

కాంచనమాల ఊరికే నాకేసి చూస్తుంది. ఒకసారి నావైపు, ఒకసారి శేషాచారివైపు; మరీ మరీ, ఎదుట కూర్చున్న తన భర్తవైపు-ఆ బెదరిన లేడి చూపులతోనే.

కొంతసేపటికి ఆమె భర్త అన్నారు: "మీ స్నేహితులు శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారున్నూ మరీ మరీ చెప్పారు. ఈమెకు మాత్రము, ధైర్యము చాలడములేదు. నేనూ చాలా ప్రయత్నించాను. చూద్దాము. ఏమాత్రము వీలున్నా.... నేను మీకు మళ్ళా కనిపిస్తాను" అన్నారు.

కాని, మా అనార్కలీ నాటకములో కాంచనమాల నటించలేదు.

....చిత్రము, ఈ సినిమా జగత్తు! వెండితెరపైన ఒక్క మెరుపుమెరిసి అలా మాయమయిపోయింది ఆమె, మెరుపులాగే! ఎంత చక్కగా అలంకరించినది, నటించినన్నాళ్ళూ, ఆనాటి మన చిత్రాలను, కాంచనమాల! ఆమెకు ఆమే సాటి !!

కాలప్రవాహంలో జారిపడిపోయిన కొన్ని అమూల్యములైన వస్తువులలో ఒకటి, కాంచనమాల నటనా వైదగ్ధ్యము.

ఆ రోజులలో హిందీ సినిమాలలో చాలా ఆకర్షవంతముగా నటించేది సబితాదేవి. ఆమె నటనా చమత్కృతినీ నాకు చాలా ఇష్టము. ఆమె కన్నుల

లోనూ ఒక వింత ఆకర్షణాశక్తి ఉండేది. "భీతహరిణీ నేత్రాలు" కాకపోయినా, వానిలోనూ ఒక విపరీతపు అందముండెడిది. ఆ చూపులకు తోడు, ఆమె మెరుపు తీగలా చలించిపోయే తన మైతీగ అభినయముతోనే ఎన్నో భావాలు ఎంతో చక్కగా ప్రకటించేది.

"సంపత్"కూ నాకూ సబితాదేవి నటనావిషయంలోనూ ఏకాభి ప్రాయమూ, తద్వారా సన్నిహితత్వమూ ఏర్పడింది. ఆయనంతగానూ నేనూ సబితా దేవి నటనా కౌశలాన్ని ఎంతో మెచ్చుకునేవాడను, ఆ రోజులలో. ఎటొచ్చీ, ఆయన కవిగాబట్టి, తన మెప్పుదలను చక్కని మాటలలో చెప్పగలిగారు-ఇల్లాగ:

ఓ తారా నవరూపిణి!
ఓ నాట్యకళా కలాపినీ!!
భావ బంధుర కవన
కల్యాణి ఋతురాణి,
చూపులో, చెంగల్వ రేకులో
వేబోక రాకలో
నీ చూపె, నీచూపె
నీకేక రాత్రమ్మో...

అంటూ వ్రాశాడు, "సంపత్" ఆ రోజులలోనే.

నిజమే:.... ఏ కొందరోగాని, ఇంతటి మన్ననకు పాత్రులు గారు.

"సంపత్" రచన శ్రద్ధతో చదివేవాడను నేను, తీరిక కలిగినపుడల్లా. "వెన్నెల రేయి" అంటూ ఆయన వ్రాసిన పద్యాలున్నూ చాలా అందమైనవి :

ఈ నెలవన్నెకాడు కురియించిన
వెన్నెల సన్నతుంపురుల్

సాగుతున్న యాత్ర

మేనిని సోకినన్ వలపు మెత్తని
నాయెద పుల్కరించి యే
వో నవగీతులల్లుకొనబోయిన
స్వాప్నిక సౌఖ్య రేఖలో
తేనెలకోసమై వలపు తెట్టువ
గట్టును లేతవెన్నెలన్

అది, కవి ప్రకృతిలో కలిసిపోయే వర్ణన. ఇక వ్యక్తిగతమైన, అతి గాఢమైన అనుభవము :

...కలయని కూరుముల్, మనసుకట్టని
వేవలపుం దుమారముల్
పొలయని భావముల్, యతుకుపోసెడి
వెన్నెల లివ్వి, కన్నె చూ
పుల పచరించు లేమెరుగు మొత్తములై
సెలకట్టి వచ్చెనో
తళతళ వెన్నెలై వలపుదారుల
బోసిన వెల్గునారు! లై

పిచ్చి ప్రేమికుడు! సృష్టిలోని తీయదనమంతా తన అనుభవాల ప్రకటన కోసమే అనుకుంటాడు కవి!!

నేనూ ఆ తెగలోవానినే ఏమో, నాకు కవిత్వము రాకపోయినా,.... ఏమో!

## ౬

కేయూరాణి న భూషయన్తి పురుషం
హారా న చన్ద్రోజ్జ్వలా
న స్నానం న విలేపనం న కుసుమం
నాలంకృతా మూర్ధజాః
వాణ్యేకా సమలఙ్కరోతి పురుషం
యా సంస్కృతా ధార్యతే
క్షీయంతే ఖిలభూషణాని సతతం
వాగ్భూషణం భూషణమ్.

భర్తృహరి

నిజమేకాదూ; మనుష్యుణ్ణి అలంకరించేవి భుజకీర్తులు కావు; ధళధళ మెరిసే ముత్యాలహారాలు కావు; పన్నీట స్నానమూ, చందనచర్చ, పరిమళ ద్రవ్యాలతో విలేపనమూ ఇవి అలంకరింపవు; పువ్వులూ అలంకరింపవు-సంస్కృతము చేయబడిన వాక్కు ఒక్కటే మానవుని చక్కగా అలంకరిస్తుంది. తక్కిన ఆభరణాలు అన్నీ అనిత్యములు. వాగ్భూషణము మాత్రము మనిషికి నిత్యాభరణము. వాణికి అంతటి ప్రభావమున్నది!

పవిత్రవాణి ఎంతటి శక్తివంతమైనదో బ్రాడ్‌కాస్టింగ్ విధానంలో ప్రత్యక్షమవుతుంది. రేడియోకు మాట ప్రాణము; మాటకు విపరీతమైన ఉద్వేగాన్ని, అద్భుతమైన ఆధిక్యతను కలుగజేస్తుంది రేడియో.

స్వచ్ఛమై, ప్రస్ఫుటమై, ఇంపైన మాటద్వారానూ, ఆ మాటలోని కొన్ని కొన్ని మెలకువలవల్లనూ, వ్రాతమూలకంగా అందింపలేని ఎన్నో ఎన్నో భావాలను ఎంతో ఎంతో అందంగా అందింపవచ్చును, రేడియో ప్రసంగములద్వారాను.

రేడియో నాటకములద్వారాను. కొన్నికొన్ని సన్నివేశాలు ఎంతో గొప్పగా చిత్రింపవచ్చు, తరఫీదుపొందిన కంఠస్వరంతో. కాని, ఇందుకు ఎంతో సాధకము కావాలి. మద్రాస్ కేంద్రము స్థాపించే మొదటి రోజులలో ఈ తరఫీదునిచ్చే బాధ్యత మాపై వ్రాలినది. మాట్లాడవలసిన రీతిని మాట్లాడటము నేర్పటము ఒకపని; ఇదివరకు స్టేజిపైన అట్టహాసముతో మాట్లాడేవారి తీరును మార్పుచేసి రేడియోకు అనువైనట్లు మృదులంగాను, అందంగాను, ఆప్యాయతతోను పల్కింపచేయటము ఒక మహా ప్రయత్నము. రేడియోకు అనుకూలమైన రీతిని మాట్లాడవలసిన నేర్పును, సహజంగాకలవారు చాలా అరుదు. అటువంటివారు లభించడము ఒక పండుగ వంటిది అన్నమాటే!

ప్రసారానికి అనుకూలమైన రచనలలోను, ఒకానొక విశిష్టత అవసరము. ఆదిని కొన్ని కొన్ని నాటికలు మేమే రచించేవారము. నేను రేడియో కోసము రచించిన మొదటి నాటకము "కచదేవయాని." ఆ మాటకొస్తే, అసలు నేను రచించిన మొదటి నాటకమే కచదేవయాని. అదివరకు మారిస్ మాటర్లింక్ రచనను ఆధారంగా "అంతరంగము" అను ఏకాంకిక రచించిఉన్నా ఈ నాటకమే నా మొదటి స్వతంత్రరచన-ఇతివృత్తము కొంతవరకు భారతములోనిదీ కొంతవరకూ రవీంద్రునిదీ ఐనా.

ఈ నా మొదటి నాటికను "దేవయాని"చేత చదివించడము ఒక వింత అనుభవమే. నేను రచించాను కాబట్టి, నేను ఊహించగలిగాను దేవయాని ఇలా ఇలా మాట్లాడుతుంది, ఇలా ఇలా తన భావాలను వ్యక్తపరుస్తుంది అని. దేవయానిగా నటిస్తున్న భానుమతికి తెలియజేసి వీలైనంతవరకు భానుమతికి నా దేవయానితో తాదాత్మ్యము కలిగించాలి నాటకనిర్వాహకుడనైన నేను. పాపము, భానుమతి చప్పున అందుకోగలిగింది నా భావాలను. ఆమెకూడా జీవితంలో ఇంతో, అంతో బాధను అనుభవించి ఉన్నది కాబట్టి కచుడు తనను విడిచివెళ్ళిపోయేటప్పుడు దేవయాని ఎంత బాధపడిందో అంతబాధా తాను అనుభవింపగలిగింది మైక్రోఫోన్ ముందు భానుమతి.

కాని, ఒక్కొక్కమాటా ఎంతో నేర్పుతో చెప్పాలి. భావము ఎంతో ప్రస్ఫుటంగా ఒప్పించాలి. అందు, నారచన పూర్తిగా గుండె దొల్చుకునివచ్చిన రచన. మాటిమాటికి "కచా!" "నా కచా!" అంటుంది నా దేవయాని. ఇందు మొదటి మాటకూ రెండవమాటకూ ఉచ్చారణలో, సంగీతంలో మొదటిస్థాయికీ, రెండవ స్థాయికీ ఉన్నంత తేడా ఉంటుంది. మొదటి "కచా" సంబోధన, రెండవ "కచా" ఉపలాలన. ఇది భానుమతి తెలుసుకోవాలి. ఆ ప్రకారం ఉచ్చరించాలి ఆమె. ఈ రెండుమాటలూ చెప్పేవిధానాన్నిబట్టి ఎంతో ఆదరభావము, ఎంతో ఆత్మీయత అందింపవచ్చు. మరొక విశేషము; స్టేజ్‌మీద దేవయాని తన చూపులద్వారా అభినయముద్వారా ఈ మాటలకు ప్రాణముపోసి వింతశక్తి నీయవచ్చు. ఆ చూపులూ, ఆ అభినయమూ ఉపకరింపవు భానుమతికి మైక్రోఫోన్‌ముందు. అంతా ఉచ్చారణ ద్వారానే కంఠస్వరములోని మెలకువలద్వారానే చూపించాలి. ఇలాగే, అనురాగము, చనువు, కోపము, ఆశ, నిరాశ, నిస్పృహ మాటలద్వారానే ఒప్పించాలి. నటించే వారికి మొదట ఇది కొంచెం కష్టం అనిపిస్తుంది.కాని, ఆధోరణిలో పడ్డాక స్టూడియో లోని వాతావరణం మారిపోయి, భానుమతి పూర్తిగా దేవయాని ఐపోవచ్చును. ఆమె అలాగే ఐపోయిందికూడాను. నాటకాంతభాగమున దేవయాని కచుని శపిస్తుంది కాని శపించేటప్పుడు ఆమె ప్రకటించే కోపభావము ఎదురుతిరిగి భరింపలేని నిస్పృహగా మారి, ఆమె అమ్మా! అమ్మా!! అంటూ సొమ్మసిల్లిపోతుంది. అచ్చంగా అల్లాగే నిరూపింపగలిగింది భానుమతి. కొంత సహజప్రతిభవల్లా, కొంత నా తరిఫీదువల్లా.

నాటకరచనకూడా ఇటువంటి భావప్రకటనకు దోహద మియ్యాలి. మరి రచన సూటిగనూ, ముక్తసరిగనూ, అతి శక్తివంతముగనూ అమరాలి. ఒక్కొక్కమాట భావాన్ని వెంటనే స్పష్టపరచాలి. ఒక్క పేలవమైన పల్కు పనికిరాదు. ఎంతటి ఆప్యాయంతో, ఎంతటి విపరీతపు భావస్ఫురణతో అంటున్నదో నా దేవయాని :

"కచా! కచా!! వద్దు, నువ్వు వెళ్ళవద్దు. మనం కట్టిన కొత్తమామిడంటు చిగిర్చనైనా చిగిర్చలేదు. మనం పందిరివేసిన మల్లెతీగె ఎంత అద్భుతంగా అల్లుకు

పోయింది! కాని, పువ్వులు పుయ్యేవద్దూ? ఆ పువ్వులన్నీ దండగుచ్చి నీ మెళ్ళో వెస్తేనేగాని నాకు తోచదు" అంటుంది.

వాక్యాలు నాలుగైనా ఎంతటి భావసంపద, అనుభవపరంపరా ఇమిడి వున్నాయి ఈ నాలుగు వాక్యాలలో. ఇంతటి భావసంపదనూ అనుభవపరంపరనూ, ఒప్పించాలి మైక్రోఫోన్‌ముందు. అల్లాగే, తనప్రయాణానికి సెలవునిమ్మని అర్థించే కచునితో మరోస్థాయిలో అంటూంది దేవయాని:

"సెలవు! సెలవిచ్చేదాన్ని నేనా? చూచుకో నీ హృదయంలోకి చూచుకో! పుస్తకాల దొంతరలమధ్యను అణగిపోయిన నీ అనుభవపరంపరలను ఒక్కసారి పైకి కనపడనీ. అవి ఏమంటున్నవి? అవి సెలవిస్తాయా? చూడు: నువ్వు ఇక్కడకు వచ్చిన క్రొత్తలో మనము సెలయేటిదగ్గరకు వెళ్ళాము, జ్ఞాపకమున్నదా? అవతలిఒడ్డుకు వెళ్ళాలని, నేను ప్రవాహాన్ని దాటలేకపోతే నువ్వు నన్ను ఎత్తుకు తీసుకువెళ్ళలేదూ? ఏరు దాటినాకకూడా నేను దిగనంటే నువ్వు నవ్వావు, జ్ఞాపకం లేదూ?.... కచా! కచా!! కొంచెము స్మృతితెచ్చుకో— మన జంటహృదయాలను తనలో కలుపుకున్న సెలయేరు నీ ప్రయాణానికి సెలవిస్తుందా? అదుగో! మ్రోత వినబడుతూనే ఉన్నది: "ఒద్దు! వెళ్ళొద్దు!!.... అంటూనే ఉన్నది, "కచా! కచా!!....నా కచా!!"

ఒకానొక మహత్తర ప్రేమను నిరూపించాలి ఈ మాటలు. నిపుణతతో అమర్చిన సన్నని వీణావాద్యము రసస్ఫూర్తిని ఇనుమడింపజేస్తుంది నాటక ప్రదర్శనలో. తరువాత వచ్చే సన్నివేశములో ఇంతటి ఆప్యాయతా, అధిక్షేపణగా మారుతుంది. దేవయాని అంటుంది:

"ఏమీ! దేవకార్యమే ముఖ్యమా? అయితే, ఈ సంవత్సరాలన్నీ అబద్ధాలేనా? నీ వినయమంతా ఒక్క దేవకార్యసిద్ధికొరకేనా? అయ్యో! నా కచా! ఇంతేనా? నీవు వట్టి బడిపిల్లవాడ వనుకోలేదు. చదివినన్నాళ్ళు చదువుకొని, ఆట విడుపురోజు రాగానే పుస్తకాలను చంకనబెట్టుకొని ఇంటిమొగమయ్యే శిష్యుడవేనా!

ఓయీ! నీకు హృదయం లేదూ! సృష్టిలో ఉండే అపూర్వమైన వైభవాలను చూచి తన్మయుడవై పోతూ ఉండేవాడవు. అదంతా ఏమైనది!" అని.

కచుడంటాడు: "దేవయానీ! నిజము చెప్పావు! నాకు హృదయము లేదు!" అని.

వెంటనే దేవయాని అంటుంది తొట్రుపాటుతో, అనునయిస్తూ, రెట్టించిన ప్రేమతో!

"కచా! కచా!! కోపమా? నేను అనాలని అనలేదు. నీకా హృదయము లేకపోవడము! నీకే హృదయము లేకపోతే నందనవనానికి సౌందర్యమే లేదు! మెరుపుతీగెలో వెలుతురే లేదు. నవతుషారములో చల్లదనమే లేదు! నీకు హృదయమున్నదీ లేనిదీ నాకు తెలియదూ!

"నీ అనుభవాలన్నీ నా అనుభవాలుగా జేసుకున్న నాకు తెలుసు; సర్వమూ నీ కళ్ళతో చూడడానికి అలవాటుపడ్డ నాకుతెలుసు. ఇన్నాళ్ళూ నీవు పీల్చే గాలే పీలుస్తూ మైమరచిపోతూన్న నాకు తెలుసు. కచా! కచా!!.... ఈరోజున మనము వేణువతిలో స్నానానికి వెళుదామనుకున్నాము. ఎన్నాళ్ళయిందో ఆవేపు వెళ్ళి. రా! రా!!" అంటూ లాలిస్తుంది దేవయాని. వినేవారికి ఈ ఘట్టము ఎంతో హృద్యంగా ఉండాలి.

కచుడు అంటాడు: "దేవయానీ: నన్ను క్షమించాలి. ఇక ఆలస్యము చేయలేను. దయఉంచు." అని. అలా అనేసరికి, తోకత్రొక్కిన త్రాచులా బుస్సుమంటూ, రోషంతో అంటుంది దేవయాని:

"దయా! దయా!! ఎవరికుండాలి, దయ? లేతతీగెలను ధ్వంసము చేస్తున్నావు; పూలదొంతరలను తొక్కివేసున్నావు. దయ నీకా, నాకా?" అని.

కాని, వెంటనే నిస్పృహ. అతి దీనంగా అంటుంది ఆ ప్రేయసి: "నీవు లేని ఈ ప్రదేశంలో నా కింకేమున్నది, కచా! కచా!! ....నీవు కనబడని నిమిషము

నేను జీవింపగలనా? చకోరపక్షిలాగ నీ కనుచూపులే ఆహారంగా బ్రతుకుతూన్న నాకు ఇంక ప్రాణమేదీ!" అంటూ అతి దీనంగా దేవయాని.

కచుడు: దేవయానీ! వద్దు! వద్దు!! పాషాణమును ద్రవింపజేయవద్దు.

దేవయాని: పాషాణమా! అవును పాషాణమే!....కాని, పాషాణానికైనా ఒకప్పుడు దివ్యస్త్రీరూపమునుదాల్చే శక్తిఉన్నది. నీకు స్త్రీరూపాన్ని రూపుమాపే శక్తి ఉన్నది. పూలతీగను కాలితోనలిపివేసే కిరాతకుడవు!.... దేవదూతా! ఎంతపనిచేశావు!! పట్టపగలు పంచభూతాలసాక్షిగా, సూర్యచంద్రులసాక్షిగా, ఎంత దొంగతనముచేశావు! సరే, వెళ్లు! వెళ్లు! సంపాదించావుగా గొప్ప విద్య! ఇది నీవు ఎలా వినియోగిస్తావో చూస్తాను. మోసముచేసి నేర్చుకున్న చదువు నీకు ఉపయోగపడదు సుమా!.... వెళ్ళు! వెళ్ళు! ఇంకా ఆగుతావేమి? దొంగవు! ఇచ్చటి నిర్మలవాయువును మలినంచెయ్యకు. కిరాతకుడవు! వెళ్ళు, వెళ్ళు!!.... ఇంకా వెళ్ళవేమి!!" అని గర్జిస్తుంది.

కాని, తనలోకలిగిన ఈ హోరుగాలికి తాళలేక మొదలుతెగిన అరటి లాగ, "అమ్మా! అమ్మా!!" అంటూ కూలిపోతుంది దేవయాని.

ఈ సంభాషణ జరుగుతుండగా అందలి ఆ భావాలను ఉద్దీపింపజేసే వాద్యసమ్మేళనమున్నూ క్రమంగా తీవ్రస్థాయికి వస్తుంది. "క్లైమాక్స్"ను అతి రమ్యంగా స్ఫురింపచేస్తాయి అతి దీర్ఘమైన వయొలిన్‌వయొలిన్‌సెలోస్వరాలు.

నాటకము ఎంతో రక్తికట్టింది.

కాని, ఈ నాటకాన్ని విన తటస్థించిన ఒకరు అన్నారట మా డైరెక్టర్‌తో, ఏదో మాటలసందర్భంలో మరునాడు ఉదయమే: "ఏమి నాటకము ప్రసారముచేశారు! ఏమిటా భాష? ఏమిటా భావాలు??" అని.

ఆ సంగతి ఉదయము ఎనిమిదింటికి ఆఫీస్‌కు వచ్చిన నాతో చెప్పారు, ఆయన, "రాత్రి నీ కచదేవయాని ఏమీ బాగాలేదటగా!" అంటూ.

# సాగుతున్న యాత్ర

నేను నిర్ఘాంతపోయాను. ఎంతో గొప్పగా రక్తికట్టింపగలిగాము అనుకున్న మా యత్నాన్నిగురించి డైరెక్టర్ ఇటువంటి అభిప్రాయాన్ని అందియ్యడము నాకు పట్టరాని ఆశాభంగము కలుగజేసింది. ఆ వినినవారికి ఈ భాష క్రొత్త; నాటకమందలి లలితభావాలను అనుభవించి ఆనందించడానికి ఒక రీతి సంస్కారము రావాలి. అందరికీ అర్థముకావు ఆ భావాలు—ఐనా, ఎవరో చెప్పిన అభిప్రాయాన్ని మా డైరెక్టరే విశ్వసించడము నన్ను చాలా బాధించింది. ఇంత అన్యాయమా, ఇంతటి సత్యదూరమా అనుకున్నాను. వెంటనే నిరశనవ్రతము ప్రారంభించాను. పచ్చిమంచినీళ్ళు ముట్టుకోలేదు నేను ఆ రోజంతా. ఎవరు ఎంత బోధించినా వినలేదు. ఆ పూటా, ఆ మధ్యాహ్నమూ, ఆ సాయంత్రమూ అల్లాగే పస్తుండి నా ఆఫీస్‌పనిమాత్రం నిర్వర్తించాను. "మేము రేడియోసెట్టును అంటిపెట్టుకు కూర్చుని విన్నాము. నాటకము గొప్పగా రాణించినది" అన్నారు స్నేహితులు; కాని, నేను ఉపవాసదీక్ష మానలేదు.

సాయంత్రం చీకటిపడుతూండగా, రేడియోస్టేషన్‌కి తన డ్యూటీవేళకు వచ్చిన అనౌన్సర్ ఉమామహేశ్వరరావు రేడియోనిలయపు ఆవరణలో అడుగు పెట్టగానే తనకు అవుపించిన ఒకరితో అన్నాడట: "నిన్నరాత్రి కచదేవయాని చాలా బాగుందని మా అన్నయ్య చాలాచాలా మెచ్చుకున్నారు. రచనా, ప్రదర్శనా కూడా గొప్పగా ఉన్నాయి అన్నారు అన్నయ్య" అన్నాడు. ఆమాట వినిన అతను ఉమామహేశ్వరరావును గబగబ నావద్దకు తీసుకువచ్చి అతనిచేత మళ్లా అనిపించాడు, ఆ మాటలను, నా యెదుట.

ఉమామహేశ్వరరావుగారి అన్నగారు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ! అప్పుడు అక్కడ ఉన్నవారంతా అన్నారు: "ఇంకేమి, ఎవ్వ రేమంటే ఏమి? శర్మగారు మన నాటకాన్ని మెచ్చుకున్నారు— ఇతరుల అభిప్రాయంతో మన కేంపని?" అని.

నేను, నా చేతిలోవున్న పనిని ముగించుకొని త్వరత్వరగా అన్నగారు శర్మగారివద్దకు వెళ్లాను. ఆయన నన్ను గాఢంగా కౌగిలించుకుని అన్నారు: "ఎంత





గొప్పగా వ్రాశారు నాటకము! ఎంత అద్భుతంగా ప్రదర్శించారు. దేవయాని చాలా గొప్పగా ఒప్పించింది తన పాత్రను!చాలా సంతోషము!చాలా సంతోషము!!"అని.

ఆ రాత్రి శర్మగారిఇంట్లోనే భోంచేశాను. భోంచేస్తుండగా ఎవరో చెప్పారు ఆయనతో నా నిరశనవ్రతాన్ని గురించి. ఆయన నవ్వుతూ అన్నారు: "ఈమాత్రానికేనా నిరసనవ్రతము? ఐనా, సాహిత్యరీత్యా మీ కచదేవయాని గొప్ప రచన! మీరు అనుమతిస్తే భారతి పత్రికలో అచ్చువేసుకుంటాము, మీ నాటకాన్ని" అని.

భారతిలో అచ్చు అయినది నా కచదేవయాని. కాని, రచయితగా నా పేరు అచ్చువేయలేదు నేను. నా అభిప్రాయంలో రేడియోలో ఎవరు ఏది చేసినా, ఆ ఘనత అంతా సంస్థదేకాని, వ్యక్తులది కాదు. నాటకము గొప్పదైతే మెప్పుదల రేడియోసంస్థకు చెందాలి. వ్యక్తిగా నాకు కాదు. పైగా నా చదువు, నా శక్తి సామర్థ్యాలూ నా ఊహలూ నా ఆలోచనలూ నా సర్వమూ రేడియోకే అర్పించి ఉన్న నాకు రేడియోతో ఒక అవినా సంబంధము యేర్పడివున్నది.నేనే రేడియో, రేడియోయే నేను. ఈ సత్యాన్ని నేను మనసారా నమ్మాను.

* * * *

ఒక పర్యాయం, కంకంటి పాపరాజు ఉత్తరరామాయణమును ఆధారంగా తీసుకుని సీతమ్మశోకపు ఘట్టాన్ని చిన్నరూపకంగా ప్రదర్శిస్తున్నాము. సీతమ్మగా నటించడానికి సీత అనే ఒక అమ్మాయిని నియమించాము. సీత చాలా బాగా పాడగలదు. కాని, ఇంతవరకూ ఆమెకు ఎక్కువగా"లలితసంగీతమును"పాడటమే అలవాటు.అష్టపదులు చక్కగాపాడగలదు.ఇటువంటి కరుణారసపూరిత ఘట్టాలను చదువడము ఆమెకు ఇదే మొదటిసారి. దేవునిపుణ్యాన, ఇంతవరకూ ఆమె జీవితంలో బాధాకరమైనవిషయాలు ఏవీ జరిగివుండలేదు. అందువలన కారడివిని నిర్దాక్షిణ్యంగా విడిచివేయబడిన సీతామ్మవారిస్థితిని ఆమె తగినంత భావనాబలంతో ఊహించుకోలేకపోయింది. ఆ స్థితి ఆమెకు ప్రత్యక్షము కాలేదు అన్నమాట.

సాగుతున్న యాత్ర

"కటకట లక్ష్మణా! పిడుగుకంటెను బెట్టిద
మైన మాట నే
డిటువలె విని యుండియున్ బగుల దింతలు
నింతలు గాదు గుండె......"

అనే పద్యాన్ని ఆ అమ్మాయి సంగీతరీత్యా తప్పులు లేకుండా చదివినా, నాటకరీత్యా నాకు కావలసినంత భావనాబలంతో చదువలేకపోయింది. ఆ "సీత" నాకు చిరపరిచితురాలు. ఎంతో కన్నులకు కట్టినట్టువున్నది, శోకిస్తూన్న సీతాస్వరూపము నాకు. మళ్లా మళ్లా చదివించాను ఆ పద్యాన్ని, ఎన్నో ఎన్నో సూచనలు ఎంతో ఓర్పుతో, ఎంతో ఆసక్తితో సూచిస్తూ. ఒకొక్కసారి సంగీతములో ఒక కొత్త సంగీతరాగములో ఒకకొత్తకళ విసిరేదేగాని, సీతమ్మశోకాన్ని మాత్రము నేను అనుకున్నట్టు నిరూపించలేకపోయింది పాపము! తనకు అటువంటి అనుభవం లేనందునా, కళారీత్యా ఆ అనుభవాన్ని ఊహించుకోలేనందునా ఆ భావాన్ని ఒప్పించలేకపోయింది ఆమె. అప్పుడు నేను ఆమె పాటకు తోడుగాఉన్న వీణను మార్పించి, గోటువాద్యాన్ని అమర్చాను. గోటువాద్యము నారాయణఅయ్యర్ ప్రతిభాశాలి. నా భావాన్ని గ్రహించి ఆమె పలికే మాటలకు విపరీతంగా ఆలంబనము కలిగిస్తూ ఆలాపించసాగాడు. ఒక అద్భుతమైన వాతావరణము ఏర్పడింది. కాని, ఇంకా ఆమెమాటలలో మాత్రము తగినంత శోకము రాలేదు.

అప్పుడు, నేను లేనికోపముతెచ్చుకొని అన్నాను ఆమెతో: "చూడు! నీవు సీతవైపోవాలి, తప్పదు!! నిన్నే, మీవాళ్ల ఒక రాతిహృదయంవానికి పెళ్ళి చేశారనుకో! నీవు ఏతప్పూ చేయకపోయినా, నీమీద భయంకరమైన అపవాదును మోపి నిన్ను ఇల్లువెడలిగొట్టినాడనుకో నీ మొగుడు. అలో లక్షణా అంటూ నీవు వీధిని పడ్డావనుకో! అప్పు డెలావుంటుంది నీ మనస్సు? అలా ఐపోవాలి నీవు!" అన్నాను తీవ్రంగా.

నే నీ మాటలు అంటూవుంటే పాపము, ఆ అమ్మాయిముఖం వింతగా మారిపోయింది. అంతవరకూ చిరునవ్వు తాండవిస్తున్న ఆమె లేతముఖంలో మూల

మూలలనుంచీ. మేఘచ్ఛాయలు కమ్ముకువచ్చాయి. "అలో లక్షణా అంటూ వీధిని పడ్డావు" అనేసరికి బొటబొట కన్నీరుకార్చింది ఆమె. చుట్టూవున్నవారు నాకేసి చూస్తూఉన్నారు, ఇంత కఠినంగా ప్రవర్తిస్తున్నాదేమి ఇతను, అనుకొంటూ.

కన్నీరు కారుస్తూన్న ఆమెను ఉద్దేశించి అన్నాను నేను:

"ఇప్పుడు పద్యమును చదువు! ఊ! చదువు! చదువు మరీ!!" అంటూ ప్రోత్సహించాను. గుండె బ్రద్దలయేటంతటి దీనంగా గోటువాద్యాన్ని మ్రోయింప సాగాడు నారాయణఅయ్యర్. వెక్కి వెక్కి ఏడుస్తూనే, ఆ అమ్మాయి పద్యం చెప్పింది. ఒక్కొక్క మాటా స్పష్టంగా పలుకుతూ, అద్భుతంగా, శోకరసాన్ని ఒప్పిస్తూ.పద్యం సాగగా సాగగా ఆమె పూర్తిగా సీతాదేవి పాత్రలో లీనమైపోయింది.

స్టూడియోలో ఎర్రదీపమువెలిగి నాటకము ప్రారంభించాక, ఆమెకళ్ళు తుడుచుకుని, తనపాత్రను ఎంతో గొప్పగా నిర్వహించింది.

...ఎన్నటికిన్ రఘూద్వహుని నేనును
నన్నిక రామచంద్రుడున్
గన్నుల జూడగల్గ దొకో, కల్గక
యుండిన, బ్రాణమేల పో
దన్న, రఘుప్రవీరు చెవులారగ
నింతయు దెల్పు నాదు మే
నున్నది చెంత గంగ మడుగున్నది
యైనటు లయ్యెదున్ దుదిన్—

అని చదువుతూ ఆ అమ్మాయి అచ్చంగా భవభూతి సీతగా మారి పోయింది!

ప్రసారము పూర్తియై, మేము స్టూడియోలోంచి ఇవతలకు వచ్చాక, ఆమె చేతికి వేడికాఫీని అందిస్తూ, అన్నాను నేను: "అమ్మాయీ! నిన్ను చాలా బాధపెట్టాను కదూ! పాపము! కళ్ళ నీరు తెప్పించాను!" అన్నాను.

ఉత్సాహంతో, కొంత గర్వంతో వికసించిన నిండుకళ్ళతో నన్ను చూస్తూ అన్నది ఆమె: "నాటకము ఎంత గొప్పగా రక్తి గట్టింది! అంతా మీ మూలాననే!!" అని. తరువాత, ఇతరులూ అన్నారు, ఆ ఘట్టము చాలా గొప్పగా ప్రసారమైనది, అని.

కాని, కొన్నికొన్ని గొప్పనాటికలూ గొప్పరూపకాలూ ఎంతో శ్రమ పడి, కొన్నివారాలు కష్టపడి, ఎంతో అందంగా ప్రదర్శించాక, ఆ కార్యక్రమ ప్రసారంలో ఆఖరిమాటలు ప్రసారమై, స్టూడియోలోని ఎర్రదీపము ఆరిపోయాక, మనస్సులో, హృదయపు లోతులలో కలిగే వెల్తి ఇంతా అంతా కాదు! నాటకములో పాల్గొన్నవారు ఒకరినొకరు ఉత్సాహంతో పలుకరిస్తూ నాకేసి చూచి నమస్కరిస్తూ వెళ్ళిపోతారు. నేను ఒక్కడనే మిగిలిపోతాను. నాటకమున వారు చదివిన కాగితాలను ఒకొక్కటీ ఏరి, బల్లమీదను ఉంచుతూ, ఇటూ అటూ కదలుతూ వారు చిందరవందరచేసిన ఆ ప్రదేశాన్ని శుభ్రపరచి సర్దుతాను. ఒక్కసారి, జరిగిన గంట నాటకము ఒక్క నిముషముసేపు రివ్వున నా మనోవీధిని మళ్ళా నడిచిపోతుంది, మెరిసే మెరుపులా. అద్భుతంగా రక్తికట్టిన కొన్ని సన్నివేశాలు మాత్రం విడివిడిగా మరికొంతసేపు జ్వలించి, అవీ మాయమై పోతాయి.

ఇప్పుడు, భరింపరాని శూన్యభావము ఆవహిస్తుంది, దట్టమైన మబ్బులాగ. పూర్తిగా కమ్మివేస్తుంది నన్ను. ఏదో గొప్ప వెల్తి! అంతా ఐపోయింది. ఆవగింజంతైనా మిగలలేదు. ఇంక ఏమీలేదు; ఏమీలేదు!! అనే భావము భరింపరాని భారములా క్రిందికి అణగద్రొక్కుతుంది.

స్టూడియోనుంచి ఇవతలకువస్తే మళ్లా ఎప్పటి ప్రపంచకమే. మళ్ళా ఎప్పటి అల్పవిషయాలను గురించిన ఆందోళనే! కాని, ఇవతలకు రాక తప్పదు. బాహ్యప్రపంచకములో కలువక తప్పదు, మరి.

# సాగుతున్న యాత్ర

ఎప్పటికీ నేను నిర్మించుకున్న ఆకళాప్రపంచకములోనే, నేను సృష్టించుకొన్న ఆ స్వప్నాకాశవీధులలోనే విహరించలేనా ? అక్కడే ఉండిపోలేనా, రంగులరంగుల మేఘమాలికలతో తేలిపోతూ, ఇక ఎప్పటికీ భౌతిక ప్రపంచంలోకి, క్రిందికి దిగిరాకుండా !.... ఏమిటో, వెర్రి ఊహలు.

ఇటువంటప్పుడే అర్ధమవుతుంది మహాతత్వవేత్త ఐనా కళాతపస్వి ఉమార్ ఖయ్యామ్ మధుపాత్రను ఎందుకు అంత ప్రాణప్రదంగా పరిగణిస్తాడో. ఏదోచేసి, మరో లోకంలోకి పారిపోవాలి — వీలైనంతసేపు అక్కడే ఉండిపోవాలి !!

## ౭

జూన్ పదహారవతేదీ నా పుట్టినరోజు. ఆల్ ఇండియా రేడియో మద్రాస్‌కేంద్రము పుట్టినరోజూ జూన్ పదహారే!

పెళ్ళివారిల్లులా కళకళ్లాడుతూ అతిసందడిగా ఉన్నది, రేడియో నిలయము. నాదస్వరనాదమున దిక్కులు ప్రతిధ్వనిస్తున్నాయి. తోటలో బ్రహ్మాండమైన టీపార్టీ. ఆ వచ్చేవారిలో చాలామంది అతిధులను నేనే స్వయంగా వెళ్ళి ఆహ్వానించాను. కాని, వారిని కలుసుకొని ఇష్టాగోష్టిలో ఉండడానికి వీలులేదు, నాకు. స్టూడియోలో అనార్కలీ నాటకము ఆఖరి రిహర్సల్ సరిజూస్తున్నాను, నేను—ఆర్టిస్టులను, పాపము, వారినీ పార్టీకి వెళ్ళనియ్యకుండా!

ఇది పదహారవరిహర్సల్. ఇదివరకు పదిహేనుసార్లు సరిజూచాము, రేడియోలో ప్రప్రధమమున ప్రసారముకానున్న ఈ ఏకాంకికను. ఇన్నిసార్లు సరిజూచినా, నాకు సంతుష్టి లేదాయె! బ్రాడ్‌కాస్ట్‌వేళ సమీపించినకొద్దీ, కంగారుకాదుగాని, ఆత్రుత ఎక్కువగుతోంది, నాటకము ఎలావస్తుందో అని. బృందగానము, కృష్ణశాస్త్రి ఈ నాటకముకోసము వ్రాసిన అందమైన పాటలతో అనుకున్నంత అందముగా అమరుతుందా అని బెంగ. పాత్రధారులు సరిగా చెపుతారా, ముఖ్యంగా అనార్కలీ వాచకములో ఉండవలసినంత ఉద్వేగమూ, అవసరమైనంత నిస్పృహా, ఆత్మార్పణా నిరూపితమవుతుందా అనే బెంగ. నేపథ్యముగా మిక్కిలి వోపికతో, ఎంతో నేర్పుతో అమర్చిన వాద్యసంగీతము తగినంత రక్తి గట్టుతుందా—ఇలాగనే ఆందోళన. అక్కడికీ పాపము, నటీనటులు నాకేసి ఎంతో సానుభూతితో చూస్తున్నారు: మరేం ఫరవాలేదు, మీశిక్షణ అణువైనా మరచిపోము. ప్రతి అంశము, ప్రతి చిన్నఅంశముకూడా మీరు అనుకున్నరీతినే ప్రసారమవుతుంది—అని అభయమిస్తున్నాయి, వారి చూపులు.

నియమితమైన నిమిషానికి కంట్రోలర్ లయొనల్ ఫీల్డెన్ కోరగా మద్రాస్ ముఖ్యమంత్రి శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి కేంద్రరవాణాశాఖ మెంబర్ సర్

అలెగ్జాండర్ క్లవ్‌ను శ్రోతలకు పరిచయంచేశారు. సర్ అలెగ్జాండర్ మద్రాస్ రేడియోకేంద్రాన్ని ఉపక్రమిస్తూ దక్షిణప్రాంతాలకోసము ప్రత్యేకంగా వెలసిన ఈ నిలయపు ప్రాముఖ్యతను వివరిస్తూ ఈ నిలయ కార్యక్రమాలు ఈ ప్రాంతపు సంస్కృతిని సర్వతోముఖంగా విస్తరింపజేయడానికి అన్నివిధాల ఉపకరిస్తవనే ఆశయమును వెల్లడించారు. ముఖ్యమంత్రి వారికి వందనము లర్పించారు, రాజధాని ప్రజలతరపున.

నా రిహార్సల్‌లోంచి ఒక్క పదినిమిషాలు విరామంతీసుకుని ఫీల్డెన్ ప్రముఖులున్న స్టూడియోలోకి వెళ్లాను, నేను. ఈ విశేషసమయానికి అవసరమైన సూట్, బూట్, నెక్‌టై వేషంతోఉన్న నన్ను చూచి ఫీల్డెన్ కొంటెగా నవ్వారు ఈ వేషమూ నీకు బాగానేఉన్నది అన్నట్టు. మా నిలయపు "విజిటర్స్‌బుక్" చూపి, ఆ పుస్తకంలో వారి ముగ్గురి సంతకాలూ తీసుకున్నాను. మా డైరక్టర్ ముందు నడువగా వారిని సాగనంపి నేను చప్పున మళ్లా మా నాటకముజరిగే స్టూడియోలోకి జేరుకున్నాను.

ఇంక రెండు నిమిషాలకు నాటకము ప్రారంభిస్తుంది అనగా, ఢిల్లీనుంచి వచ్చిన పెద్ద ఇంజనీయర్ మైక్రోఫోన్‌ముందు నేను మిక్కిలి జాగరూకతతో అమర్చిన బృందగానపు అమరికను అంతా మార్చివేసి తనకు నచ్చినరీతిని కొందరిని ముందు, కొందరిని వెనుక కూర్చోనియమించారు. నే పడిన కంగారుకు మేరలేదు. ఆ ఇంజనీయర్‌ని మ్రింగివేయా లనిపించిందన్నమాట. కాని అతను చాలా మంచివాడు. నా భుజముతట్టి, "మరేం ఫరవాలేదు, నేను అమర్చిన విధానము బ్రాడ్‌కాస్టింగ్‌లో సరికొత్తవిధానము—ఇప్పుడు మీపాట మరింత శ్రావ్యంగా వినిపిస్తుంది" అన్నాడు. అతను చెప్పినది నిజమేకావచ్చు, కాని, నాకు ఆ ధైర్య మెలా ఉంటుంది ? అప్పుడు నేనేమనను ? ఏమనడానికీ వ్యవధి ఏది ? భారమంతా భగవంతునిపై వేసి, స్విచ్ నొక్కాను. ఎర్రదీపం వెలిగింది. పిల్లలు పాడ సాగారు. దేవులపల్లి కృష్ణశాస్త్రి రచించిన ఆహ్వానగీతాన్ని, తేనెవానలు కురిపిస్తూ :

## సాగుతున్న యాత్ర

"రారమ్మ! రారమ్మ! మందారమా !!
రక్తకరవీరమా !!
రావె శేఫాలికా! రావె నవమల్లికా !!
రారమ్మ! రారమ్మ !! అంటూ

....మద్రాస్‌కేంద్రమునుంచి ఓం ప్రథమముగా వెలసిన రేడియో నాటిక అశేష జనానీకపు జనుల వీనులకు విందుగొలుపుతోంది. నాటకములోని పాటలోనే ఉన్నాయి ఈ మాటలు :

ఏలాగు మెప్పింతొ
ఈ సదస్యుల ప్రేమాల...
పేద దానిమపువ్వు గాథ
పేద దానిమపువ్వు గాథ... అంటూ

నేను అనుకున్నాను, "సదస్యులు వేలాది ఆంధ్రజనానీకము ఎలా హర్షిస్తారో, ఈ మా నాటికను !" అని.

మా "మూర్తిత్రయము"లో అయ్యగారి వీరభద్రరావు—అక్బర్, సూరి నారాయణమూర్తి—అబుల్‌ఫజల్, నేను, నేను సలీమ్ అనుకుంటాను, నామాట సరిగా జ్ఞాపకం లేదు—సలీమ్ నేనో, మరిఒకరో. అసలు, ఈ సలీమ్‌పాత్రకు నీలంరాజు వెంకటశేషయ్య అనుకున్నాము. ఆయన ఒకటి రెండు రిహర్సల్స్‌కు వచ్చినట్టున్నూ జ్ఞాపకము. ఆతర్వాత, ఆయన, ఏవో కార్యాంతరాలవల్ల రాలేక పోయారు. అనార్కలికూడా మేము అనుకున్న కాంచనమాల కాదు. కాంచన మాలె అనార్కలిగా నటిస్తుంది, మా మొదటిరేడియో నాటికలో అని చాలా ఆశిం చాము. ఆమె ఆ పాత్రను అద్భుతంగా ఒప్పించగలదని మా నమ్మకము. గట్టి ప్రయత్నమూ చేశాము. స్నేహితుడు గూడవల్లి రామబ్రహ్మమూ చాలా ప్రయ త్నించాడు, అప్పుడు తన చిత్రములో నటిస్తూన్న ఆమెను ఒప్పించడానికి.

"ఏం - కాంచనమాల ఒప్పుకున్నదా ?" అనే ప్రశ్న పరిపాటయింది, రేడియోనిలయంలో, నాటకానికి ఒక పదిరోజుల ముందునుంచీ ప్రతిపూటా, ప్రతి నిమిషమూను. చివరకు, ఆమె రాలేకపోయింది. కాని, ఆమె మా నాటకములో నటించాలనే ప్రయత్నంలో నేను రామబ్రహ్మాన్ని ఆయన స్టూడియోలో ఒక పది సార్లయినా చూచాను. ఇలా పదిసార్లు వెళ్ళడములో ఆయన అప్పుడు తీస్తున్న కొత్తచిత్రములో "రష్స్" అన్నీ ఏనాటివి ఆనాడు, ఆయనతోకూడా నేను చూడడము తటస్థించింది. జరిగినంతవరకు తనచిత్రాన్ని నాకు చూపిస్తూ అడుగడుగున మా సలహా అడుగుతూ ఉండేవాడు అతను. ఈ సీన్ సరిగా వచ్చిందా, ఏమేమి మార్పులుచేస్తే ఇంకా బాగుంటుంది—అంటూ. ఈ 'రష్స్' చూస్తుండగా ఎప్పుడొచ్చేదో, ఎలావొచ్చేదో, చడీచప్పుడుగాకుండా కాంచనమాల మా వెనుక ఒక సోఫామీద వచ్చి కూర్చునేది."అదుగో కాంచనమాల వచ్చింది;నేను చెప్పాను ఆమెతో అనార్కలీని గురించి" అనేవాడు రామబ్రహ్మం. కాని, ప్రతిసారీ ప్రదర్శన పూర్తికాకముందే కాంచనమాల లేచి వెళ్ళిపోతుండేది. ప్రతిసారీ రామబ్రహ్మం అంటూ ఉండేవాడు, 'రేపు గట్టిగా మాట్లాడతాగా, ఆమెతో !" అంటూ. మరునాడు మళ్ళీ అదే వరస. చివరకు, ఆమె రానేలేదు, రేడియోకు.

కాంచనమాల స్థానే భానుమతి, అంటే ప్రఖ్యాతగాయకి విశ్వేశ్వరమ్మ చెల్లెలు భానుమతి నటించింది. మొదట మేము కాస్త శంకించాము, ఈమె ఎలా నటిస్తుందో అని. కాని, చాల చక్కగ ఒప్పించినది భానుమతి, అనార్కలీ పాత్రను. భానుమతి అనార్కలీగా రావడమున్న చిత్రంగానే జరిగింది. అనార్కలీలో పాటలు పాడడానికి విశ్వేశ్వరమ్మను నియమించాము మొదట. ఆతర్వాత, కాంచనమాల రావడములేదని దృఢమయ్యాక,విశ్వేశ్వరమ్మనే అనార్కలీ పాత్రను నిర్వహింపమన్నాము.కాని,తీరాఆమెచేత పోర్షన్ చదివించేసరికిఆమెకు ముద్దుకృష్ణ భాష అలవాటులేనట్టు ప్రత్యక్షమైంది.అంతేగాకుండా, దైవానుగ్రహంవల్ల,ఏ చీకూ చింతా లేకుండా, ఎటువంటి ఒడుదుడుకూ లేకుండా, పడవప్రయాణంలా సాగిపోతున్న ఆమెజీవితంలో ఆమె అనార్కలీవంటి దురదృష్టవంతురాలి విషాదగాధను గురించి ఊహించలేకపోయినది— ఎంత చదివినా, ఏదో చదివినట్టు ఉండేదిగాని అనార్కలీభావాలను ఆమె ఏమాత్రమూ అర్థముచేసుకొన్నట్టు తోచలేదు.

నాముఖంలో కనిపించిన అసంతృప్తినిగుర్తించి విశ్వేశ్వరమ్మ భర్త రామచంద్రన్, నన్ను స్టూడియో ఇవతలకు పిలచి అన్నారు: "నాకు తెలుసు, మీరు ఏమి అనుకుంటున్నారో, విశ్వేశ్వరమ్మ ఈ పాత్రను నిర్వహింపలేదు. ఈమె చెల్లెలు భానుమతికి ఇటువంటిగాథలు చక్కగా అర్థమవుతవి. కార్‌లోవెళ్ళి ఆమెను తీసుకువస్తాను. ఆమెచేత చదివించి చూడండి, పాటలుమాత్రం విశ్వేశ్వరమ్మ పాడుతుంది" అన్నారు.

భానుమతి అనార్కలీభావాలను చాలాచక్కగా అర్థముచేసుకుని, మన స్పార అనుభవిస్తూ, చదివింది. ఒక్కొక్కభావమూ చాలా చక్కగా ఒప్పించింది. తర్వాత, తర్వాత మాకు తెలియవచ్చింది, చిన్నవయస్సులోనే, కొన్ని విషాదమైన కారణాంతరాలవలన ఆమె తనజీవితంలో వెన్నెలేగాక చీకటినికూడా రుచిచూడవలసిన అగత్యం ఏర్పడింది అనీ, తత్కారణంగా ఆమెహృదయం మిక్కిలి ఆర్ద్రీవంతమైనదనీ. అది అంతే అనుకుంటాను. నటుడు తాను స్వయముగా తన వ్యక్తిగతజీవితంలో అనుభవించిన అనుభవాలప్రభావము అతని నటనాకౌశలాన్ని తప్పక ఇనుమడింపజేస్తుంది. ఒక్కొక్కప్పుడు, తన ప్రత్యక్ష అనుభవాలకు విరుద్ధమైనభావాలను నిపుణతతోనూ, చాకచక్యంతోనూ నిరూపింపగలిగినా అతను పూర్తిగా ఒప్పింపగలిగిన పాత్రలు తనకు ప్రత్యక్షానుభవమునకు సన్నిహితమైనవే అనుకుంటాను, నేను. భానుమతి నాటకములో పూర్తిగా అనార్కలీ పాత్రలో లీనమై, కొన్ని సన్నివేశాలలో, స్టూడియోలో ఉన్నవారి కన్నుల వెంట నీరు తెప్పించేటంత తాదాత్మ్యమును స్ఫురింపచేసింది, ఆనాడు.

అక్బర్‌గా వీరభద్రరావున్నూ చాలా గొప్పగా చేశారు. ఆయన ఉచ్ఛారణ అద్వితీయము. నూటికి నూరుపాళ్ళు రేడియోకు అనుకూలమైనది, ఆయన చదివేపద్ధతి. మిక్కిలి పాత్రోచితంగా మాట్లాడారు ఆయన. అక్బరుచక్రవర్తికి కావలసిన హుందా ఒకసారి, తండ్రి చూపించవలసిన ప్రేమవాత్సల్యాలు ఒకసారి, ముఖ్యంగా అనార్కలీతో సంభాషిస్తూన్నప్పుడు ఆమెఎడల చూపే సానుభూతి—ఇలా బాగా చేశారు వీరభద్రరావు, ఆనాడు. అంతవరకూ బొత్తిగా రాచమర్యాదలను పాటిస్తున్న అక్బర్‌పైన మనకు వచ్చిన కోపమంతా ఇట్టే చల్లారి

పోతుంది, తనకుమారుని ప్రేమించి, ఆత్మార్పణము చేసిన పరమ ప్రేయసి, పేదరాలు,అనార్కలీనిగురించి అక్బర్ పడే బాధను వీరభద్రరావు అతి నిపుణతతో వ్యక్తపరచినపుడు.

అబుల్ఫజల్గా మూర్తిగారున్నూ గొప్ప ప్రజ్ఞ చూపించారు. అసమానమైన లోకానుభవమూ, గొప్ప దూరదృష్టి, వర్ణనాతీతమైన సానుభూతీ చూపగలిగారు తన పాత్రపోషణలో. ఇప్పటికీ వారి ప్రత్యక్ష జీవితములోనూ ఈ గుణగణాలు రాణిస్తున్నాయి.

పెద్దనాటకమనుకున్న అనార్కలీ ఇట్టే పూర్తి ఐపోయింది. ముద్దుకృష్ణ ఎంతో గొప్పగా రచించిన ఏకాంకిక మా రేడియోనిలయపు మొదటి నాటికగా అర్పించాము, శ్రోతలకు. అతని రచనలోని సంభాషణా తీరు ధారాప్రవాహంగా సాగిపోయింది. నిమిషాలూ పావుగంటలూ ఎలా గడచిపోయాయో అంతచప్పున ! చివరను, కృష్ణశాస్త్రి రచించిన బృందగానము ఎంతో జాలికలిగించింది. గుండె తరుక్కుపోయిందన్నమాట, ఈ మాటలు వింటూఉంటే !

పోయినది దానిమ్మపూవు !
తీయ తీయదనాల ప్రోవు !!
మాయభువిలో మురుగు నెదలకు
మంచు జడులని లేనెలేవు !

లోకమంతా కాలమంతా
చీకటిల్లై ! చీకువాలై
ఏకమైతే, మురుగు నెడదల,
శరత్తు లనునవి రానెరావు !

బ్రతుకు లేమో భస్మమైనా
ప్రణయమైనా బ్రతికి ఉంటే,

## సాగుతున్న యాత్ర

స్వర్గముంటే, మరుగు నెదలకు
శాంతి సుఖములు రాకపోవు !!

దేవులపల్లి కృష్ణశాస్త్రి రచించిన గేయాలలోకల్లా ఈ గేయము నన్ను చాలా ఎక్కువగా కదలిస్తుంది. నిజమైన కవిత్వానికి అవసరమైన అనుభవ సంపదా, ఆవేశమూ, నిరాశా, చివరకు ఉన్నతమైన ఆశా, ఈ రచనలో ఉన్నాయి అనుకుంటూ ఉంటాను, నేను.

అతనినీ, నన్నూ ఇంకా ఎందరినో, ఎందరినో, అనార్కలీగాథ ఇంతగా కదిలించడానికి కారణము ఆలోచిస్తే, ఆ కథంతా ఒకరీతి సంకేతమైనది కాబట్టి, అనుకుంటాను. అనార్కలీ విషాదగాథ నిజముగా జరిగినదే అంటారు. జరిగిఉన్నా, జరిగిఉండకపోయినా, అటువంటి సంఘటనలు మనలో కొందరి జీవితంలో ప్రత్యక్షంగా జరిగినవేకూడా. అనార్కలీవంటి పరమప్రేయసి ఎవరో మనలో కొందరి జీవితానికి మెరుపులా వెలుగునిచ్చి మళ్ళా మాయమైపోయి వారి శేషజీవితాన్ని చీకటిమయంచేసిఉంటుంది. అక్బర్‌వంటి తండ్రులూ ఉన్నారు. వారినీ అటువంటిసమస్యే ఇప్పటికీ బాధిస్తూ ఉంటుంది. కొడుకును ఆవహించిన విపరీతమైనప్రేమ, సంప్రదాయముల పట్టింపూ—వీని సంఘర్షణ తీరనిసమస్యగా జనకుని వ్యాకులపరుస్తూనేఉంటుంది, ఈనాడున్నూ.

బ్రతికిఉండగానే తమచుట్టూ నిర్భేద్యమైన గోడకట్టివేయబడడమున్నూ కొందరిజీవితాలలో ప్రత్యక్షానుభవమే కూడా. ఊపిరిసలపనంత గట్టిగా క్రమ్మివేస్తాయి బాహ్యపరిస్థితులు మనలను, ఒక్కొక్కప్పుడు. ఈ బలవన్మరణము తప్పదు, కొందరికి—కొన్ని పరిస్థితులలో.

*    *    *    *

అలా, పదహారవ తేదీన, శుభసమయాన ఉపక్రమించిన రేడియో వ్యాపకము నా తదుపరిజీవితాన్ని పూర్తిగా కమ్మివేసింది. ఏమి ఆలోచిస్తున్నా, ఏమి చూస్తున్నా, ఏమి మాటాడుతున్నా, ఏమి చేస్తూన్నా రేడియో విషయమునుగురించే!

ఈ కృషి నిర్విరామంగా జరిగిపోవలసినదే. మరివేరుప్రసక్తి లేదు. కాస్తవిశ్రాంతి తీసుకుని ఏ సినిమాకో, ఏ నాటకానికో, ఏ గానసభకో వెళ్ళినా, అక్కడ ఉన్నంత సేపూ అక్కడకలుగుతూన్న అనుభవాలను రేడియోకార్యక్రమాలను మరింత ఆకర్షవంతముగా చేయడానికి ఎలా వినియోగించడము అనే ఆలోచనే! ఎవరైనా, స్నేహితుని పంపడానికి రైల్వేస్టేషన్‌కి వెళ్ళితే, ఆ స్టేషన్ సందడినంతా అలా మనఃఫలకముపైన పదిలపరచుకుని, ఆ వారమో, ఆ పైవారమో "పదినిముషాలు రైల్వేస్టేషన్‌లో" అనే పేరుతో ఒక విచిత్రమైన రూపకము ప్రసారమయ్యేది. స్నేహితులతో ఇష్టాగోష్టిని ఉన్నా, సహస్రరూపమైన జీవవాహినిని చూస్తూన్నా, ఆ మాటలూ, ఆ దృశ్యాలూ, వీలైనంత త్వరలో ఏదో ఒక రేడియోకార్యక్రమంలో పదిలమవుతూ ఉండేవి. చివరకు నేనే రేడియో, రేడియోయే నేను, అనే టంతటి అవినాసంబంధం ఏర్పడింది. ఇది ఒక అహంభావము ఏమో, అనిపించే టంతటిగా లీనమైపోయాను, రేడియో వ్యాపకంలో. సెలవులంటూ లేదు. ఏమి చెయ్యాలి, సెలవు తీసుకుని? ఆఫీస్‌పని లేనప్పుడే మరింత ఎక్కువగా రేడియో కార్యక్రమాలను సరిదిద్దుకోవచ్చు. ఒక రిహర్సల్‌కీ, ఇంకో రిహార్సల్‌కీ మధ్య కాస్త విరామము కలిగితే ఆ సమయంలో క్రొత్తగావచ్చిన రికార్డ్‌లను వింటూ, వీనినీ ఇదివరకు వినిన రికార్డ్‌లనూ కలిపి "రికార్డ్‌లతో కూర్చిన కథ" అంటూ బలేచిత్రముగా ఏర్పాటుచెయ్యడము. క్రొత్తరికార్డ్‌లలో రికార్డ్ మొదట ఒక నిమిషమో, అరనిమిషమో, ఉపోద్ఘాతముగా వచ్చే వాద్యసమ్మేళనాన్ని గుర్తుపెట్టుకుని, జ్ఞాపకముంచుకోవడము. ఆ సంగీతము ఏదో ఒక నాటకములోనో, రూపకములోనో వినియోగింపవచ్చు. ఇలా తటస్థమైనవాద్యసంగీతమే ఒకసారి మాళవికాగ్నిమిత్రము నాటికలో అద్భుతంగా ఉపకరించినది నాకు. మాళవిక దోహదక్రియ సలుపగా, చెట్టు అద్భుతంగా పుష్పభరితమవుతుంది. ఆ సుకుమారగాత్రి పాదము తాకినంతనే కొమ్మకొమ్మనూ క్రొత్తపువ్వులు పూయడము ఎంతో గొప్పగా స్ఫురింపజేసింది నేను దాచిఉంచిన రికార్డ్‌లోని వాద్యసమ్మేళనము! ఇలాగే, కొన్ని విషాదసన్నివేశాలసందర్భంలో కావలసిన సంగీతము, ఏదో వర్ణింపలేని మూగబాధ, ఏదో అంతులేని అన్వేషణా, ఇటువంటిభావాలను అతిప్రస్ఫుటంగా స్ఫురింపజేసి, అరనిమిషంలో, అద్భుతమైన వాతావరణము కలిగింపజేయగల సంగీ

శాన్ని పదిలపరచాను. ఆ రికార్డ్ల నంబర్లను పుస్తకంలో వ్రాసుకునేవాడను. కొంతకాలానికి, ఆ పుస్తకంలేకుండానే చెప్పకలిగేవాడను, ఈ సన్నివేశంలో, ఈ రికార్డ్ ఉపయోగింపవచ్చు, అంటూ. ఇదంతా తీరికసమయంలో చేసినపనే!

ఏ పనిలోనైనా కొంత చర్వితచర్వణము ఉంటుంది. ఇది తప్పదు. ఇది కొందరకు ఎంతో విసుగు కలిగిస్తుంది. ఆఫీస్విషయంలో విసుగు కొంత తప్పదు. కాని, ఆఫీస్విడిచి స్టూడియోలో జేరేసరికి ఎంత నిత్యనూతనము కనిపించేది! పూటపూట, ఒక క్రొత్తప్రసంగమో, ఒక క్రొత్తరూపకమో, ఒక క్రొత్తనాటకమో! పూట, పూట, ఎవరో క్రొత్తవారు వస్తూఉండేవారు: ఆసక్తితో, ఉత్సాహంతో, ఎంతో ఆశతో, ఈ కార్యక్రమాలలో పాల్గొనడానికి. వీరందరితోను ప్రసక్తి ముఖ్యంగా రేడియో కార్యక్రమాలవిషయమే ఐనా, ఏదో సందర్భంలో వారి జీవితములోని కొన్ని అనుభవాలనుగురించిన ప్రసక్తి వచ్చి, వారితో కొంత సానుభూతి ఏర్పడేది నాకు. క్రమక్రమంగా వారు ఆర్టిస్ట్లూ, నేనూ ఉద్యోగినీ అనే సంబంధమేగాకుండా, నన్ను ఒక ఆప్తస్నేహితునిగా భావింపసాగేవారు, కవులూ, నటీనటులూ, గాయకులూ. వారి సాధకబాధకాలను నాతో చెప్పుకొంటూ కొంత ఉపశాంతినిపొందేవారు, కొందరు. కొందరు మిక్కిలి ఆత్మీయమైన విషయాలను కూడా వివరించి ఇకముందు తాము ఏమిచేస్తే బాగుంటుందీ అని నా సలహాను ఆపేక్షించేవారు. ఆత్మవిశ్వాసమూ, ఎటువంటి పరిస్థితులలో నిజాయితీనే పాటించడమూ, ఎదుటివారు ఎలావున్నా మన "మంచితనాన్ని" మనము పోగొట్టుకోకుండా ఉండడమూ- ఇటువంటివి, వారు తప్పక అనుష్టింపవలసిన విధులు అని నేను నచ్చచెపుతూంటే, వారికి నాపైన విశ్వాసము మరింత ఎక్కువయేది. ఇలాగ, నేను సత్యము అని నమ్మిన విషయాలనుగురించి నాతో పనికలిగినవారిలో కొంతకొంత నమ్మకము కలిగింపకలిగాను. మిక్కిలి నిరాశతో నావద్దకువచ్చిన వారినిన్నీ, అవసరమైనపుడు నా జీవితమే దృష్టాంతముగా చూపిన్నీ ఆశాపూరిత హృదయాలు కలవారినిగా చేస్తూ ఉండేవాడను.

రేడియోకార్యక్రమ ప్రసార విషయంలోనూ, అందుకు కావలసిన రిహర్సల్స్ విషయంలోనూ చండశాసనునిలా ప్రవర్తించేవాడను. ఒక్కమాట

తప్పు పదువగూడదు. ఒక్క భావము సూదిమొనంత భేదములో వ్యక్తపరుప గూడదు. ఎన్నిసారులైనా, మరీమరీ చెప్పి, కావలసిన రసానుభూతినికలిగించే యత్నము చేయవలసినదే. "జానకిరామ్ రిహార్సల్" అనేది ఒక నానుడిగా చలామణి కాసాగినది, కొన్నాళ్ళకు. తప్పుచేస్తే తాము నా తీవ్రమైనకోపానికి గురి కాగలము అనుకునేవారే, తాము తమపనిని చక్కగా నిర్వహిస్తే నావలన విపరీతమైన ప్రశంసకు పాత్రులమవుతాము అనే నమ్మకము వారు తమతమ గుణగణాలు పూర్తిగా వినియోగించి ఆ యా కార్యక్రమాలను విజయవంతంగా పరిణమింపజేసేటట్టు జేసేది. 'మీ రేడియో నిలయము,' 'మీ నాటకము,' అనేవారు "మన రేడియో నిలయము", "మన నాటకము", అనడము నేర్చుకున్నారు, ఈ సంస్థ వారికోసము ఏర్పడినదీ అనీ ఈ కార్యక్రమాలు వారి పూర్తి సహకారముమీదనే ఆధారపడివున్నవి అనీ గుర్తించాక.

ప్రతినిత్యమూ ఎవరో ఒకరు క్రొత్తవారు కనిపిస్తూఉంటారు, పాత స్నేహితులూ మనలను కలుసుకుంటూ ఉంటారు. వీరిని ఇదివరకు కలుసుకోవడము వేరు, ఇప్పుడు కలుసుకోవడము వేరు. ఇప్పుడు వీరు కనిపించినంతనే నా మనస్సులో కలిగే మొదటి ఆలోచన: 'వీరు రేడియోకు ఏవిధంగా ఉపకరిస్తారు!' అనే. సాధారణులైనా, అంతే, మహనీయులైనా అంతే. వీరి ప్రతిభను రేడియోలో వినియోగించాలి అని సంకల్పమే, నాకు.

ఒకరోజు శ్రీ శొంఠి రామమూర్తిగారిఇంట జరిగిన టీపార్టీకి వెళ్ళాను. ఆ పార్టీలో శ్రీ ముట్నూరి కృష్ణారావు కనిపించారు. నమస్కరించి, వెంటనే అడిగాను, వారిని: "మీకు ఎప్పుడు వీలు, ఈవాళగాని, రేపుగాని, మన రేడియో నిలయానికి వచ్చి మీ ప్రసంగం రికార్డ్ చేయడానికి. ఇదివరకు మిమ్ములను మరీమరీ ఆహ్వానించి ఉన్నాము. ఇందుకోసము పనిగట్టుకు రావడానికి మీకు సావకాశం లేకపోయినా, ఊళ్లోకివచ్చారు కాబట్టి, నామాట మన్నించరూ, మరి!" అని. ఆయన నవ్వుతూ అన్నారు: "నాకు తెలుసు, నేనంటే ఎంత అభిమానమో మీకు. నన్ను విడిచిపెట్టాలి, మీరు. నేను వట్టి వ్రాతగాడను. మాట్లాడేపని అంతా మీరు చేయవలసినదే! అమోఘంగా నెరవేరుస్తున్నారు, కానియ్యండి, దిగ్విజయము తప్పదు!"

అన్నారు. అదే ఆఖరుసారి, నేను వారిని కలుసుకోవడము. వారి ఆశీర్వచనము నా కృషిలో నాకెంతో బలాన్ని ఇచ్చింది.

అప్పుడప్పుడు చిన్న చిన్న తమాషాలున్నూ జరుగుతూ ఉండేవి. ఒకపర్యాయం శ్రీ అడివి బాపిరాజు వచ్చారు, రేడియోనిలయానికి "నిత్య జీవితములో, సౌందర్యపిపాస"ను గురించి ప్రసంగించడానికి. ఆయనతోకూడా శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావూ, శ్రీ కాటూరి వెంకటేశ్వరరావూ, వచ్చారు. కళాతపస్వి బాపిరాజు రూపంలోనూ, చేష్టలలోనూ, అతిసుకుమారి. ఆయన ప్రతి చేష్టా ఒక అభినయము. రెండుచేతులూ విపరీతంగా త్రిప్పుకుంటూనేగాని ఆయన మాట్లాడలేరు. మన అందరిలోనూ ఎంతో కొంత "అర్ధనారీత్వము" ఉంటుంది. కాని, ఆయన కళాశీలి, అతిసుకుమారవంతుడూ, సౌందర్యప్రియుడూ కాబట్టి, ఆయనలో "నారీత్వము" ఒకపాలు ఎక్కువగా కనుపించేదేమో. అంచేత, ఒకరీతి పొగడ్తగానే, ఆయన సన్నిహితులు, మిక్కిలి చనువైనవారు, బాపిరాజును "శ్రీమతి" అని, పిలచేవారు. ఈ విషయాన్ని పురస్కరించుకుని శ్రీ రామకోటేశ్వరరావు అన్నారు నాతో, వేళాకోళంగానే: "బాపిరాజును ఏమని పరిచయం చేస్తారు? మేమంతా ఇతనిని 'శ్రీమతి' అంటాము. మీరున్నూ "శ్రీమతి బాపిరాజు" అని పరిచయంచేస్తారా రేడియోలో!" అని. "నేను సరే! అలాగే చేస్తాను" అన్నాను. రామకోటేశ్వరరావు "ఆ! అలా చెయ్యగలరా!!" అన్నారు, ఆశ్చర్యంతో. వెంకటేశ్వరరావు "ఆ! ఊరికే అంటున్నారు, అదెలా వీలు!!" అన్నారు.

నేను, అనినట్టుగానే, ప్రసారానికిముందు బాపిరాజును పరిచయం చేస్తూ, మైక్‌లోకి అన్నాను: "ఆల్ ఇండియా రేడియో, మద్రాస్‌కేంద్రము. "నిత్య జీవితములో సౌందర్యపిపాస"ను గురించి శ్రీమతి - క్షమించాలి - శ్రీయుత అడివి బాపిరాజు ముచ్చటిస్తారు" అని. బాపిరాజు నావైపుజూచి చిరునవ్వు నవ్వి తన ప్రసంగమును ప్రారంభించారు. మైక్‌ముందున్నూ, ఏక చేతులు త్రిప్పుకోవడమే! మైక్రోఫోన్ ఒక అందమైన అమ్మాయి అని భావించి, ఆమె ముందు చెప్పుకుపోతున్నాడు ఆయన, సౌందర్యపిపాసను గురించి. మద్రాస్‌రేడియో నిల

యపు కార్యక్రమాలలో, మొదటిరోజులలో వెలువడిన చాలా మంచిప్రసంగాలలో, బాపిరాజు ప్రసంగము ఎన్నదగినది.

స్టూడియోనుంచి బయటకు వచ్చాక, రామకోటేశ్వరరావు ఆదుర్దాతో అన్నారు : "అన్నంతపనీ చేశారే! మరేం ఫరవాలేదుగదా! పైవారు మిమ్మల్ని ఏమీ అనరుకదా!" అని. నేను నవ్వుతూ అన్నాను: "నేను ఏమంత సాహసమైన పని చెయ్యలేదు. మా డైరెక్టర్ అంటూ ఉంటారు, మాతో: "మైక్ముందు మీరు అతిసహజంగా ఉండాలి, మన 'డ్రాయింగ్రూమ్'లో కూర్చుని ఒకరిద్దరు స్నేహితులతో ఆప్యాయంగా ముచ్చటించినట్లు ఉండాలి, మీ మాటలధోరణి. అవసరమైతే, వోమాట చెప్పి, చిన్నదగ్గు దగ్గో, బుద్ధిపూర్వకంగానో, చిన్నపొరపాటుచేసో, "క్షమించండి, పొరపాటు" అంటూ తప్పు దిద్దుకొనో, తద్వారా సంభాషణలో సహజత్వాన్ని కల్పించాలి, అప్పుడప్పుడు" అని, అన్నాను నేను!" "ఇంకేమి! పైవారుచెప్పిన పాఠమేనా!" అన్నారు, వెంకటేశ్వరరావు.

ఆరాత్రి, మేము నలుగురము శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి ఇంటికి వెళ్ళాము. త్రోవపొడుగునా, రేడియో విశేషాలనుగురించే మా ప్రస్తావన అంతా. శర్మగారింటా ఆ మాటలే! వారందరూ చాలాచాలా ప్రస్తుతించారు జరుగుతూన్న కృషినిగురించి. కొన్ని విలువగల సలహాలనూ ఇచ్చారు.

బాపిరాజుతో కలసి తిరగడము అదొక వింత అనుభవము. ఆయన చెప్పే ప్రతిమాటలోనూ ఎంతో ఆవేశమూ, ఎంతో ఉద్వేగమూను. తన కండ్ల ఎదుట, మనోనేత్రాలముందు, ప్రత్యక్షమైన ఒకానొక సుందరప్రపంచాన్ని మనకూ చూపిస్తేగాని తనివితీరదు, ఆయనకు. ఉన్నట్టుండి, ఒకానొక అద్భుతమయ, సుందరాతి సుందర, విశ్వాన్నే సృష్టించాలి, మనయెదుట అనే ఆతురత, ఆయనలో, ఎప్పుడూను. ప్రస్తుత పరిస్థితులలో అటువంటిది సాధ్యమా అని జంకులేదు ఆయనకు. అందుకే "నా బ్రతుకొక పరిమళార్ద్ర నందనోద్యానము" అన్నారు - అంతటి ఆశావాది బాపిరాజు. అతని కవిత్వములో ఎంతటి సహజత్వమూ ఎంతటి నిజాయితీ !!

## సాగుతున్న యాత్ర

బాపిరాజును నాకోసము ఒక చిన్నపని చేసిపెట్టమన్నాను, ఇక కొన్ని నెలలలో ఆయన స్వర్గస్థులవుతారనగా. కూచిపూడి నాట్యకళానిధి శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగార్కి బ్రహ్మాండమైన సన్మానమును ఏర్పాటుచేస్తూ వారిచేతిని తొడిగించడానికి పదహారుకాసుల సింహతలాటాన్ని చేయిస్తున్నాను, నేను బాపాలాల్ చేత. ఆ సింహతలాటానికి కావలసిన డిజైన్లు బాపాలాల్ వద్ద లేవు, బాపిరాజును చిత్రించిపెట్టమని కోరుతూ, కావలసిన పరికరాలు అతని ముందు ఉంచాను.

ఒక పదినిమిషాలలో చిత్రించారు నాముందు, బాపిరాజు, నాకు కావలసిన సింహతలాట చిత్రాన్ని, ఒక్కొక్క రేఖ తీర్చిదిద్దుతూ, ఈ రేఖ ఇలాఉండాలి, ఈ ఒంపు ఇలా రావాలి, సింహంనడుం ఇలా సన్నంగా కుదరాలి; నటరాజ విగ్రహం ఇలా ఉండాలి" అంటూ పూర్తిచేశారు సగము కడియాన్ని. ఇటో సింహమూ, అటో సింహమూ కోరః చూపుతూ ముందుకు లంఘిస్తున్నట్లు అద్భుతంగా కుదిరింది. కాని, ఇంతలో ఏదో జ్ఞాపకంవచ్చి, "నేను వెంటనే వెళ్ళిపోవాలి, అవతలిసగము అచ్చంగా ఇలాగే ఉంటుందిగా, కంసాలి పూర్తిచేయకలడు" అంటూ వెళ్ళిపోయారు ఆయన! అంతే! ఆ వెళ్ళడము, వెళ్ళడము ఏ భీమవరము వెళ్లారో, ఏ హైదరాబాద్ వెళ్లారో ఏ కార్తీకపూర్ణిమ ఉత్సవానికో, ఏ కళాప్రదర్శన ఉపక్రమణకో-నాకు మళ్ళీ కనిపించలేదు, బాపిరాజుబావ! అదే ఆఖరుసారి చూడ నోచుకోవడము ఆతనిని, నేను.

బాపాలాల్‌షాపుకు వెళ్ళగా బాపిరాజు చిత్రించిన సగము నమూనాను చూచి హరేంద్రమెహతా విస్తుబోయాడు. "ఎక్కడ సంపాదించావు ఈ అతి ప్రాచీన సింహతలాటచిత్రాన్ని - సింహాలకు జీవంపోసినట్టు ఉన్నది అచ్చంగా, ఏమి నటరాజ రూపము! ఎంత చక్కగా కుదిరినవి ఈ రేఖలు!" అని, "ఇటువంటిది బంగారముతో చేయకలిగితే మేము ధన్యులమే" అన్నాడు. "పని వెంటనే ప్రారంభింపవచ్చుకాని ఈ డిజైన్ అవతలిసగమున్నూ పూర్తిచేయించి తీసుకురా!" అన్నాడు, కాని, బాపిరాజు ఏడీ?

చాలా ప్రయత్నించాను, అచ్చంగా ఆ రేఖలే అవతలవేపూ వేయించాలి అని. కాని, ఎవరూ అటువంటిరేఖలు వెయ్యలేకపోయారు. పనితొందరవల్ల, ఎవరిచేతనో బాపిరాజుచిత్రానికి నకలు పూర్తిగా చిత్రింపించి, ఆ నమూనా బాసాలాల్‌కు ఇచ్చాను. సింహతలాటమును చేయించామన్నమాటేగాని బాపిరాజు చిత్రించినట్లు లేదు.

బాపిరాజు మా ఇంట్లో ఆవేళ చిత్రించిన సగము సింహతలాటచిత్రమూ ఇప్పటికీ ప్రాణప్రదముగా దాచుకుంటున్నాను, నేను. ఆ మధ్య, "అందము" అనే విషయాన్నిగురించి వ్యాసమువ్రాస్తూ వ్యాసానికి మకుటాభరణంగా, అర్ధవలయాకారంగా ఆ చిత్రాన్ని ముద్రింపించాను. ఐదు ఆరు పేజీలలో అందాన్నిగురించి నేను చెప్పలేని ఉదంతాన్ని బాపిరాజుగీసిన రేఖలు చెప్పకలిగాయి! అట్టి సిద్ధహస్తుడు ఆ కళాతపస్వి !!

అడివి బాపిరాజు కవితలోకల్లా, నాకు చాలాచాలా ఇష్టమైన రచన ఇది:

నువ్వూ నేనూ కలసి
పువ్వులో తేనెలా
తావిలో మధువులా!
నువ్వూ నేనూ కలసి
కోకిల గొంతులా
గొంతులో పాటలా!
నువ్వూ నేనూ కలసి
వెన్నెల వెలుగులా
వెలుగులో వాంఛలా!
నువ్వూ నేనూ కలసి
గగన నీలానిలా
నీలాన శాంతిలా!!

## సాగుతున్న యాత్ర

నాలో నేను, ఎన్నిసార్లో వల్లించుకుంటూఉంటాను ఈ పలుకులను !! అద్భుతమైన ఈ ఆదర్శప్రేమ ప్రకటనలో ఎంత గొప్ప కవిత్వమున్నది !!! ఎంతటి మధురిమ ఉన్నది !! సంగీతపుకెరటాలపై తేలిపోతుంది ఆత్మ, ఈపాట పాడుకుంటూ ఉంటే !!!

ఈ పుస్తకంలోనే బాపిరాజుబావ జీవిస్తుంటాడు నా జిహ్వాలో, నేను బ్రతికినన్నాళ్ళూ !!

## ౮

"ఏను నిద్దురవోదునో, యేమొ కరుణ
సెలవు గైకొనకేగగావలదు; ఇన్ని
నాళ్ళ యెడబాటు నీ నిరీక్ష
ణమ్ము బరువులు బరువులై నయనయు
గళమయ్యె దిగలాగు నిద్దుర మరపులకును
ప్రియతమా, యిక నిదురింతును పిలువబోకు
బాసిపోకు నిర్భాగ్యపు బ్రతుకు దాటి!
ప్రియతమా, పొరలి పొరలి మొయిళు
లేవో మేలుకొననీవు రెప్పల వాలి యదిమి!"

దేవులపల్లి కృష్ణశాస్త్రి

ప్రమద్వరగా శ్రీమతి కొమ్మూరి పద్మావతి అంటున్నారు, ఈ మాటలు, ఋషికుమారుడు రురూతో నా రెండవ రేడియోనాటకంలో. పద్మావతి పద్యంచదివే తీరులో ఒక విశిష్టత ఉన్నది. ఆమెకు ఆమే సాటి; నాకు తెలిసినంతవరకు ఎవరూ చదువలేరు, నేటి మన భావకవిత్వాన్ని, పద్మావతి చదివినంత అందంగా. అంత అర్థముచేసుకుంటూ, అంత అనుభవిస్తూ, చదువుతుంది ఆమె. ముఖ్యంగా, నండూరి వారి యెంకిపాటలూ కృష్ణశాస్త్రి ఊర్వశీపద్యాలూ ఆమె చదువగా వినడము ఒకానొక అపూర్వమైన అనుభవము. ఆ అనుభవాన్ని జ్ఞాపకంచేసుకున్నా చాలు, లోలోపలినుంచి, ఎక్కడినుంచో ముంచుకువస్తుంది ఒకానొక వింత సానుభూతి.

ప్రియతమా, నిను వదలికోలేను, నిదుర
కడలిపై కొటుకై కనుగవ నడంచు;

## సాగుతున్న యాత్ర

ప్రియతమా, వీడిపోకోయి వీడలేని
నా మమతచిచ్చు కునుకునా నన్నుబోలి!

ఎంతటి అగాధమయిన ప్రేమలోతులు స్ఫురిస్తాయి ఈ పలుకులలో! ఎంతటి గాఢమైన అనురాగాన్ని ప్రకటిస్తూన్నది ప్రమద్వర!! ఆ తరువాత వచ్చే వారిద్దరిసంభాషణా అంతటి ప్రేమపూరితంగానూ, అనురాగమయంగానూ ఉంటుంది. ప్రమద్వర అంటుంది, నేను వ్రాసిన మాటలతో:

"రురూ! నీతోనేఉన్నది నాకు సర్వమూను. నీ నీడలో నడుస్తూ ఉన్నప్పుడే నా జీవితానికి కాంతివస్తుంది. నీ చూపులలోనే నాకు లోకం కనబడుతుంది," అని.

కాని, రాబోయే అవాంతరము ఆమెకు ఎలాగో స్ఫురించి, ఆమె ఏడుస్తుంది. అతనిని పోగొట్టుకుంటుందేమోననే భయంతో అంటుంది ప్రమద్వర: "రురూ! ఏమో చెప్పలేకుండా ఉన్నాను. ఈ సాయంత్రమునుంచీ ఏమో భరింపలేని బెంగ నన్ను ఆవరిస్తూంది.........రురూ! ఇంకా దగ్గరగా రా, ఇంకా!.... నన్ను వదలకేం! నాకు భయమేస్తూంది. అతిగాఢమైన మన అన్యోన్యాన్ని చూచి విధికే ఈర్ష్య కలుగుతుంది అనిపిస్తోంది," అని ప్రమద్వర.

నాకు తరుచు వస్తూంటుంది, ఈ భయము. చాలాచాలా ఆనందకరమైన నిమిషాలలో ఎన్నాళ్ళనుంచో ఆశించిన మహానందం నాకు అందుబాటులోకివచ్చింది, ఇక నా సంతోషానికి మేరలేదు, అని నేను అనుకుంటూన్నప్పుడు వెంటనే కారునల్లనినీడలా మనస్సులో ఈ భయము వస్తుంది: "నా ఆనందమునుచూచి విధికే ఈర్ష్యకలుగుతుందేమో!" అనే భయము. ఆలోచింపగా ఈ భావానికి పునాది ఎప్పుడో కొన్నేండ్లక్రిందట నేను చదివిన హరీన్ పద్యములోని మాటలు: "గాడ్ హిమ్‌సెల్ఫ్ ఈజ్ జలస్ ఆఫ్ అవర్ ఇమ్మోర్టల్ లవ్!" అంటాడు హరీంద్రనాథ ఛటోపాధ్యాయ.

ఋషికుమారుడు రురూ విషయంలోనూ, అలాగే అవుతుంది. అతడు తన ప్రాణముకంటే అధికముగా ప్రేమించిన ప్రమద్వరను పాము కరుస్తుంది. ప్రమద్వర చనిపోగా, రురూ విధిని బ్రతిమాలి తన ఆయుఃపరిమాణములో సగము ధారవోసి ఆమెను తిరిగి బ్రతికించుకుంటాడు. కాని, భారతములోని కథలో నేను నారచనలో చిన్నమార్పుచేశాను: ఆ సగము ఆయుస్సూ ఇప్పుడే గడిచిపోయి, నవ యవ్వనమున ఉన్న రురూ వార్ధక్యంతో క్రుంగిపోయే పండుముసలి ఐపోతాడనీ, ఆ మార్పు మృత్యువాతనుండి బయటపడిన అతనిప్రేయసి సహింపగలదా అనే సంశయము అతనిని బాధిస్తుందనీ, నేను చిత్రించాను. ఈ సందిగ్ధాన్ని మరింత బలవంతముగా చేయడానికి ప్రమద్వరకు చెలికత్తెగా మరో అమ్మాయినీ కల్పించాను: కుముదిని - ఆమెకూడా రురూను అమితంగా ప్రేమిస్తుంది. రురూకూడా తనను అంతగా ప్రేమించాలని కుముదిని ప్రాధేయపడుతుంది. ఆమెయెడ అనురాగమున్నా, రురూ ప్రమద్వరనే మనసార ప్రేమిస్తాడు. కుముదిని రురూను అడుగుతుంది : "నేను అందంగాఉన్నానా....ఆ ప్రమద్వర అందంగా ఉన్నదా ?" అని, అప్పుడే కొలనులో స్నానంచేస్తూ హంసలతో ఆడుకొని వచ్చిన కుముదిని. రురూ అంటాడు : "అన్ని హంసలతో ఆడుకొన్నామన్నావుకదా - కుముదూ, వానిలో ఏ హంస నడకతీరు ఎక్కువ బాగున్నదో చెప్పగలవా.........ఈ పొదరింట ఇన్ని పువ్వులున్నాయి. ఇందులో ఒక్కపువ్వును తీసి తతిమ్మావానికంటే ఇది బాగున్నది అనగలవా ?" అని.

కాని, ఈ మాటలు కుముదినిని సంతృప్తిపరుపవు. ఆమె ఇంకా గ్రుచ్చి గ్రుచ్చి ప్రశ్నిస్తుంది. చివరకు రురూ అంటాడు: "కుముదూ! చెప్పనా, సాధారణపు కళ్ళకు నీ అందము గొప్ప అందము. నీ దేహకాంతి కళ్ళను మిరిమిట్లు గొలుపుతుంది. విశాలమైన నీ ఫాలభాగాన్నిచూస్తే ఆ మెదడులో ఎన్నెన్నో వింతఊహాలు ఉన్నాయి అనిపిస్తుంది. తీర్చిదిద్దిన నీ కనుబొమలను చూస్తూఉంటే, బ్రహ్మ చిత్రకారుడే సుమా అనిపిస్తుంది. మెరిసిపోతున్న నీ కళ్ళు ఉత్సాహం, ఉద్రేకం, క్రొత్త క్రొత్త అనుభవాలను పొందాలనే ఆతురత - ఇలాంటి వెయ్యిభావాలతో నిమిష

నిమిషమూ మారిపోతూ ఉంటాయి. నిన్ను చూస్తే ఈ జీవితములోనూ, ఈ ప్రపంచములోనూ ఉత్సాహము వెయ్యింతలవుతుంది!" అని.

రురూ ప్రశంస వినేసరికి, పాపము, కుముదిని అంటుంది పట్టలేని ఉత్సాహంతో: "నిజంగా! నిజంగానా రురూ!! నీ కళ్ళకు నేను అందకత్తెనా? నా అందము నీలో చలనము కలుగజేస్తుందా? - ప్రమద్వరకంటేనా!" అని.

రురూ : "కుముదినీ! ఏమన్నావు? చలనమా! ప్రమద్వరకంటేనా? ....నీవు అందకత్తెవు - ప్రమద్వరకంటే రూపసివి. కాని - "

కుము : "ప్రమద్వరకంటే రూపసిని; కాని - "

రురు : "కాని, ఆమెలో ఒక అలౌకికమైన, అసాధారణమైన అందము ఉన్నది. అది మిక్కిలి సాత్వికమైన సౌందర్యము....మనశ్శాంతినిచ్చే మార్దవము ....ఆమెలో వెన్నెలలు వెదజల్లే విలాసము....చేతులు జోడింపజేసే వింత శక్తి ఉన్నాయి!!" అంటాడు రురూ.

ఈ మాటలు కుముదినికి రుచించవు. ఎలా రుచిస్తాయి? కాని, పాముకరచి ప్రమద్వర చనిపోయినంతనే, ఆకాశవాణి ఆదేశించినప్రకారము రురూ తన ఆయుఃపరిమాణములో సగము ధారపోసి, ముసలివాడై పోడానికి సిద్ధపడుతూండగా. కుముదిని పరుగెత్తుకుంటూ వచ్చి అంటుంది:

కుము : "ఆ! రురువు ముసలివాడా! ఎంతమాట! రురూ! చూడు, నువ్వు ఒప్పుకోకు ఈ నియమానికి. నువ్వేమిటి, ముసలివాడవవడమేమిటి!!"

అంటూ, చాలా చాలా బోధిస్తుంది. పోయిన ప్రమద్వరను మరచి పొమ్మనీ, అన్నివిధాలా అతనిని సంతోషపెట్టగల తనను స్వీకరింపమనీ ఎంతో ఎంతో చెపుతుంది. నవమన్మధసమానుడైన రురువును ప్రేమించిన ప్రమద్వర ముసలితొడుగై, కీళ్ళుసడలిన అతనిని ఏవగించుకుంటుంది. తప్పక అనిన్నీ చెపుతుంది. ఇంకా ఇలా అంటుంది కుముదిని :

కుముదిని : "ఐనా, ఇంకొక్కమాట. నవశిరీషకుసుమపేశలమైన ఆమె యవ్వనానికి తోడుగ నీ ముసలితనాన్ని ఆమెకు అర్పించడము న్యాయమేనా? ఆమె నీతో చెప్పుకోలేకపోవచ్చును; కాని, ఎప్పుడో, ఒక్క అరనిమిషమైనా, ఆమెకు చింతకలుగదూ 'ఈ ముసలివానితో ఏమి కాపురము' అని. అప్పుడు ఆమెకు కలిగిన అసహ్యాన్ని ఎలా భరిస్తావు రురూ !"

రురూకు శంకగానే ఉంటుంది - పడుచుప్రాయపు ప్రమద్వరకు ముసలివాడైన తనతోటి సహవాసము జుగుప్స కలిగిస్తుందేమోనని. ఐనా గుండె దిటవు చేసుకొని, విధి విధించిన నియమానికి ఒప్పుకుంటాడు, భయపడుతూభయపడుతూ. నిద్రనుంచి మేల్కాంచినట్టు తిరిగి బ్రతికిన ప్రమద్వరకు తనముఖాన్ని చూపించడానికి సాహసింపలేకపోతాడు. కాని, తన యవ్వనాన్ని ధారబోసిన అతని త్యాగబుద్ధికి మెచ్చి, దేవతలు అతడు ప్రమద్వరకళ్ళకుమాత్రమే నవయవ్వనుడుగాను, ఇదివరకుకంటే అతిశయించిన రూపురేఖావిలాసాలతోను, కనుపించేటట్టు అనుగ్రహిస్తారు. కాని, ఆ విషయం రురూకు తెలియదు. అతనిని కౌగలించుకుంటూ ఆవేశంతో అంటుంది ప్రమద్వర :

"ఓహో! ఏమిటిది! నువ్వు నా రురువే? ఏమిటీ కాంతి! నీ ముఖంలో ఎంత తేజస్సు! నీ కళ్ళు ఎంత మెరిసిపోతున్నాయి....నీలో నవవసంతం తాండవమాడుతోంది....రురూ! నన్ను కవుగలించుకో....గట్టిగా....ఇంకా గట్టిగా....! ఏవీ నీ లేతపెదవులు....అసలే సుందరమూర్తివి....మరింత సుందరుడవెల్లా అయ్యావు, రురూ !!"

రురు : "ప్రమద్వరా ! ప్రమద్వరా !! అంతా నీ ప్రేమప్రభావమే ! ప్రమదా ! ప్రమదా !!"

నాటకాన్ని వినిన అన్నగారు మల్లంపల్లి సోమశేఖరశర్మ రచననూ, ప్రదర్శననూ చాలా మెచ్చుకున్నారు. రురూ పలేక్క కొన్నికొన్ని ప్రేమవాక్యాలను జ్ఞాపకముంచుకున్నారుకూడా. ఒకచోట ప్రమద్వరతో అంటాడు రురు :

"ప్రమదా! చర్వితచర్వణమైన ఈ జీవితంలో బండిచక్రంలా తిరిగి పోతూఉన్న నా బ్రతుకులోకి నీవు ఒక క్రొత్త అందాన్ని, ఒక క్రొత్తఆశను, ఒక క్రొత్తఆశయాన్ని కల్పించావు....ప్రమదా! ఎంత ప్రేమమయుణ్ణిచేశావు నన్ను.... ప్రమదా! అగ్నిహోత్రాలపొగకు అలవాటుపడ్డ నాకళ్ళు నీ వినీలకుంతలాల్లో దాక్కొని నిద్రపోవాలని కోరుతున్నాయి! ప్రమదా!!"

"అగ్నిహోత్రాలపొగకు అలవాటుపడ్డ నా కళ్ళు నీ విలీనకుంతలాల్లో దాక్కొని నిద్రపోవాలని కోరుతున్నాయి!" అనే పంక్తులను ఉదాహరిస్తూ అన్నారు సోమశేఖరశర్మ: "ఎంత గొప్పగా ప్రకటిస్తారండీ, మీరు ప్రేమభావాన్ని! ఎలా వ్రాయగలుగుతారండీ, ఇంతటి అనురాగరక్తిమతో!" అని. నేను అన్నాను: "ఆ నిమిషము నా ప్రమద్వర నా కళ్ళముందు నిలుస్తుంది ఏమో అన్నగారూ!" అని. ఆయన అర్థంచేసుకుని, నావైపు చూచారు అతి సహజమైన ఆయన వెన్నెల చూపులతో.

* * * *

క్రొత్త రేడియోనిలయములో రోజుకొక మంచి ప్రసంగమును ప్రసారము చేసేవారము. మొదటివారములోనే అనుకుంటాను పూజ్యులు శ్రీ గిడుగు రామమూర్తి పంతులు "సజీవభాష"ను గురించి చెప్పారు. ఈ నిమిషానా కళ్ళకు కట్టినట్టు కనిపిస్తుంది ఆయన గంభీరవిగ్రహము, భీష్మవిగ్రహంలా, మా స్టూడియోలో అడుగుపెట్టుతూన్నదృశ్యములో. ఆయన ఎడమచేతిని ప్రియశిష్యుడు తెలికిచర్ల వెంకటరత్నము భుజాన ఆనించారు; కుడిచేయి నా భుజాన. ఆనాటి వారి ప్రసంగము ఇన్నిఏళ్ళ రేడియోప్రసంగాలలోనూ మణిపూసలా ప్రకాశిస్తుంది. ఎంత చక్కని భావాలు! ఎంతటి సహజశైలి! ఎటువంటి దివ్యకంఠమూ వారిది! ఆ మూర్తిని మరచిపోలేము, మనసు. ఆ ప్రసంగములో వారు దిద్దిన ఒరవడినే ఇన్నాళ్ళూ రేడియోవాచకములో అనుసరిస్తూవచ్చాము. ఆయన నేర్పినదే మన సజీవభాష !!

# సాగుతున్న యాత్ర

మహాపండితులు, మహనీయ విమర్శకులు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి "వాత్స్యాయనుడు ఉపదేశించిన నాగరిక వృత్తము"ను గురించి చెప్పారు ఎంతో అందముగా. సముద్రమంతజ్ఞానము వారిది, వైశాల్యములోనూ, లోతులోను. కాని, ఎంతటి శులభశైలిని, ఎంత విపులంగా, ఎంత సొంపుగా. విశదపరచారు, ఆ ఋషిసూక్తులను, మాకోసము! ఎక్కడో ఉన్న బరంపురంనుంచి వచ్చారు ఆదినారాయణశాస్త్రి. ప్రసంగము ప్రసారమైనాక, స్టూడియోలోనే కూర్చుని ఎన్నో ఎన్నో విషయాలు చెప్పారు మాకు.

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి చేసిన భాషాసేవ అద్వితీయమైనది. ఈ తరమువారిలో ప్రాచీనవిషయాలందు ఆసక్తిని నిలువజేయడానికి వారి రచనలూ, వారి విమర్శనలూ ఎంతో తోడ్పడినవి. ఆయన రాజశేఖరకావ్యమీమాంస అమూల్యమైన వ్యాఖ్యానము.

ఈ రాజశేఖరకావ్యమీమాంసను గురించి ఒక చిత్రము జరిగింది రేడియోప్రసంగముల ఏర్పాటు సందర్భములో. నేను ఇదివరకు ఆ గ్రంథమును చదివిఉన్నాను. నాకు చాలాచాలా నచ్చినది ఆ వ్యాఖ్యానము. ఎన్నోఎన్నో విషయాలు తెలుసుకోగలిగాను నేను ఆ గ్రంథమును చదువుతూ. ఆ పుస్తకాన్ని జనుల వినియోగంనిమిత్తం కానిమెరా లైబ్రరీవారిచే కొనిపించాను కూడా. ఆ పుస్తకాన్ని గురించి శ్రోతలకు తెలియజెయ్యవలెననే ఉద్దేశముతో కొంచెము పేరుపొందిన ఒకకవికి ఆహ్వానము పంపాను నేను, రేడియోతరపున. ఆయనను నేను ఎరుగను. కాని, పత్రికలలో వీరినీ వారినీగురించి కాస్తకటువుగానే విమర్శిస్తూంటారు ఆయన. అచ్చటచ్చట సభలు చేయించి సన్మానాలు పొందుతూఉంటారు కూడా ఆయన. కాని. మా ఆహ్వానాన్ని అందుకున్నట్లు ఆయనవద్దనుంచి జవాబు రాలేదు. ఒకసారి జ్ఞాపకంచేశాము; మళ్లా రెండవపర్యాయమూ జ్ఞాపకముచేశాము. మూడవ ఉత్తరాన్ని అందుకుని, ఆయన మా డైరెక్టర్‌కి వ్రాశారు ఇలా: "మీ ఆహ్వానమూ, మీ మూడుఉత్తరాలూ అందినవి. నేనెవరినో మీకు తెలియనట్టున్నది. ఎవరో ఊరూపేరూ లేనివాడు, మీరు ఏ విషయాన్ని నిర్దేశిస్తే ఆ విషయాన్నిగురించి ప్రసంగించడానికి సిద్ధపడే అనామకుడు ఇతనూ

అనుకున్నట్టున్నది మీరు. నేను అటువంటివాడనుగాను. మీరు చెప్పిన రాజశేఖర కావ్యమీమాంసనుగురించే ఎందుకు మాట్లాడవలెను నేను? నా ఇచ్ఛవచ్చినవిషయమును గురించే ఉపన్యాసమిస్తాను, రేడియోలో. ఇందుతో, రెట్టమతప్రభావమును గురించిన వ్యాసమును పంపాను. ఈ విషయమునుగురించి రేడియోలో ప్రసంగించడానికి అభ్యంతరము లేదు. ఇటీవల నాకు నరసరావుపేటలో జరిగిన సన్మానమును గురించిన కరపత్రమునూ ఇందుతో పంపుతున్నాను" అని వ్రాశారు. ఆయనవిలువ తెలియక రేడియోవారికి ప్రియమైన అంశాన్నిగురించి ప్రసంగించమని నియమించడానికి సాహసించినందుకు కొన్ని కటువైన మాటలూ అన్నారు మమ్మల్ని ఆయన.

ఆ ఉత్తరము నాకు పంపుతూ డైరెక్టర్ అన్నారు : "ఆయనకు కోపము వస్తుంది. ఆయనపంపిన వ్యాసమును చదివి అదే ఉపయోగించండి, వీలైతే!" అని.

ఆ వ్యాసమును శ్రద్ధగా చదివాను; కాని, తలాతోకా లేక, చేటభారతంగా ఉన్న ఆ రచన మాకు ఎందుకూ పనికిరానిది. త్రిప్పిపంపివేయక తప్పినది కాదు.

తరువాత ఎప్పుడో ఈ ప్రస్తావన రాగా, తెలికిచర్ల వెంకటరత్నము అన్నారు : "మీరు ఎవరినిగురించి చెపుతున్నారో నాకు తెలుసు, వారిపేరు చెప్పకపోయినా. వారికి ఎన్నో బిరుదులున్నవి, వాస్తవమే. కాని నేను ఘంటాపథముగా చెప్పగలను : వారు ఎన్నడూ రాజశేఖరకావ్యమీమాంసజోలికి పోలేదు, ఆ పేరే వారికి తెలియదు!" అని.

కాని, కొందరుమాత్రము చాలా చదువుకున్నవారుకూడా తమకు అంతగా పరిచయములేని విషయాన్నిగురించి రేడియోవారు ప్రసంగము ప్రసారము చెయ్యమని కోరితే మమ్మల్ని అడిగేవారు : "ఈ విషయమునుగురించి నాకు చూచాయగా తెలుసు, ప్రసంగానికి కావలసినంత విపులంగా తెలుసుకోవడానికి మీరేమైనా సలహాలనిస్తారా, ఏవైనా గ్రంథాలను పంపుతారా?" అని. ఆ విషయమై సేకరించిన

గ్రంథాలనూ, సాహిత్యాన్నీ వారి కందించి, వారిచేత చక్కని ప్రసంగమును విని పించేవారముకూడా.

ఈ కోవకుచెందినవారే సర్ వేపా రామేశము. జడ్జిగాను, చీఫ్‌జస్టిస్‌గానూ పేరుపొందిన ఆయన మహాజ్ఞానసంపన్నుడు. గణితశాస్త్రము ఆయన అభిమాన విద్య. కాని, సకలవిద్యాసంపన్నుడు ఆయన. ఆయన తరచిచూడని విషయమే లేదు. ఆయనకూడా ఒక్కొక్కప్పుడు "ఈ విషయాన్నిగురించి ఇటీవల వెలువడిన గ్రంథాలు ఏమైనాఉంటే పంపండి" అనేవారు. వారిని ఒకానొక విషయాన్నిగురించి ప్రసంగించమని మేము కోరితే, ఆ గ్రంథాలను వారికి తీసుకువెళ్ళి ఇచ్చేవాడను నేను. ఆ సమయాలలో ఎంతో చక్కగా ఎన్నోవిషయాలను గురించి ముచ్చటించేవారు, ఆయన నాతో. వారికీ నాకూ కొన్నిదశాబ్దాలు తేడా, వయసులో, అనేమాట మరచిపోయి, ఎన్నోఎన్నో విజ్ఞానవిషయాలనుగురించి చర్చించేవారు నాతో, ఎంతో ఉత్సాహంతో. ఎప్పుడూ నవ్వుతూ పలుకరించేవారు నన్ను ఆయన. ఎప్పుడు వారివద్దకు వెళ్ళినా, నాకోసము కనిపెట్టుకున్నట్టూ, నేను రావడమువల్ల వారికెంతో ఆనందము కలిగినట్టూ తోపించేవారు. చాలా చలాకీగా మాట్లాడేవారు. ఒకసారి నేను కొత్తగాచదివిన ఒక పుస్తకాన్ని పురస్కరించుకొని, "ఇతరగ్రహాలలోనూ మానవులున్నారా ?" అనే విషయాన్నిగురించి మాట్లాడమని కోరడానికి నేను వెళ్లాను, సర్ వేపా రామేశం వద్దకు. నేనుచెప్పిన విషయమును విని ఆయన అన్నారు : "నాకో సంగతి జ్ఞాపకమువస్తోంది. ప్రఖ్యాత వైజ్ఞానికుడు ఒకానొక ఆక్స్‌ఫర్డ్ ప్రొఫెసర్‌ని ఒకరు ప్రశ్నించారట 'ఉత్తరధృవ ప్రదేశంలో పాములున్నాయా?' అని. ఆయన అన్నారట 'మీ ప్రశ్నకు ఒక్కమాటలో సమాధానం చెప్పవచ్చు-లేరు!' అని, అని, నవ్వారట ఆ ప్రొఫెసర్. అలాగ మీరు కోరే రేడియోప్రసంగము ఒక్కమాటలో చెప్పవచ్చు "లేరు!" అని. కాని, పదిహేను నిమిషాల ప్రసంగానికి ఆ ఒక్కమాటా చాలదు. సరే, వ్రాసిపంపిస్తాను, మీకు కావలసిన వ్యాసము!" అని మా ఆహ్వానమును అంగీకరించారు.

వృద్ధాప్యములోనూ, శ్రీ రామేశంగారి బుద్ధికుశలతా క్రొత్తక్రొత్త విషయాలను గురించి తెలుసుకోవాలని విపరీతమైన ఆసక్తీ, అన్నిసంగతులనుగురించీ

ఎంతోఎంతో ఆకర్షవంతంగా మాట్లాడే నేర్పు నన్ను వారిదెసకు మరీమరీ లాక్కు-వెళ్ళేవి. ఆయనతో ఒక గడియ ఉండడమే ఎంతో బలమునిచ్చేది నాకు.

రేడియోనిలయము వెలసిన మొదటి పదిహేనురోజులలోనే మా నాయనగారు శ్రీ ఆచంట లక్ష్మీపతిగారున్నూ ఒకప్రసంగాన్ని ప్రసారముచేశారు, ఇంగ్లీషులో. ఆ ప్రసంగము జ్ఞాపకముండడానికి ఒక ప్రత్యేకకారణమున్నది. వారు చెప్పబోయే మాటలలో ఒకమాటను నేను ఆక్షేపించాను, అందుచేత. ఆరోగ్యవిధులను గురించి వివరిస్తూ నాన్నగారు "న వేగాన్ ధారయత్వా ధీమాన్" అని సంస్కృతంలో వ్రాసి, ఇంగ్లీషువివరణలో వివరించారు ఒకానొక ఆరోగ్యవిధిని. ఇంగ్లీష్‌లో ఆ మాటలు వాడరు నాగరికులు. అందుచేత, ఆ మాటలకు ఎదురుగా గుర్తుఉంచి మా డైరెక్టర్‌కు చూపాను. మా డైరెక్టర్ అన్నారు: "ఏమిటి! అంతవరకూ వచ్చిందీ! తండ్రిరచనలోనే తప్పులుపడతావా! అంత సాహసమా!! వారి రచన దిద్దడానికి వీలులేదు!!" అని. నేను ఏమీ అనలేదు.

కాని, ప్రసంగము ప్రారంభించేముందు నాన్నగారిని రిహర్స్‌చేస్తూ నేను అన్నాను: "ఈ మాటలు సంస్కృతంలో ఫరవాలేదు, ఇంగ్లీష్‌లో అలా అనరు" అని.

నాన్నగారు అన్నారు నవ్వుతూ "అవును! నేను మరచిపోయాను. మీరు అందరూ ఆర్టిస్ట్స్‌కాదూ? నిజమైనా, మృదువుగానూ, సున్నితంగానూ చెప్పాలి కదూ! సరే, నీవు కోరినట్టే ఇలా మారుస్తాను" అంటూ మార్పుజేశారు.

౯

కోమలాంగీ నీ
దివ్యాకారం, నాయెడంద అద్దంలో
ఈ కళ్యాణముహూర్తమా నిశీథంలో
ఆకుల్దొడిగిన పూల మొక్కలా
నిల్చావో కన్యా!
ఈ లోక కఠోరయాత్రలో, నాలో
డోలాందోళిత భీత భావనా జాలం
జాలై, వాగై, వో మహాప్రవాహమై,
నా జాగ్రదావస్థనెల్ల ముంచెత్తి,
నా జ్ఞాన ప్రవృత్తులెల్ల కుంచించి,
నా జీవాన్ని ప్రసుప్తం చేసిన చీకట్ల
నో జవ్వనీ!
పూజా పుష్పాంజలితో విరిశావో
తేజస్వరూపిణి రాణి
తారాజ్వలిత లలితకాంతిమయీ!
శాంతిమయీ!!

మల్లవరపు విశ్వేశ్వరరావు

**మా** బావ, మల్లవరపు విశ్వేశ్వరరావు, తాను రచించిన "కళ్యాణ కింకిణి" పద్యకావ్యాన్ని ఆప్తమిత్రులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి వివాహ శుభసమయాన, వధూవరులకు తన పరిణయోపహారంగా అర్పించాడు. గోపాలరెడ్డి వివా

హం మద్రాస్‌లో మే 8, 1938 ని మహావైభవంగా జరిగింది. తెలుగునాడు నాలుగు మూలలనుంచీ పేరుపొందిన కవులు అందరూ వచ్చారు, పెండ్లికి. కళ్యాణము ఐదు రోజులూ కన్నులపండువగా జరిగింది.

ముహూర్తపురోజుకు మూడురోజులు ముందుగానే కవులు రా నారంభించారు. మంత్రి గోపాలరెడ్డిని చూడడానికి వెళ్ళిన నన్ను ఆయన "రండి! వెళ్ళి, పెండ్లిఏర్పాటులు చూచివద్దాము" అంటూ, విడిదిలోకి తీసుకువెళ్ళారు, తనతో. కవులకోసము ఏర్పరచిన వసతులు ఒకొక్కటీ వివరంగా పరిశీలిస్తూ, వేరువేరు జనాన్ని ఆ యా పనులకు నియోగిస్తూ, అతిథులు ఎవరికీ ఎటువంటిలోపమూ రాకుండా అతిశ్రద్ధగా ఏర్పాటుచేశారు, ఆయన - స్వయంగా ఆయన! కొన్నిగదులలో, అప్పటికే వచ్చి ఉన్న కవులను ఆహ్వానిస్తూ, వారితో కవితాగోష్ఠిలో ఉండిపోయేవారు, గోపాలరెడ్డి - తరువాత ఎన్ని పనులున్నా, ఆ పనులను అన్నిటినీ మరచిపోయి! నేను జ్ఞాపకముచెయ్యవలసివచ్చింది, తరువాత ఈ ముఖ్యమైన పని ఉన్నది, మీకు, అంటూ. అంతటి కవికులపక్షపాతి, గోపాలరెడ్డి !

గోపాలరెడ్డిని నేను మొట్టమొదట శాంతినికేతనంలో చూచాను, 1926, ఆ ప్రాంతాన. కాని, అప్పుడు, ఒకరి నొకరు ముఖాముఖి చూచుకుని, చిరునవ్వులు నవ్వుకోవడమేగాని, చనువుగా మాట్లాడుకోలేదు. మాకు ఆతిథ్యమిచ్చిన గుజరాతీ స్నేహితుడు నన్ను పరిచయముచేశాడు గోపాలరెడ్డికి. "ఇదుగో! ఇతను మీ తెలుగువాడు. కళాశీలి. సాహిత్యంలో మంచి అభిరుచి ఉన్నది, ఇతనికి!" అంటూ. ఒకరినొకరము కన్నులతో పలుకరించుకున్నాము, ప్రక్కప్రక్కనే కూర్చుని భోంచేశాము. నాకు మంచినీళ్ళగ్లాస్ లేకపోతే, తనగ్లాస్ నాకిచ్చాడు గోపాలరెడ్డి. అంతేగాని, ఎక్కువగా ఏమీ మాట్లాడుకోలేదు, అప్పుడు శాంతినికేతనంలో.

తరువాత ఒక పదేళ్ళకు విశాఖపట్నంలో కలుసుకున్నాము, మళ్లా. అప్పటికి ఆయన రాజకీయవేత్త. నా కార్‌లో, వారినీ, వారిస్నేహితులనూ షికారుగా భీమునిపట్నము తీసుకువెళ్లాను, నేను. త్రోవపొడుగునా, శాంతినికేతనము కబుర్లు, మా బావ మల్లవరపు విశ్వేశ్వరరావును - అతనూ శాంతినికేతనంలో

చదువుకున్నవాడే - గురించిన కబుర్లు, అనేక సాహిత్యవిషయాలను గురించిన చర్చా, ఇటువంటి సల్లాపంతో గడిచిపోయింది ఆపూట అంతా.

ఆ తర్వాత, ఆయనఆంధ్రదేశపుపర్యటనలో కొన్నిచోట్ల ఆయనతో కూడా ఉండి, కొందరు కవిమిత్రులను, ముఖ్యంగా వేదుల సత్యనారాయణశాస్త్రినీ, వారిబృందాన్నీ చూచాను. అప్పటినుంచీ ఉండేది, గోపాలరెడ్డికి, నేల నాలుగుచెరగులా ఉన్న కవులను ఒకచోట చేర్చాలనీ, వీరందరిచేతా ఏదో ఒక గొప్ప సాహితీ కృషి చేయించాలనీ.

ఈ వివాహ శుభసమయంలో, వివిధ ప్రాంతాలనుంచీ వచ్చిన కవికుమారులతో కళకళ్లాడుతున్నది, విడిది. వేదికను అత్యద్భుతంగా అలంకరించాడు, అడివి బాపిరాజు. పెండ్లికొడుకుతీవితో ఒకచోట బంగారపు పువ్వుల పావుకోళ్ళలో కాళ్ళు పెట్టుకొని, పడకకుర్చీలో కూర్చుని ఉండిపోలేదు, గోపాలరెడ్డి. ఎక్కడచూచినా అతనే! వచ్చేపొయ్యేవారి సౌకర్యాలను గమనించేది ఆయనే, పెండ్లిపందిరిఅలంకరణ విషయం ప్రతి చిన్నఅంశమూ సరిజూచేది ఆయనే, మాకందరికీ కాఫీ ఉప్మాల ఏర్పాట్లు సరిగాఉన్నదీ లేనిదీ కనిపెట్టేది ఆయనే - మధ్య మధ్య మంత్రిగా తమ ఆఫీస్‌విషయాలూ చూచుకుంటూ ఉండేవారు. ఇలా అన్నిచోట్లా తానే ఉంటూ, మా కందరికీ ఆనందాన్నీ, విస్మయాన్నీ కలిగించారు, గోపాలరెడ్డి.

వివాహపుతంతు ఎంతో శోభాయమానంగా జరిగింది. ఒక విశేషము : ముహూర్తాన్ని చూడడానికి మంత్రిపుంగవులూ, పెద్దపెద్ద ఉద్యోగస్తులూ, ఊరిలోని పెద్దమనుష్యులూ అందరు వచ్చివున్నా, పెండ్లిపీటలకు ఇరువంకలా, ముందు వెనుకా, అతిసమీపంలో కూర్చున్నవారు పెండ్లికుమారుని కవిమిత్రులే! నేను మరీ దగ్గరగా కూర్చుండబట్టి బంగారుబొమ్మ పెండ్లికుమార్తెను కన్నులార చూడగలిగాను. మూర్తీభవించిన పార్వతిలా కనిపించింది నాకళ్ళకు ఆమె. ఆమె ఎంత దాచుకున్నా, తాను మనస్సార కోరినవరుడు తనకు దొరికాడు అనే మహత్తరానందాన్ని కప్పిపుచ్చలేకపోయింది ఆమె, మెరిసే తన కన్నులలో. కాని, ఎంతటి

సౌమ్యత! ఎంతటి సౌశీల్యత! ఎంతటి సౌకుమార్యము!! ఆ పెండ్లికుమార్తెను తలచుకొనినపుడల్లా, నాకు, వికసిస్తూ వికసిస్తూన్న ఉదారంగు చంద్రకాంతపు పువ్వు జ్ఞాపకంవస్తూఉంటుంది - అదే లావణ్యము, అదే లాలిత్యము, అదే ముగ్ధత్వము ఆమెలో.

వధూవరులను ఆశీర్వదిస్తూ విశ్వనాథ సత్యనారాయణ తమ గోపాలోదాహరణమును చదివారు. 'ఉదాహరణ' కావ్యమును ఇదివరకు నేను ఎరుగను. చాలా శ్రద్ధగా విన్నాను, కవి తన సహజగంభీరస్వరములో తనకావ్యాన్ని చదువుతూంటే. తరువాత జరిగిన కవిసమ్మేళనములో ఒకొక్కకవీ,తనరచనలను చదివి వినిపించారు. రేడియోఆఫీస్‌నుంచి తిన్నగా ముహూర్తసమయానికి వెళ్ళిన నేను నా ట్వీడ్‌కోట్‌లోపలి జేబులోంచి కాగితాన్నితీసి, నారచనను చదివాను. ఇంగ్లీష్‌లో రచించినది. ఆ రచన చివర ఇలా నడుస్తుంది :

perfumed bowers,
ardent lovers,
making vows,
eternal loves !

ఆ మహాసభలో అందరు తెలుగుకవుల మధ్య అలా సాహసించి, నేను నా ఇంగ్లీష్‌రచనను చదివినందుకో, నాయందలి అపారమైన వాత్సల్యమువల్లనో సభాసదులందరు చప్పట్లుకొట్టారు. ఆ చప్పట్లకు బెదిరి, నేను తలవంచుకుని వచ్చివేస్తూంటే గోపాలరెడ్డి చేయి చాచి, నా చేతిలోని కాగితాన్ని అందుకొని ఆ నా రచనను భార్యచేతిలో ఉంచారు!

నిజమైన కవిహృదయము గోపాలరెడ్డి హృదయము. ఎన్ని ముఖ్యమైన పనులున్నా కవిత్వానికీ, కళలకూ ఆయన మొదట అవకాశమిస్తారు. ఏ పదవిని అలంకరించినా, ఏ హోదాలోఉన్నా ఆయనకు కవితారాధనా, కళాపోషణా మొదటి వ్యాపకములు. రవీంద్రునిఅంశ ఆయనలో పూర్తిగా మూర్తీభవించినదో ఏమో, హనుమంతుణ్ణి రామనామస్మరణ ఎంతగా తన్మయుణ్ణిజేస్తుందో, అంతటి

ఆనందమూ, అంతటి ఆసక్తీ కలుగజేస్తుంది రవీంద్రప్రస్తావన గోపాలరెడ్డిలో. రామాయణగాథ వినిపిస్తూన్న ప్రతిచోటా హనుమంతుడు పరోక్షంగా అవతరించి ఉంటాడు అంటారు; అల్లాగే, ఎక్కడెక్కడ రవీంద్రసంకీర్తనము జరుగు తూన్నా, అక్కడే ఉంటారు గోపాలరెడ్డి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో. అంతటి ప్రీతి, వారికి, రవీంద్రుని దెస!

కాని, వంగభాషయందలి అపరిమితమైన ప్రీతివలననో ఏమో, గోపాల రెడ్డి తెలుగురచనలో మాత్రము, పదేపదే వంగభాషచ్ఛాయలు ధ్వనిస్తూఉంటాయి. కనబడినపుడల్లా, తన క్రొత్తరచన ఒకటి నాచేత ఉంచుతూ ఉంటారు గోపాల రెడ్డి. కాస్త తీరికఉంటే, తాను రచించిన ఒక క్రొత్తవర్ణన వినిపిస్తూ ఉంటారు, నాకు. ఊర్వశి ఆయనకు అభిమానవ్యక్తి. ఊర్వశిని గురించి ఆయన చదువుతూఉంటే రవీంద్రుడే తెలుగులో చదువుతున్నారా అనిపిస్తుంది. ఏదో వర్ణ నాతీతమైన గంభీరత, ఎన్నటికీ తరుగని సౌందర్యపిపాస ద్యోతకమవుతవి, ఆ వర్ణనలో. ఇట్టే ఊపివేస్తుంది, మనలను ఆ భావగరిమ, ఆ మాటలధ్వని. కాని, సాంతమూ విని, నే నంటాను: "అద్భుతంగా ఉన్నది! అద్భుతంగా ఉన్నది!! కాని, ఈ రచనే చక్కనితెలుగులో సాగితే, మరింత హృద్యంగా ఉంటుందేమో!!" అని. చిరునవ్వు నవ్వుతూ అంటారు గోపాలరెడ్డి "నాకు తెలుసు, శిష్టవ్యవహార భాషాప్రియులు మీరని! కాని, భాష ఒక మహాప్రవాహంవంటిదని మీరే అంటారు కదా. ఎన్నో ఎన్నో నదులూ, ఉపనదులూ కలుస్తూంటవి ఆ ప్రవాహంలో, నా యీ రచనాపద్ధతీ ఒకఉపనది అనుకోరాదూ - ఇదీ ఉండనివ్వండి!!" అని.

మంత్రి గోపాలరెడ్డి ఇంటికివెళితే, ముందుగా మనము చూచేది వారిని కలుసుకోవడానికి వేచియున్న నలుగురైదుగురు కవిపుంగవులూ, ఇద్దరు ముగ్గురు నాట్యకళాకోవిదులూను. పరిపాలనాసంబంధమైన కార్యకలాపము జరుగుతూనే ఉంటుంది. కాని, అతిముఖ్యమైన ఆనాటిపభుత్వపు కాగితాలను పరిశీలిస్తూనే, మధ్య మధ్య, కాస్త విరామము కల్పించుకొని, ఈ కవులనూ ఈ నాట్యకళావేత్త లనూ తమ సమక్షానికి పిలిపించుకుని, వారు వచ్చినపని ముందు గమనించి, పంపి

వేస్తారు, వారిని. ఏ పనీలేకుండా, ఊరికే వారిని చూచివెళదామనీ వచ్చిఉంటారు కొందరు కవికుమారులు. వీరి రాక తెలిసి, ఎంత చప్పున తన ఆఫీస్‌పని ముగించుకుని వీరి మధ్యవచ్చి వ్రాలవచ్చా అని చూస్తూంటారు గోపాలరెడ్డి!

ఒక పర్యాయం ఆయన మద్రాస్‌లో మంత్రిగా ఉండగా,-ఆ రోజంతా రాజకీయవాతావరణ "విద్యుత్‌మయమై" ఉంది, ముఖ్యమంత్రి ఎన్నిక విషయంలో- నేను పూర్వము చదువుకున్న అడయార్ బిసెంట్ స్కూల్ హెడ్‌మాస్టర్ నాకు ఫోన్‌చేశారు: "నిన్నటినుంచి ప్రయత్నిస్తున్నాము మేము శ్రీ గోపాలరెడ్డితో టెలిఫోన్‌లో మాట్లాడడానికి, వారు మాకు అందడములేదు.... ఈరోజు విజయదశమి. మా తెలుగు విద్యార్థుల సంఘపు వార్షికోత్సవము. ఈ ఉత్సవమును శ్రీ గోపాలరెడ్డి జరిపించాలని పిల్లలందరూ చాలా ఆసక్తితో ఉన్నారు. నీ వెల్లాగైనా వారిని తీసుకు రాగలవా? తప్పకుండా తీసుకురావాలి, మరి!" అని.

వింత ధైర్యముతో, నేను: "సరే! ప్రయత్నిస్తాను, మీ ఏర్పాటులో మీరు ఉండండి!" అన్నాను. వెంటనే నా కార్‌లో తిన్నగా మంత్రిగారి భవనానికి వెళ్ళాను. నేనూ వారి బంగాళా ఆవరణలో ప్రవేసించానూ, నా ఎదురుగా గోపాలరెడ్డీ, కుమారస్వామిరాజా మెట్లుదిగి వస్తున్నారు. కార్ ఒకప్రక్క ఆపి వారిని సమీపించాను, నేను. తమ కార్‌లో ఎక్కబోతూ, నన్ను జూచి, ఆగి, కుమారస్వామిరాజా నన్ను కుశలప్రశ్న లడిగి, నా నమస్కారమందుకుని వెళ్ళిపోయారు. చిరునవ్వు నవ్వుతూ, నా భుజముపై చేయివేసి, గోపాలరెడ్డి అడిగారు నన్ను: "ఏమి, చాలా తొందర పనిమీద వచ్చినట్టున్నారే-ముందుగా తెలియజేసే వాడుక, మీకు, ఉన్న పళాన వచ్చినట్టున్నారు. ఏమి విశేషము?" అన్నారు.

"విశేషమే! మా బిసెంట్‌స్కూల్ పిల్లలు విజయదశమి ఉత్సవం చేసుకుంటున్నారు. ఆ ఉత్సవం మీరు స్వయంగా జరిపించాలని ఆసక్తితో కనిపెట్టుకున్నారు. నిన్నటినుంచి మీ దర్శనంకోసం ప్రయత్నిస్తున్నారట, హెడ్‌మాస్టర్." అన్నాను, నేను.

"అల్లాగా! నాకు తెలియనేలేదు. ఐతే, వెంటనే వెళదాము పదండి! నా కార్ రావడానికి ఆలస్యమవుతుంది, మీ కార్‌లోనే వెళుదాము." అంటూ ఆయన తన గుమాస్తాను తన ఖండువా తెచ్చిపెట్టమని నా కార్‌లో వచ్చి కూచున్నారు.

త్రోవలో చెప్పారు, గోపాలరెడ్డి, కుమారస్వామిరాజా ముఖ్యమంత్రి కాబోతున్నారనీ, ఆ విషయం చెప్పడానికే తమవద్దకు వచ్చారనీ, సాయంత్రము ఆరుగంటలకు తానూ రాజభవన్‌కి వెళ్లాలనీ.

కాని, పిల్లలగుంపులో చేరిన వెంటనే రాజకీయ ప్రపంచకాన్ని పూర్తిగా మరచిపోయారు ఆయన. ఆ వాతావరణం ఆయనకు శాంతినికేతనాన్ని జ్ఞాపకము చేసిందో ఏమో, ఎంతో ఆప్యాయంతో, ఎంతో ఉత్సాహంతో, పిల్లలతో కలసి పోయారు ఆయన. పిల్లలు రవీంద్ర గీతావళి పాడుతూంటే తానూ వారితో కలసి కంఠమెత్తి పాడసాగారు. తరువాత, రవీంద్రుని బహుముఖమైన ప్రతిభనుగురించి వర్ణించి చెపుతూ అల్లాగే ఉండిపోయారు ఆయన, ఆ పిల్లలతో. "రాజ్‌భవన్‌కు వెళ్ళేవేళ ఐంది. మీ కార్ వచ్చిఉన్నది" అని నేను చెప్పేవరకూ ఆయనకు ఈ నిత్యప్రపంచకపు ధ్యాసేలేదు-అంతగా కలసిపోయారు ఆయన, అమాయకులైన బాలబాలికలతో, కళకళ్లాడుతూన్న ఆ వాతావరణలో!

....ఈమధ్య నేను గోపాలరెడ్డిని కలుసుకొన్నది బెజవాడ రైల్ స్టేషన్‌లో. నేను దిగుతూన్న రైలు ఎక్కుతూ నా కంపార్ట్‌మెంట్‌వద్దకు వచ్చారు, ఆయన, నన్ను పలుకరించడానికి. కాని, ప్రయాణపుతొందరలోఉన్న ఆయనతో ఎక్కువసేపు మాట్లాడలేకపోయాను, నేను. ఈ కించ పోగొట్టుకునేందుకు నేను ఆయన మళ్లా ఈవేపువచ్చే రోజూ సమయమూ కనిపెట్టి, స్టేషన్‌లోనే వారిత్రోవ కాశాను, రెండు చేతులతో ఇన్ని కలువపువ్వులతో.

కలువపువ్వులను అందుకుంటూ, గోపాలరెడ్డి అన్నారు: "ఇవి కలువ పువ్వులు. మీ చేతిలో ఎప్పుడూ ఉండేవి తామరపువ్వులుగా, మరి?" అని, ఆశ్చర్యంతో. మళ్ళీ, అన్నారు: "కాని, కలువలూ చాలా బాగుంటాయి. ఎంత మృదువుగా ఉన్నవి రేకులు! ఎంత చల్లగా ఉన్నవి!!" అంటూ పువ్వులను తన ముఖానికి

అద్దుకున్నారు మరీ మరీ. ఆయన ముఖమంతా పుప్పొడి అలమికొన్నట్లు తెలియదు ఆయనకు!

కార్ ఎక్కుతూ అన్నారు, గోపాలరెడ్డి: "మరచిపోకండి! రవీంద్ర జయంతి వస్తోంది. అప్పటికి నేను మద్రాస్ వస్తున్నాను. మనము చేయవలసినపని చాలా ఉన్నది!!" అని.

నేను అన్నాను: "అవును, ఆ రోజున మీరు రవీంద్రప్రశస్తిని గురించిన రేడియో ఇష్టాగోష్ఠి ఉపక్రమించాలి-మరచిపోకండి! పట్నంలో కలుసుకొంటాను మిమ్మల్ని" అని, సెలవు పుచ్చుకున్నాను.

తరువాత, గోష్ఠి చాలా గొప్పగా జరిగింది. రవీంద్రుని గురించి తాను ఆవేశపడటమేగాకుండా చెంతనున్నవారిలోనూ విపరీతమైన ఆసక్తి కలిగిస్తారు, ఆయన. నిజానికి, ఎంత గొప్పగా ప్రసరించినదీ మన భాషపైన రవీంద్రుని ప్రభావము! ఇన్నేళ్ళనుంచీ వెలువడుతూన్న మన భావగీతికలలోనూ, సౌందర్యాన్ని గురించిన మనవారి వ్యాసాలలోనూ, ఆధునికుల తత్త్వవిచారచింతలోనూ ఎంతగా ప్రతిబింబిస్తున్నాడు, రవీంద్రుడు! సువ్యక్తంగానో, అవ్యక్తంగానో, రవీంద్ర బోధన కనిపించకుండా ఒక్కమాట అనలేరు శిష్టులు, ఈనాడు, మనవారిలో.

రాయప్రోలు సుబ్బారావు తృణకంకణము, ఇంకా అంతకు ముందు అబ్బూరి రామకృష్ణారావు రచనలు మొదలుకొని ఈనాటి భావకవుల రచనలు అన్నిటిలోనూ రవీంద్రుని ఛాయలు కనిపిస్తూనే ఉంటాయి. మన కథానికలు, మన సారస్వత వ్యాసాలు, మన సౌందర్య చర్చ-అన్నిటిలోనూ రవీంద్రుని ప్రభావము కనిపిస్తూనే ఉంటుంది.

పూజా శిరీషము లేరుకొంటిమి
పోయివచ్చెద, జవ్వనీ!
తేజోవిలీన దృగంచలమ్ముల
తేరిచూచెద వెవ్వనీ!!

## సాగుతున్న యాత్ర

అనే అబ్బూరి రామకృష్ణారావు రవీంద్రుని అడుగుజాడలలోనే నడుస్తున్నారు. దేవులపల్లి కృష్ణశాస్త్రిని విపరీతంగా ఉత్తేజపరచినదీ, ఈనాటికీ అతని అంతర్వాణిని పలికించేదీ రవీంద్ర భావనాబలమే! ఇందుకు కృష్ణశాస్త్రి గర్విస్తున్నాడు కూడా:

"ఈ కుటీర ముఖద్వార
మిందే వ్రేలాడి సగము
వాడి విరహాతోరణమ్మునై..."

అంటాడు, రవీంద్రుడు కృష్ణశాస్త్రి కంఠముతో.

వేదుల సత్యనారాయణశాస్త్రి కవిత కొంతవరకు నిరాశతో నిండి ఉంటుంది. కాని, రవీంద్రస్పర్శ తగిలేసరికి తప్తకాంచనంలా మెరిసిపోతుంది:

ఆమె నవనీతహృదయ; నా అంతరంగ
శాంతిదేవత, ఆశాపథాంతరాళ
పారిజాతమ్మ, ప్రేమజీవనవిభాత
కైశికీగీతి, నా తపఃకల్పవల్లి!

దివ్య స్త్రీమూర్తిని ఇంత హృదయపూర్వకంగా ఆరాధించడము మనకు నేర్పినది రవీంద్రుడే!.........

ఓ ప్రభూ! నీ రథము దీప్తా ప్రణీత
విధుర వేగమ్ము పరువులు పెట్టుచుండె
నా శరీరమ్ము దానిక్రిందబడి నలిగి
నలిగిపోయినయది రక్తనదము లింకి.
దివ్య తేజోవిరాజత్త్వదీయ రథము
ఈ గతుకు జేమియనియైన నాగలేదు;

## సాగుతున్న యాత్ర

నా విరోధించిన హతాన్ని నాదమునకు
వెనుదిరిగియైన మరి చూచుకొనగలేదు.
నాదురక్తంబు నీ రథచోదకుండు
కడిగివేయును రేపు చక్రములనుండి,
అచటి బహుజన రక్తచిహ్నములయందు
నాది యిదని గుర్తేమి కన్పడును స్వామి!

విశ్వనాథ సత్యనారాయణ చెప్పిన ఈ కవితలో అంతర్వాహినిగా రవీంద్ర సరస్వతి నాట్యమాడుతున్నదనడము సాహసము కాదేమో!

తెనుగువారి ఇంటింటా రవీంద్ర ప్రసక్తి ఉంటుంది, తప్పకుండా-ఏదో ఒక రూపంలో. రవీంద్రునియందలి విపరీతమైన అభిమానమువల్లనే పిల్లలకు రవీంద్రుని పేరు పెట్టుకుంటారు. నిజానికి, తెలుగునాట తిలక్‌లూ, గోఖలేలూ, గాంధీలూ, ఇటీవల జవహర్‌లూ, ఉన్నా, వారి సంఖ్యకంటె, "రవీంద్రు"ల సంఖ్యయే ఎక్కువ. ఎంతో దూరము వెళ్ళనక్కరలేదు: మా ఇంట్లోనూ అంతే. 1910లో అనుకుంటాను-మద్రాస్‌లో ఉండగా, మా మేనత్తకు తొలిచూలుగా కొడుకు పుట్టాడు. పొత్తిళ్ళలో ఉన్న పురిటిపాపను "ఇదిగో! నీ కొక కొత్త బావ!" అంటూ నా చేతి కందీయగా, నేనన్నాను: "ఇతనిపేరు రవీంద్రనాట్ ఠాకూర్"అని. నేను పెట్టిన పేరు అలాగే ఉండిపోయింది. తరువాత, వాళ్ళ ఊరువెళ్ళి, పేర్రాజు అని నామ కరణంచేశారట. లోకవ్యవహారరీత్యా ఆ పేరు కాగితాలలో ఉన్నా, అందరూ అతనిని టాగూరూ! అని పిలుస్తారు. ముఖ్యంగా, అతని తల్లిదండ్రులూ తమ్ములూ చెల్లెళ్లూ అతనిని టాగూరూ అనో, రవీంద్రనాథ టాగూరూ అనో పిలుస్తూఉంటారు.

ఇలాగ ఎందరి తెలుగు కుటుంబాలలోనో నిలచిపోయింది రవీంద్రుని పేరు. ఇక రవీంద్రనిలయము, రవీంద్ర సారస్వత సమాజము, రవీంద్ర నాట్య బృందము-ఇవి లేని ఊళ్ళే లేవు, తెలుగునాట!

పేర్లుపెట్టే విషయంలో, మరీ నవనాగరికులు తమ ఆడపిల్లలకు రవీం

ద్రుని సుప్రసిద్ధ రచనలలో వారు చదివిన అమ్మాయిల పేర్లు పెట్టుకుంటారు. నళిని, హేమనళిని, మాలిని, ఆశాలత, చిత్ర, వాసంతి-ఇవన్నీ రవీంద్ర సాహిత్యాన్ని అలంకరించిన వారి పేర్లే!

మన ఇళ్ళలో ఎచ్చటెచ్చట సారస్వతాభిలాష తాండవిస్తుందో, ఎచ్చటెచ్చట సౌందర్యపిపాస వ్యక్తమవుతుందో, ఎచ్చటెచ్చట విశ్వమానవ సౌభ్రాతృత్వము వెల్లివిరుస్తుందో అచ్చటల్లా, రవీంద్రుడు అమరజీవియై అలంకరిస్తున్నాడు, మన నిత్యజీవితాన్ని.

౧౦

స్వచ్ఛాంగీ నవమార్జనా దసిలతే
నోల్లాసితా స్వాత్మనా
జ్యోత్స్నాంపూరవిపాండరాంబరధరా
రాత్రి ర్యథా శారదీ
బిభ్రాణా తరపల్లవేన కబరీ
మార్ద్రాం మియం దృశ్యతే
శ్రీః శృంగారసుధాపయోధిసలిలా
దభ్యుత్థితే వాపరా.

శ్రీ పాకాల వెంకట రాజమన్నార్ రచించిన "దయ్యాల లంక" నాటికలో పుచ్చపువ్వులాంటి వెన్నెలలో చలపతిరావు వల్లిస్తాడు, ఈ శ్లోకాన్ని తన మరదలు సుధ ఎదుట. ఇక్కడనుంచే నాటిక విషాదాంతముగా పరిణమిస్తుంది. అంతటి వెర్రిఆనందానికి పర్యవసానం మరి విషాదమేగా!

ఆల్ ఇండియా రేడియో మద్రాస్ కేంద్రము ప్రదర్శించిన మొదటి సాంఘిక నాటకము దయ్యాలలంక. అప్పటికి రాజమన్నార్ ఇంకా "వృద్ధిలోకి వస్తూన్నయువవకీల్" మాత్రమే. కాని, అప్పటికే ఆయన నాటకరంగంలోనూ, సాహిత్య ప్రపంచములోనూ మంచిపేరు సంపాదించుకున్నారు. నీలంరాజు వెంకటశేషయ్యా ఆయనా కలసి "నాట్యకళ" అనే చక్కని పత్రికను నడిపారుకూడా, కొన్నాళ్ళు. చాలా ఉత్తమస్థాయిని నడిచింది ఆ పత్రిక; కాబట్టే, ఎక్కువకాలం సాగలేదు. సాగిననాళ్ళుమాత్రము సర్వాంగసుందరంగా, కన్నులపండువుగా, ఎంతో జ్ఞానదాయకంగా ఉండేది, నాట్యకళ.

దయ్యాలలంక నాటిక రాజమన్నార్ ఉత్తమ నాటికలలో ఒకటి. చలపతిరావూ భార్య లక్ష్మీకాంతమూ-వీరి దాంపత్యము అనుకూలదాంపత్యమే అయినా

వారి ఆశయాలలో తేడా ఉంది. చలపతిరావు సున్నితహృదయుడు. మిక్కిలి ఆర్ద్రస్వభావము గలవాడు. కొన్ని కొన్ని విలువలను శ్రద్ధతో పాటిస్తాడు. లక్ష్మీ కాంతమ్మకు అంతటి ఉదారస్వభావము లేదు. పూర్వాచారపద్ధతులకు కట్టుబడిన ఆమె దృష్టి ఆమె ధోరణీ ఆతీరుననే ఉంటవి. ఆమె చెల్లెలే సుధ-బాలవితంతువు, పాపము! కాని, మంచి చలాకీగల పిల్ల. మేఘసందేశకావ్యాన్ని చదివి ఆనందింప గల భావనాబలమూ, అనుభవింపగల యోగ్యతాకల సుకుమారి. పువ్వులంటే వెర్రి ప్రీతి ఆమెకు. కాని, ఆచారానికి బానిసఐన ఆమె అక్కకు సుధ పువ్వులుపెట్టు కోడము చేయకూడని పని. ఆమెకు ఏమాత్రం ఇష్టము ఉండదు. చెల్లెలు తలలో పువ్వులు ముడువరాదని అక్క తీవ్రంగా శాసించడమూ ఆమె సుధతలలోని పూల గుత్తిని బలవంతంగా లాగిపారవెయ్యడమూ చూచిన చలపతిరావుమనస్సు చివుక్కుమంటుంది. ఇదే నాటికకు కీలకము.

చలపతిరావూ భార్యా, మరదలూ, మామగారూ ఉల్లాసంగా గోదావరినది పైన పడవషికారుకు వెళుతారు. ఆ పిల్లల మేనమామకూడా వస్తాడు, వారితో సర దాగా. ఉన్నట్లుండి గాలిదుమారము వచ్చి, వారు ఆ రాత్రికి గోదావరిలంకలో ఉండి పోవలసివస్తుంది. ఈ లంకపేరే దయ్యాలలంక. కాని, దయ్యాలలంకకు ఇంకా విశాలమైన అర్థమున్నది. రచయిత దృష్టిలో, మంచి చెడ్డలు పాటింపక, మూఢ విశ్వాసాలకు ఆకరమైనసంఘమే నిజమైన దయ్యాలలంక. గోదావరిలోని లంకలో ఆరాత్రి ఉండిపోయినవారిలో తతిమ్మావారంతా అలసిపోయి నిద్రిస్తుండగా సహృద యులూ, సమానఅభిరుచులూ, పరస్పరసానుభూతీగలవారైన చలపతీసుధా మాత్రం వెన్నెలలో కూర్చుని, చంద్రబింబాన్ని అల్లాగే చూస్తూ ఉండిపోతారు. హఠాత్తు రాత్రై, అంతవరకూ చీకటితోడుగా బ్రతుకుమోస్తున్న సుధ అభాగ్యపుజీవితము లోకి ఒక్క ముహూర్తకాలము పండువెన్నెల ప్రసరిస్తుంది. కాని, ఈ మహత్తరా నందాన్ని భరించలేదు ఆ వెర్రిపిల్ల. అంతటి గొప్ప అనుభూతిని పొందినపిదప, ఆమె మళ్లా మామూలు ప్రపంచకాన్ని చూడలేదు. నిద్రపోతున్న చలపతిని విడిచి పెట్టి, తనవారిని అందరినీ విడిచిపెట్టి గోదావరిలో కలిసిపోతుంది సుధ. ఈ త్యాగము తప్పనిసరి.

## సాగుతున్న యాత్ర

ఈ గాధ చాలా చక్కగా ప్రదర్శితమైనది రేడియోనాటికలో. సంభాషణ ఇంపుగా సాగింది. వాతావరణా చక్కగా కుదిరింది.అక్కగా కొమ్మూరి పద్మావతి ఆ భావాలను చాలా అందంగా ప్రకటించారు. చెల్లెలిపైన అక్కకు ఉండవలసిన ప్రేమను క్రమ్మివేసే పూర్వాచారపరాయణత్వాన్ని చక్కగా నిరూపించారు పద్మావతి. బాలవితంతువును అదుపులో పెట్టాలి అనే యత్నము సహజ ప్రేమను కూడా మరపించింది అన్నమాట! తన పాత్రను చక్కగా రాజమన్నార్ ఊహించి సృష్టించిన భూమికకు చక్కగా జీవంపోసింది వసంత. ఈ పాత్రనిర్వహణ చాలా కష్టం. ఈ నిమిషము, అథమూ, శుభమూ తెలియని బాలికలా చిలిపిమాటలతో నవ్వించాలి. వెంటనే, బాలవితంతువగుటవల్ల తాను పడుతూన్న వ్యధను ప్రకటించాలి. ఆ చలాకీమాటలూ, అక్కను విసిగించే కొంటె పలుకులూ చక్కగా విసిరింది వసంత. బావతో సంభాషణలోనూ, ఎంత ఉత్సాహండున్నా పైకి ప్రకటించకుండా ఉండాలనే ప్రయత్నమూ అప్రయత్నంగా,కొన్నిచోట్ల అపరిమితమైన సానుభూతిని చూపుతూ, అంతులేని సానుభూతిని కోరుతూ, మాట్లాడివేయడమూ, చాలా సహజంగా నిరూపించింది వసంత.

ఈ నాటకంలో కొంత అప్యాయత కలిగించే పాత్రగా ఈ పిల్లల మేనమామ వస్తాడు. కొంత హాస్యరసానికి తావుకలిపిస్తారు రాజమన్నార్, ఈ పాత్ర ద్వారా. కాస్త నత్తికూడా ఉంటుంది "మామయ్యకు". పడవప్రయాణానికిముందూ, లంకలోనూ, మామయ్య చాలా నవ్వు తెప్పిస్తూంటారు. అంతేకాక, బాలవితంతువు దురవస్థను అర్థంచేసుకుని, అక్కగారు ఆమెదెస కఠినంగా ప్రవర్తించినప్పుడల్లా చెల్లెలిని కొంత వెనుకవేసుకువస్తూ ఎంతో జాలి కలిపిస్తారు. ఈ పాత్రను గాడేపల్లి శంకరము చాలా బాగా నిర్వహించారు. ఆయన కంఠస్వరమూ, మాటల ధోరణీ మూడుమూర్తులూ ఆ మామయ్యకు సరిపోయినవి.

రాజమన్నార్ సంభాషణలు ఎంతో భావగర్భితముగా అమరి, ఆయన అందింపవలసిన సందేశాన్ని అతిసూటిగా అందిస్తాయి.

తలనిండా పువ్వులతో ఎదుటనిలచిన సుధను చూచి, అక్కగారు అంటుంది: "ఒసే, ఈ అన్యాయము ఏమిటే!! ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు?"

సుధ : ఏమనుకుంటారు? అదీన్నీ పాపమేనా?

లక్ష్మి : అవును, అసలలా జుత్తు ఉంచుకోవడమే తప్పు. చిన్నదానివే అని జాలి పడి నాన్న తీసేయించలేదు. పైగా పువ్వులుకూడానా?

సుధ : అబ్బ! ఎందుకే నన్ను బాధపెడతావు? నాకు పువ్వులంటే ఇష్టము. పోనీ, ఎవరు చూస్తారు? ఇంట్లో నాన్నా, సుప్వూ, మామయ్యా, బావయ్యా-అంతేగా?

లక్ష్మి : (ఎందుకో తటాలున) తీసేస్తావా లేదా?

అక్కగారు చెల్లెలిజడలో పువ్వులు లాగిపారవేస్తూండగా, బావ చల పతిరావు ప్రవేశిస్తాడు. నీరుగ్రమ్మిన కళ్ళతో సుధ అవతలకు వెళ్ళిపోతుంది. చల పతిరావు హృదయం కరిగి నీరవుతుంది. ఈ సంఘటనను అర్థంచేసుకుని, అతడు భార్యను మందలింప యత్నిస్తాడు.

....పడవషికారు మాటవచ్చి, సుధ అంటుంది, నదిలోపల నీటిని దూసు కుంటూ పడవ వెడుతూండే దృశ్యాన్ని భావించుకుంటూ:

"బోటు సర్రుమని వెడుతూంటే గోదావరిహృదయాన్ని చీల్చుకొని పోతున్నట్టు ఉంటుంది కాదూ! అయితే, వెంటనే ఒక్కమరకైనా కనపడదు. ఎన్ని దెబ్బలైనా తన కెరటాలతో కప్పివేసుకుంటుంది."

ఈ మాటలు చాలా చక్కగా చెప్పేది, వసంత, రాజమన్నార్ ఉద్దేశిం చిన "ధ్వని"ని పూర్తిగాప్రకటిస్తూ. జరుగుతున్నది నాటకమేఐనా, నేను కేవలమూ నాటక నిర్వాహకుడనే ఐనా, రిహర్సల్స్‌లో ఆమె ఆ మాటలు అలా అంటూఉంటే చాలా బాధ అనుభవించేవాడను, నేను.

లంకలో, వెన్నెట్లో కూర్చుని, చలపతిరావు తను వెన్నెలను వర్ణిస్తూ శ్లోకము వల్లించాక, ఆ తర్వాత సుధనుకూడా, పాటపాడమని బలవంతముచేస్తాడు. ఆమె సందేహిస్తూ ఉంటే అతనంటాడు:

చలపతి : వింటే, మనవాళ్లేమైనా అనుకుంటారని భయమా?

సుధ : భయమా? ఏమీలేదు. ఈ లంకమీద నాకేమీ భయములేదు. ఎవరన్నా భయము లేదు. అదో ప్రపంచము-ఇదో ప్రపంచము.

ఆ వాతావరణ అందాన్ని అనుభవిస్తూ సుధ అంటుంది:

సుధ ; అబ్బ! ఈరాత్రి ఇలాగే ఉండిపోకూడదూ?....ఇలాగే, లంకలో ఉండిపోతే?

చల : నిజంగా! మళ్లా ఊళ్లోకిపోవాలని ఇష్టముండదా?

సుధ : నిజంగా నాకుండదు!

చల : సుధా! మేలుకునే కలుపరిస్తున్నావు!!

సుధ : నేనా! నేనా కలువరిస్తున్నది!! బాగా చెప్పారు, మీరు కలువరిస్తున్నారు, ఊరు ఊరంటూ!!

చల : ఎందుకూ నీకు ఊరంటే అంతవైరము?

సుధ : ఊరిలో అందరూ దయ్యాలు.... ఈ 'దయ్యాలలంకే' నాకు ఆనందంగా ఉంది!....

తరువాత సాగిన ఆప్యాయమైన సంభాషణకు అనుగుణంగా చలపతి రావు చలించినవాడై భౌతికంగా తన ప్రేమను ప్రకటింప ప్రయత్నిస్తాడు. అతనిని వారిస్తూ అంటుంది సుధ: "వద్దు! వద్దు!! నన్నొక క్షణంలో చంపివెయ్యకండి!!.... అప్పుడు మనము ఇక్కడే ఉండిపోవాలి! మళ్లా ఆ దయ్యాల ఊళ్ళోకి వెళితే ఎలా బ్రతకడం!!"-అని.

ఈ నాటికను నేను రంగస్థలముపైన చూడలేదు. రంగస్థలముపైన ఎలా ఉంటుందోగాని, ఆ రాత్రి రేడియోలో మాత్రము చాలాచాలా రసవంతముగా పరిణ

మించినది. ఈ సంభాషణకు అనువైన నేపథ్యసంగీతమూ అందంగా వినిపించ డమువల్ల మరింత ఉద్దీపితమైనది, భావప్రకటన.

నాటకము కడపటిరిహార్సల్ పూర్తిఅయ్యి, ప్రసారానికి ఇంకో ఇరవై నిమిషాలు ఉన్నదనగా, నాకొక ఆలోచన తట్టినది. రాజమన్నార్ తమ నాటికలో సుధ నదిలోపడిపోవడము సంగతి పడవవాళ్ళచేత చెప్పిస్తారు. తెల్లవారాకకాని, ఆమె నదిలో ఉరికి, ప్రాణత్యాగము చేసికొన్నట్టు చూపరు. స్టేజిమీద అటువంటి సంఘటనలు చూపడమూ కొంచెము కష్టము. కాని, ఆఖరి రిహార్సల్‌లో నాకు తోచింది, ఈ సంఘటన రేడియోలో చక్కగా నిరూపింపవచ్చు, తద్వారా నాటకము మరింత రక్తిగడుతుంది, అని. వెంటనే కాగితముతీసుకొని ఒక్క ఆరు చిన్న చిన్న వాక్యాలు సుధ ఒక్కర్తే చెప్పే మాటలుగా వ్రాశాను. చలపతిరావును వదలి శూన్యహృదయంతో సుధ నదిని దరిసినట్టూ, ఆ సమయానికే కారుమేఘాలు ఆకాశాన్ని అలముకున్నట్టూ, మొదట గోదావరి కెరటాలను చూచి ఆమె బెదిరి నట్టూ, దూరాన ఎక్కడో అవతల ఒడ్డున సాగిపోతున్న పడవలోని దీపము మిణుకుమిణుకుమంటూ ఆ చీకటిని ఛేదించుకుంటూ ఆమెను పలుకరించినట్టూ, అంతట "అదుగో వెల్తురు! నాకేమి భయము!!" అంటూ వింత ధైర్యముతో ఆమె నదిలోకి నడిచివెళ్ళిపోయినట్టూ, "అమ్మా! గోదావరీ!! నన్ను నీకడుపులో దాచుకో! తల్లీ!!" అనే ఆర్తనాదముతో ఆమె నదిలో మునిగినట్టూ స్ఫురింపజేస్తూ వ్రాశాను, నేను. స్టూడియోలోకి వెళ్ళబోతున్న వసంతను ఇవతలకుపిలచి "అమ్మాయీ! ఇవిగో మరికొన్ని పంక్తులు, సుధ ప్రత్యక్షంగా నదిలోపడిపోయి నట్టు నిరూపించాలి మనము, ఈ నాటకంలో. "నీవు నదిలోపడాలి! ఏదీ, చదువూ!" అన్నాను, కాగితము ఆమె చేతికిచ్చి.

ఇదివరకే ఆ పాత్రలో పూర్తిగా లీనమైఉన్నది వసంత, నా మనస్సును చక్కగా అర్థముచేసుకుని, ఎంతో చక్కగా చదివింది, నేనువ్రాసిన మాటలు. "ఎక్కువ రిహార్సల్‌కు అవకాశంలేదు,ఇక రెండు నిమిషాలలో నాటకము ప్రారం భిస్తారు. ఈ సంఘటనను సరిగా నిరూపిస్తాననే ధైర్యం ఉన్నదా నీకు, వసంతా!" అన్నాను.

"ఫరవాలేదు; మీరు కోరినంత బాగానూ, వీలైతే అంతకంటె ఎక్కువగానూ నటిస్తాను. బెంగపడకండి!" అంటూ, స్టూడియోలోకి వెళ్ళింది వసంత.

నిజంగా, నేను ఊహించినదానికంటే ఎక్కువ గొప్పగా రక్తిగట్టినది ఆ విషాదాంతఘట్టము! శ్రోతలకు ఎంతైనా జాలికలిగించినది. నదిలో పడిపోతూ సుధ పలికే మాటలకు తోడుగా, అప్పటికప్పుడు, నేను ఏరి సమకూర్చిన రికార్డ్ల ద్వారా అద్భుతమైన వాతావరణను కలిగింపకలిగాము. కీచురాయి శబ్దమూ,నక్కల కూతలూ, ఈదరగాలి రోదనా, కెరటాల రెపరెప, ఆ తరువాత, నీటిలో మునిగిన గుడగుడ శబ్దమూ; వెంటనే ఇదివరకున్న హోరుగాలి మరింత ఎక్కువ కావడమూ, ఆ తర్వాత మళ్ళా కీచురాయిశబ్దమూ, అందుండి క్షణిక నిశ్శబ్దమూ-ఈ విధంగా ధ్వని పరంపరలవల్లా, చివరకు నిలచిపోయే గాఢ నిశ్శబ్దంవల్లా అద్భుతంగా నిరూపించాము ఆ సంఘటనను, రేడియోలో.

మర్నాడు, మమ్ములను కలసికొన్న రచయిత రాజమన్నార్ ప్రదర్శనను చాలాచాలా ప్రశంసించారు. "ఆఖరి ఘట్టము మరీ బాగా నిరూపించారు! నా నాటిక చాలా గొప్పగా రక్తిగట్టింది. మీరు కల్పించిన ఆ కొన్నిమాటలవలననూ!!" అన్నారు, ఆయన, నాతో.

"నాటిక ఇంత గొప్పగా రాణించినందులకు నటీనటవర్గాన్ని అభినందించాలని కోరుతున్నాను. వారిని నాతరపున ఆహ్వానించి, టీకి తీసుకురండి" అన్నారు, ఆయన.

ఆ పార్టీలో, మాటల సందర్భాన తెలుసుకున్నాను నేను, నేనూ రాజమన్నారూ హైస్కూల్‌క్లాసులలో ఒకే స్కూల్‌లో చదువుకున్నామని! వారూ జ్ఞాపకం చేశారు. నాకూ జ్ఞాపకంవచ్చింది, అప్పటికి ఒక ఇరవై ఏళ్ళకు పూర్వము పాఠశాలలో మా పరిచయము!

ఇలా ప్రారంభమైన మా స్నేహము నానాటికి వర్ధిల్లి, రేడియో కార్యక్రమాల సందర్భంలోనూ, కళాభివృద్ధికి తోడ్పడే ఇతర సంస్థలలో జరిగే కార్య

కలాపాల సందర్భంలోనూ నాకు వారితో కలిగిన సహచర్యాభాగ్యమువల్ల, తలుచు కున్నంతమాత్రాననే ఒళ్లు పులకరింపజేసేటంతటి పరిమళవంతమైన పుష్పిత స్నేహలతగా రూపుదాల్చినది, ఈనాటికి. ఏ మహాసభలోనైనాసరే, వారు ప్రవే శిస్తుండగా నేను ఎదురుగా వెళితే, నా నడుముచుట్టూ చేయివేసి నన్ను దగ్గరకు తీసుకుంటూ అడుగుతారు ఆయన: "కులాసాగా ఉన్నారా? క్రొత్తరచనలు ఏమి రచించారు? నాకు చూపించారు కారేమి?" అని. ఏవో పనులతొందరలలో నేను వారిని కొన్ని వారాలు కలుసుకొనకపోతే, ఈసారి కనిపించినపుడు అడుగుతారు ఆత్రుతతో: "చాలారోజులైంది, మీరు కనిపించి, ఎలావున్నారు?" అని.

రేడియోలో ఏమి విశేషము జరిగినా వారిని ఆహ్వానింపక తప్పదు."రేడి యోలో మొదటి కవిసమ్మేళనము జరుగుతుంది, ఈ ఉగాదికి, మీరు అధ్యక్షులుగా ఉండాలని మాకోరిక!" అంటే, "సరే! అల్లాగే!!"అంటారు,ఆయన. "మూడు నెల లకోసారి, సాహిత్యసమీక్ష ఏర్పాటుచేశాము. మొదటి సమీక్ష మీరు ప్రసారము చేస్తారా, దయచేసి!" అని కోరితే, ఎంతపనిఉన్నాసరే, "సరే! అల్లాగే!!" అంటారు, ఆయన. ఆ మొదటి సాహిత్యసమీక్షలోనే, రాజమన్నార్ సమకాలిక సాహిత్యరీతులను విమర్శిస్తూ,శ్రీ శ్రీ రచనాధోరణినిగురించి విపులంగా ప్రస్తావించి, ఇలా అన్నారు:

"సింధూరం, రక్తచందనం, బంధూకం, సంధ్యారాగం, పులిచంపిన లేడినెత్తురూ, రుద్రాళిక నయన జ్వాలికా, కలకత్తా కాళికనాలిక-ఇవి కవితావస్తువు లైనాయి, ఈనాడు. కాని, 'కదలేదీ కదిలించేదీ, మారేదీ మార్పించేదీ, పాడేదీ పాడించేదీ, పెనునిద్దుర వదలించేదీ, మునుముందుకు సాగించేదీ, పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ' కావాలట నవకవనానికి. మంచిదే! కాని, ఏదీ అటువంటి కవిత?" అని ప్రశ్నించారు. ఆ ప్రశ్నతో ముగించారు, తమ సమీక్షను.

శ్రీ శ్రీ తన కడపటి రచన వ్రాసి అప్పటికప్పుడే ఐదేళ్ళు దాటింది.

...."దక్షిణ భారత చిత్రాకారుల సంస్థతరపున చిత్రపట ప్రదర్శనము జరుగనున్నది. మీరు ప్రదర్శనను ఆవిష్కరించాలి, ఫలానా రోజున" అని ఫోన్

చేస్తే "ఎవరూ!....మీరా! సరే! అల్లాగే! ఒకరోజు ముందుగా జ్ఞాపకంచేస్తారు కదూ నాకు!" అంటారు, రాజమన్నార్.

"పూజ్యులు, కూచిపూడి నాట్యకళానిధి శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారికి సింహతలాట బహూకరణ ఏర్పాటుచేస్తున్నారు, మద్రాస్ పురజనుల తరఫున సెప్టెంబర్ 5వ తేదీన. వారిచేతిని సింహతలాటమును మీరు తొడగాలి" అని కోరాను, నేను రాజమన్నార్‌ను. ఆయన అన్నారు: "మంచిపని చేస్తున్నారు, మీరు! కాని, ఆరోజుననే నాకు రాజ్‌భవన్‌లో టీపార్టీఉన్నది. సరే, పార్టీనుంచి తప్పించుకుని వస్తాను, మీరు కార్యక్రమాన్ని ఒక అరగంటతర్వాత ప్రారంభింప కలిగితే; సరేనా? ఇదుగో బహూకరణ సందర్భంలో నా పారితోషికముగా ఈ నూటపదహార్లు తీసుకోండి!" అంటూ చెక్‌వ్రాసిఇచ్చారు, నాచేతికి!! అనుకున్నప్రకారము సభకుహాజరై, మంగళవాద్యములు మారుమ్రోగుతుండగా నాట్యకళానిధి ముంజేతిని తొడిగారు ప్రధానన్యాయమూర్తి, రాజమన్నార్, ఆ పదహారుకాసుల సింహతలాటాన్ని. ఇల్లాగే ఎంతపనిఉన్నాసరే, మీవలన కావలసిఉన్నదీ అంటే, మన కోసము వెంటనే అంగీకరించి మనకోరిక నెరవేర్చే స్వభావము వారిది.

అంతటి సౌజన్యమూ, అంతటి సౌహార్ద్రతా, అంతటి సంస్కృతీ ఉన్నవారు చాలా అరుదు. ఈ తరము వారిలో సంగీతములోనూ, సాహిత్యములోనూ, నాట్యశాస్త్రములోనూ, శిల్పములోనూ, చిత్రకళలోనూ, సమానమైన ఉత్కృష్ట సంస్కారముగలవారు ఆయన ఒక్కరే అనుకుంటాను, నేను. ఇక మనిషిగా, మనిషికి కావలసిన మంచిగుణాలన్నీ ఉన్నాయి, ఆయనలో. ఆయన నిజంగా పురుషోత్తముడే!

రాజమన్నార్ నాటికలలోకల్లా శిల్పరీత్యా గొప్పదీ, అనుభవదాయకంగా మిక్కిలి బాధాకరమైనదీ ఆయన రచించిన "పరకీయ". ఈ నాటికలో కొన్ని సంఘటనలు జరుగుతూంటే, అక్షరాలను కన్నీటితెరవెనుకనుంచే చదువాలి, నావంటివారు! అంతటి గుండె తరుక్కుపోయే విషాదగాథ ఇమిడివున్నది, "పరకీయ" నాటికలో. పరమ పతివ్రతగా పరిగణింపబడుతున్న ప్రభావతి ఒక విచిత్ర సన్నివేశంలో, వివాహానికిపూర్వం తను మనసారా ప్రేమించిన ప్రియుని కలుసుకోవ

డమేకాక గొప్ప జ్వరంలోఉన్న అతనికి సేవచేయవలసివస్తుంది. భగ్నహృద యుడు, అతను, ఈమె తనకు లభించకపోవడంవల్ల కలిగిన వెల్తిని మర్చిపోవడం కోసం త్రాగుడు నేర్చుకుని ఆ దుర్వ్యసనానికి బానిసై ఒళ్ళు గుల్లచేసుకుని బికారిగా ఇంచుమించు మరణావస్థలో కనుపిస్తాడు ఆమెకు. అతని పరిస్థితికి తానే కారణమని నిర్ణయించుకుని ప్రభావతి తన పరువుప్రతిష్టలు మంటగలిసినా అతనితో వెళ్ళిపోయి, తన సంరక్షణవల్ల అతనిని బ్రతికించుకోవాలని సంకల్పిస్తుంది. వ్యాధి తాత్కాలికంగా నిమ్మళింపగా, కాస్త తెలివితెచ్చుకున్న ఆమెప్రియుడు ప్రభావతి త్యాగానికి అంగీకరింపక వచ్చినత్రోవనే వెళ్ళిపోతాడు. అతనిని నిలుపుకోలేక, గుండె బ్రద్దలయేటట్లు ఆమె ఏడుస్తూండగా తెర వాలుతుంది. నేనూ కన్నీరు కారుస్తాను పుస్తకం మూసి, ఎంతోసేపు. ఈ నాటకములో అతి తీవ్రమైన, మిక్కిలి ఉద్రేకపూరితములైన సంభాషణలను పొందుపరిచారు రాజమన్నార్. ఒక్కొక్క మాట సూదిమొనలా పొడుస్తుంది మన హృదయాన్ని. ప్రభావతికి జరిగిన అన్యాయాన్ని జ్ఞప్తిపరుస్తూ, సన్నిపాత ప్రలాపనలో మోహనరావు అనే మాటలు భయంకరంగా ఉన్నా, చాలా జాలికలిగిస్తాయి. ఆ స్థితిలో ప్రభావతి అతనిని మళ్ళీ కలుసుకోవాలని వచ్చినందుకూ, అతడు సర్వనాశనమైపోతున్నా తాను ఏమీ చేయలేనందుకూ ప్రభావతి దెసమనకు సముద్రమంత సానుభూతి కలుగుతుంది. ఆమెతో కలిసి నేనూ దుఃఖిస్తాను, చాలాసేపు.

"పరకీయ" నాటకములోవంటి సన్నివేశాలనూ, ఆ సంభాషణలనూ, ఊహించడము చాలా కష్టము. అవి నిజంగా జరిగివుంటే మరీ కష్టము. నాకు అనిపిస్తుంది. "ఈ సంఘటలను చిత్రిస్తూంటే ఎంత బాధపడిఉండాలో రచయితగా, కళాశీలి రాజమన్నార్ అని" వారిదెస పట్టరాని జాలి, విపరీతపు సానుభూతి కలుగుతవి. నాటకములోని పాత్రలదెస ఆవహించివున్న అనుకంపా భావమంతా రచయితదెస ప్రసరిస్తుంది.... ఉన్నట్లుండి, నాలో నాకే గొప్ప భయమువేస్తుంది. నేనే మోహనరావునుఐతే ఏమైపోయివుందునో, నేను-అని. అబ్బ!!....

కళాశీలి రాజమన్నార్ అప్పుడప్పుడు నిత్యజీవితపు బెడదలోంచి పారిపోతూ ఉంటారు. ఎంతోదూరంకాదు. అవతల వీధినివున్న మహాశిల్పి దేవీప్రసాద్

రాయ్‌చౌధురీవద్దకు వెళుతారు ఆయన. ఒక కొత్త శిల్పప్రతిమకు నెన్నుదురు చెక్కుతూనో, ఒక చిత్తరువుకు వెలుగునీడలు సంతరిస్తూనో కళాకృషిలో నిమగ్నులై ఉన్న చౌధురీ ఆ పనిని ఆపకుండానే స్నేహితుని చిరునవ్వుతో ఆహ్వానిస్తూ ఎదుటఉన్న కుర్చీలో విశ్రమింప నియమిస్తారు కనుసన్నలతోనే. ఒక్క పలుకు పలుకరు, కళాశీలిగానీ, కళావేత్తగానీ. అలాగే ఉండిపోతారు, ఒకరి ఉనికిలో ఒకరు ఆనందాన్ని అనుభవిస్తూ, గడియల పర్యంతమూ. చౌధురీని చూడడానికి వెళ్ళిన నేనూ పంచుకుంటూ ఉంటాను, అప్పుడప్పుడు, వారితో ఆ ఆనందాన్ని. వారిద్దరుకూడా నన్ను ఆత్మీయతతో ఆదరిస్తారూ కాబట్టి. సుస్నేహభరితమైన ఆ నిశ్శబ్దాన్ని అనుభవించడమే ఒక గొప్ప అనుభూతి.

రాజమన్నార్ మద్రాస్ గవర్నరుపదవిని అలంకరించారు, ఆమధ్య. రాజభవన్‌కు తలుపులు లేవు, ఆయన అక్కడ ఉన్నన్నాళ్ళూ! ఒకపర్యాయము ప్రఖ్యాత అమెరికన్ నీగ్రోగాయనీమణిని ఆహ్వానించి రాష్ట్రప్రజలతరఫున సత్కరించారు, ఆమెకు గవర్నర్ రాజమన్నార్. ఆ సమయంలో ఆ విదుషీమణిని ప్రశంసిస్తూ ఆయన ఇలా అన్నారు:

"ప్రజల తరఫున, నా తరఫున, తమవంటి ఉత్తమ కళాభిజ్ఞులను యథోచితరీతిని సత్కరించే మహాభాగ్యముకొరకే ఈ పదవిలోనుండే సదవకాశము లభించినది నాకు, అని భావిస్తున్నాను నేను!!" అన్నారు రాజమన్నార్,గవర్నర్‌గా.

ఉత్తమపురుష లక్షణమైన వినమ్రతా, సౌజన్యమూ అవధినందుకున్నాయి ఆ మాటలలో, అనుకుంటూ ఉంటాను నేను.

౧౧

గంగాతరంగ హిమశీకర శీతలాని
విద్యాధరాధ్యుషిత చారుశిలాతలాని
స్థానాని కిం హిమవత: ప్రళయం గతాని
యత్సావమాన పరపిండరతా మనుష్యా:

"ఎంత చక్కని శ్లోకం! ఎంత తీయనిది! కాని, ఇంతకంటే అపాయకరమైనది ఈ దేశంలో లేదు. 'త్రాగడానికి గంగాజలం ఉంది, పరుండడానికి శిలాతలాలున్నవి, ప్రళయంవచ్చి హిమగిరిస్థానాలు పోలేదే? ఎందుకు మానవులు పరపిండాన్ని ఆశిస్తారు' అని. తరువాత, కానల్లో పళ్ళున్నాయి, ఆకులున్నాయి, దుంపలున్నాయి అంటూ అంటాడు భర్తృహరి. మనకు ఇది పనికి రాదు....ఎంత దిగులుపుట్టిస్తుంది ఈ వేదాంతం! ఎంత నీరసంగా చేస్తుంది ఈ వేదాంతం!....నాకు ఐశ్వర్యం కావాలి, సమృద్ధి కావాలి, అందరికీ కావాలి!!"

ఈ మాటలు నామాటలుకావు-నేనూ ఇటువంటి భాష వ్రాయడానికి నేర్చుకున్నా, ఈ అభిప్రాయం దేవులపల్లి కృష్ణశాస్త్రి తన మొదటి రేడియోప్రసంగంలో వ్యక్తపరచినది. 'ఆకలి' అనే తన ప్రసంగంలో కృష్ణశాస్త్రి ఇంకా ఇలా అన్నాడు:

"ఇంకొకకవి ఇలా అన్నాడు: ఒక మహాముహూర్తములో ఒక తేలు సగర్వంగాలేచి, 'ఆ సూర్యునికి కాంతిభిక్షపెట్టినవాడే నాకూ దినదినమూ తిండి పెడుతున్నాడు,' అని, ఒక మహాముహూర్తములో ఒక సర్పం అగ్నిలతలాగ నృత్యంచేసి 'ఆ చంద్రుడికి శీతలరజతాహారం అనుగ్రహించినవాడే అనునిమిషమూ నాకు తినిపిస్తున్నాడు'అని, ఒక మహాముహూర్తములో నక్షత్రాలన్నీ శత

సహస్రకంఠకాంతులు విప్పి ఆ పురుగులకు 'ఆహారమిస్తున్నవాడే దినదినమూ మేము మరీమరీ మెరిసిపోయేటట్లు మాకూ ఆహారం అనుగ్రహిస్తున్నాడు' అని అంటాయి. ఒక్క మహాముహూర్తమూలేదు, మానవునికి! తాను నిర్మించుకొన్న కారాగారపు ఊచల వెనుకనుండి 'ఇదిగో, చూడండి! నేను ఆకలితో చచ్చిపోతున్నాను' అంటున్నాడు. ఇది కవి అన్నది. నేనంటాను: ఆకలిఉంటే చచ్చిపోము, అని. మనదేశములో ఆకలిలేదు; మనం శిలలం. మనం మన్ను. మనం మృత్యువు. వేనవేండ్ల అసత్యప్రచారములు, అధర్మాచారములు, అసంబద్ధవైరాగ్యములు మనకు ఆకలిలేకుండాచేశాయి. మనకు ఆకలిలేదు; లేదని తెలియదు. మనకు ఆధ్యాత్మిక క్షుధాలేదు, లేదని తెలియదు"- అంటాడు, కృష్ణశాస్త్రి.

ఎంత తీవ్రంగా వ్రాశాడు! పద్యరచనలో ఎంతటి లాలిత్యం చూపిస్తాడో అంతటి కాఠిన్యమూ, ఉద్రేకమూ వ్యక్తపరుస్తాడు, కృష్ణశాస్త్రి ఇటువంటి వచన రచనలో. కొన్నివిషయాలనుగురించి అతనికి మిక్కిలి తీవ్రమైన అభిప్రాయాలున్నాయి. ఆ ప్రస్తావనవస్తే మండిపడతాడు అతను. ఏమిచెయ్యాలో తెలియక ఉక్కిరిబిక్కిరి ఔతాడు. కాని, సంఘసంస్కర్తగా అప్రియమైన సత్యాలను ఉద్ఘాటించే కృష్ణశాస్త్రికంటే, కేవలమూ కవిగా అందమైన అబద్ధాలనుచెప్పే కృష్ణశాస్త్రి నాకు ప్రియమైనవాడు. సంఘసంస్కరణనుగురించి చాలామంది చెప్పగలరు, తీవ్రంగా, ఉద్రేకంతో. కాని, ఇటువంటి మనస్సును ఆనందంలో ముంచివేసే కవిత ఒక్క కృష్ణశాస్త్రి అల్లకలడు:

రేగుకోర్కెలగుత్తి నాగుండెవలె నెర్ర
నెర్రనైనది మావిఇగురు గుబురు
మ్రోగు పాటలపేటి నాగళమ్మటు తీయి
తీయనైనది పుల్గు తెరవగూడు- అనీ

...ఈ దారికెలకులందేను వేణువునోయి
నాదాలకోవ! ఆనందాల పెనుప్రోవ!!

స్వాదు మృదులములు నీపాదాల సవ్వడులు
ఏదవ్వులందైన నే నెరుంగలేన!
అదరు నీపెదవి యూరుపుగాలి కదిలేన
చెదరు నీ చీరకుచ్చెల సుంతమెదిలేన,
ఆగికోలేనోయి! అడగియున్నవి వేలు
మ్రోగిపోయేనోయి ముగ్ధరహాస్యాలు! – అనీ

ఒక్క కృష్ణశాస్త్రి అనకలడు.

ఇంకా ఉన్నాయి, మంచి మంచి భావాలూ, మంచి మంచి మాటలూ కృష్ణశాస్త్రి ముద్రతో:

శ్యామలాలకల నవమల్లికల డోలికల
పేర్చినారా, దారి కురవకాశోకాలు,
ఓర్చికోలేవు స్వామి మృదు చరణాలు –అనీ,

...మల్లీ వల్లీ మరకతకాంచీ
వేల్లిత తనుమధ్యా! వసంతా!
ఫుల్ల మాలతీ పులకిత వ్రతతీ
పల్లవ మృదురధ్యా! వసంతా!
ఓహో! వసంతా! ఓయి వసంతా!
అరవింద సితకుంత దళస్మిత! –అనీ,

ఎలదేటి నోయి!
స్వామీ! నేను సెలయేటి
అలలలో కదిలేటి

సాగుతున్న యాత్ర

కలువ పూపడవలో
పూయల ఈలీల
పూగేను! తూగేను
నీ మోలగము వేళ
నే ఇంత మరపేల! -అనీ,

కురియు మంచు నునుజడులనడగు
తెలిఇసుక పొరల బయళులపై
తొరయు పుప్పొడుల దొరగు తేనె యస
లొలయు చివురు తెరువులపై
—ఇటురావె! ఇటురావే!

...చలిత హిమానీ లలిత తుషారము
దులిపికొనుడు మెయి నంటినులే!
...మధుర మధుర మధురమై రేయము
మరుగు ఎదలలో నిండెనులే
ఇటురావే శాఫాలీ
ఇటురావే!

అంటూ అద్భుతంగా చిత్రింపగల కృష్ణశాస్త్రి భావనాబలమూ, పద లాలిత్యమూ-ఇవే నన్ను ఎప్పటికీ ఆకర్షిస్తాయి.

దేవులపల్లి కృష్ణశాస్త్రి కవితనుగురించి మల్లవరపు విశ్వేశ్వరరావు "నవ్యాంధ్ర కవిత్వము: భావచిత్రణ"అనే తన మొదటి రేడియోప్రసంగములో ఇలా అన్నాడు:

"కృష్ణశాస్త్రి కవిత,సూర్యకాంతపుష్పం. ఒక్క కొండమీద ఒంటరిగా వికసించినట్టు ఆత్మానుభూతినే ఆలంబనగా గైకొని ఖండకావ్యంగా ప్రఫుల్లమవుతుంది. దృశ్యప్రపంచాన్ని వర్ణించే ప్రకృతివర్ణనలూ, దృశ్యజీవితాన్ని నిరూపించే ప్రబంధ కావ్యాదులలోకంటే కృష్ణశాస్త్రి ఖండికలలో ఆత్మ ఆత్మపరమైన రహస్య ప్రపంచం, సంజ్ఞారూపకమైన నిగూఢానుభూతీ, ఉత్కృష్టరసోద్దీపకములైన భావచిత్రాలూ పాదుకేర్పరచుకోగలవని చెప్పవచ్చు" అని చెప్పి, విశ్వేశ్వరరావు కృష్ణశాస్త్రి రచించిన "ఆమె కన్నులలో అనంతాంబరంపు నీలినీడలు కలవు"; అనే పద్యాన్ని ఉదాహరిస్తూ ఇలా విమర్శించాడు, తన రేడియోప్రసంగంలో, సరిగ్గా ఇరవైయేండ్లక్రితము:

"ఈ గీతంలో ఒక భావచిత్ర పరంపరను పరుగెత్తిస్తాడు, కవి. 'ఆమె కన్నుల' లోతుకాంతులను కవి ఊహాతూలికతో కావ్యయవనికమీద చిత్రపరంపరగా చిందించి, ఆ కన్నుల అగాధంలో వెల్లివిరిసే అగోచర లోకసాదృశ్యాలను ముక్తధారగా సహృదయుని అంతఃకరణలోకి ప్రవహిల్లజేశాడు."

అని, ఇంకా కొన్ని ఉదాహరణలనూ ఇస్తూ కృష్ణశాస్త్రి కవితలో ఇంద్రియానుభూతిని మీరిన సంజ్ఞాప్రధానమైన భావచిత్రణ ప్రభావం మనకు అవగాహన అవుతుందనీ,

> ఇపుడు నేనొక్క తుదిరేయి ఇరులచాయ
> నై నశించుచున్నాను...

అని వర్ణించిన నిస్పృహోర్తమై మృత్యురావంలోనే, కవి మరుక్షణంలో పొందగల విభాతోజ్జ్వలపరివర్తన స్ఫురితమవుతుంది-అన్నాడు, మల్లవరపు విశ్వేశ్వరరావు.

ఆ మల్లవరపు విశ్వేశ్వరరావు కవితను విమర్శిస్తూనే శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు తమ మొదటి రేడియోపుస్తకసమీక్షలో ఇలా అన్నారు:

## సాగుతున్న యాత్ర

"పాతిక సంవత్సరాలనాడు శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి 'తృణకంకణము'లో ప్రారంభమైన నవ్యకవితాస్రవంతి ఎడతెరిపిలేకుండా ప్రవహిస్తూనే ఉన్నది. ఈమధ్య రెండుమూడేళ్ళక్రింద కొంచెము మందగించిందేమో అనిపించింది. ఏమంటే, ప్రధానకవులైన ఒకరిద్దరిని గురువులుగా అంగీకరించి వారినే అనుకరిస్తూ అనేకమంది పిన్నకవులు వ్రాయడం పరిపాటి అయిపోయింది. వారిలో ఉండే ప్రతిభా, భాషాప్రభుత్వమూ వీరిలో లేకపోవడముచేత అంతకంతకు నవ్యకవిత్వము నీరసిస్తున్నదేమో! క్రొత్తపోకడలు లేవే! అంతా పాడినపాటగానే ఉన్నది!- అనుకున్నాము కాని, శ్రీరంగం శ్రీనివాసరావు, పిలకా గణపతిశాస్త్రి, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, రుక్మిణీనాథశాస్త్రి, మల్లవరపు విశ్వేశ్వరరావు రచించిన కృతులు చూస్తే మళ్ళీ ఆశ మొలకెత్తింది. వీరిలో భావంలోనూ భాషలోనూ కూడా నూతనత్వము పొడగట్టుతున్నది. విశ్వేశ్వరరావు విషయంలో కవికి 'ఈ లోక కఠోరయాత్రలో, తన జీవితాన్ని ఆవరించిన చీకట్లో ఒక తేజస్స్వరూపిణి, ఒక కాంతిమయి, క్రొత్త వెలుగును విరజిమ్మినది. అంతటితో తనలో నిగూఢమై ఉన్న శక్తులన్నీ మేల్కొన్నవి. పాపం! ఎన్నోదినాలు 'అవనీ తీరాలెల్లా వెదకి వేసారి' నాడు.... అట్టిపరిస్థితిలో 'అలముకొన్న స్వప్నజీవితావరణం' మేలు గొలిపి హృదయభవనంలో దీపంనిలిపింది, ఆమె. ఆమె దివ్యంగా పాడగలదు, ఆమెపాట,

మనసులో మనసులో కలసిపోయెను
దీపకళికలో కాంతిలా!

ఆమె అనుగ్రహంవల్లనే తన కవితాలత పుష్పించింది. తన హృదయ వీణ మ్రోగింది:

ఏనాటిదీరత్నపేటికా వాసిత
దివ్యవీణ!

సాగుతున్న యాత్ర

ఈనాటికి తెరచి మీాటినావు

బాల! నా బ్రతుకు!

అని ధన్యవాదాలు చేస్తాడు, కవి. ఈ కావ్యంలో కవి తనకు కలిగే ఆశ, నిరాశ, దివ్యములైన అనుభవాలు వర్ణించాడు"-అని, రామకోటేశ్వరరావు అంటారు: "ఎవరో ఒక కవికి సంబంధించిన ఈ అనుభవాలూ, ఈ విలాసాలూ కావ్యంగా ఎందుకు వ్రాయాలి? లోకానికి వీటితో ఏమి ప్రసక్తి?"- అంటారేమో? అనుభవాలు లోకంలో అనేకమందికి వస్తూనే ఉన్నవి. కాని, జీవితమనే సముద్రాన్ని మధించి అందులో వెలువడే అమృతాన్నీ, హాలాహలాన్నీ సమంగా ఆస్వాదించి, ఆ అనుభవంవల్ల తాము తరించి, ఇతరులను తరింపజేయగల శక్తి కవులకే ఉన్నది. ఇంత చిన్నతనంలో (1938) ఇంత ఉత్తమ కావ్యంవ్రాసి ధన్యుడైన విశ్వేశ్వరరావు ఆంధ్ర కవితా కన్యకు ఇంకా ఎన్నిఅలంకారాలు దిద్దుతాడో! పోను పోను, సమాసభూయిష్ఠమైన సంస్కృతశబ్దజాలాన్ని తగ్గించమనీ, పదముల రవళికయొక్క సమ్మోహనమునుండి తప్పించుకోమనీ కోరుతున్నాను," అన్నారు, రామకోటేశ్వరరావు ఆల్ ఇండియా రేడియోనుండి ప్రసారమైన మొట్టమొదటి పుస్తకసమీక్షలో.

మొదటి పుస్తకసమీక్ష రామకోటేశ్వరరావుగారు ప్రసారముచేస్తే, ఆ తరువాత పుస్తకసమీక్షను బుర్రా వెంకటసుబ్రహ్మణ్యాన్ని చేయమని కోరాము. బుర్రా సుబ్రహ్మణ్యము చాలా బాగా చదువుకున్నారు. ముఖ్యంగా, ఆంగ్లనాటికలు వారికి అభిమాన విషయము. తెలుగుభాష అంటే చాలా ప్రియము. వారూ కథానికలు వ్రాస్తారు. మంచి విమర్శకులు. త్రివేణిపత్రికానిర్వహణలో రామకోటేశ్వరరావుకు కుడిభుజమువంటివారు, అప్పుడూ ఇప్పుడూ కూడా.

రామకోటేశ్వరరావు తమ పుస్తకసమీక్షకు పుస్తకములు తామే సూచించారు. ఈక్రొత్తపుస్తకాలువచ్చినవి, అవితెప్పించండి, వానిని సమీక్షచేస్తానుఅన్నారు. అల్లాగే ఆ పుస్తకాలు, విశ్వేశ్వరరావు 'కల్యాణ కింకిణీ', శివశంకరశాస్త్రి 'వకుళమాలిక', వేదుల సత్యనారాయణ 'దీపావళి'వారు సమీక్షించారు. కాని, బుర్రాసుబ్ర

హ్మణ్యం ప్రసారముచేయవలసిన సమీక్షనిమిత్తము వారికి పంపడానికి రేడియో నిలయానికి ఒక్కపుస్తకం రాలేదు. ఈవాళ రావచ్చు, రేపురావచ్చు అనే ఆశతో ఇంచుమించు చివరిరోజువరకూ గడిచిపోయింది. ఇక మూడురోజులున్నదనగా మద్రాస్‌లో ఉన్నతెలుగు పుస్తకశాలలు-ఎన్నోలేవు-అన్నిటినీ గాలించాను. క్రొత్తగా వచ్చిన పుస్తకంఒక్కటీకనిపించలేదు. ఒకటి రెండూ వచ్చినా అవి కేవలం పాఠశాలవిద్యార్థులకు పనికివచ్చేవి మాత్రమే. "ఏంబుద్ధి చెప్మా" అనుకుంటూ, దిగులుతో బుర్రా సుబ్రహ్మణ్యంఇంటికి వెళ్లాను నేను, ఆయనవద్దకు క్రొత్తపుస్తకాలు ఏమైనా వచ్చిఉంటే వానినివిమర్శించమని కోరదామనుకుంటూ. వారివద్దకూ ఒక క్రొత్త పుస్తకమైనా రాలేదు. "ఏమిటోనండి! తెలుగులో ఒక్క పుస్తకము వెలువడలేదు, గడచిన ఈ ఆరు నెలలలోనూ! ఇది మన దౌర్భాగ్యము!!" అన్నారు ఆయన. ఆ మాట వినడంతోనే నా కొక ఆలోచన తట్టింది. నా ఆలోచన వారితో చెప్పి నేను రేడియోస్టేషన్‌కి వచ్చివేసి, డైరెక్టర్‌కూ ఆ మాట చెప్పాను.

నియమితసమయానికి బుర్రా సుబ్రహ్మణ్యాన్ని స్టూడియోలోకి తీసుకుని వెళ్ళి, వారి సమీక్షప్రసారాన్ని ఉపక్రమిస్తూ నేను ఇలా అన్నాను, రేడియోలో:

"ఆల్ ఇండియా రేడియో మద్రాస్ కేంద్రము. పుస్తక సమీక్ష; శ్రీ బుర్రా వెంకట సుబ్రహ్మణ్యము. ఈ రోజు శ్రీ బుర్రా సుబ్రహ్మణ్యము కొన్ని క్రొత్త పుస్తకాలను సమీక్ష చెయ్యాలి. కాని, ఇటీవల ఒక క్రొత్త పుస్తకమైనా ప్రచురితమైనట్టు తోచదు. తెలుగులో క్రొత్త రచన ఎందుకు కరువైనదో అనే విషయం గురించి శ్రీ సుబ్రహ్మణ్యం పరిశీలిస్తారు- శ్రీ బుర్రా సుబ్రహ్మణ్యము" అన్నాను, నేను.

బుర్రా సుబ్రహ్మణ్యము తమ ప్రసంగంలో చాలా చక్కగా వివరించారు, ఉత్తమ సాహిత్యము సమకాలికజీవితపు ప్రతిబింబమేననీ, తెలుగువారి అప్పటి జీవితంలో స్తబ్ధత ఏర్పడిపోయి, ఎటువంటి చలనమూలేనివారగుటచేత క్రొత్త రచనలు ఏవీ వెలువడలేదనీ అన్నారు. కొంతకాలము మన సాహిత్యరచన భాషాంతరీకరణతో సరిపోయింది. బెంగాలీనుండీ, హిందీనుండీ, సరే, అంతకుముందు

ఇంగ్లీషునుండీ రావలసిన అనువాదాలు వచ్చివేశాయి. స్వతంత్రరచన సాగడానికి అనువైన చైతన్యము జనులలో లేనట్టే కనిపిస్తుంది. మరి ఈ చైతన్యము ఎప్పుడు కలుగుతుందో, అని చెపుతూ, ఉత్తమ సాహిత్య లక్షణాలూ, విదేశాలలో ఏదో ఒక సంఘటన జనులను ఉర్రూతలూగించినపుడు తత్ఫలితంగా క్రొత్త రచన ఎలా వెలువడిందో నిరూపించారు, తమ ప్రసంగములో సుబ్రహ్మణ్యము. వారికి గల అశేష భాషాజ్ఞానమూ, విమర్శనాపటిమా వ్యక్తమయ్యాయి, ఆ ప్రసంగంలో. పర్యవసానము: ఏవో రెండో మూడో పుస్తకాలను విమర్శించడమునకు బదులు సాహిత్యావతరణ, సాహిత్యలక్ష్యము వీనినిగురించి అద్భుతమైన ప్రసంగము ప్రసారమైనది, తలవని తలంపుగా, వక్త ప్రతిభావంతుడు కాబట్టి.

క్రొత్తగా నెలకొల్పిన శాసనసభా సమావేశములను గురించిన్నీ సమీక్షలు ప్రసారమగుతుండేవి. వీనిలో మొదటి సమీక్ష, ఇంగ్లీష్‌లో, మా పినతల్లి రుక్మిణమ్మగారు ప్రసారము చేశారు. ఆ ప్రసంగమప్పుడు నేనే వారితో స్టూడియోలో ఉన్నాను. ఆమె తన పరిశీలనలో కొందరు ప్రముఖ సభ్యులనుగురించి చెపుతూ ఛలోక్తిగా ఇలా అన్నారు: 'ప్రభుత్వపు బెంచీల'కేసి చూడడముతోనే మన దృష్టిని అరికట్టేది నవయవ్వనుడైన గోపాలరెడ్డి నవ్వుముఖము. ఇంతటి చిన్నవయసులోనే గోపాలరెడ్డి మంత్రిపదవిని అలంకరించడము ఎంతో ముదావహము,- అన్నారు, రుక్మిణమ్మగారు, తమ ప్రసంగంలో. ఆమె ప్రసంగం పూర్తి ఐనాక నేను, శ్రోతలు ఫలానావారి సమీక్ష విన్నారు అని చెప్పి, స్టూడియోను 'ఆఫ్' చేసేలోపుగా ఆమె అన్నారు, నాతో: "అతను ఏమీ అనుకోడుగదా, అతనిని నవయవ్వనుడు అన్నాననీ!"-అని. రుక్మిణమ్మగారు అనిన ఈ మాటలున్నూ వినిపించాయి శ్రోతలకు!! నేను ఖంగారుపడి స్విచ్‌ని మరి రెండుసార్లు నొక్కి-స్టూడియోను 'ఆఫ్' చేశాను. ఇటువంటి తమాషాలు జరుగుతూండేవి, అప్పుడప్పుడు- మాకు అనుభవము తక్కువ, అప్పటికి, కాబట్టి.

రుక్మిణమ్మగారు చక్కగా వీణ వాయింపగలరు, కూడ. ఆమె ప్రఖ్యాత వీణావిద్వాంసురాలు వీణ ధనమ్మాళ్ వద్ద ఒక పదిఏండ్లు అభ్యాసము చేశారు. రేడియోనిలయము నెలకొల్పినాక, మా డైరక్టర్ రుక్మిణమ్మగారిని ఒక నలభై

ఐదు నిమిషాలు తమ వీణావాద్యమును ప్రసారముచెయ్యమని కోరారు. ఆమె మొదట ఒప్పుకోలేదు- "నాకేమివచ్చు, వీణ" అంటూ. కాని, డైరక్టర్ ఆమెను మరీ మరీ బలవంతంచేసి, ఆమెచేత బ్రాడ్‌కాస్ట్ చేయించారు. ఆ బ్రాడ్‌కాస్ట్ జరిగిన ఒక పదిహేను రోజులకు రుక్మిణమ్మగారు రేడియోనిలయ సలహాసంఘ సభ్యులుగా నిలయాన్ని చూడడానికి వచ్చారు. స్టూడియోలు అన్నీచూచి ఆమె కంట్రోల్ రూమ్‌కు వచ్చారు. వారికి ప్రసారవిధానాన్ని అంతా వివరించి తెలుపుతూ ఇంజనీయర్ ముక్కవల్లి లింగప్పశాస్త్రి ఆమెకు రికార్డింగ్ మెషిన్ చూపించి, "ప్రసారమైన కార్యక్రమాన్ని ఇదుగో ఈ 'డిస్క్'పైన పొందుపరిచి ఉంచుతాము మళ్ళీ అవసరమైనపుడు వినిపించడానికి. ఈ రికార్డ్ వింటారా?" అంటూ స్విచ్ వేశాడు. అతిశ్రావ్యమైన వీణావాద్యము వినవచ్చింది. ఆ సుమధుర స్వనము కంట్రోల్ రూమ్‌లో వెల్లివిరిసింది. నిశ్చేష్టితురాలై, ఏకాగ్రతతో వింటున్నారు రుక్మిణమ్మగారు. కొంతసేపటికి ఆమె పెద్దగా నిట్టూర్చి, తలపంకిస్తూ అన్నారు: "ఒక్క ధనమ్మాళే వాయింపగలరు-ఇంత గొప్పగా. ఆ నిపుణత ఎవరికొస్తుంది!" అని. ఒక్కొక్క సంగతీ, ఒక్కొక్క గమకమూ, వింతగా మెచ్చుకున్నారు. శాస్త్రి అన్నారు: "అబ్బే! ఈ రికార్డ్ ధనం రికార్డ్‌కాదు. ఆమె ఇంతవరకూ మా నిలయానికి రానేలేదు. మీరు పదిహేనురోజుల క్రితము బ్రాడ్‌కాస్ట్ చేసిన ప్రోగ్రామ్ ఇది. వినండి!" అని.

రుక్మిణమ్మగారు నమ్మలేదు, మొదట. తరువాత, తరువాత, మేము మరీ మరీ చెప్పగా మా మాట నమ్మారు. కాని, వారి ధోరణి మారిపోయింది. అంతవరకూ మరీమరీ మెచ్చుకుంటూ ఉండిన వాద్యములో ఆమె, ఆ వాద్యము తన వాద్యము అని తెలిసాక తప్పులుపట్టనారంభించారు. ఈచోట తాళం తప్పింది; ఇచ్చట ఆలాపన ఇంకా విస్తరించి ఉండాలి; ఇచ్చట రాగభావము ఇంకా బాగా ఒప్పించి ఉండాలి" అంటూ విమర్శింప నారంభించారు. భర్తృహరిమాటలు జ్ఞాపకము వచ్చాయి నాకు- సజ్జనులు ఇతరుల యత్నాన్ని గొప్పగా శ్లాఘిస్తారనీ తమ యత్నాన్ని తక్కువచేసి మాట్లాడతారనీ.

ఆ రోజులలో నేను శాసనసభ సమావేశాలకు తరుచు వెళుతూండే వాడను. చర్చలు వినడానికి కాకుండా, నేను రేడియో కార్యక్రమవిషయాలను గురించి కలుసుకొనవలసిన మంత్రులుగాని, శాసనసభ్యులుగాని వెంటనే నాకు దొరికేవారు అక్కడ, అని. శ్రీ బులుసు సాంబమూర్తి తమ స్పీకర్స్ గాలరీలోకి నాకు ప్రవేశము ఇప్పిస్తుండేవారు.

ఒకసారి ఇలా వెళ్ళినప్పుడే, శ్రీ టి.టి. కృష్ణమాచారిని కలుసుకున్నాను. ఆయన అప్పుడు పూర్తిగా విదేశరీతి దుస్తులతోనే ఉండేవారు. అంతేగాక, ఆయన మద్రాస్‌లోని ఆంగ్లవాణిజ్యసంస్థల తరఫున సభ్యులుగా వచ్చారు కూడా. ఆంగ్లేయులతో సమంగా వ్యవహరిస్తూ వారి మన్ననలను పొందుతూన్న ఆయనను చూడగా నాకు చాలా ముచ్చటైంది. సభలో మాట్లాడేటప్పుడు విపరీతమైన చాకచక్యమును ప్రకటించేవారు. అప్పుడు ఆయన 'ఇండిపెండెంట్'గా ఉండి ప్రభుత్వపద్ధతులలో కొన్నిటిని తీవ్రంగా విమర్శించడానికి జంకేవారు కారు. ఐనా, ఆయన అభిప్రాయాలను చాలా జాకరూకతతో వినేవారు అన్ని కక్షలవారూ. ఆయన మాట్లాడడము తీరున్నూ మిక్కిలి సొంపుగా ఉండేది. ఆయనతో అల్లా మాట్లాడుతూ ఉండిపోవాలనే నేను రెండు మూడు పర్యాయాలు ఆయనవద్దకు వెళ్ళేవాడను. వాణిజ్యసంస్థల తరఫున సభ్యుడైనా, ఆయనకు ఇతర విషయాలందున్నూ చాలా ఆసక్తి ఉండేది. ముఖ్యంగా సంగీతసాహిత్యములందు ఆయనకు మిక్కిలి ప్రీతి.బహుశాఈ సమాన అభిరుచే నన్ను వారిదెసకు ఇంకా తీసుకువెళ్ళినదేమో.వారున్నూ,నేను తమకంటే చాలా చిన్నవాడను ఐనా, అనేక విషయాలనుగురించి నాతో చర్చిస్తూ, మానసికంగా తమకు సమానునిగానే భావిస్తుండేవారు. ఆయనకు పుస్తకాలంటే తగని ప్రీతి. నాకున్నూ. తదుపరి, ఆయన ఒక బ్రహ్మాండమైన పుస్తక భాండాగారాన్ని సేకరింపకలిగారు. నేనూ కొన్ని కొన్ని అతి విలువగల పుస్తకాలను సంపాదించాను. మద్రాస్‌లో కొన్ని పెద్దపుస్తకాల షాపులవారు కొన్ని విలువగల గ్రంథాలను రెండే రెండు ప్రతులను తెప్పించేవారు: ఒకటి, కృష్ణమాచారిగారికి, ఒకటి, నాకు. ఇటీవల వారిని కలుసుకున్నదికూడా, ఒక పుస్తకాలషాప్‌లోనే. క్రొత్తగావచ్చిన పుస్తకాలను పరిశీలిస్తున్నారు, ఆయన. క్షణం ఆ వ్యాపకము మాని

నాతో చాలా ఆప్యాయంగా మాట్లాడారు. వచ్చివేస్తూ నేను అనుకున్నాను, ఇంతటి ప్రతిభావంతుడు, ఇంతటి సంస్కృతికలవాడు,- ఈయనను దేశము సరిగా ఉపయోగించుకోవడములేదని.

* * * *

మద్రాస్‌రేడియో నిలయము నెలకొల్పి అప్పుడే పదినెలలైంది. ఈ పది నెలలలోనూ రేడియోప్రసార విధానము సర్వజనాకర్షణీయంగా వర్ధిల్లింది. ఐతే, ఇతర ప్రాంతాలతో పోలిస్తే మనప్రాంతాలలో రేడియోసెట్లు తక్కువ. వట్టి లెక్కలనుబట్టి చూస్తే ఇంత తక్కువసంఖ్యశ్రోతలకు ఇంత విశ్వప్రయత్నము అవసరమా అని ప్రశ్నించడానికి అవకాశముండేది, సానుభూతి లేని పైవారికి. కాని, దేశంలో ఇంకా ఇంకా విద్యుత్‌శక్తి సరఫరా అభివృద్ధిఐతే ఇంకా ఎక్కువ ప్రదేశాలలో రేడియోసెట్లు వెలుస్తవి అనుకుంటూ ఉండేవారు ఉన్నశ్రోతలుమాత్రము, ప్రతి అంశాన్నీ శ్రద్ధతో వింటూ తమ ప్రశంసను ఉత్తరాలద్వారా తెలుపుతూండేవారు.

విధివిరామంలేకుండా పనిచేస్తున్నా, నిత్యమూ ఏదో ఒక క్రొత్త అంశము జీవితానికి మెరుగులుదిద్దుతూన్నా, తరుచు, ఆరాత్రి ప్రసారము పూర్తిచేసుకుని ఒక్కడనూ హోటల్‌వైపు నడక సాగిస్తూంటే పట్టరాని వెత్తి ఆవహించేది నన్ను. ఒకప్పుడు తోస్తుంది, మనకు అందుబాటులో లేని విషయాలను గురించే మనకు ఆసక్తి మెండు-అని. అవే కాబోలు, గగన కుసుమాలు!

మానవుడు స్వతహాగా విగ్రహారాధకుడు. వట్టి మానసికంగా ఆలోచిస్తే, విగ్రహారాధన తక్కువరకపు సాధనా మార్గము. కాని, ఒక వాతావరణంలో పెరిగినవారికి, ముఖ్యంగా సన్నిహితమైన భావకవిప్రపంచకములో వ్యవహరించేవారికి, ఈ అలవాటు తప్పదేమో. అందుచేతనే కాబోలు, అప్పుడే వచ్చిన భారతి సంచికలో, పెనుమర్తి రామారావు రచించిన గీతమాలిక చూచి నేను అంతగా చలించాను:

సాగుతున్న యాత్ర

ఏ సుముహూర్తమందుననో యీ
వరుదెంచి సువర్ణ పాద వి
న్యాసముతోడ, నా గృహము నంత
పునీతము జేతువంచు నే
నాసల మున్గిపోయి ప్రణయార్ద్రి హృదం
తర సీమయందు నీ
కై సఖి! దాచి యుంచితి సుఖంబుల
ప్రోవులు భావనామణుల్!

"సుఖంబుల ప్రోవులు భావనామణుల్"

క్షణంలో, పద్యాన్నంతా అద్భుతమైన అలౌకిక సుకుమార భావము ఆవహించివేసింది!

ఈ గీతములోనే, కవి అంటారు:

జీవిత మెల్ల నీకొరకు చేయుచునున్న
మహాతపస్సు; నె
త్తావుల గుమ్మరించు సుమదామము
నై భవదీయ కైశిక
స్థావరమాస జేతు!......అని

నిజమే! జీవితమంతా ఎందుకోసమో, ఎవరికోసమో చేస్తూన్న మహాతపస్సు.... మహాతపస్సే!

౧౭

తారుణోజ్వల రాజకుమారా!
త్రావుము జీవితమధు విదిగో!
మృదుకంకణ తాళారవముల కే
కదలియాడు నీ నవమధువు!!
తారారాజిత భృంగకుమారులె
త్రాగే రజనీసుమ మధువు
ఈ రజనీ హాసములన్నియు నీ
యౌవ్వన మంగళ హారతులు!!
తరళ విశ్వ సౌందర్యములన్నీ
తారుణ్యారుణ హేమ పాత్రలో
తళతళ మెరిసే తరగములే.
చిటపట బుడగలు చితుగకమునుపే
త్రావుము యౌవ్వన మధువిదిగో!!

పిలకా గణపతిశాస్త్రి

యౌవనశ్రీ నర్తిస్తూ మురిపిస్తోంది, రాజకుమారుడు సిద్ధార్థుణ్ణి, గణపతిశాస్త్రి ప్రతిభతో రచించిన 'పరిత్యాగము' అనే నాటికలో. 'ఉదయిని'లో అచ్చుఐన ఈ నాటికను ఆల్ ఇండియా రేడియో మద్రాస్‌కేంద్రమునుంచి శ్రోతలకు వినిపించాము ఆ తొలిరోజులలో. ఈ నాటిక ప్రదర్శనవిషయంలో శ్రీ సూరి నారాయణమూర్తి చాలాచాలా శ్రద్ధతీసుకున్నారు. ఒక్కొ-క్క-మాటా పూర్తి అర్థంతో పలికించడానికీ, సిద్ధార్థుని పునీతచరిత్రను భక్తితో విశదపరచడానికీ, మరువరాని ఆ రాత్రి జరిగిన సన్నివేశాలకు తగిన వాతావరణ కలిగించడానికీ చాలా పాటు పడి కృతకృత్యులయ్యారు శ్రీమూర్తి. నాటిక అద్భుతంగా రక్తికట్టింది. కథా

వస్తువు అట్టిది, రచన అట్టిది, ప్రదర్శన అట్టిది. అయ్యగారి వీరభద్రరావు సిద్ధార్థునిగా ఎంతో ఉదాత్తత ఒప్పించారు. యశోధర కొమ్మూరి పద్మావతీదేవి. సిద్ధార్థ నిష్క్రమణానంతరం ఉంచిన 'లేపనైనా లేపలేదే' అనే బసవరాజు అప్పారాయ కవి పాట పద్మావతి చాలా అనుభవిస్తూ పాడారు, ఎంతో జాలిగా. ఆమె ఆక్రందనము వింటూఉంటే కన్నులు నీరుగ్రమ్మాయన్నమాట!

పిలకా గణపతిశాస్త్రి సిద్ధహస్తుడు. ఈతరము భావకవులలో ఇంద్రగంటి అనుమచ్ఛాస్త్రికీ,పిలకా గణపతిశాస్త్రికీ ఉన్నంత సంస్కృతభాషాజ్ఞానము మరెవ్వరికీ లేదు-నాకు తెలిసినంతమటుకు. హనుమచ్ఛాస్త్రికి సంస్కృతకావ్యాలు కొట్టిన పిండి.

పిలకా గణపతిశాస్త్రిని నేను మొట్టమొదట 1933లో అనుకుంట కలుసుకుంట.స్నేహితుడు జనమంచి కామేశ్వరరావు నన్ను ఆయనకు పరిచయము చేశాడు రాజమహేంద్రవరము గోదావరిఒడ్డున, మార్కండేయ దేవాలయము ప్రక్కన, ఒకనాటి ఉదయాన. అప్పుడు ఆయన ఒక విద్యాలయంలో సంస్కృత పండితులుగా ఉండేవారు. ఆదర్శబ్రహ్మచారికీ, ఉపనిషత్‌వేత్తకూ ఉండవలసిన గొప్పవర్చస్సు కనిపించింది, నాకు ఆయన ముఖములో, చూచీ చూడడముతోనే. ఆయన కంఠస్వరము ఎంతో ఆప్యాయంగా ఉంటుంది. ఆయన మాట్లాడేతీరున్నూ మనలను ఆయనకు ఎంతో దగ్గరగా తీసుకువెళ్ళుతుంది. ఆయన అంతరంగములో ఉన్న సద్భావమంతా వెంటవెంటనే వెల్లడి అవుతూ ఉంటుంది, ఆయన అల్లాచనువుగా మాట్లాడిన ప్రతిమాటలోనూ. ఆయన కళ్ళు మిక్కిలి అమాయకంగా ఉన్నా, ఏదో గొప్ప తీక్షణత ప్రకాశిస్తూ ఉంటుంది, ఆయన చూపులలో. మాటలసందర్భంలో, సంస్కృతభాషావిషయాన్ని గురించిన ఏదైనా ప్రస్తావనవస్తే ఒక విపరీతపు ఉద్వేగమూ వస్తుంది, ఆ చూపులలోకి.

నేటి భావకవులలో అంతటి లోతైన, విశాలమైన సంస్కృతభాషా జ్ఞానము అరుదు కాబట్టి సంస్కృతభాషలో ఏవిషయాన్నిగురించైనా తెలుసుకోవాలి అంటే నేను గణపతిశాస్త్రిని అడుగుతూ ఉంటాను, ప్రత్యక్షంగా కలుసుకొనిగాని, టెలిఫోన్‌లోగాని. ఒకసారి, ఉపనిషత్తులోని 'హిరణ్మయేన పాత్రేణ'అనే సూక్తిని

టెలిఫోన్‌లో అడిగి వ్రాయించుకున్నాను, అర్థముతో సహా. అర్థము చెపుతూ ఆయన అంటారు: "ఉండండి, ఒక్క-క్షణము; నేనుచెప్పిన ఆ అర్థము సరికాదేమో!" అని, మళ్ళా ఆమాటలు ఒకటి రెండుసార్లు వల్లించుకుని, చటుక్కున సరియైన అర్థం స్ఫురింపగా "ఆః ఇలా అనవచ్చు," అంటూ, సరియైన అర్థము చెపుతారు. చిత్రమేమిటంటే, ఆయన చేస్తూన్న పనికి అంతరాయము కలిగించి ఇలా నాకోసం వారికి శ్రమ ఇచ్చినందుకు మన్నింపమని నేను వారికి నా కృతజ్ఞతను తెల్పాలని యత్నిస్తూంటే ఇలా ఆయనను అడిగినందుకు ఆయనే మనదెస కృతజ్ఞులై ఉన్నట్టు అంటారు, ఎంతో దయతో. అటువంటి సమయంలో న్యూమన్ మంచివారిని గురించి చేసిన నిర్వచన జ్ఞాపకంవస్తుంది: 'ఒకరికి ఉపకారం చేస్తూ, ఆ ఉపకారం చేయడంవల్ల తమకు లాభించినట్టు వర్తిస్తారు మంచివారు' అని. గణపతిశాస్త్రి విషయంలో తరుచు ఈ నిర్వచన ప్రత్యక్షమవుతూ ఉంటుంది. అందువల్ల ఆయనను ఈ మాయ ప్రపంచకంలో 'వట్టి వెర్రివాని'గా జమకట్టుతారు, 'ప్రయోజకులై'న కొందరు.

ఆయన తప్పుపట్టాడంటేమాత్రము, మిక్కిలి సకారణమైనదే ఆయన అభ్యంతరము. ఆమధ్య, నేను రచించిన ఒక పద్యాన్ని టెలిఫోన్‌లో ఆయనకు వినిపిస్తూ నేను అన్నాను: 'నాకు పద్యాలువ్రాయడము చేతకాదు. కాస్త సవరించి పెడతారా, చదువుతాను' అని. గణపతిశాస్త్రి అన్నారు: "మీ రచన నేను సవరించడమేమిటి? మీరు అలా అనడం మీకు నాపైన ఉన్న అకారణమైన వాత్సల్యానికి తార్కాణము. చదువండి, నాకు వినాలని ఉన్నది" అని. నేను చదువసాగాను, టెలిఫోన్‌లోనే:

విశ్వమోహన మీ విరికన్నియ,
ఆదిశక్తి అపురూపపు సృష్టి! -అంటూ,

ఆయన 'ఊ' అనలేదు. "వింటున్నారా?" అని, మళ్లా చదివాను. ఈసారీ ఆయన 'ఊ' అనలేదు. "ఏమండీ, వింటున్నారా?" అని, మళ్లా అడిగాను. గణపతిశాస్త్రి అన్నారు: "వింటున్నాను, వింటున్నాను. ఆలోచిస్తు

న్నాను: మీరు ఏమీ అనుకోకపోతే ఒక చిన్నమాట చెప్పాలి. ఇప్పటివారు ఈ అభ్యంతరం పాటించడములేదు అంతగా; కాని, 'విరికన్నియ' స్త్రీలింగము కాబట్టి 'విశ్వమోహనము' అనడముకంటే 'విశ్వమోహిని' అంటే బాగుంటుందేమో ఆలోచించండి" అన్నారు. నేను వెంటనే ఆ సవరణ చేశాను: 'విశ్వమోహిని ఈ విరికన్నియ' అంటూ తతిమ్మా పద్యమున్నూ చదువుతూంటే:

కన్నులపండువ మాత్రమెంతో
మిన్నుమీన వెలసిన శతపత్రము!!

అనేసరికి, "ఏదీ మళ్లా చదువండి, ఒకసారి" అని, విని, "చాలా బాగా కుదిరిందండి-చాలా బాగుందండి, భావము"అన్నారు. ఇలా పద్యం అంతా శ్రద్ధతో విని, శ్రమ అనుకోకుండా, మంచి సలహాలనిచ్చారు నాకు.

పిలకా గణపతిశాస్త్రీ, నేనూ ట్రామ్‌లోనో, బస్‌లోనో కలుసుకుంటూ ఉండేవారము, తరుచు. నాకు కార్ ఉన్నరోజులలో, ఒకొక్కప్పుడు ఆయన నాకు రోడ్‌మీద కనిపిస్తే, కార్ ఆపి ఆయనను కార్‌లో ఎక్కించుకునేవాడను. ముందు ఆయన వెళ్ళవలసిన చోటికి ఆయనను తీసుకువెళ్ళి దిగబెట్టి, తరువాత నాపనిమీద వెళ్ళేవాడను. ఆయన కార్‌లో కూర్చున్న ఉత్తర క్షణమే, ఏదో ప్రాచీన సంస్కృత సాహిత్యవిషయాన్నిగురించే మా ప్రస్తావన ప్రారంభించేది. విశేషాలేమిటనిగాని, మీ రెలాఉన్నారు, వారెలాఉన్నారు అనే వ్యర్థ ప్రసంగముతోగాని కాలయాపన మయ్యేదిగాదు. వెంటనే ప్రారంభించేవాడు ఆయన: "మరండీ, రఘువంశంలో ఆ దిలీపచక్రవర్తి అంటాడుకదా"- అంటూ, నా కిదివరకు తెలియని అద్భుతవిషయాలను గురించి చెప్పుకుపోతూ. కొంతసేపయ్యాక, సమకాలిక సాహిత్యచర్చ వచ్చి: "మీరు బాగా చదివి ఉంటారు, టి. ఎస్. ఇలియట్ ప్రత్యేకత ఏమిటండీ-అతనిని అందరూ అంతగా మెచ్చుకుంటున్నారు?" అని, ప్రశ్నించేవారు నన్ను.

తనకు కొన్ని కొన్ని విషయాలు తెలియవు అనే నామోషీ లేదు, ఆయనలో, ఏమాత్రమూను. అందుచేతనే ఆయనంటే నాకు అంత ఇష్టము.

## సాగుతున్న యాత్ర

ఎన్నో విషయాలు తెలిసినా, ఇంకా ఇంకా తెలుసుకోవాలి అనే ఆసక్తి ఉన్నది ఆయనలో. ఫ్రెంచ్‌భాషలో ఉత్తమసాహిత్య మున్నదని తెలిసి, ఆయన ఆ భాషను నేర్చుకో మొదలుపెట్టారు, ఆమధ్య. మార్సెలా హార్డీ అనే విదుషీ మణి-ఆమె ఈమధ్యనేగతించారు, పాపము-ఆయనకు ఫ్రెంచ్ నేర్పారు,కొన్నాళ్లు. మార్సెలా హార్డీ, పిలకా గణపతిశాస్త్రి ఇద్దరూ 'శిల్పి' అనే ఉత్తమ సాహిత్య పత్రికపని చూస్తూండేవారు. ఇంగ్లీష్‌లో 'శిల్పికి' సహాయ సంపాదకురాలు, మార్సెలా, తెలుగులో 'శిల్పి'కి సహాయ సంపాదకులు, నిజంగా సంపాదకులు, పిలకా గణపతిశాస్త్రి. మార్సెలా, ఐరోపీయ స్త్రీ ఐనా, ఆమెకు మన దేశ భాషలంటే ప్రీతి అపారము. ఎక్కువగా తెలుగు రచయితలతో పరిచయము కలిగి నంతనే, ఆమెకు తెలుగు నేర్చుకోవాలనే బుద్ధిపుట్టింది. మార్సెలాకు ఫ్రెంచ్ బాగా వచ్చును. ఇకనేమి! పిలకా గణపతిశాస్త్రి ఆమెకు తెలుగు నేర్పడము, మార్సెలా గణపతిశాస్త్రికి ఫ్రెంచ్ నేర్పడమూను -ఇలా ఫ్రెంచ్‌భాషతో పరిచయము ఏర్పడింది గణపతిశాస్త్రికి.

ఆరోజులలో నేనూ కొంత ఫ్రెంచ్ సాహిత్యమూ కొంతవరకు ఫ్రెంచ్ లలితకళలూ అభ్యసించాను. అంతేగాక, ఫ్రెంచ్‌వారి సంస్కృతికీ, మన సంస్కృతికీ మరింత సన్నిహితత్వమును పెంపొందించే ఉద్దేశములో కొందరు స్నేహితులతో 'ఇండో ఫ్రెంచ్ కల్చరల్ యూనియన్' స్థాపించాను నేను. ఆసందర్భంలో లయోలా కాలేజ్ రెక్టార్ ఫాదర్ జరోమ్ డిసౌజాను తరుచు కలుసుకుంటూ ఉండేవాడను, నేను. మద్రాస్‌లో ఉన్న ఫ్రెంచ్ కాన్సలూ, పుదుచ్చేరిలో ఉన్న ఫ్రెంచ్ గవర్నర్‌జనరలూ, ఆయన సతీమణీ నాకు పరిచయమయ్యారు ఈ సంస్థ స్థాపించే సందర్భంలో. ఈసంస్థ సభ్యులు నెలకొకసారి సమావేశమై, ఇష్టాగోష్టిలో ఫ్రెంచ్ భారతీయ సంస్కృతులనుగురించి విశదంగా తెలుసుకుంటూ ఉండేవారు. ఫ్రెంచ్ భాషాప్రియులైన విదేశీయులూ, మనవారూ వస్తూ ఉండేవారు ఈ 'గోష్టి' సమావేశాలకు.

ఇలాంటి ఒక ఇష్టాగోష్టి ఒక సంపన్నసభ్యుని ఆతిథ్యాన కనిమెరా హోటల్‌లో జరిగింది. హాల్ కిటకిటలాడుతోంది, ఇందుకోసము పుదుచ్చేరినుంచి

పనిగట్టుకు వచ్చిన ఫ్రెంచ్‌పండితులతోనూ, ఆ రాజ్యపు ప్రధాన ఉద్యోగస్తుల తోనూ, మద్రాస్‌లో ఉన్న ఫ్రెంచ్‌భాషాప్రియులతోనూ. రకరకాల తినుబండారాలు బల్లలపై పళ్లాలలో పరచి ఉన్నవి. తెల్లనిదుస్తులు ధరించి వెయిటర్‌లు, వచ్చిన వారికి వానిని అందిస్తున్నారు చల్లని, వెచ్చని పానీయములతో, వారివారి ఇష్టముల ననుసరించి. నేను ఆ హాలులో ప్రవేశించేసరికి ఒకమూల నక్కి నిలబడి ఉన్నారు. పిలకా గణపతిశాస్త్రి!

నాకు నవ్వువచ్చింది. "ఏమండీ! ఇలా ఒక్కరూ ఈ మూల నిలబడి ఉండిపోయారు!!" అన్నాను. ఆయనను సమావేశానికి తీసుకొనివచ్చిన మార్సెలా ఫ్రెంచ్‌కాన్సల్‌తో మాట్లాడుతూ ఉండిపోయినది చూస్తూ.

నన్ను చూడడముతోనే పిలకా గణపతిశాస్త్రికి ప్రాణం లేచివచ్చినట్టని పించింది."అమ్మయ్య!"అనలేదు కాని,అన్నట్టు వినిపించింది నాకు, "మీరొచ్చారు, ఇక ఫరవాలేదు!" అన్నట్టూనూ.

"ఏమోనండి! ఇంత హడావుడిగా ఉంటుంది అనుకోలేదు నేను. మీ రొచ్చారు, సంతోషము!" అన్నారు, ఆయన. మేమిద్దరమూ ఒకచోట కూర్చు న్నాము. వెయిటర్లు పళ్ళాలుతీసుకు మావైపు రావడముచూచి, భయపడుతూ భయ పడుతూ నాతో అన్నారు, ఆయన: "ఆ వస్తువులు నేను తినవచ్చో, తినకూడదో, మీరే చెప్పాలి!" అని. "మరేం ఫరవాలేదు! నేను రుచిచూచినవన్నీ మీరూ రుచి చూడవచ్చు, నేనున్నానుగా!" అన్నాను నేను నవ్వుతూ.

కాని, మేమిద్దరమూ అక్కడ ఎక్కువసేపు ఉండలేదు. ఆ వాతావరణం నాకు సహించలేదు, ఆయనకు అసలే సహించలేదు. కాస్సేపటికి ఇద్దరమూ బయ టకు వచ్చివేశాము. నా కార్‌లో ఎక్కి అలా సముద్రమువేపు వెళ్లాము. త్రోవలోనే ఆయన ఆమధ్య రచిస్తూవచ్చిన 'హృదయోపహారము' అనే కావ్యంలో కొన్ని పద్యాలు చదివారు:

ప్రేమశిరీష మోహనపరిమళ
మంతయు గోయబోవ, లో

సాగుతున్న యాత్ర

లో మనస్సైనయంత నె-విలు ప్రమగున్
లవమేని లేక, త
న్వీ! మరి నేను సౌరభసమేతముగా
గుసుమమ్ముగోసి, నీ
కై మృదుపాదధూళి నిడగా దలతుం
గృపతో క్షమింపుమీ!

ప్రతి నిమిషమ్మునుం బరుగువారెడు
జీవిత మాపి, మాధురీ
ప్రతికృతి! నిన్ను నా కవనరంజిత భావములు
గ్రహింప గో
రితి! వృథ, ఈ ప్రయత్నము! సరే, మరి
నా హృదయమ్ముమాత్ర మీ
జతనము మానలేని వివశత్వమునం
- బడియెన్ క్షమింపుమీ!

నేను అనుకోలేదు, ఆయనలో ఇంతటి ఆర్ద్ర ప్రేమభావ మున్నది అని. వేదమే కంఠోపాఠముగా వచ్చేవారిలో, ఎల్లప్పుడూ ఏవేవో ప్రాచీన సంస్కృత గ్రంథాలనే నెమరువేస్తూన్నవారిలో ఇంతటి-నా దృష్టిలో - ఆధునిక భావసంపద ఉంటుందనుకోలేదు, నేను. కాని, ఏదో సందర్భంలో శ్రీ శివశంకరశాస్త్రి చెప్పినట్లు: "ప్రాచీన నవీనభావ సమ్మేళనము పిలకా గణపతిశాస్త్రి హృదయంలో సరసంగా సంఘటిల్లింది."

ఈ హృదయోపహారంలో మరొక పద్యమున్నూ నాకు చాలా ఇష్టము. చిరవాంఛితమైన ప్రియసమాగమనాన్ని ఇద్దరు ముగ్గురు భావకవులు వారివారి తీరున వర్ణించిఉన్నారు. కాని, వానిలో అందమంతా ఒకయెత్తు, గణపతిశాస్త్రి పద్యంలో

అందమొక యెత్తు! ఆశ్చర్యమును గొలిపే ఒక వింత సొబగుఉన్నది గణపతి శాస్త్రి చిత్రించిన భావములో. "అంతా ఐపోయింది, ఇక, ఈ జీవితానికే స్వస్తి" అనిపించి, మరు నిమిషమే పునర్జన్మ కలిగిస్తారు, ఆయన ఈ పద్యంలో:

ఈవొక వేళ వచ్చుసరికే మొయిజీవన
దీపమూరియే
పోవునొ! దానికే తరలిపోయెదవో సుమి!
దివ్యదీప్తి! భా
షావృతమైన నీ యధర మల్లన సోకిన
యంతలోనె తా
రావిచలత్కనీనిక లరాళత నిన్గని
చొక్కు నిర్వృతిన్!

బొమ్మ బాగాఉంది, భావమూ బాగుంది!

ఐతే, "ఆ తారుణ్యోజ్వల రాజకుమారా!" అనే పాట జ్ఞప్తికివచ్చినపుడల్లా నాకు ఒక విశేషము జ్ఞాపకమొస్తుంది. ఒక ప్రఖ్యాత సినిమాప్రొడ్యూసర్ నాకు స్నేహితుడు. మేము తరుచు కలుసుకుంటూ ఉంటాము. ముఖ్యంగా, ప్రతి రోజూ ఉదయం సముద్రపుషికారు వెళ్ళినపుడు, ఆతడు నాకు తటస్థమగుతూ ఉంటాడు. ఇద్దరమూ కలసి ఒక మైలో, ఒక క్రోసో నడుస్తూఉంటాము సముద్రపు ఒడ్డున, ఈమాటా ఆమాటా మాట్లాడుకుంటూ. తప్పనిసరిగా, అతను తీస్తున్న, తీయబోయే క్రొత్త పిక్చర్‌నిగురించిన ప్రస్తావన వస్తూ ఉంటుంది. ఒక పర్యాయం అతను తను నిర్మిస్తూన్న ఒక కొత్తచిత్రంలోని సన్నివేశాన్ని గురించి వర్ణిస్తూ నాతో అన్నాడు: "ఇక్కడ, యువరాజును నర్తకి ప్రాపంచికవిషయాలదెస రంజింపచెయ్యాలి, ఇక్కడ ఒక మంచిపాట కావాలి నాకు; నీవేదైనా పాటను సూచింపకలవా?" అని. నాకు వెంటనే, పరిత్యాగము నాటికా, 'తారుణ్యోజ్వల

రాజకుమారా' అనే ఆపాటా జ్ఞప్తికివచ్చి "ఆ! చక్కనిపాట ఉన్నది, పిలకా గణపతిశాస్త్రి రచించినది. కొంతకాలం క్రితము రేడియోలో గొప్పగా రక్తికట్టినది ఒక నాటకములో ఆ పాట. బుద్ధుని జీవితమునకు చెందినది. మీ చిత్రములో గొప్పగా ఉపయోగింపవచ్చును, వినండి!" అంటూ ఆ పాటలోని మాటలను చెప్పాను. నాకు వచ్చినంతవరకు, పాడవలసిన పద్ధతీ చెప్పాను.

అతను విని చాలా సంతోషించాడు. మళ్లా మళ్లా ఆ మాటలు అనిపించుకుని అర్థము తెలియజెప్పించుకున్నాడు. ఉత్సాహముకొద్దీన్నీ ఇటువంటి మంచి సాహిత్యము తెరమీదికెక్కితే ఎంతో బాగుంటుంది అనే ఆవేశంకొద్దీన్నీ నేను అన్నానుకూడా, "కావలిస్తే నేను రిహార్సల్‌కి వచ్చి ఆర్కెష్ట్రాకు, నర్తనకీ సహాయం చేస్తాను. ఆ దృశ్యం గొప్పగా చేయవచ్చు!" అని.

"అల్లాగే, నేను మీకు టెలిఫోన్ చేస్తాను!" అన్నాడు అతను.

కాని, అప్పటికీ, ఇప్పటికీ నాకతను ఈ విషయమై టెలిఫోన్ చెయ్య లేదు సరికదా, మేము ఎన్నిసార్లు మళ్లా కలుసుకున్నా, ఈ ప్రస్తావనే తేలేదు అతను. అతను క్రొత్తగా విడుదలచేసిన చిత్రములో మాత్రము రాజకుమారుని ఎదుట ఒక 'డాన్స్' ఉన్నదనీ, ఆ డాన్స్‌లో సర్వాంగాలూ త్రిప్పుకుంటూ నర్తకి 'సమయమిదే మంచిది, సరసుడా లేచి రారా!' అనే పాటను అభినయిస్తుందనీ విన్నాను. ఇదీ వరస!

పిలకా గణపతిశాస్త్రివంటి భావకవులను మనస్సులో ఉంచుకునే కాబోలు మద్రాస్ రేడియో కేంద్రపు తొలిరోజులలో నవ్యకవిత్వాన్నిగురించి మాట్లాడుతూ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి ఇలా అన్నారు:

"నవ్యహిత్యం అనగా ఏనాడూలేని అభూతకల్పన అనిగాదు అర్థం. పాతబంగారంతో క్రొత్తనగలు చేయడము, అంతే! ఏనాడు సాహిత్యంలో నవజీవనము వచ్చినదన్నా, ఇదే తాత్పర్యం. ఉత్తమ నవకవులు ప్రాచీన కావ్య హృదయములను బాగా బోధపరచుకొని ఈ క్రొత్తమార్గములనుపట్టినట్టు తోస్తుందిగాని,

అసమర్థులై పాతకావ్యములను చదువలేక ఆ ధోరణిలో వ్రాయలేక ఇందులో దిగినట్టు కనబడలేదు. ఎందుచేతనంటేఎన్నో పూర్వకావ్యాలలోని సంస్కృతులు ఈనాటి కావ్యాలలో మెరుగులతో కనబడుతున్నాయి. మనుష్యుని రాగద్వేషాలూ, మోదఖేదాలూ, మానావమానాలూ, సుఖదుఃఖాలూ ఎప్పుడూ ఒకటే. వాటి నెవరూ మార్చరు. మార్చితే రసభంగం అవుతుంది. కవిత్వమునకు ఎప్పుడూ ప్రధానమైనది ఆనంద నిష్యందమూ, చమత్కారభావ ప్రదర్శనమూను" అన్నారు, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి తమ రేడియోప్రసంగంలో.

కాని, ఆ రోజులలోనే, అనగా 1938 లో, 'నేటి తెనుగు కవితలో క్రొత్తపోకడలు' అనే విషయాన్నిగురించి రేడియోలో మాట్లాడుతూ శ్రీశ్రీ వెలిబుచ్చిన దృక్పథానికీ, హనుమచ్ఛాస్త్రి దృష్టికీ చాలా వ్యత్యాసమున్నది, మొదట్లో కొంతవరకు ఏకీభావమున్నా. శ్రీశ్రీ అంటారు:

"ఒకటిమాత్రము నిశ్చయం. నేటి కవులు అసమర్థతవల్ల, పూర్వ సంప్రదాయాలను నిరసింపలేదు. ఒక అశాంతి, ఒక అసంతృప్తి ప్రబలి, అంచులను దాటే ప్రయత్నాలలో నానా ముఖాల వీరు పరుగెత్తుతున్నారు. తాము నిరాకరించి, వెనుక వదలిన సంప్రదాయాల నిజస్థితీ అంతస్తత్వం వీరికి తెలియనిది కాదు...."

ఆ మాటలలో శ్రీశ్రీ అప్పటి ధోరణి చక్కగా వ్యక్తమవుతుంది. ఆధునిక కవులు వాడుతున్న ఛందోరీతులనుగురించీ, భాషనుగురించీ వివరించి శ్రీశ్రీ ఆ రాత్రి వారి ప్రసంగములో ఇంకా ఇలా అన్నారు:

"నిస్సందేహంగా ఇకముందు పదిసంవత్సరాలూ వచనగమకాలలో పరిశోధనలకు వినియుక్తం కాబోతున్నవి....భావకవులలో అతివాదాభిప్రాయాలతో సానుభూతికలవారందరూ ఈ క్రొత్త వాహినులకు తమ బలం ఇచ్చి శ్రేణి తీరుస్తారని ఆశింపవచ్చును" అన్నారు శ్రీ శ్రీ.

శ్రీ శ్రీ ఇంకా ఇలా అన్నారు:

"వచనగీతం తన రూపము తానే నిరూపించుకుంటుంది. ప్రాచీన ఛందస్సులో ప్రాచీనసంగీతము గోచరించినట్లే, నవీన కల్పనలతో నవీన శ్రావ్యతలు గోచరిస్తాయి. క్రొత్త సంగీతము లోహ విహంగాల, పారిశ్రామిక యంత్రాల, ధూమనౌకల,విద్యుచ్ఛకటాల వివిధ విచిత్ర ఘోషలలోనుండి బయలుదేరుతున్నట్లే నవీన గీతాలు కవియొక్క రసాత్మనుండి అనేకధోరణుల ప్రవహిస్తాయి. ఇందుకు కారణము ఈ కాలపు పారిశ్రామిక యుగధర్మమే. వీటివల్లనే క్రొత్త కవిత్వము ప్రోక్తమవుతుంది," అన్నారు శ్రీ శ్రీ.

నవకవుల కావ్యవస్తువును వివరిస్తూ, శ్రీ శ్రీ ఇలా అన్నారు: "వీరు ఆకాశాలలోనికి వెళ్ళి, నక్షత్రపథాలలో విహరించినట్లే, భూమికికూడా చేరువగా వచ్చి ఇదివరకు కవులు ప్రవేశించని చీకటికోణాలలోనికి కాంతి కిరణాలు పంపిస్తున్నారు. నగరజీవితం, పారిశ్రామిక పరిస్థితుల హృదయవిదారక దృశ్యాలు, పతనోన్ముఖమైన పాతసంఘపు వికారనృత్యము - వీనిని కావ్యవస్తువులుగా చేసుకున్నారు. కుబేరవైభవం ప్రక్కనే, కుచేలదారిద్ర్యం కనబడడానికి వీరు నిర్ఘాంతపోతున్నారు. ఒక్కసారి తమ చుట్టూచూస్తే సంఘదూషితులైన ప్రవాసజీవితులు, దరిద్రభిక్షువులు, జీవనోపాధికి శరీరకష్టం తప్ప వేరే ఆధారములేని కష్టజీవులు కానవస్తున్నారు. తమ కవితలో ఈ దారుణ దృశ్యాలు ప్రదర్శించి లోకం కళ్ళు తెరవడానికి నేటి కవులు యత్నిస్తున్నారు," అని, శ్రీ శ్రీ నవకవులకు కలిగిన ఈ దృక్పథానికి 'రష్యన్ ఫ్యూచరిజమ్' కారణము అన్నారు. అదే వారి ఆదర్శమన్నారు. "మయొకొవిస్కీ, పాస్టెర్నాక్ మొదలైన కవుల రచనలు పీడితలోకంలో వీరికి సానుక్రోశము కలిగించాయి," అన్నారు శ్రీ శ్రీ.

శ్రీశ్రీ వివరించిన ఇద్దరు రష్యన్ కవులలో, మయొకొవిస్కీ ఆత్మహత్య చేసుకొన్నాడు. ఈ ఆత్మహత్యకు కారణము తానుఊహించుకున్న భూతలస్వర్గము తన జీవితకాలములో అవతరించే ఆశ లేకపోవడమే అంటారు విమర్శకులు. ఇక, రెండవ కవి రచనలను ప్రపంచమే ఆమోదించి 'నూతన వ్యవస్థకు' అప్రియమైనాసరే కొన్నికొన్ని శాశ్వతమైన సత్యాలను నిర్భయంగా నాటినందుకు ఆయనకు నోబెల్ బహుమతినీ్న ప్రసాదించారు.

తదుపరి, రాజకీయ కారణాలవల్ల ఆయన ఆ బహుమతిని నిరాకరించి నాడు.

కాని, శ్రీ శ్రీ 1938లో ఆయన రేడియో ప్రసంగమును ఇలా ముగించారు: "ఆధునికకవిత్వము అర్ధముకాదనే అతనికి ఆధునికజీవితము అర్థము కాలేదన్నమాట. అతడు కళ్ళు మూసుకున్నాడు. వెనుకబడిపోయినాడు. అసలు, అతని ప్రపంచమే శిథిలమైపోయింది. అతనిని ఉన్నచోటనే వదలిపెట్టి నూతన జీవితము హుటాహుటిగా తరుముకువస్తున్నది. నవకవులు దీనినే ఆహ్వానిస్తున్నారు. దీనినే ఆరాధిస్తున్నారు!" అన్నారు శ్రీ శ్రీ ఒక ఇరవై ఏండ్ల క్రితము.

కాని, నేను చూచినంతమటుకూ, ఈ 'నూతనజీవితము' ఏమంత చెప్పుకోతగినంతగా మనమీద వచ్చిపడినట్టు తోచదు. ఈ ఇరవై ఏండ్లలోనూ. ఇరవై ఏళ్ళక్రితము శ్రీ శ్రీ మాటలలో, 'పతనోన్ముఖమైన' పాతసంఘమూ ఇంకా కూలిపోలేదు. ఎటొచ్చీ, సినిమా నాగరికత మాత్రము సంఘాన్ని పూర్తిగా ఆవరించింది. అందరూ, నవకవులుసహా అందరూ, సినిమానాగరికతనే ఆహ్వానిస్తున్నారు, అనిపిస్తుంది.

## ౧౩

యథోదకం దుర్గేవృష్టం పర్వతేషు విధావతి।
ఏవం ధర్మాన్ పృథక్ పశ్యంస్తానేవాను విధావతి॥

యథోదకం శుద్ధే శుద్ధ మాసిక్తం తాదృగేవ భవతి
ఏవం మునేర్విజానత ఆత్మాభవతి గౌతమ॥

కఠోపనిషత్తు

పర్వతశిఖరముపైనపడిన వర్షపునీరు కొండ నలుప్రక్కలా పాయలు పాయలుగా అనేక మార్గాల ప్రవహించిపోతుంది; ఆవిధంగానే వస్తువులు భిన్న రూపములవి అనే భావనగల వ్యక్తి త్రోవాతెన్నూ తెలియక, వానివెంట పరుగు లెత్తును. పరిశుభ్రమైన నీరు పరిశుభ్రమైన నీటిలో కలియగానే పరిశుభ్రముగానే ఉండిపోతుంది. ఆవిధంగానే ఆత్మజ్ఞానముగల యోగి మనస్సున్నూ పరిశుభ్రము గానే నిలచిపోతుంది.

అడయార్‌లో చదువుకుంటూ ఉండగా మా ప్రఫెస్సర్ కఠోపనిషత్తు లోని యమ-నచికేతస్సు సంవాదమునుగురించి చెప్పేవారు మాకు. ఆరోజులలోనే అవనీంద్రులో, ఆయన శిష్యవర్గములో మరొకరో, చిత్రించిన 'యమ-నచికేతస్' అనే చిత్తరువునుకూడా చూచాను. అందమైన ఆ బొమ్మలో యముడు నాటక రంగమున మనలను భయపెట్టే భీకరస్వరూపముతోగాక, తేజోవంతమైన ఆదిత్య రూపముతో, మిక్కిలి గౌరవింపదగిన గురుతుల్యునిగా కనిపించాడు. నచికే

స్సున్నూ అతితీక్షణమైన చూపులతో మిక్కిలి కుశాగ్రమైన బుద్ధిగల మునికుమారునిగా కన్నులకు విస్మయానందాలను కలిగించాడు. అప్పటినుంచీ నాకు నచికేతస్సుఅంటే గొప్ప అభిమానమున్నది.

ఈ నచికేతస్సు వృత్తాంతమే చక్కని నాటకంగా రచించారు కన్నడ భాషలో శ్రీ హిరణ్యయ్య. ఈ నాటకమునే 1938 లో మద్రాస్ రేడియో కేంద్రము నుండి ప్రసారముచేశాము, మేము. నేను కొన్ని ఏండ్లు బెంగుళూర్‌లో ఉన్నందునా నాకు కన్నడభాషలో కొంత ప్రవేశమున్నందునా రేడియోలో క్రొత్తగా ఏర్పరచిన ఈ కన్నడనాటక కార్యక్రమాలున్నూ నేనే నిర్వహిస్తూండేవాడను, ఆ రోజులలో.

ఈ రేడియోనాటకములో యముని పాత్ర నెల్లూర్ నగరాజరావు ధరించారు. వారికి తెలుగూ, కన్నడముకూడా చాలా బాగా వచ్చును. తెలుగునాటక రంగమున ఎంత గొప్పగా రాణించారో కన్నడమునకూడ, అంతటి ప్రతిభా ఉన్నది వారికి. మా ఆహ్వానమును అంగీకరించి, ఈ రేడియో మొదటి కన్నడ నాటకము విజయవంతముగా ప్రసారము అగుటకు చాలా తోడ్పడ్డారు, శ్రీ నగరాజరావు.

నచికేతస్సుపాత్రను ప్రసన్ అనే ఒక యువకుడు నిర్వహించాడు, మిక్కిలి నిపుణతతో. ప్రసన్‌ను నాకు పరిచయము చేసినవారు శ్రీ బళ్లారి రాఘవాచార్య. ఆ రోజులలోనే 'మండోదరి' అనే నాటకప్రదర్శన సందర్భాన అనుకుంటాను, ఆయన మా నిలయానికి వచ్చినపుడు ఈ కన్నడనాటక ప్రస్తావన వచ్చి నచికేతస్‌కు తగిన కుర్రవానిని పంపుతానని, ఆ అబ్బాయిని మావద్దకు పంపారు, శ్రీ రాఘవాచారి.

ఉపనిషత్‌గాథను చక్కని నాటకముగా చిత్రింపకలిగాము, మేము. ముఖ్యంగా, నచికేతస్సు జ్ఞానతృష్ణా యముని మహాజ్ఞానసంపదా చాలా చక్కగా వ్యక్తమైనవి. సంభాషణా చకచకా నడచినది. కొన్నికొన్ని సన్నివేశాలతో, శ్రోతలకు ఎంతో విభ్రాంతిగొలిపే రీతిని రేడియోనాటక పరికరాలను ఉపయోగించి, మంచి రక్తి గట్టింపగలిగాము. ఉపనిషత్‌వాక్య గంభీరతా, అచ్చటచ్చట ఉంచిన వేదఘోషా, ఒక విపరీతపు వాతావరణను కల్పింపకలిగినవి. అన్ని

విధాలా ఆ నచికేతస్ నాటక ప్రదర్శనము నా జీవితములో మరువరాని ఒక అనుభవము. కొంతకాలముతర్వాత, ఈ కన్నడనాటకము ఆధారముగా తమిళములోనూ, ఆ తర్వాత తెలుగులోనూ కూడా 'నచికేతస్' నాటకములను ప్రదర్శించాను, రేడియోలో. ఒక్కొక్క పర్యాయమూ మళ్లా మళ్లా ఆ వింత అనుభూతినే పొందుతూ వచ్చాను. నచికేతస్సు విపరీతపు పట్టుదల నన్ను ఎంతో ఆకర్షిస్తుంది. మృత్యువునే తన జ్ఞానతృష్ణచేత జయించినవాడు, నచికేతస్సు.

వాజశ్రవస్సుడనేఋషి కుమారుడు నచికేతస్సు. ఒక పర్యాయము వాజశ్రవస్సు విశ్వజిన్నామక యజ్ఞమును చేస్తూఉండగా సర్వమునూ ఋత్విజులకు పంచిపెట్టుతూన్న తండ్రిని చూచి, బాలుడైన నచికేతస్సు: "తండ్రీ! నన్నెవరికి దానము చేస్తావు?" అని, పదేపదే తండ్రిని ప్రశ్నిస్తాడు. యజ్ఞాసక్తుడైన తండ్రి కుమారుని మాట వినిపించుకోడు మొదట. కాని, నచికేతస్సు మళ్ళా మళ్ళా ఆ ప్రశ్నతోనే తండ్రిని వేధింపగా వాజశ్రవసు విసిగి, పరధ్యానంగా, "మృత్యువునకు" అని ప్రత్యుత్తర మిస్తాడు. ఋషివాక్యము అమోఘము కాబట్టి నచికేతస్సు మృత్యువును సందర్శింపవలసివస్తుంది. కాని, ఇది అతనికి మంగళకరముగానే పరిణమిస్తుంది. యముడు ఇంటివద్ద లేనిసమయాన యమసదనాన్ని జేరిన నచికేతస్సు అతను తిరిగి వచ్చేవరకు అన్నపానీయాలు ముట్టకుండా అలాగే ఉండిపోతాడు, యముని రాకకై నిరీక్షిస్తూ. యముడు వచ్చి, తనకోసము ఒక బ్రాహ్మణ కుమారుడు నిరశనుడై నిరీక్షిస్తున్నాడని తెలిసికొని, అ పాప పరిహారార్థము నచికేతస్సును ఏవైనా మూడు వరాలు కోరుకోమంటాడు. మృత్యుముఖమునుండి వెలువడిన తన్ను తండ్రి కోపింపకుండునట్లు మొదటి వరముగా అడుగుతాడు, నచికేతస్సు. స్వర్గలోక సాధనభూతమైన మార్గములను ఉపదేశింపమని రెండవవరము. ఈ వరాలను ప్రసాదిస్తూ అతిశక్తివంతమైన అగ్ని ప్రభావమును నచికేతస్సుకు ఉపదేశించి, "నీవు మహానుభావుడవు కాబట్టి ఇకమీదట ఈ అగ్ని 'నచికేతాగ్ని' అనే పేరట ప్రఖ్యాతిగాంచి, మిక్కిలి పవిత్రమైనదీ, ప్రతిభావంతమైనదిగా ప్రజ్వరిల్లుతుంది" అంటాడు, యముడు. మూడవ వరమును కోరుకోమనగా, నచికేతస్సు "మృత్యువు అనంతరము గల ఆత్మస్వరూపాన్ని నాకు తెల్పుము మహనీయా!" అని అర్థిస్తాడు. "ఈ విషయం అతినిగూఢమైన రహస్యము. దేవతలు

సహితము ఈ రహస్యాన్ని తెలుసుకోలేకపోయారు, తొల్త. ఇది తప్ప మరేదైనా వరము కోరుకో!" అంటాడు, యముడు. "అంతటి గొప్ప రహస్యమైతే నాకు తప్పకుండా తెలుసుకోవాలని ఉన్నది, నీ అంతటి గొప్ప గురువు నాకు మరెవరు లభిస్తారు. నీవే నాకు ఈ రహస్యమును ఉపదేశించాలి!" అని పట్టుపడతాడు, నచికేతస్సు.

యముడు నచికేతస్సును మరపించాలని ప్రయత్నిస్తూ ఎటువంటి వారినీ మభ్యపెట్టగల గొప్ప గొప్ప వరాలను ప్రసాదిస్తానంటాడు. ధనకనకవస్తు వాహన సమృద్ధీ, ఆయురారోగ్య ఐశ్వర్యాలూ, ఇటువంటివి ఎన్నో ఇస్తానంటాడు, ఆ రహస్యమును చెప్పడానికి బదులు. నచికేతస్సును మహాసామ్రాజ్యాధిపతిగా చేస్తానంటాడు. కాని, నచికేతస్సు వీనిని కామింపడు. 'నీవు చెప్పిన ఐశ్వర్యాలూ సిరిసంపదలూ సర్వభోగాలూ సర్వేంద్రియాల తేజస్సును హరిస్తవి. ఆయుః పరిమాణము ఎంతైనా, దేహము అనిత్యమే గదా! ఈ భోగాలతో నాకేమిపని? నాకు కావలసినది ఆత్మస్వరూపజ్ఞానము. ఆ జ్ఞానమును ప్రసాదింపుము, దేవా!" అంటాడు. చివరకు యముడు నచికేతస్సు శ్రద్ధకూ, విపరీతమైన పట్టుదలకూ సంతసించి అతనిని చాలా మెచ్చుకుంటూ ఆత్మస్వరూపాన్నిగురించి బోధిస్తాడు. 'అవ్యక్త స్వరూపాన్ని' గురించీ ఊహకి అందని 'పరమపురుష' స్వరూపాన్ని గురించీ నచికేతస్సు తెలుసుకుంటాడు యమునివల్ల:

ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్ని బోధత।
క్షురస్యధారా నిశితా దురత్యయా
దుర్గం పథ స్తత్కవయో వద న్తి॥

"సానబెట్టిన కత్తికంటే పదునైన మార్గముకలది ఈ ఆత్మతత్వసాధన, తెలుసుకో, నచికేతా!" అంటాడు, యముడు. 'అశబ్దం, అస్పర్శం, అరూపం, అవ్యయం, అరసం, నిత్యం, అనాది, అనన్త-ఐన, పరమాత్మ స్వరూపాన్ని తెలుసుకోకలిగిన అతడే జీవన్ముక్తుడు కాగలడు అని, యముని బోధనవల్ల తెలుసుకుంటాడు నచికేతస్సు.

# సాగుతున్న యాత్ర

ఈ నాటకాన్ని రిహర్స్ చేస్తుండగానూ ప్రదర్శిస్తూండగానూ అంత సేపూ నా మనస్సు పూర్తిగా ఉపనిషత్తు ప్రపంచములో నిమగ్నమైపోయింది. ఇప్పటికీ, ఈ ఉపనిషత్ ప్రసంగము నా కెంతో శాంతి నిస్తుంది. అప్పుడప్పుడు ఆవేశంతో అంటూ ఉంటానుకూడా, లోకంలో ఎన్నో మతాలు వెలిసినవి, ఎన్నో తత్వాలు వెలిసినవి. ప్రళయమే వచ్చి ఇవన్నీ కొట్టుకుపోయినాసరే, ఒక్క మన ఉపనిషత్తులు చాలు, తిరిగి, లోకానికి జ్ఞానోదయము కలిగించడానికి. మనిషికీ మనిషికీ మధ్య ఉండవలసిన ఐక్యభావాన్నీ, మనిషికీ దైవస్వరూపానికీ మధ్యఉండే విచిత్రమైన ఆత్మా పరమాత్మా సంబంధాన్నీ ఎంతో చక్కగా వ్యక్తపరుస్తాయి, మన ఉపనిషత్తులు.

నేను పూర్వము బెంగుళూరులో ఉండగా హరీంద్రనాథ్ చటోపాధ్యాయా, కమలాదేవీ, నేనూ తరుచు వాదించుకుంటూ ఉండేవారము, వ్యక్తుల మధ్య ఉండే అనురాగ సంబంధములను గురించి. హరీన్ మిక్కిలి ఆపేక్షగల మనిషి. నేనూ అంతే. నాకు వ్యక్తులంటే విపరీతమైన ఆపేక్ష. నేను ప్రేమించిన వ్యక్తి నిత్యమూ నా కళ్ళఎదుట మసలుతూ ఉంటేనేగాని తోచేదికాదు, నాకు. వారు దూరమైతే చాలా చాలా బాధపడేవాడను. ఆ రోజులలో హరీన్‌కూడా అంతే. కమలాదేవి మమ్మల్ని చూచి నవ్వేవారు, "ఏమిటీ వెర్రిఆపేక్ష!" అని. ఆమె ఉద్దేశంలో ఎంతగాఢమైన ప్రేమా బంగారపుసంకెలలా ఐనాసరే, బంధింపరాదు మనలను. ప్రేమించవచ్చు ఎంత గాఢముగానైనా. కాని, ఆ ప్రేమ మనము ప్రేమించినవారిని మనదెస త్రాళ్ళతో కట్టినట్లు కట్టివేయకూడదు, అనేవారు ఆమె. ప్రేమ ఒకరీతి నిరంకుశాధికారమును చెలాయిస్తుంది ప్రేమించినవారిపైన, అనేవారు, ఆమె. ప్రేమకు లక్ష్యము ప్రేమించడమేగాని ప్రేమించినవారితోటి నిత్యసాంగత్యముకాదు, అనేవారు, కమలాదేవి. అప్పుడు, ఆమె మాటలు ఎంతో అలభ్యలక్ష్యాన్ని సూచించేవి అనుకునేవాడను నేను. చాలా బాధపడేవాడనుకూడా. కాని, కాలక్రమేణా, నా జీవితములో ఇంకా ఇంకా అనుభవముకలిగినకొద్దీ, ఇంకా ఇంకాచదువుకొన్నకొద్దీ, కమలాదేవి నిర్వచన చాలా సత్యమని తోచింది, నాకు. ప్రేమ మనలను ఒక మెట్టు పైకి తీసుకుపోవాలిగాని, క్రిందికి దిగలాగకూడదు. ప్రేమించినవారు మిక్కిలి ఉదారత్వమును ప్రక

టించాలిగాని సంకుచితబుద్ధితో, తమ ప్రేమను ఒక విలువగల స్థిరాస్తిగా భావించి, దానిని అంటిబెట్టుకు ఉండిపోగూడదు. ఎటువంటి సందర్భములోనూ ప్రేమ సంతోషాన్నీ, ఆనందాన్నీ ఇయ్యాలిగాని, నిస్పృహనూ, విషాదాన్నీ కలిగింప కూడదు. ఈ భావము నాలో అంతకంతకు కొంత పరిణతికి చెందుటవలన కాబోలు, రేడియోకోసము నేను రచించిన మొదటి సాంఘిక నాటిక ఆ ధోరణినే నడిచినది. 'ప్రేమపరీక్ష' అనుకుంటాను, ఆ నాటకము పేరు. ఆ నాటకము సామర్ సెట్ మామ్ 'సీజర్స్ వైఫ్'ను చదివాక వ్రాసినది. పాత్రల మాతృకలున్నూ మామ్ సృష్టించినవే. నా నాటకము వాతావరణ మాత్రము పూర్తిగా మన వాతావరణే. ఎటొచ్చీ, కథ షిల్లాంగులో జరుగుతుంది. దివాన్ విశ్వేశ్వరరావు మేధావి, ప్రతిభావంతుడు, ధర్మశీలి. అతను తన నలుబదిఐదవయేట తనకంటే పాతిక ఏండ్లు చిన్నదైన లలితను పెండ్లాడుతాడు. లలిత అతిరూపలావణ్య, సౌజన్యరాశి. విశ్వేశ్వరరావు ఆమెను మనసార ప్రేమించినా అతని సిరిసంపదలనూ హోదానూ కుటుంబప్రతిష్ఠలనూ చూచి అతనిని వివాహమాడిన లలిత మాత్రము మొదట అతనిని ప్రేమింపకున్నా, అతని మంచిగుణాలవల్లా, అతను చూపుతూ వచ్చిన అనురాగాతిశయంవల్లా అతనిని భర్తగా పూజిస్తూ అన్నివిధాల అతనికి సంతోషము చేకూర్చడానికి ప్రయత్నిస్తూంటుంది. ఇలా ఉండగా, విశ్వేశ్వరరావువద్ద అంతరంగిక కార్యదర్శిగా మిక్కిలి రూపవంతుడూ చాలా తెలివిగలవాడూ, ప్రయోజకుడూ ఐన మోహన్ వస్తాడు. మోహన్ విశ్వేశ్వరరావుకు దూరపుబంధువు. అందువల్ల, మోహన్ వీరింటిలో చనువుగా తిరుగుతూఉంటాడు. అంతేగాక, మోహన్‌కు వయొలిన్ బాగా వచ్చును. లలిత కొన్నాళ్ళు వయొలిన్ సాధకముచేసి, పెండ్లి ముందు మానివేసింది. ఆమెకు ఈ సంగీతమందున్న అభిరుచిని గుర్తించి, విశ్వేశ్వరరావే మోహన్‌ను తన భార్యకు వయొలిన్ నేర్పవలసినదిగా నియమిస్తాడు. సమానవయస్కులూ, సమానఅభిరుచులూగలవారూ ఐన లలితామోహనులు ఒకరినొకరు ప్రేమింపక తప్పదు. మోహన్ కాకపోయినా, లలిత ఈ ప్రేమను నిరోధించడానికి, శాయశక్తులా ప్రయత్నిస్తుంది. కాని, సుడిగాలివంటి ఆ ప్రేమను ఆమె అరికట్టలేకపోతుంది. పరిస్థితులు ఇలా పరిణమిస్తవని సందేహించిన మోహన్‌పినతల్లి అతనిని మరో రాష్ట్రానికి, ఇంతకంటే పెద్ద ఉద్యోగంలోకి పంపే యేర్పాటు

చేస్తుంది. రాజకీయరంగంలో తనకున్న పలుకుబడిని ఉపయోగించి. ఆమె లలితా మోహన్‌లమధ్య అంకురించిన ప్రేమవిషయమై విశ్వేశ్వరరావుతో చూచాయగా అంటుందికూడాను. కాని ఆ ప్రస్తావన విషయమై విశ్వేశ్వరరావు ఆమె నెక్కువ మాట్లాడనివ్వడు. అతిఉదారస్వభావముకల విశ్వేశ్వరరావు లలిత సంతోషమే తన సంతోషముగా భావించి, వారిద్దరూ ఒకరి సాంగత్యములో ఒకరు కొంత ఆనందాన్ని పొందగలుగుట తెలిసి, తనూ ఆనందిస్తాడేగాని, ఈర్ష్య వహింపడు. మోహన్‌కు బదిలీ అని తెలిసి, ఇక ఇతను వెళ్ళిపోతాడేమోనని లలిత చాలా బాధపడుతుంది. ఆ బాధతో ఆమె వెలవెల ఏడుస్తూండగా, భర్త ఆమెను మిక్కిలి సానుభూతితో ఊరడిస్తాడు. మోహన్ వెళ్ళిపోవడంలేదనీ, ఆ బదిలీని ఆపుచేసి అతడు తనవద్దనే అప్పుడే ఖాళీఅయిన అసిస్టెంట్ దివాన్ పదవికి అన్నివిధాలా తగివున్నాడు కాబట్టి అతనికి ఆ ఉద్యోగం ఇస్తున్నానని చెపుతాడు భర్త భార్యతో. లలిత ఆశ్చర్యపోతుంది. తాను పాపముచేస్తున్నాను అనుకొన్న ఆమెకు భర్తఉదారత్వము అర్థంకాదు. "నామీద కోపములేదా మీకు" అంటుంది. "కోప మెందుకు లలితా! నిన్ను చూడడముతోనే ప్రేమింపకుండా ఉండలేరు ఎవరూను. కాని, నీవు నీ ప్రేమను గురించి ఇంతబాధపడటము తప్పు. ప్రేమ మనలను ఒక మెట్టు పైకి తీసుకెళ్లాలిగాని, క్రిందికి దిగలాగకూడదు. ప్రేమ ఒక అమూల్యమైన ఆట వస్తువు అనీ, అది పోతే మనకు ఏదీ తోచదనీ భావింపకూడదు. ప్రేమ పవిత్రమైనది. ఇరువురిలో గల మంచిగుణాలను పైకి ప్రకటింపచేసే గొప్ప శక్తి ప్రేమ. మనసారా ప్రేమింపగలిగినవారు ధన్యులు అంటాడు" విశ్వేశ్వరరావు. లలితకు ఏమనాలో తెలియదు. భర్తరెండుచేతులూ పట్టుకుని "మీరు ఎంత మంచివారు!- ఎప్పటికయినా మిమ్మల్ని మనసారా ప్రేమింప ప్రయత్నిస్తాను. నాకు కొంచెము వ్యవధి నివ్వండి; అంతే!" అని అర్థిస్తుంది. విశ్వేశ్వరరావు ఆమెను చంటిబిడ్డలా లాలిస్తూ "వెర్రిదానా! ప్రేమ నేర్చుకుంటే వచ్చేదికాదు. ఐనా, నన్ను నీ ఆప్తస్నేహితునిగా భావించి నేను ఎల్లప్పుడూ నీ శ్రేయస్సునే కోర్తున్నాను అనే నమ్మకముతో ఉంటే నేను చాలా సంతోషిస్తాను" అంటాడు. ఈ మాటలు లలితలో వింత పరివర్తనమునకు దారి చూపుతాయి. మరికొన్నాళ్ళకు, సౌందర్య ప్రియుడైన మోహన్ లలితవంటి అందగత్తెనే మరొక అమ్మాయిని కలుసుకుని

వెంటనే ఆమెను పెండ్లిచేసుకుంటాడు. ఈ వివాహము లలితకు బాధకలిగించక తప్పదు. కాని, ఈసారిన్నీ భర్త ఆమెను ఓదారుస్తాడు, "లలితా! నీ కొకమాట చెప్పనా! మోహన్ ఆ క్రొత్త అమ్మాయిని అంత హడావిడిగా పెండ్లిచేసుకోడానికి కారణము ఏమిటో తెలుసా?........ఆ అమ్మాయిలో నీ రూపమును చూసుకుంటు న్నాడు మోహన్! పోనీ ఈ విధంగానైనా అతనిజీవితంలో పరిపూర్ణత్వం కలిగితే కొంతమంచిదే!" అంటూ. భర్త ఈ అతిఉదారస్వభావము లలితనుపూర్తిగా ఆమెభర్త దెస భక్తురాలిగా మార్చివేస్తుంది. నాటకములో అక్కడక్కడ మాత్రము విశ్వేశ్వర రావు అంత ఉదారవంతుడైనా అతనిజీవితము ఒంటరిజీవితమనీ, త్యాగమయు లనూ, సంతోషానికీ చాలాదూరమనీ, వ్యక్తమగుతూ ఉంటుంది. అతని ఉదారత్వా నికి అతనిని ఎంత మెచ్చుకుంటామో అతని ఏకాకి మనుగడకు అతనిపైన అంత జాలీ కలుగుతుంది మనకు.

ఈ నాటకము, పేరుకు, సాంఘిక నాటకమైనా ఎక్కువగా వ్యక్తుల భావపరంపరలను చిత్రిస్తూ, వారివారి అంతరంగములను ప్రస్ఫుటముజేసే మనస్తత్వ పరిశీలనగా పరిణమించినది. దివాన్‌గా అయ్యగారి వీరభద్రరావు, లలి తగా కొమ్మూరి పద్మావతి చాలా బాగా నటించారు. ఆ యా సన్నివేశాలలో నేపథ్య సంగీతము చాలా అనువుగా కుదిరి ఇతర రేడియోనాటక పరికరాలున్నూ బాగా సమ కూరినవి. ఒక్కొక్కచోట మాత్రము నేను ఆశించిన వాతావరణమునకూ తేగలిగిన వాతావరణకూ తేడా లేకపోలేదు. ముఖ్యంగా, మోహన్ లలితకు వయొలిన్ ఆఖరి పాఠము నేర్పే సన్నివేశంలో, అచట మాటలు మోహన్‌వి అయినా, వాద్యము నిలయవిద్వాంసుడు వాయించాలి. అతను సప్తతంత్రుల వయొలిన్‌పైన వాయించే గొప్ప నిపుణుడు. ఈ నాటకమునకు అంతటినిపుణత అవసరములేదు. కాని, అత నిని ఈ నాటికకు ప్రక్కవాద్యకునిగా నియమించారు. కాబట్టి, ఆ వయొలిన్ పాఠము అతనే చెప్పవలసి వచ్చింది. చాలా జాలిగా ఉండాలని నేను 'క్షీరసాగర శయనా' అనే దేవగాంధారి కృతిని ఉంచాను ఇక్కడ. లలితామోహన్‌ల ఇచ్చటి సంభాషణ మూడు నిముషాలలో అయిపోవాలి. కాని నిలయవిద్వాంసుని దేవగాంధారి ఆలాపనా, పల్లవీ, అనుపల్లవీ, వీనికి పదినిముషాలైనా చాలవు. ఆ సన్నివేశములో చప్పున దేవగాంధారి రాగముద్వారా విపరీతపుజాలిని స్ఫురింపజేసి లలిత వెక్కి

వెక్కి ఏడుస్తుండగా ఆ ఏడుపుకు తగినట్లు కొంత రాగచ్ఛాయనూ, ఆ పాటలోని ఒక్క చరణాన్ని మాత్రమే వినిపించి టక్కున ఆపివేయాలి. ఆపివేస్తూ మోహన్ లలితను ఊరడించాలి, అని నా ఊహ. నేను అనుకున్నట్లు చేసివుండగలిగితే ఆ సన్నివేశము ఎంతో రక్తికట్టేది. కాని, ఆ విద్వాంసుని ముందు నా ఆటలు సాగ లేదు. దేవగాంధారిరాగము పూర్తిగా ఆలాపించవలసినదే! మొదటి చరణము, అన్నిస్వరాలతోనూ వినిపించవలసిందే! అలాకాకుండా నేను అతని వాద్యమును టక్కున ఆపినందుకు వయొలిన్ విద్వాంసుడు చాలా ఖిన్నుడయ్యాడు.

కాని, మొత్తముమీద నాటకము మాత్రము చాలా గొప్పగా ప్రసార మైనది.

మరునాడు ఉదయం ఊళ్లోకి వెళ్ళగా, త్యాగరాజనగరంలో ఒక కాఫీ హోటల్లో ఈ నాటకమునుగురించిన చర్చ నేను విన తటస్థించింది. చర్చించేవారు నాకుచాలాస్నేహితులే! వారుఅనుకుంటున్నారు: "ఈభావాలూ అందరికీఅర్థమవుతవా? మాటవరుసకు, బెజవాడలో నిన్నరాత్రి ఈ నాటకమును వినిన ఫలానా లాయర్‌గారు ఏమంటారో ఈ నాటకములోని కొన్ని కొన్ని సంభాషణలనుగురించి? కొన్నికొన్ని ఉన్నతాదర్శాలు-ఒక విధంగా విప్లవాత్మకమైనవి-ప్రకటించేటప్పుడు ఆ ఆదర్శా లను సగముసగము అర్థంచేసుకునేవారికి చాలా అపకారము చేస్తాయేమో!' అను కుంటున్నారు, నా మిత్రులు, నేను వారివద్దకు వెళ్ళేసరికి. నేను వారితో వాదించ లేదు. వారు సూచించిన భయము వట్టిభ్రమ కాదు కాని, సత్యమును ప్రకటించడమూ మన ధర్మమేకదా? కొన్ని కొన్ని విషయాలు పరమసత్యముగా భావించిన మనము వానిని గురించి ఇతరులకున్నూ చెప్పకుండా ఉండగలమా మరి?

గుడిపాటి వెంకటచలము రచించిన 'భానుమతి'న్నీ ప్రదర్శించాము. 'చలం' నాటికలలోకల్లా అన్నివిధాలా మిక్కిలి ఉత్తమశ్రేణికి చెందినది 'భాను మతి' అనుకుంటాను నేను. నిజానికి, ఇంతవరకు వచ్చిన తెలుగు ఏకాంకికలలో 'భానుమతి'కి సాటియైనది మరొకటిరాలేదు. చలం 'భానుమతి' ప్రసార మైన పిదప వారి ఇతర నాటకాలెన్నో ప్రసారము చెయ్యాలని ప్రయత్నిం

చాము. ఆ ఉద్దేశముతోనే 'అనూరాధ' నాటికను నిలయపు నటీనటులచే చదివించానుకూడ. కాని, ఆ నాటకమును చదివించినకొద్దీ ఆ గొప్ప రచనను ప్రదర్శింపగల నటులూ లేరు, విని ఆనందింపగల శ్రోతలూ లేరు ఇంకా మన సమాజములో అని ఆ యత్నమును విరమించుకోవలసివచ్చింది.

జనవరి 1939లో నాకు తిరుచునాపల్లి బదిలీ అని ఉత్తరవు వచ్చింది. కొంత సంతోషమూ, కొంత విచారముకూడా. మరొక క్రొత్త రేడియోనిలయపు నిర్మాణములో నాకు అవకాశము కలుగుతూంది. మరొక భాషలోని అందచందాలను లక్షలాది జనులకు వెల్లడిచేయవచ్చును అని ఉత్సాహము. కాని, ఈ ఏడాదిలోనూ, మద్రాసు నాకు చాలా అలవాటైనది. ఎంత వద్దనుకున్నా నా వ్యక్తిగత జీవితములోకి కొన్ని కొన్ని కొత్త ప్రభావాలు ప్రసరించి, చీకటిమనుగడలో కొంత కాంతి నియ్యసాగినవి. ఈ ప్రభావములనుంచి దూరమగుట కష్టమే! కాని అది తప్పనిసరి; నాకు మంచిదీకూడా!

కావేరీతీరమున పవ్వళించిఉన్న శ్రీ రంగనాథస్వామి పిలుపు వినిపించింది. ఉత్సాహముతో సిద్ధమయ్యాను నేను.

## ౧౪

### శ్రీరంగము.

"రాత్రి వసంతోత్సవము చేస్తున్నాము, మీరు తప్పకరావాలి?" అని స్థానికులు పార్థసారథి అయ్యంగార్ కబురుచేశారు. ఆ సాయంత్రము రేడియోలో పాటకచ్చేరి, నేను ఉండవలసినపనిలేదు. దీపాలవేళకు శ్రీరంగము చేరాను. శ్రీరంగనాధుని సేవించి, అచటగల మరి ఇతర పుణ్యస్థలాలనూ తిలకిస్తూ, వసంత మంటపము జేరాను.

అబ్బ! ఆ దృశ్యమును చూడాలేగాని, వర్ణింపలేము. అన్నీ పువ్వులే! ఎక్కడనుంచి వచ్చాయో ఈ లక్ష సన్నజాజిమాలలు! ఏమి అలంకాలము! ఏమి అలంకారము!! సన్నజాజీ, ఎర్రగన్నేరూ కలిపికట్టిన మాలలు నిలువునా వ్రేలాడుతున్నవి మంటపము పైభాగమునుంచి క్రిందివరకున్నూ, బెత్తెడు బెత్తెడు దూరంగా. దట్టమైన ఈ పూలమాలికల తెరలోంచి కనిపిస్తోంది కల్యాణవేదిక. ఇటు గులాబీపూల రాసి-అటు ఎర్రతామరల ప్రోవులు. మధ్యను రంగనాధుడూ-రంగనాయకీ ఉత్సవవిగ్రహాలు. అర్చకులు ప్రతిమలను ఇంకా అలంకరిస్తున్నారు. నేల అంతా ముగ్గులే! రకరాకాల ముగ్గులు-తెలుపూ, పసుపూ, ఎరుపూ రంగులతో. మంచిగంధపుసువాసనా, కస్తూరి జవ్వాది సువాసనలూ, పువ్వుల సౌరభమూ కలసి ఏదో అనిర్వచనీయమైన అలౌకికపువాతావరణముకలుగజేస్తున్నవి. నేను ఈలోకంలో లేను. విభ్రాంతుడనైన నన్ను చూచి పార్థసారథి అన్నారు: "నాకు తెలుసు, మీరిలా తన్మయులైపోతారని; అందుకే, మిమ్మల్ని రమ్మన్నాను. అలంకరణ ఇంకా ఒక అరగడియసేపు కావచ్చును. ఇంతట్లోకీ రంగనాయకి మూలవిగ్రహమును చూచి వద్దాము రండి," అని తీసుకువెళ్ళారు నన్ను, పార్థసారధి. విశాలమైన ద్వారముల లోంచి ప్రవేసిస్తాము మనము రంగనాయకీదేవాలయ ప్రాంగణములోకి. ఎదుట ఎన్నో ఎన్నో అందమైన శిల్పాలు, రాయలనాటివి అన్నారు, పార్థసారధి. ప్రదక్షిణముచేసివచ్చాక, లోపలమంటపాలు చూస్తూఉంటే, మంటపము పైకప్పులోపలి

భాగమంతా, గోడలపైనా, కృష్ణలీలలూ, భాగవత పురాణగాధలూ చిత్రించిఉన్నవి. మన బందరుకలంకారీ బొమ్మల తీరున. ఒక్కొక్కగాధనూ తెలియజెప్పుతూ తెలుగులో రచన! ఉత్సాహంతో కేకవేశాను నేను: "ఇదంతా తెలుగే!" అని. స్థానికులు పార్ధసారధి అన్నారు:"అవును; ఇచ్చట దేవాలయఅలంకరణ అంతా తెలుగువారే చేస్తూ వచ్చారు. విజయనగరరాజుల పోషణంలో ఉండేవికావా, మరి, ఈ ఆలయాలు!"అని. నేను చాలాచాలా గర్వించాను తెనుగునాటికి ఇంతదూరాన, లక్షలాది నానాదేశ ప్రజలూ దర్శించి తరించే ఈ పుణ్యస్థలాన, పురాణగాధలను ఇలా తెలుగు భాషలో వర్ణించి చెపుతూ, ఇలా తెలుగు శిల్పులు చిత్రించి ఉన్నందుకు!

రంగనాయకి విగ్రహమును చూచి నేను అట్టే నిలచిపోయాను-ముందు అడుగువెయ్యడానికి కాలు కదులలేదు. ఆ కన్నులలోని చల్లని చూపులు నన్ను కట్టివేశాయి. తీర్చిదిద్దిన ఆ నాసికను అలంకరించిన నత్తూ, అడ్డబాసా నన్ను విస్మితునిచేసి, ఆ కనకాంబరపు చీర నాలో ఏవో ఏవో అనిర్వచనీయమైన ప్రేమతో కూడిన భక్తిభావాలను రేకెత్తించినది. నన్నని ఆ నడుముచుట్టూ వెడల్పైన బంగారపు వడ్డాణము. మువ్వల వడ్డాణము, దీపపు కాంతిలో ధగధగ మెరిసిపోతోంది. అప్పుడు నాకు ఒక వెర్రి ఆవేశం కలిగింది. దేవికి కుడివైపుఉన్న పళ్ళెంలోని గులాబీ పువ్వులను తీసికొని ఒక్కొక్క పువ్వు ఆ వడ్డాణము చుట్టూ అలంకరించాలని! వెర్రిఊహ!.... అర్చకుని అష్టోత్తర పఠనము నన్ను మేలుకొలిపింది. ఆ తర్వాత హారతీ, ఇత్యాదులు. చిన్న వెండిగిన్నెలో శ్రీచందనమూ, కస్తూరీ, పచ్చకర్పూరమూ రంగరించి మనకు ఇస్తారు; అంటే, అతిముఖ్యులైన భక్తులకు.అది ఒక గౌరవము. నవనాగరీకులు ఈ చందనాన్ని కొనవ్రేలుతో తాకి నుదుట నుంచుకుంటారు. నేనుమాత్రము దోసిలిలో తీసుకుని చెంపలకూ, కంఠానికీ రాచుకున్నాను. మల్లెపువ్వులాంటి మల్లుచొక్కాకు గంధమవుతుందీ అని సందేహించక. చొక్కాబొత్తాములుతీసి ఒంటికీ రాచుకున్నానుకూడా ఘుమఘుమలాడే ఈ పవిత్రమైన శ్రీచందనాన్ని,

ఆచోటు విడువలేక, విడువలేక, విడిచివచ్చాను-రంగనాయకి సమక్షము నుంచి, బయటకు. కాని, ప్రాకారము మలుపు తిరిగానో లేదో, చిత్రము, నాకండ్ల

ఎదుట ప్రత్యక్షమైనది ఒక దివ్యమంగళ విగ్రహము-అదేమి మాయయో, అచ్చంగా దేవి ధరించినటువంటి కనకాంబరపు పట్టు చీరే, ఆ కంఠమాలలే. తీర్చిదిద్దిన నాసికకు అటువంటి అడ్డబాసే, అన్నిటికంటె మరీ చోద్యము: అటువంటి వెడల్పైన మువ్వల వడ్డాణమే-ఎవరో యాత్రికురాలు! ఆమె దేవిసమక్షమునకు వస్తున్నారు; నేను ఆరాధించి వెళుతున్నాను. నన్ను చూచి, పరమ సాత్వికభావ ముప్పతిల్లే చిరునవ్వు నవ్వి, ఆమె గుడిలోకి వెళ్ళిపోయారు. ఎందుకో, ఆమెకు 'మంగళము'అనే పేరు పెట్టుకున్నాను, నేను, నా మనస్సులో. తరువాత, కొన్ని ఏండ్లతర్వాత నేను రచించిన 'వడ్డాణము' అనే ఒక కథలో ఈ 'మంగళము' ప్రధానపాత్ర వహిస్తుంది.

ఇది ఒక విచిత్రమైన అనుభవమే! మనము చూచిన ఒక క్షణిక దృశ్యము అలా మనోవీధిని, మన అంతరంగంలో, శాశ్వతంగా నిలచిపోయి, ఎంతోకాలం తరువాత, కావ్యవస్తువుగా అతి తీవ్రముగా తాండవిస్తుంది. నా 'వడ్డాణము' కథ నిజంగా ఒక వడ్డాణమును గురించే!

'సుకుమార్' అతి సుకుమారవంతుడు. వెన్నవంటి మనస్సుగలవాడు. ప్రేమమయము అతని జీవితము. అందువల్లనే, అతను చాలా బాధపడతాడు. అతను ప్రేమించి, సర్వస్వమూ ధారవోసిన 'కనకము' అతని అపూర్వమైన ప్రేమ అంతస్థును అందుకోలేకపోతుంది-అందుకో ప్రయత్నించదుకూడ, ఆమె నైజము వేరుకాబట్టి. తన మనుగడకే కనకము స్నేహము అత్యవసరముగా పరిగణిస్తూ వచ్చిన సుకుమార్‌ను ఆమె ఉదాసీనత చాలా గాయపరుస్తుంది. తీవ్రమైన మనోబాధతో పరితపిస్తున్న సుకుమార్ తండ్రిఆదేశము ప్రకారము, తన ప్రాణ స్నేహితుడైన 'సంపత్‌కుమార్'ను చూడడానికి శ్రీరంగము వస్తాడు. లోకోత్తర స్నేహము సుకుమార్‌సంపత్‌ల స్నేహము. వారిదేహములు వేరైనా వారిద్దరి ఆత్మలూ ఒక్కటే! ఆ సంపత్ భార్యే మంగళము. స్త్రీకి ఉండవలసిన లావణ్యమూ, సుగుణసంపత్తీ, సౌశీల్యమూ, అపరిమితసానుభూతీ రాశిగా అవతారము దాల్చాయి నా మంగళములో. సుకుమార్ శ్రీరంగము వచ్చేసరికి సంపత్ ఊళ్ళో

ఉండడు. సుకుమార్ మొదట రంగనాయకిని దర్శించి, తర్వాతనే వస్తాడు, సంపత్‌ని చూడడానికి. రంగనాయకిని సేవిస్తున్నప్పుడే సుకుమార్, దేవి సమక్షనే, మంగళాన్ని మొదట చూస్తాడు. అతడామెను చూచి ఉండలేదు ఇదివరకు, సంపత్‌ద్వారా ఆమెనుగురించి విని ఉన్నాడు. దేవిసమక్షన ఉండగా, రంగనాయకి ధరించిన అలంకరణే, మంగళాన్ని అలంకరించి ఉండడమూ, ఆ వడ్డాణమే ఈ భక్తురాలూ ధరించడమూ సుకుమార్‌ను ఆశ్చర్యనిమగ్నుని చేస్తుంది. విభ్రాంతుడై, అపరిచితవైపు అలా చూస్తూ ఉండిపోయిన అతని గురించి ఆమె కినుక వహింపదు. అతని చూపులలోని పరమపవిత్ర భావాన్ని ఆమె అర్థముచేసుకుని అతి సాత్వికమైన చిరునవ్వు ప్రసరిస్తుంది, అతనిపైన. ఆ చిరునవ్వును అతను తన హృదయాంతర హృదయంలో పదిలపరచుకోడానికి కళ్ళు రెండూ గట్టిగా మూసుకున్న నిమిషంలో ఆమె ఆ ప్రదేశంనుంచి వచ్చివేస్తుంది. మరునాడు ఉదయము సంపత్ ఇంటికి వచ్చిన సుకుమార్‌కు వారింటి మధ్యహాలులో ప్రత్యక్షమవుతుంది మంగళము—సుకుమార్ ప్రాణస్నేహితుడైనసంపత్ భార్యగా! తలంటుకోబోతున్న ఆమె తన వడ్డాణాన్ని మెళ్లో వేసుకుని ఉన్నది. తనూ, చిన్నప్పుడు వాళ్ళ అమ్మ వడ్డాణాన్ని తన మెళ్ళో వేసుకునేవాడు. తన తల్లి, చనిపోయే ముందు, వణికేచేతులతో, అతని మెళ్ళో అమర్చింది ఆమె వడ్డాణాన్ని. ఇది ఎప్పటికీ మరచిపోలేదు సుకుమార్.

భర్త ఊళ్లో లేకపోయినా, సుకుమార్‌కూ, తన భర్తకూ ఉన్న అవినాభావ సంబంధమైన అపురూప స్నేహభావాన్ని గురించి తెలిసిఉన్న మంగళము సుకుమార్‌ని ఆదరించి అతిథిసత్కారము చేస్తుంది, అతనిని వారింటనే ఉండమని పట్టుబట్టి. మిక్కిలి సంస్కారవంతురాలైన మంగళము, మాటల సందర్భాన, సుకుమార్ జీవితఉదంతము తెలుసుకుని అతనియెడ అపరిమితమైన సానుభూతిని ప్రకటిస్తుంది. ఈ సానుభూతివల్ల ఆమె సుకుమార్‌కు మరింత సన్నిహితమవుతుంది. వారిద్దరి మధ్యా ఒక గొప్ప స్నేహము అవతరిస్తుంది. ఒక విచిత్ర సన్నివేశంలో మంగళము సుకుమార్ పీడితహృదయానికి కొంత శాంతినిచ్చే ఉద్దేశంతో, అతని తల్లి స్థానాన్ని అందుకోయత్నిస్తుంది! సుకుమార్ ఆమె ఎదుట

మోకరిల్లి, తన కన్నీటితో ఆమె వడ్డాణానికి అభిషేకము చేస్తాడు. ఆ సమయానికే సంపత్ అక్కడకు రాగా, మానసికంగా ఇంకా పూర్తిగా పరిణతికి చెందని సుకుమార్ తాను ఏదో తప్పు చేశాను అనే భావంతో సంపత్తూ మంగళమూ అతనిని ముక్కిలి ప్రేమతో పిలుస్తున్నా, వినిపించుకోక అక్కడనుంచి పారిపోతాడు.... తరువాత తరువాతగాని తెలియదు అతనికి సంపత్తూ, తానూ, మంగళమూ ఒకే ఆత్మయొక్క భిన్న స్వరూపములని.

ఈ కథలో, పురుషునికీ పురుషునికీ మధ్య గాఢమైన స్నేహము ఎంత గొప్పగా వర్థిల్లకలదో పురుషునికీ స్త్రీకీ మధ్యకూడా అంతటి గాఢమైన స్నేహమూ వర్థిల్లడానికి అవకాశం ఉన్నదని నిరూపింప యత్నించాను, నేను. కాని, ఒక పురుషునికీ, ఒక స్త్రీకీ మధ్య ఇలాంటి స్నేహము ఉండాలి అనే ఆశయము నేను క్రొత్తగా కనిపెట్టినది కాదు. ఈమధ్య, భవభూతి ఉత్తరరామచరిత్ర చదువుతుంటే చూచాను: జనకమహారాజు కౌసల్యనుగురించి అంటాడు: 'నా ప్రియసఖి, కౌసల్య' అని. ఆ మహారాజు దశరథుని దేవేరిని 'నా స్నేహితురాలు. కౌసల్య' అనడము నన్ను చాలా చాలా ఆనందింపజేసింది!

* * * *

దేవాలయాధికారులవద్ద సెలవుదీసికొని చాలా రాత్రి ఐనా నేను కావేరీ నది ఒడ్డుకు వచ్చాను ఒక్కడనే, పుచ్చపువ్వులా విరిసిన పండువెన్నెలలో. మాఘ పౌర్ణమి. నిండు చంద్రబింబము సూటిగా నావైపే చూస్తూన్నట్టు భ్రమ. అంతేగాక మా తల్లిగారు పరమపదించినది మాఘ పౌర్ణమి. అందుచేత ఆ మాఘపౌర్ణమీ చంద్రబింబాన్ని చూచినపుడల్లా చంద్రబింబములోంచి మా అమ్మ నన్ను పలుకరిస్తున్నట్టు అనిపిస్తుంది నాకు....

ఒక పదిహేనుఏండ్ల క్రితము ఈ చంద్రబింబాన్నే చూచాను నేను హరిద్వారమున గంగానదిలో. ఇప్పుడు మళ్లా చూస్తున్నాను కావేరీ పావనసలిలములో. ఆ గంగానదే ఈ కావేరి. ఆ చంద్రుడే ఈ చంద్రుడు. ఆ నేనే ఈ నేను. కాని,

అప్పటికింకా నా జీవితప్రాంగణములో నా ఆరాధ్య దేవత, నా సుగుణాలరాశి, జన్మతరింపజేసే నా మొదటి ప్రేమరాణి, నా 'అప్రాప్తమనోహరిణి' అడుగుపెట్టి ఉండలేదు. హరిద్వారమున గంగానదిలో పూర్ణచంద్రుని చూచ్చినప్పుడు ఒక్క-మా అమ్మ ముఖమే కనిపించినది ఆ బింబములో. ఇప్పుడు, కావేరీజలములో చిందులాడే పూర్ణచంద్రునిలో అమ్మబొమ్మప్రక్క-నే అంత ప్రస్ఫుటంగానూ, అంత లావణ్యవంతంగానూ ఆ అందాలరాశి బొమ్మ. హరిద్వారమున నా హృదయములో అమ్మలేని బెంగఉన్నా అది హృదయాన్ని డొల్చివేసే బాధ కాదు. ఇప్పుడు ఈ కావేరి ఒడ్డున చంద్రబింబాన్ని చూస్తూంటే భరింపరాని ఒంటరితనములో నా లోలోపలి లోతులను కలియబెట్టి, ఏకధారగా, కన్నీరు స్రవిస్తుంది నా కన్నుల ముందు నిలచిన 'ఆమె' ఆకారాన్ని చెదిరింపజేస్తూ.

ఈ బాధ ఎప్పటికీ ఇలా వుండవలసినదే! ప్రేమికులు చెల్లించే విధాయకమైన పన్ను ఇది. ఎటొచ్చీ ఈ కన్నీటిని ఎవరూ విలువకట్టలేరు; అంతే!

*  *  *  *

తిరుచ్చినాపల్లి రేడియోకేంద్రములో తొలిరోజులలోనే ప్రసారమైనది నేను రచించిన 'కర్ణ, కుంతీ' అనే తమిళ రూపకము. ఈ నాటకము రవీంద్రుని రచనకు అనుసరణ. "తమిళభాషకు నూతన అలంకారముగా రాణించదగినది. ఇదివరకు తమిళములో ఇటువంటి నాటికలు లేవు" అని లేఖకునిగా నాకు సాయముచేస్తున్న పండితుడు అయ్యం పెరుమాళ్ కోనార్ అన్నారు. కాని, నా రచనలో తమిళమున విల్లిపుత్తూర్ మహాకవి రచించిన భారత భాగాలనూ ఉపయోగించాను. కథాప్రారంభమునా, కుంతీదేవి సంభాషణలోనూ, కర్ణుని ప్రత్యుత్తరములోనూ, మిక్కి-లి రసవంతమైనవి కొన్ని విల్లిపుత్తూర్ భారతవృత్తముల నుంచాను. ఈ వృత్తములు చాలా అందంగాఉంటవి. నడకలో ఒక చక్క-ని ఉద్వేగముంటుంది. మనము సాధారణముగా వింటూన్న వాడుకభాష తమిళానికీ, గ్రంథస్థమైన ఈ తమిళభాషకీ చాలా తేడా ఉంటుంది. విశేషపరిశ్రమవలన నాకు ఈ గ్రంథస్థ తమిళభాషతో బాగా పరిచయమై ఆ భాష అంటే ఎంతో ప్రీతి కలిగినది.

క్రమక్రమంగా తమిళులకు అత్యాధునికంగా కనిపించే ఎన్నో ఎన్నో నూతన భావాలను నేను వారి ఈ గ్రంథస్థ తమిళభాషలో వ్రాయసాగాను నా నాటికలలో.

రేడియోస్టేషన్ తొలిరోజులు కాబట్టి నా నాటికకు తగిన పాత్రధారులను నేనే వెతుకవలసి వచ్చింది. మా డైరెక్టర్ గోపాలన్ సలహా ప్రకారము శ్రీరంగపు హెడ్‌మాస్టర్ కుటుంబానికిచెందిన మంచి సంస్కారముగల ఒక అమ్మాయిని కుంతీ పాత్రకు నిర్ణయించాము. కాని, తీరా ఆమె తన పోర్షన్‌ను చదివి ముగించే సరికి నాకు తోచింది, ఆమె ఎంత చదువుకున్నదైనా ఈ పాత్రను నిర్వహింపగల శక్తి ఆమెకు లేదని. అందువలన నాటకమునకు ఉపోద్ఘాతముగా చెప్పవలసిన మాటలు చెప్పడానకి ఆమెను నియమించి, కుంతికై మళ్లా వేట సాగించాను, వ్యవధి అంత లేకున్నా. ఆ ప్రాంతాలలో స్టేజి నాటకములలో కొంత పేరు గడించిన 'విజయకుమారి' ని తీసుకువచ్చారు. నాకు స్టేజినటకులంటే భయం. స్టేజినాటకానికీ, రేడియోనాటకానికీ నల్లకుక్కకూ, తెల్లకుక్కకూ ఉన్నంతతేడా ఉన్నది; కాకికీ కోయిలకూఉన్నంత తేడా ఉన్నది. అందువల్ల, కాస్త సందేహిస్తూనే ఆమెచేత పోర్షన్ చదివించాను. కాని, చిత్రము! చిరకాలస్టేజిఅనుభవం వల్ల ఆమె ఉచ్చారణలో ఎంతో అతిశయోక్తి ఉన్నా విజయకుమారితో విపరీతమైన భావనాబలము కనిపించింది నాకు. పైగా, నా రచనలోని నూతనత్వాన్ని ఆమె చాలా హర్షిస్తూ, ప్రాణమిస్తూ చదివింది. అందువల్ల, ఆమెనే ఆ పాత్రకు నిర్ణయిస్తూ రెండుమూడురోజులు చాలా శ్రమపడి ఆమె ఉచ్చారణను మార్చగలిగాను. ఆమె కంఠస్వరములోనూ ఇదివరకు ఎప్పుడూలేని మార్దవమూ, సానుభూతీ ప్రకటిస్తూ సానుభూతిని కోరుతూన్న ఒక రీతి ఆప్యాయతనూ కల్పింపగలిగాను. ఆమెకూడా పూర్తిగా నా ఆశయాన్ని అర్ధముచేసుకుని నా శిక్షణను ఫలవంతము చేసింది.

డైరెక్టర్ గోపాలన్ నిర్దేశించిన వ్యక్తినిమాత్రము ఈ పాత్రనుండి తొలగించినందులకు నేను బాధపడ్డాను. కాని, అప్పటి పరిస్థితులలో తిన్నగా ఆయనవద్దకు వెళ్ళి ఇలా ఇలా ఈ కారణాలవల్ల మీరు చెప్పిన ఆమె ఈ పాత్రకు పనికిరానందున నేనే మరిఒకరిని నియమిస్తున్నాను అని చెప్పడానికి సాహసం

లేక పోయిందినాకు. అందుచేత, వారిపేర ఉత్తరం వ్రాసి, ఈ విషయాలన్నీ వివరిస్తూ నా చర్యను గురించి ఏమీ అనుకోవద్దు అని ప్రార్థించాను వారిని. నా ఉత్త మును చూచి ఆయన ఏమనుకున్నారోగాని, రేడియోలో ప్రసారమైన నాటకమును విన్నాకమాత్రము, ఆయన నన్ను టెలిఫోన్‌లో పిలచి అన్నారు! "నాటకము విన్నాను, చాలా బాగుంది—మనము పడిన శ్రమ ఫలించినదనే అనుకుంటున్నాను, నేను" అన్నారు.

వారి ఈ 'మనము' అనే మాటలో ఎంతటి సహృదయత్వము ఇమిడి ఉన్నది! ఇటువంటి పైఅధికారులతో కలిసి పనిచెయ్యడము ఒక గొప్ప అదృష్టము!!

ఆధునిక తమిళనాటక రచయితలలో పేరుపొందినవారు శ్రీ కే.పి. రాజ గోపాలన్. వారు రచించిన 'అభిమన్యన్' నాటికనున్నూ తిరుచ్చినాపల్లి రేడియో తొలిరోజులలో ప్రసారము చేశామ నేను. ఈ నాటికలో ఉత్తరగా విజయకుమా రినే నియమించాను. కాని, ఎంత వెతికినా నాకు కావలసిన అభిమన్యుడు దొరక లేదు. ఈ అన్వేషణలో విసిగి, చివరకు, ఆపాత్రను నేనే నిర్వహింపడానికి నిశ్చయించాను. ఇది సాహసమే. అభిమన్యుడు ఉత్తరను విడిచి, శయ్యామంది రము నుండే తిన్నగా యుద్ధభూమికి వెళ్ళే భావము నాకు పూర్తిగా అవగాహము. అటువంటి తీవ్రమైన, అతిగాఢమైన అనుభవమూ కలిగినది నాకు, నా జీవితములో. కాని, తమిళభాష నేను ధారాళంగా చదువలేను. ఆ లిపి నాకు అంత అలవాటు లేదు. అందుచేత, నా పోర్షన్ అంతా, తమిళసంభాషణను, తెలుగులిపిలో వ్రాసి కొని, పదిసార్లు, ఇరవైసార్లు రిహర్స్ చేసుకున్నాను, పండితుడు అయ్యం పెరు మాల్ కోనార్ ఎదుట. స్టూడియోలో, విజయకుమారినీ చాలా చాలా శ్రద్ధతో రిహర్స్ చేశాను. ఆమెకున్నూ ఇటువంటి పాత్రలు క్రొత్త. రవీంద్రరచనను అనుసరించిన ఈ నాటికలో ఉత్తరలో ఎంతో ఆర్ద్రత కనిపించాలి. స్టేజినాటక ములో విపరీతపు శోకరసాన్ని అతి ఇదిగా ప్రకటించేవారు, ఇటువంటి మిక్కిలి సున్నితమైన పాత్రను నిర్వహించడము కష్టము. కొన్నాళ్ళకుముందు ప్రసార మైన 'కర్ణ, కుంతీ' నాటికలో ఎంతో కొంత అనుభవమున్నా విజయకుమారి

ఈ ఉత్తరను ఎలా సాధిస్తుందో అనే బెంగ నాలో లేకపోలేదు. అంతకంటే ఎక్కువగా, మరో బెంగ: అభిమన్యునిగా నేను ఎలా నిర్వహిస్తానో అని. స్టూడియోలో ఎర్రదీపము వెలిగేవరకున్నూ కూడా, నేను చదువుతూనే ఉన్నాను విజయకుమారి ఎదుట, నా మాటలను. ఆమెకూ తెలుసు నేను తెలుగులిపిలో వ్రాసుకున్న మాటలు చదువు తున్నానని. నా విపరీతపు వ్యాకులత చూచి ఆమె కన్నులు నవ్వు తున్నట్టూ, నేను గ్రహించాను.

పదినిమిషాల 'అభిమన్యన్' రేడియో రూపకము ఒక్కనిమిషములోనే అయిపోయినట్టు అనిపించింది. ప్రాణప్రదమైన ఉత్తరను విడిచి అనురాగ హృదయుడు అభిమన్యుడు వీరునిగా యుద్ధభూమికి వెళ్ళిపోయాడు. ఉత్తర మూర్ఛిలి, క్రిందపడిపోయింది. స్టూడియో ఎర్రదీపం ఆరిపోయింది. ఉత్తరగా, నేను అనుకున్నదానికి పదిరెట్లు అందముగా నటించినది విజయకుమారి. ఆమె దగ్గరకువెళ్ళి "అమ్మాయి! చాలా బాగా నటించావు!" అని! నేను అనేసరికి, మెరిసి పోతూన్న కళ్ళతో, ఆమె అన్నది: "మీకంటే బాగుగానా! ఎలా ఒప్పించగలిగరో అభిమన్య పాత్రను ఇంత చక్కగా, అపరిచితమైన భాషలో - ఇదే నాకు ఆశ్చర్యంగా ఉన్నది!! ఎంత బాగా నటించారు!!" అంటూ, సంప్రదాయానికి కొంత నిరుద్ధమైనా, నా రెండు చేతులూ తన చేతులలోకి తీసుకుని, నన్ను మనసార ప్రశంసించినది, విజయకుమారి !!

ఆమెను గురించిన నా ప్రశంస వినిపించుకోక, మెరిసే కళ్ళతో, విజయకుమారి నన్ను అలా మెచ్చుకోవడము జీవితములో మరుపురాని ఒక నిమిషము.

౧౫

బసో మేరే నైనమే నందలాల్
మోహనీ మూరత సోంవరీ సూరత,
నైనా బసే బిసాల్
అధరసుధారస మురళీ రాజత
ఉర బైజయంతీ మాల్.
క్షుద్ర ఘంటికా కటితట శోభిత
నూపురశబ్ద రసాల్.
మీరాప్రభు సంతన సుఖదాయీ
భగత బఛల గోపాల్.

విపరీతపు గాలీ, వానా; కటికచీకటిలో, ఉన్నట్టుండి ఉరుములూ మెరుపులూను. శ్రీకృష్ణప్రేమోన్మాదినియై, వెర్రిగా పరుగెత్తుతోంది, మీరా, యమున వైపు ఆ చీకటిలో, ఆ హోరు గాలిలో, తళుక్కు తళుక్కుమనే మెరుపులే త్రోవచూపగా, 'ప్రేమోన్మాదిని మీరా!! ప్రేమోన్మాదిని మీరా!!' అని పాడుకుంటూ. "ఆగు, మీరా!" "ఆగు మీరా!!" అంటూ వెంబడిస్తున్నాడు భర్త, కుంభరాణా. పిలుపు వినిపించినా, ఆమె నిలువదు. ఒక్కటే పరుగు, యమునవైపు!

మీరా నదితీరాన్ని చేరనే చేరింది. కళ్ళు మిరుమిట్లుగొలిపే ఒక మెరుపు మెరిసి, ఫెళఫెళమంటూ ఒక ఉరుము ఉరిమి, మీరా యమునలో లీనమై పోయింది. ఆక్షణిక విద్యుత్కాంతిలో చూస్తాడు రాణా, నదిలో కొట్టుకు పోతున్న మీరా పావన స్వరూపాన్ని. దూరాన నుంచి యోగీశ్వరుని పాట వినిపిస్తుంది, 'జ్యోత్ మే జోత్ మిలా!' అంటూ.

## సాగుతున్న యాత్ర

....తిరుచ్చి కేంద్రమున నేను ప్రసారము చేస్తున్న మీరాబాయ్ నాటకము సంపూర్ణము. ఇంకొక్క నిమిషములో, ఇంటినుంచి ఫోన్ చేస్తారు డైరెక్టర్ గోపాలన్ : "నాటకము చాలా బాగానడిచింది; కాని...." అంటూ, నా ప్రదర్శనలోని లోపాలను గురించి చెపుతారు. కాని, చివరకు అంటారు, ఆయన : "ఐనా, మనము అనుకొనిన దానికంటే చాలా బాగున్నది, నాటకము!" అని. వెంటనే, వచ్చేవారము, మళ్ళా ఈ రోజున్న ప్రసారము కానున్న మరిఒక నాటకాన్ని గురించి వివరాలు అడుగుతారు, నన్ను. ఈ నిరంతర యత్నములో విశ్రమించడానికి వ్యవధి ఉండదు; ఉండకూడదు, కూడా.

మీరాబాయ్ గాథలో నాకు ఆసక్తి వింతగానే కలిగినది. కాలేజ్‌లో ఉన్నప్పుడు, మొదట విన్నాను మీరాను గురించి, ప్రిన్సిపాల్ జేమ్స్ కజిన్స్ రచించిన అంగ్లనాటికద్వారా. ఆతర్వాత, కొంపెల్ల జనార్దనరావు రచించిన తాన్సేన్ రూపకములో మీరాబాయ్‌ని గురించి చదివాను. ఇప్పుడు, తిరుచ్చి నిలయానికి బయలుదేరే ముందు, మద్రాస్‌లో నాకు క్రొత్తగా స్నేహితులైన ఒకరి ఇంట విన్నాను జూతికారాయ్ పాడిన ఎన్నో మీరాపాటలు. సమాన అభిరుచులు స్నేహకారణమైతే, స్నేహమే సమాన అభిరుచులకు త్రోవ చూపుతుంది. వారి సహవాసమువలననే నాకు మీరా సాహిత్యమందు గొప్పఆసక్తి కలిగిది. తిరుచ్చి వెళ్ళాక, మీరాబాయి పాటలపుస్తకం రెండుకాపీలు కొని ఒకకాపీ వారికి పంపి,ఒక కాపీ నావద్ద ఉంచుకున్నాను, వారి జ్ఞాపకంగా. నాకు హిందీభాష అంతగా రాకపోయినా. ఒక్కొక్క అక్షరమూ కూడబలుక్కుంటూ కష్టపడి చదువుకునేవాడిని ఆ పాటలను, నాకు తోచినరీతిని అర్థము చేసుకుంటూ.

మీరాబాయ్‌పాటలపుస్తకంతో అలా నది ఒడ్డుకువెళ్ళి తిరిగి వస్తూంటే చటుక్కున తోచినది నాకు, మీరాబాయ్‌గాథ నాటకముగా రేడియోలో ప్రసారము చేయవలెనని. ఆఫీసుకువచ్చి, డైరెక్టరుతో చెప్పాను. ఆయన "ఊ, కానియ్యి" అన్నారు. వెంటనే పూనుకున్నాను నాటక రచనకు. నాకు చాలా ఇష్టమైన ఒక పదిపాటలను ఏరి, ఊళ్లో నేషనల్ కాలేజ్‌లో ప్రొఫెసర్‌గా ఉన్న శ్రీరామయ్యర్ వద్దకు వెళ్ళి ఆ పాటలకు అర్థము వ్రాసుకున్నాను. ఈ పాటల పూర్తిఅర్థము

తెలిసేసరికి ఎంతో ముగ్ధుడను అయిపోయాను. ఆ కవిత గురించీ, అ భక్తి పారవశ్యమును గురించీ.

కాని, నాటకానికి కథ కావాలి. కథ అల్లడానికి ప్రాతిపదికగా కజిన్స్ ఇంగ్లీషురచనకోసము వారికి ఉత్తరము వ్రాశాను. తిరుగుటపాలో వారు పంపారు తమ రచనను, సౌజన్యము వెల్లువారే ఆప్యాయమైన ఉత్తరము సహా! కథను మరింత రసవంతముగా చేయడానికి మీరాకు ఒక పెంపుడు కూతురును కల్పించాను నేను. ఆమె పేరు రాధ. మీరా నేర్పిన ప్రతి కొత్తపాటా శ్రావ్యంగా పాడు తూంటుంది రాధ. ఊరూ పేరూలేని రాధ ఈ పాటలు అలా ఎప్పుడూ పాడుతూండటము రాణాకు విసుగు కలిగిస్తుంది. పైగా, అతను గాఢముగా వాంఛించే వ్యక్తిగతమైన ప్రేమకు బదులు మీరా తన ఆత్మను పూర్తిగా శ్రీకృష్ణ పరముచేసి గోపాలుని గురించి పూట కొక క్రొత్తపాట పాడుతూ ఉంటుంది. ఈ పాటలు ఆనోటా ఆనోటా రాజ్యమంతా వ్యాపించి, రాణా తన రాచకార్యాల పైన ఎక్కడకువెళ్ళినా అక్కడ వినిపిస్తూ ఉంటాయి. పొలాల్లో పనిచేసే కూలి వారూ, మీరా పాటలే పాడుతారు; బాటసార్లూ, యాత్రికులూ మీరా పాటలే పాడు తారు; పడవవాండ్రూ చాకళ్ళూకూడా మీరా పాటలే పాడుతారు. ఇందరు 'తక్కువ జాతి' వారి నోళ్ళలో మహారాణి పేరు వినిపించడము కుంభరాణాకు మిక్కిలి కోపకారణ మవుతుంది. ఇందుకుతోడు ఒకనాడు మీరా భజనచేస్తున్న అంతఃపుర కృష్ణాలయములోకి మారువేషముతో అక్బరూ, తాన్సేనూ వచ్చారనీ, వర్తకుని వేషములోనున్న అక్బర్ తన మెడలోని అమూల్యమైన రత్నాలహారాన్ని మీరా చేతిలో నుంచాడనీ, తెలుస్తుంది రాణాకు. రాణా మండిపడతాడు. అసూర్యంపశ్య, తన భార్యను, మొగలాయి చక్రవర్తి కన్నెత్తి చూడడము ఆతనికి దుస్సహమైన అవమానము. ఒక్కనిమిషము రాణా మీరా శీలాన్ని శంకిస్తాడుకూడా. కాని, ఈ సందర్భములో రాధ అతనికి నచ్చచెపుతుంది మీరా పరమపవిత్రతను గురించి.

రాధఉద్బోధనవల్ల రాణామనస్సు మారుతుంది. కాని, అప్పటికే సమయము మించిపోయింది. అనుమానభూయిష్ఠమైన ఈ లోకంలో ఇక ఉండ లేదు, మీరా. రాణావంశముపై తనవలన కలిగిన కళంకాన్ని తుడిచివేసే నిమి

త్రము ఆమె ఆత్మత్యాగం చేసుకోడానికి యమునవైపు పరుగెత్తుతోంది, జడి వానలో, హోరుగాలిలో. త్రోవలో ఒక్కనిమిషము ఆగి, యోగియైన తాన్సేన్‌ను సందర్శించి ఒక కొంతఆత్మశాంతిని పొందుతుంది, మీరా. ఈ మీరా, తాన్సేన్‌ల సంభాషణ చాలా చక్కగా కుదిరింది, నా రచనలో.

నాటకములో, మీరాపాటలను అన్నిటినీ హిందీలోని అసలు పాటలే ఉంచాను. ఈ పాటలను చక్కగా అర్థముచేసుకొని భావముతో పాడగల శ్రీమతి సౌందరంను ఇందుకోసము పిలిపించాము, తంజావూరునుంచి. రెండురోజులు అదే పనిగా శిక్షణఇచ్చాను, వాచకములోనూ, పాటలోనూ.

ఈ నాటకరచన నాకొక క్రొత్త అనుభవము. నాకు సాయముచేస్తున్న కోనార్ పదేపదే ఆశ్చర్యపోయేవారు తమిళభాషలోకి నేను తేజూస్తున్న క్రొత్త భావాలనూ, క్రొత్తప్రయోగాలనూ గురించి. ఒకచోట, కుంభరాణా అంటాడు : "మీరా ! నేడు నీ పుట్టినరోజు. అంతులేని నా ఆపేక్షకు ఆనవాలుగా ఈ అణి ముత్యాలహారాన్ని నీ కంఠసీమ నలంకరింపనిమ్ము !" అని. వినయముతో తల వంచుకుని మెళ్లో హారమువేయించుకుంటూ, మీరా అంటుంది, భర్తతో, సూటిగా అతనికన్నులలోకి చూస్తూ : "అంతులేని ఆపేక్షకు ఆనవాలు ఎందుకు ప్రభూ !" అని. నాటకాంతమున యోగి అంటాడు రాణాతో : "రాణాజీ ! నీ మీరా ఇక లోకపు మీరా ఐపోయినది !" అని. ఇటువంటిభావాలూ, ఇటువంటిమాటలూ తమిళ భాషకు క్రొత్త. కాని, నాటకమును వినిన శ్రోతలకుమాత్రము ఇవి ఎబ్బెట్టుగా కన్పింపలేదు సరికదా, వారందరూ నాటకాన్నీ, ప్రదర్శననూ చాలా మెచ్చు కున్నారు. వారు తరుచు రేడియోలో వింటూన్న మీరాబాయి పాటలు తమిళవచన ముతో మేళవించి నాటకరూపంగా వినిపించడం వారికి చాలా ఆహ్లాదకారణమైనది.

ప్రసంగములప్రసారము సందర్భములోను, నాకు ఆ ప్రాంతములవారితో మంచి పరిచయమూ, తద్వారా కొందరు బాగా చదువుకున్నవారితో స్నేహమూ కలిగినవి. వారందరితోనూ తమిళభాషనుగురించీ, తమిళసంస్కారమునుగురించీ ముచ్చటిస్తూ సందర్భానుసారంగా తెలుగు సంస్కృతముల గురించి వారికి తెలియ

జెప్పడము సన్నిహితకారణమైనది. అంతేగాక, ఆ ప్రాంతాలలో అసహాయోద్యమ సందర్భంలో గొప్ప కృషిచేసిన మా పినతల్లి రుక్మిణమ్మగారిని బట్టిన్నీ, నాకు అనేకులు స్నేహితులయ్యారు. వీరందరూకూడా నేను తెలుగువాడనైనా తమిళ భాషలో చూపుతున్న విపరీతపుఆసక్తీ, నేర్పూ గుర్తించి చాలా సంతోషించేవారు. ముఖ్యంగా, పూజ్యులు టి. కె. చిదంబరనాథ ముదలియార్ - కంబరామాయణమున గొప్పకృషి చేశారు ఆయన - వాల్మీకిరామాయణమూ, కంబరామాయణమూ ఈ కావ్యములను పరస్పరముపోల్చి చూపుతూ ఎంతోసేపు గడిపేవారు ఆయన, నాతో. ఒకపర్యాయం నేను చదువుతూన్న 'ముత్తొళ్ళాయిరం' అనే ప్రబంధము లోని ఒకవర్ణనను ఆయనకు చూపాను: 'దట్టముగాపూచిన ఎర్రతామరలతో నిండిన ఈకొలని నీటిపైన జ్వాలాగ్ని రగులుతూన్నట్టున్నది !' అని. ఆ వర్ణనను చూచి ఆయన విస్తుపోయారు. "మీకెలా దొరకినవి ఈ పంక్తులు? మాలో చాలామందికి తెలియదు, ఇటువంటి వర్ణన ఉన్నట్లే!" అని, నన్ను ప్రశంసించారు, ఆయన. ఇటువంటివే ఎన్నోఎన్నో చక్కనివర్ణనలు చూచేవాడను నేను ప్రాచీన తమిళ సాహిత్యములో. నన్నెచోడుని కుమారసంభవములోని ఒకవర్ణనను జ్ఞాపకము చేసే వర్ణన, ఇది, అతిప్రాచీన తమిళసాహిత్యములో ఉన్నది :

'తొలకరివర్షపు చినుకులు గడ్డిచూరునుంచి క్రిందికి రాలుతూం డగా, పిచ్చుకలు చూరుఅంచులను తలక్రిందులుగా నిలచి ఆ నీటిచుక్కలను తనివితీర గ్రోలుచున్నవి !!' అని. తొల్‌కాప్యమ్ అనే మరీ ప్రాచీనకావ్య ములో ఈ వర్ణన ఉన్నది :

'ఒంటినిండా పూసుకునేవారికే తెలుస్తుంది మలయచందనగంధపు సువాసన! చెవియొగ్గి వినేవారికే తెలుస్తుంది శ్రావ్యమైనవీణాసుస్వనమాధు ర్యము. సంతోషముతో కంఠసీమను అలంకరించుకునేవారికే తెలుస్తుంది, ఆణిముత్యాలహారాల అందము !!' - అని.

మరొక ప్రాచీనకావ్యములో మహారాజు ప్రతిభను ఇలా వర్ణించారు :

'ప్రభువు కాలియందెలకు తాపిన వజ్రవైఢూర్యాలు అరిగిపోయినవి, శత్రురాజుల కిరీటములపై తాపిన వజ్రవైఢూర్యాల ఒత్తిడికి !' అని.

అతిప్రాచీన తమిళసాహిత్యంలో - ఎంత లేదన్నా - ఒక ఏబదిమంది మహిళల కవిత్వము చూడగలము మనము. వీరిలో కొందరినిగురించి చక్కని గాథలున్నూ ఉన్నవి. వీరందరూ రచించినవి పెద్దపెద్ద కావ్యములు గావు. ఈ శతాబ్దపు తొలిరోజులలో తెలుగుభావకవులు రచిస్తూవచ్చిన ఖండకావ్యములవంటివి, ఒక వేయిఏండ్లకుముందు ఈ మహిళలు రచించిన రచనలు. వీనిలో భక్తిభావముకంటే ప్రకృతిలోని రామణీయకతను గుర్తించే రచనలే ఎక్కువ. కొన్నికొన్ని మనకు పరిచితమైన శాలివాహన గాథాసప్తశతిలోని గేయములవలెనూ ఉంటవి.

....శ్రీరంగములోనూ, తిరుచునాపల్లెలోనూ చాలామంది స్నేహమయ్యారు నాకు. నేను తెలుగువాడనని తెలియడముతోనే, తామూ నాతో తెలుగు మాట్లాడ మొదలుపెట్టేవారు కొందరు. ఎప్పుడో ఒకప్పుడు తమకుగాని, అంతకు ముందుతరమువారికిగానీ, తెలుగుప్రాంతములవారితో ఉన్న పరిచయాన్ని ఏకరువు పెట్టేవారు నాముందు. ఇందరు తమిళులతో మసలుతూన్నా నాకు ఒక్క నిమిషమైనా తోచేదికాదు, నేను పరాయిదేశములో ఉన్నానని. వారున్నూ నన్ను తమలో ఒకనిగానేభావించి నన్ను ఎంతో ఆప్యాయముతో చూచేవారు.

ఒకపర్యాయము 'శిల్పశ్రీ' అనే ఒక క్రొత్త తమిళమాసపత్రికను నెలకొల్పే ఉద్దేశముతో కోలవెన్ను రామకోటేశ్వరరావు స్నేహితుడు ఒకాయన తిరుచ్చి వచ్చారు. "త్రివేణి పద్ధతినే నడుపజూస్తున్నాను ఈ పత్రికను" అన్నారు ఆయన. ఆయనను నాతోకూడా తీసుకువెళ్ళి తిరుచ్చిలోనూ, శ్రీరంగములోనూ, ఆ చుట్టుపట్ల కొన్నిగ్రామాలలోనూ, నాకుతెలిసిన సంపన్నతమిళ గృహస్తులను చందాదారులుగా చేర్పించాను, 'శిల్పశ్రీకి'. ఆయన చాలా ఆశ్చర్యపోయారు. "నా అంతట నేను, ఇందరు సంస్కారప్రియుల పరిచయము కలుగజేసికొని ఉండలేను" అని, అన్నారు.

## సాగుతున్న యాత్ర

ఇప్పటికీ నాకు సంక్రాంతికి శుభాకాంక్షలు వస్తవి కావేరీతీరము నుంచి "తమిళప్రాంతములోనే ఉండి, తాను తెలుగువాడైనా, తమిళసంస్కృతిని రేడియోద్వారా లోకానికిచాటిన మా తెలుగుసోదరునికి ఆశీస్సులు" అంటూ.

....ఉదయమూ, సాయంత్రమూ చాలాదూరము నడుస్తుండేవాడను నేను. అప్పుడప్పుడు కాలినడకనే శ్రీరంగము వెళ్ళివస్తూ ఉండేవాడనుకూడా. ఈవిధంగా కావేరీతీరాన్ని ఆరు ఋతువులలోనూ చూచే మహాభాగ్యము కలిగినది నాకు. వర్ష ఋతువులో ఎంత భయంకరంగా ఉంటుందో ఆ మహానది, వసంతఋతువులో అంత శాంతివంతముగానూ, అంత మనోహ్లాదకరంగానూ ఉంటుంది.

కావేరీతీరాన తొలివసంత దర్శనము ఒక మరువరాని అనుభవము.

## ౧౬

"ఆమె మళ్లా, ఒక్క అరనిమిషములో తన పెదవులపైకి చిరునవ్వు తెచ్చుకొని, ఆ పొగడపూదండను నావైపు విసిరి, మెరపులామాయమైంది. ....ఆ దండను తీసుకుని కళ్ళకద్దుకోవాలనుకున్నాను. కాని, వంగి తీసుకోబోగా, ఆ పువ్వులు శివద్రవ్యమని జ్ఞప్తికివచ్చింది. దండను అక్కడేవదలి ఇంటికి వచ్చివేశాను. నా ప్రియురాలి హస్తస్పర్శను పొందిన ఆ పూలదండజన్మ ఎంత గొప్ప జన్మ!....ఇంటికివెళ్ళినా, నా పాదాలు మళ్ళా నన్ను ఆ చోటికే లాగినవి. ఎంతసేపు, అరగడియ ఐనా కాలేదు. కాని, ఆ పూలదండ అచ్చటలేదు. నా గుండె గతుక్కుమన్నది. ఆ పొగడదండ బదులు ఒక త్రాచుపామైనా పండుకొనియున్నది కాదు! ఆ త్రాచును మెళ్ళోవేసుకుని ఏమైవుందునో!" ఈ మాటలు అంటూ, నా తమిళనాటకము 'ఏకవీర'లో కథానాయకుడు కుట్టాన్ ఎంతోబాధను ప్రకటిస్తాడు, మైక్రోఫోన్ ముందు. అతనికంఠస్వరము గద్గదికమవుతుంది. ఎంత గొప్పగా అనుభవిస్తూ, ఎంత ప్రస్ఫుటంగా వ్యక్తపరుపగలుగుతున్నాడు, అతను, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ తమ 'ఏకవీర'లో చిత్రించిన భావాలను!!

తిరుచినాపల్లి రేడియో కేంద్రములో ప్రసారమైన ఆ 'ఏకవీర' నాటకములో పదేపదే, ఇలా హృదయాన్ని చీల్చుకుని వచ్చే సంభాషణలు ఉన్నవి. అసలుప్రతిభ విశ్వనాథవారిదైనా ఆ భావాలను చక్కని తమిళభాషలోకి తీసుకుని రాకలిగాము - నేమూ, నా స్నేహితుడు అయ్యంపెరుమాళ్ కోనారున్నూ.

శయ్యాగృహంలో ఏకవీరను, పందిరిపట్టిమంచముపైన, తనకై వేచియుండి, తలంటుపోసుకున్న బడలికవల్ల ఒళ్ళు తెలియక నిద్రిస్తున్న ఏకవీరను, చూచి, కుట్టాన్ అనుకుంటాడు: "ఏ మహాసౌందర్యరాశి నాశయ్య విభాగించుకొనవలయునో ఆమెకు, నాకు ఈజన్మమున కలయికయే లేదు. నన్నీ పిశాచ మావేశించినది. అయ్యో! ఈ దయ్యము నన్నెట్లు వదలును?" అని. కాని, కొంత

సేపటికి కుట్టాన్‌కు కోపము తగ్గుతుంది. అప్పుడనుకొంటాడు అతను: "అయ్యో! నా కీమె సహధర్మచారిణికదా! ఈమె నన్నువదలి ఎచ్చటికి బోవును? ఇన్నాళ్ళుగా నేను మాట్లాడకుండ నుండిన ఎంత శోషిల్లినదో! నాతో వొక్కమాట పలుకలేదే!.... స్త్రీ యెట్లు పలుకరించును!" అని.

మనలో కొందరికి ఈ సమస్య స్వానుభవమే: పెండ్లిచేసుకున్నవారిని ప్రేమింపలేకపోవడమూ, ప్రేమించినవారిని పెండ్లిచేసుకోలేకపోవడమూ. అందుకే, నా అంటివారికి ఏకవీర నవల అంత గొప్పగా ఉంటుందేమో! ఐతే, విశ్వనాథ సత్యనారాయణ ఆ ప్రేమికులను వట్టి భావుకులుగా విడిచిపెట్టక, వారిహృదయంలో విపరీతమైన సంఘర్షణ కల్పించి, వారిని సాధకులుగా జేస్తారు. ఒకానొక అద్భుతమైన తపఃఫలితంవల్ల, కుట్టాన్ తానుప్రేమించిన జగన్మోహన విగ్రహమైన మీనాక్షిని తనచెల్లెలుగా జేసుకుంటాడు. ఆ తర్వాత తన ధర్మపత్ని ఐన ఏకవీరను మనసార ప్రేమింపకలుగుతాడు. కాని, ఇటువంటిసాధన చాలా కష్టము. సాధారణ మానవులకు చేతగాదు. కుట్టాన్ విషయంలో, అతని స్నేహితుడు వీరభూపతి బోధన ఎంతో ఉపకరిస్తుంది. నీ భార్యను నీవు తప్పక ప్రేమించాలి, ఆమె కన్నీరు ఒలుకరాదు, అంటూ ఎంతో ప్రాధేయపడే ప్రాణస్నేహితునిమాటలు వింటూ, కుట్టాన్ అంటాడు: "వీరా! ఎంత మంచివాడవు. ఇన్నాళ్ళు ఏమో వట్టి స్నేహితుడవనుకున్నాను. కాని, నేను నీవుగా ఊహించుకునేటంతటి ప్రేమ నాయందు నీకున్నదని తెలిసికొనలేకపోయాను. నిజంగా, ఇంతప్రేమకు నేను అర్హుడనుగాను....కాని, నేను ఆమెను ప్రేమింపలేకున్నాను. నీకోసం ప్రేమించమంటావా? ప్రేమిస్తాను, ప్రేమిస్తాను. ప్రయత్నిస్తాను. కొంతకాలము పట్టుతుంది. నీవు క్షమించాలి నన్ను!" అంటాడు. కాని, బాధ ఆపుకోలేక, వెక్కివెక్కి ఏడుస్తాడు.

ఇటువంటి ఘట్టాలు మా నాటకానికి ఎంతో వన్నెతెచ్చాయి. కుట్టాన్ వీరభూపతుల స్నేహము అపూర్వమైనది. అందుకే, తాను అంతగా ప్రేమించి అంతగా అరాధిస్తూన్న చిరకాలప్రేయసి ఆ అందాలరాశి, మరెవ్వరూ కాదు - తన మిత్రుడు వీరభూపతి, కొన్నేళ్ళతర్వాత, పెండ్లిచేసుకున్న మీనాక్షే అని తెలిసే

సరికి కుట్టాన్ "అయ్యో!" అని అరచి, క్రిందపడిపోవుటకు సిద్ధమౌతాడు. ఒక రోజురోజు ఇల్లంతా తోటంతా, పిచ్చివానిలా తిరుగుతాడు. రాత్రంతా తపస్సు చేస్తాడు. మరునాడు తెల్లవారేసరికి అతను క్రొత్తమనిషి అయిపోతాడు, ఆ నిమిషంనుండి మీనాక్షి అతనికి చెల్లెలు!....ఇక అతనిప్రేమ పూర్తిగా తనధర్మపత్ని దెస ప్రసరింపవచ్చు. కాని, విధిలీల! తనభర్తస్నేహితుడైన వీరభూపతి భార్య మీనాక్షిని చూడడానికివచ్చి ఏదో నాటకముచూస్తూ, వారిఇంటనే ఉండిపోయిన ఏకవీర, హఠాత్తుగా, వీరభూపతిని చూస్తుంది. ఇన్నాళ్ళూ ఆమె అతనిని చూడలేదు కాని, ఆమెను చూచీ చూడడముతోనే వీరభూపతి ఆమె తన తొలిప్రేయసి అని గుర్తిస్తాడు. ఆమే ఆనవాలు పడుతుంది, తాను మొట్టమొదట తన మనస్సిచ్చిన అజ్ఞాతప్రియుడు ఇతడేనని. వారిని ఆపడానికి ఏ శక్తికి సాధ్యము! ఒకరినొకరు గాఢముగా కౌగలించుకుంటారు. ఒకరిలో ఒకరు పూర్తిగా లీనమైపోతారు - ఒక అరనిమిషముసేపు. ఒక్క అరనిమిషమే. తరువాత, సాధారణప్రపంచకము - ధర్మమూ, ఆచారమూ, నీతీ, నియమమూ. అతినిష్ఠాపరుడైన విశ్వనాధ సత్యనారాయణ దృష్టిలో ఏకవీర, ఎంత అమూల్యమైన ఆత్మానుభూతిని పొందినా, ఆమె నీతినిపాటింపక తప్పదు. ఆమె ఇంటికివచ్చాక, ఆమెను తన హృదయపీఠమున నధిష్ఠింపజేయడానికి ఆత్రుతతో తనవైపు వస్తూన్న భర్త కుట్టాన్‌ను ఒట్టుపెట్టి, వారిస్తుంది. "నాయందు గొప్ప పాపమున్నది! నన్ను తాకవలద"ని - ఆజ్ఞాపిస్తుంది.

తరువాత కథ, రేడియోప్రసారము నిమిత్తము, కొంచెము మార్చినాము. మూలములో, ఏకవీర వైగై నదిలో పడిపోతుంది. ఇది రేడియోలో, అంత ప్రస్ఫుటంగా నిరూపింపలేము. కాబట్టి, కుట్టాన్‌ను తప్పించుకుంటూ, ఏకవీర రాజమార్గమున బడినట్టూ, అప్పుడే, సుందరేశ్వర బ్రహ్మోత్సవసందర్భంలో బ్రహ్మాండమైన రథము అతివేగంగా వస్తూన్నట్టూ రథానికిఎదురుగా పరుగెత్తుతూన్న ఏకవీర భర్త "ఆగు! ఆగు!" అని ఎంత వారించినా వినక పిచ్చిగా పరుగెత్తుతూనే రథచక్రము క్రింద పడిపోయినట్టూ చిత్రించాము. విగతజీవి ఐన భార్యతలను తొడపై నిడు

కాని, గుండె పగిలేటట్టు రోదిస్తూన్న కుట్టాన్‌కు సన్యాసియైన వీరభూపతి కని పిస్తాడు. భావగర్భితమైన ఉపనిషద్ నిర్వచనతో రేడియో నాటకము పూర్తి అగుతుంది.

ఈ రచనా ఈ నాటకప్రదర్శనా తమిళశ్రోతలలో వింత సంచలనము కలి గించినవి. "ఈభావాలు మాకు క్రొత్తవి; కాని, ఎంతటి నిజాయతీతో ప్రదర్శిం చారు!" అని వ్రాశారు కొందరు శ్రోతలు. కొన్నివారాల తర్వాత, నాటికను వినిన వారూ, విననివారూకూడా మరీమరీ కోరగా, మూడునెలలలోనే ఏకవీర నాటకాన్ని మళ్లా ప్రదర్శించాము. కొన్నికొన్ని సంభాషణలు శ్రోతలమనస్సులో శాశ్వతంగా ఉండిపోయాయి. కుట్టాన్ తనతల్లిని చూచాక అనుకుంటాడు :

"అందరూ నన్ను ఏకవీరను ప్రేమింపమంటున్నారు. ప్రాణస్నేహి తుడు వీరభూపతి అదేమాట. ఈ ఊరు వస్తే మా అమ్మా అదేమాట. ఇందులో ఏదో రహస్యముంది! నేను మనసారా ప్రేమించిన ఆమెనుమాని, బలవంతంగా నా మెడకు కట్టపెట్టిన ఆమెనా, నేను ప్రేమించాలి? అదెలా సాధ్యం? ప్రేమించడమూ ప్రేమించలేకపోవడమూ నా స్వాధీనంలో ఉన్నవా?....మరి, ఎవరిస్వాధీనంలో ఉన్నవి? భగవంతునిస్వాధీనంలో ఉన్నవి. మరి, నేను ప్రేమించడము ఎవరి స్వాధీనములో ఉన్నదో ఆ భగవంతుడే నేను ప్రేమించిన వ్యక్తికిబదులుగా ఈ స్త్రీని తెచ్చి ఎందుకు పెళ్ళిచెయ్యాలి నాకు? భగవంతుడుకాదు - పెద్దవాళ్ళుచేశారు, ఈ పెళ్ళి. కాని, భగవంతునికి ఇష్టంలేకపోతే పెద్దవాళ్లుమాత్రము ఎలా పెళ్ళి చెయ్యగలరు? ఈమెకూ నాకూ ఏమి సంబంధము? ఏ సంబంధమూ లేకపోతే మేము ఆచార్యరీత్యా భార్యాభర్తల మెందుకయ్యాము?" అని వితర్కించుకుంటాడు కుట్టాన్.

ఈ సమస్య ఒక్క కుట్టాన్‌దే కాదు. యుగసంధిలోపడి నలిగిపో తూన్న అనేక యువకహృదయాల ఆత్మలను దహిస్తున్న విచారము, ఇది.

* * * *

# సాగుతున్న యాత్ర

తిరుచినాపల్లిలో, ఏమీ తోచనప్పుడు, రాత్రి భోంచేసాక, అలా జంక్షన్ స్టేషన్‌కు వెళ్ళుతూండేవాడను, నేను, వచ్చేపోయే రైళ్ళనుచూస్తూ ఒక అరగంటా గంటా కాలయాపన చెయ్యడానికి. అలా రైళ్ళను చూస్తూన్నప్పుడు, ఒకసారి ఒక రైలులో 'శ్యామల' కనిపించి, చేయిఊపి పిలచింది, నన్ను. శ్యామలను చూచి, అప్పుడే ఏడేళ్ళవుతుంది. శ్యామల 'సౌదామిని' స్నేహితురాలు; ఎన్నోఏండ్లుగా కలసేఉంటున్నారు, వారిద్దరూను. ముందెన్నడో, ఒకనాడు, కలకత్తానుంచి వస్తూ విశాఖపట్నంలో మా బావను చూద్దామని ఒకరాత్రి ఆగగా, కేవలమూ కాకతాళ న్యాయంగా, సౌదామిని పరిచయమైంది నాకు. అదివరకు ఒకపర్యాయము మా అక్కయ్యతోకలసి ఆమెను చూచాను ఆమెఉన్న హస్టల్‌లో - మాబావ చెప్పాడు, ఆమెను చూడమని. ఆ మొదట చూచినప్పుడు స్థంభితుడనైపోయాను నేను. ఆ సౌందర్యరాశిని నేను తిరిగి కన్నెత్తి చూడడానికికూడా భయంవేసింది. కాని, కాల చక్రము గిర్రున తిరిగి, మాబావే మళ్లా పరిచయంచేశాడు విశాఖపట్టణంలో నన్ను ఆమెకు, రైల్‌స్టేషన్‌లోనే. అప్పుడు, వింతధైర్యంతో కొంత వట్టిపరోపకార బుద్ధివలనా, కొంత అవ్యక్తమైన అనురాగపు ఉద్రేకంవల్లా, నాపైన ఒక క్రొత్త భారాన్ని మోపుకున్నాను. అలా నేను వహించిన భారమువలననే సౌదామిని గొప్పచదువు చదివి, వృద్ధిలోకివచ్చి, ఇప్పుడు డాక్టర్‌పని చేస్తూ మంచిపేరు సంపాదించుకుంటోంది.

శ్యామల అన్నది: "మిమ్మల్నిచూచి ఆరేడు ఏండ్లు ఐనది. సౌదామిని ఇప్పుడు డాక్టర్‌పని చేస్తూంది. నేనూ ఆ ఊళ్ళోనే టీచర్‌గా ఉంటున్నాను. ఒక సారివచ్చి చూచివెళ్ళరాదా?" అని,

నేను ఆలోచించాను. "సరే" అన్నాను. ఆమె అంతటితో వదలలేదు "ఎప్పుడొస్తారో చెప్పండి, మీకోసం ఎదురుచూస్తూ ఉంటాము!" అనిఅడిగింది శ్యామల. "టెలిఫోన్‌చేసి వస్తానులే" అన్నాను. "తప్పక రావాలి" - అని. చేతిలో చేయివేయించుకున్నది, శ్యామల. రైలు కదలిపోయింది.

నేను చాలా ఆలోచించాను. గతమును త్రవ్వుకోవడమువల్ల మరింత భరింపలేని బాధేగాని, సాధించేది ఏమీలేదు, అనుకొని, అన్నీ మరచిపోవాలని ప్రయత్నించాను. విపరీతమైన సానుభూతి విపరీతమైన ప్రేమగా పరిణమిస్తుంది ఒక్కొక్కప్పుడు. కాని, ఎంతటిసానుభూతిని ప్రకటించినా, ఆ ప్రకటించడము మనకు ఏవిధమైన అపకారమూ చెయ్యదు. ఆ సానుభూతి ప్రేమగా మారినప్పుడే వస్తుంది బాధ. ప్రేమ కొంతైనా ప్రతిప్రేమను కోరుతుంది. ఇది తప్పదు. కానీ, మనము ప్రేమించినవారు మనముప్రేమించినరీతిని తిరిగి మనలనుప్రేమింపలేకపోతే చేసేది ఏముంది? ఆ ప్రేమను మరచిపోవాలి. మరచిపోలేకపోతే? నరకమే, ఇక.

.........నేను టెలిఫోన్‌చేసి, వారి ఊరు వెళ్ళాను.

తాము నీరుపోసి పెంచినచెట్టు పెద్దదై పువ్వులు పూస్తూంటే ఎవరికి సంతోషము ఉండదు! ఉద్యోగముచేస్తూన్న సౌదామినిని చూచి, చాలా సంతోషించాను, ఎన్నో తుపానులను ఎదుర్కొని, ఈనాటికి ఆమె జీవితపునౌక గమ్యస్థానము చేరినది అని. ఆ ఊళ్లో, ఇంటింటా ఆమెపేరు చెప్పుకునేవారే! సంపన్నులూ సాధారణులూ అనే వ్యత్యాసములేకుండా, అందరికీ వైద్యసహాయము చేస్తూన్నది ఆమె. కొన్నికొన్ని మరీ కష్టమైన శస్త్రచికిత్స విషయాలనుగురించి చెపుతూ, "ఇవన్నీ చేయకలిగాను నేను, ఈ ఊళ్లో!" అన్నది, సౌదామిని, సకారణమైన గర్వంతో. ఇంకా ఏమిచెప్పేదో, ఇంతట్లోకీ, అర్జెంట్ బాలింతకేస్ వచ్చి, ఆమె వెళ్ళిపోవలసివచ్చింది.

శ్యామల చాలా మాట్లాడింది, నన్నుగురించే, ఎక్కువగా. ఈ ఏడేళ్ళలోనూ నాజీవితములో కలిగిన మార్పులనుగురించి ఆమెకు తెలియదేమో అనుకున్నాను. కాని, ఆమెకు తెలుసును. అసలుస్వరూపము అలభ్యమని నిర్ధారణ చేసుకొని, ఎంతో కొంత ఓదార్పు అనే వెర్రిభ్రమతో, భౌతికంగా ఆ స్వరూపానికి కొంచెం దగ్గరగాఉన్న మరొక ప్రతిరూపానితో నేను పొత్తు కలిగించుకొనినట్టూ అనేకకారణాలవల్ల ఆ సాంగత్యమూ విచ్ఛిన్నమైనట్టూ, శ్యామలకు తెలుసు. ఆ మాట తప్పక వచ్చింది, మా మాటలలో.

"ఆమె ఫొటో ఉన్నదా మీదగ్గర?....మీకంతటి మనోభ్రమ కలిగించిన వ్యక్తి ఎలా వుంటుందో చూడాలని ఉన్నది నాకు" అన్నది శ్యామల.

"లేదు, నావద్ద ఎవరిఫొటోలూ లేవు. ఫొటో లెందుకు - ఎవరి రూపము మనము జ్ఞాపకం చేసుకోవాలనుకుంటామో, వారిరూపం అలా శాశ్వతంగా ముద్రించి ఉంటుంది, మన హృదయ దర్పణముపైన" అన్నాను నేను.

నాకొరకు నిట్టూర్చింది శ్యామల.

"సరే! నేను ఒకటి అడుగుతాను, నూటిగా సమాధానము చెపుతారా?" అన్నది.

"అల్లాగే, ఎందుకు చెప్పను? అడుగు" అన్నాను.

"ఐతే, మీరు మనసార వాంఛించే - ఇన్నాళ్ళూ గగనకుసుమము అనుకున్న పువ్వు, కొమ్మ తనంతట వంగి, పువ్వు మీఒడిలో వ్రాలితే ఏం చేస్తారు?" అన్నది శ్యామల.

"అది కలలోని వార్త. అలా జరుగదని తెలుసు!" అన్నాను నేను.

"ఏమో ఎవరికి తెలుసు! అలా జరగాలనే నా ఆశ" అన్నది శ్యామల.

ఇక ఆ ప్రస్తావన పొడిగించలేదు నేను.

కాని, తిరుచ్చినాపల్లికి వచ్చివేస్తుంటేమాత్రము, అనుకున్నాను మరీ మరీ: "ప్రేమించడమూ ప్రేమించకపోవడమూ ఎవరిస్వాధీనములో ఉన్నవి? భగవంతుని స్వాధీనంలోనా? మరి, నేనంటే అంత ప్రీతిగల భగవంతుడు నేను అంతగా ప్రేమించినవ్యక్తి నాకు లభింపకుండా ఎందుకు చేస్తాడు?" అని. ఈ ప్రశ్నకు సమాధానము లేదు. ఉన్నా మనకు తెలియదు.

# సాగుతున్న యాత్ర

త్రోవలో పుదుక్కోటలో దిగాను - నా స్నేహితుడు నాగరాజన్‌ను చూడడానికి. నాగరాజన్ గొప్ప రచయితగా పేరుపొందారు. ఇంగ్లీషులో రచించిన 'అట్టవార్ హవుస్' అనే సాంఘికనవల అప్పటి తమిళప్రాంత సాంఘికచరిత్రను వర్ణించే గ్రంథము, ఇంగ్లండ్‌లో అచ్చుకాగా ఆయనరచన చదివి ఆయనను హిల్టన్ బ్రవున్ అంటివారు చాలా పొగిడారు, నాగరాజన్ కొన్నాళ్ళు ఇంగ్లండ్‌లో ఉన్నాడు కూడా. ఇంగ్లీష్‌వారంటే ఆయనకు చాలా గొప్ప. వేషభాషలలోనూ వారిని అనుకరించాలని ప్రయత్నిస్తాడు. కాని, సంస్కృతమందూ మాతృభాషలోనూ మంచి ప్రవేశము. అన్నామలై విశ్వవిద్యాలయంలో గొప్ప హోదాలో ఉన్నాడుకూడా ఆయన. అమధ్య, నేను తిరుచ్చి కేంద్రంలో ఏర్పాటుచేసిన ఒక ప్రసంగం చక్కగా చెప్పారు. విచిత్రవ్యక్తులు అనే శీర్షికను 'గోపురాన్ని భరిస్తున్న గబ్బిలములు' అనే విషయం. గోపురం పైకప్పునుంచి తలక్రిందులుగా వ్రేలాడుతున్న ఈ జంతువులు గోపురపు భారమంతా తామే వహిస్తున్నామనీ తమవల్లనే గోపురం అలా నిలిచిఉన్నదనీ అనుకుంటాయి. కొందరు మనుష్యులూ అంతే! అటువంటివారిని గురించి చెప్పారు, నాగరాజన్ చాలా చమత్కారంగా. ఆ సందర్భంలో నాకూ ఆయనకూ పరిచయమై, అనేక సమానఅభిరుచులవల్ల, ఆ పరిచయము స్నేహముగా అభివృద్ధి అయి, ఆయన పిలువగా వచ్చాను, వారింటికి.

పుదుక్కోట ఊరు బాగానే ఉంటుంది. ఒకప్పుడు ఇక్కడ తెలుగు సంప్రదాయము ఎక్కువగా ఉండేది. పాలకులు తెలుగువారే కొన్ని శతాబ్దాలు. నిన్న మొన్నటివరకూ స్వదేశసంస్థానంగా వర్ధిల్లుతూ, రాజులు 'విజయ' అనే తెలుగుఅక్షరాలతో నాణెములు ముద్రింపిస్తుండేవారు. చిన్నప్పుడు నా సహపాఠి పుదుక్కోటవాసి నాకిచ్చిన 'విజయ' నాణ్యాన్ని చాలారోజులు దాచుకున్నాను నేను. పుదుక్కోటలో క్షత్రియ కుటుంబాలవారు ఇప్పటికీ ఉన్నారు. ఈ 'రాజుల'లో ఒకరు, సమీపాన ఉన్న 'సిత్తన్నవాసల్' అనే చోట పురావస్తుపరిశోధన చాలా చేశారు. సిత్తన్నవాసల్ వద్ద ప్రాచీన బౌద్ధ ఆరామమూ, తదుపరి వెలసిన జైనమత సూచనలూ చూడవచ్చు, మనము. ఇచ్చటనే ఒక గుహలో అద్భుతమైన కుడ్యచిత్రాలు ఉన్నవి. ఇవి ఇంచుమించు అజంతాగుహల శిల్పముల

నాటివి. శిల్ప సంప్రదాయమూ, అంత గొప్పదే. ఒక చక్కని తామరకొలను, గొడుగులలాంటి ఆకులు, అద్భుతంగా నాట్యమాడుతూన్న తామరపువ్వులూ ఎంతో అందముగా ఉంటవి. ఈ ప్రాచీన చిత్తరువులు. నీటిలో ఈదుతూన్న హంసలను వేటాడుతున్నాడు బోయవాడు. అతని ఆకృతీ, భంగిమా, జీవకళ ఉట్టిపడుతూ న్నట్టు ఉంటుంది. "ఇవన్నీ ఆంధ్ర బౌద్ధరాజులు తెనుగు శిల్పులచేత చిత్రింపించి నవే!" అన్నారు, మాకు ఆ అందాలను చూపిస్తూన్న పూసపాటి రాజుగారు, ఎంతో గర్వంతో.

"ఎక్కడకు వెళ్ళినా తెలుగువారు తమ సంస్కృతిని గురించిన అభి మానాన్ని మరచిపోలేరు!" అన్నారు నాగరాజన్ నవ్వుతూ.

నేను పుదుక్కోటనుంచి వచ్చి, ఆఫీస్‌లో అడుగుపెట్టేసరికి ఆర్డర్ వచ్చి ఉన్నది, నన్ను తిరిగి మద్రాస్‌కు బదిలీచేస్తూ. అచ్చటివారు కొందరు అను కున్నారు, ఈ బదిలీ నాకు ఎంతో సంతోషదాయకమని. కాని, అది అంత నిజముకాదు. మద్రాస్ కోసము నేను ముఖం వాచిపోలేదు, సరికదా, తిరుచ్చినీ, తిరుచ్చిప్రాంతంలోని స్నేహితులనూ విడిచి వెళ్ళడమూ కష్టమనిపించింది, డాక్టర్ రామూ, అయ్యం పెరుమాళ్ కోనార్, పూజ్యులు సర్ టి. దేశికాచారి - వీరంతా నాకు పరమ ఆప్తులయ్యారు. రేడియో నిలయమూ, చుట్టూ తోట, తోటలో ప్రతి మొక్క నాలో కలసిపోయాయి. వీనిని విడిచివెళ్ళడం కష్టం. నేను వెళ్ళిపోతే ఈ పద్మాకరములో నీళ్ళు నిండావున్నదీ లేనిదీ ఎవరు చూస్తారు? నీరు తక్కువైతే పద్మములు వాడి, ఎండిపోతాయి - అనుకున్నాను, అనవసరమైన అహంభావ ముతో. మనము లేకపోతే సృష్టి ఆగిపోతుందా? ఆగదు. నియమితప్రకారము జరిగిపోతవి అన్ని విషయాలూ.

శ్రీరంగమూ, కావేరీ తీరమూ విడిచి రావడము చాలా కష్టమైంది. రంగనాయకీ సన్నిధీ, రంగనాథ సన్నిధీ వారం వారం తప్పక లభిస్తూ ఉండేది నాకు. ఇకమీదట అవి మనస్సులోనే! ప్రతిసారి, చీకటి పడుతూండగా వృద్ధ ద్వారపాలకుడు ఒకొక్క తైలదీపాన్ని వెలిగిస్తూండగా నేను అనేవాణ్ణి;

"అదుగో! ఆ ఉద్యోగము, అతని తరువాత, నాది!" అని. ఎంత అదృష్టమూ, పైన తారకలు, మినుకుమినుకు మంటూండగా దేవీసమక్షాన ఒకొక్క దీపమూ వెలిగించడము!.... అల్లాగే, తంజావూర్ వెళ్ళినపుడు అక్కడ పువ్వులవారు ఎడ తెగని కదంబపు సరులు కడుతూంటే చూచి నేను స్నేహితునితో అనేవాణ్ణి: "ఈ ఉద్యోగమునుమాని నేను పువ్వులు గ్రుచ్చుతూ ఉండిపోతాను!" అని. కాని, ఒక్కటే బాధ: అందమైన అమ్మాయిచేతిలో ఇంత కదంబపు దొంతరా, ఇన్ని సంపెంగలూ, ఇన్ని గులాబీలు ఈ చేతితోఉంచి, ఆ చేతితో ఖరీదు పుచ్చుకోవడము —నాచేతగాదు.... ఏమిటో, వెర్రిఊహలు!

నేను రైలుకు వెళ్ళేముందు శంకరన్ అనే స్నేహితునిఇంట గొప్ప విందు చేశారు. నామెళ్ళో గులాబీదండలు వేశారు - పన్నీరులో ముంచెత్తారు నన్ను, స్నేహితులు - చొక్కా విప్పించి ఒంటినిండా గంధము పూశారు. కాని. ఇంకా వారికి తనివి తీరలేదు. ఎంతో శ్లాఘించారు, నేను ఇంతవాడను, అంత వాడను అని. ఈ ఆర్భాటము అంతా చూచి, అక్కడికి అతిధిగా వచ్చిన సినీమా డైరక్టర్ సుబ్రహ్మణ్యమ్ అన్నారు: "నిన్నుగురించి ఎరుగుదునుగాని నీవు ఇంత వాడ వనుకోలేదు. నీవు మద్రాస్‌కు వచ్చాక ఇంతకంటే బ్రహ్మాండమైన విందు చేస్తాను నీ గౌరవార్ధము!" అని. అల్లాగే, మద్రాస్‌లో సుబ్రహ్మణ్యము ఇంట విందుకు వెళ్ళాను. ఆ విందులోనే నన్ను డైరక్టర్ శాంతారామ్‌కు పరిచయము చేశారు, సుబ్రహ్మణ్యము.

స్టేషన్‌కి సామానులు ముందుగా తీసుకువెళ్ళాడు, హెడ్‌ప్యూన్ రహింతుల్లా. మా నిలయపు అధికారి గోపాలన్ తనకార్‌లో నన్ను స్టేషన్‌కు తీసుకువెళ్లారు. రైలు కదిలేవేళకు నిలయపు కార్యక్రమాలు నడుపుతూన్న నలుగు రైదుగురు తప్ప నిలయపు యావత్తుబృందమూ నన్ను సాగనంపడానికి స్టేషన్‌కు జేరారు - ఉద్యోగులూ, నౌకర్లూసహా. డ్రైవర్, పెరుమాళ్ రాజా - అతని మాతృ

భాష తెలుగు అనీ, అతడు సూర్యవంశపు క్షత్రియుడనీ ఉప్పొంగిపోతుంటాడు - పెరుమాళ్‌రాజా నా కంపార్ట్‌మెంట్ తలుపుతీసి "లోనికి దయచెయ్యండి!" అన్నాడు.

నా కళ్ళు భ్రమిసిపోయాయి! పెరుమాళ్‌రాజా, రహింతుల్లా ముందుగా వచ్చి, నా కంపార్ట్‌మెంట్‌ను శోభనపుగదిని అలంకరించినట్లు అలంకరించి ఉంచారు. గదిఅంతా పువ్వులే! కదంబపు దొంతరలు, మొగలిపువ్వులు, సంపెంగ పువ్వులు, ఘుమఘుమలాడే గులాబీపువ్వులు, వికసించిన తామరలు, అప్పుడే కోసితెచ్చిన పద్మాలు, నందనవన శృంగారము అవతరించినది, ఈ భూలోకాన, నా కోసము!

ఇంత ప్రేమ ఉంటుందా లోకంలో అనుకున్నాను - నా తడికళ్ళను తుడుచుకుంటూ!

....తిరుచ్చిటవున్ స్టేషన్‌లో రైలు మూడు నిమిషాలు ఆగుతుంది. కిటికీలో తలఉంచి బయటకు చూతును కదా - స్నేహితుడు అయ్యంపెరుమాళ్ కోనార్ నిలచి ఉన్నారు, నాకోసము, నా కంపార్ట్‌మెంట్‌ముందు. నాచేతులు చాచి ఆయన రెండుచేతులూ పట్టుకున్నాను. ఆయన ఉత్తరీయపుమడత విప్పి, తామరాకు పొట్లాన్ని నాచేత ఉంచారు. "ఇది మా ఆవిడ చేసి ఇచ్చిన పాల కోవా. మేము గొల్లలము. మాఇంటి ఆవుల పాలతో చేసినది, మా ఆవిడ. అప్పుడెప్పుడో మీరు ప్రస్తావనావశాన అన్నారు, మీకు పాలకోవా ఇష్టమని. ఆమాట ఆమెతో అన్నాను. వారు ఊరికి వెళుతున్నారు, వారికి మనము ఇంత కన్నా ఏమి ఇయ్యగలము, కుచేలభక్తితో ఇచ్చిరండి ఈకాస్త కోవాను అని నా చేతికిచ్చింది. అనుగ్రహించి తీసుకోండి" అన్నారు.

రైలు కదలింది, కన్నీటి తెరవెనుకనే కనిపించాడు నా స్నేహితుడు.

## సాగుతున్న యాత్ర

మద్రాస్ వచ్చి, హోటల్‌లో బసచేసి, సరిగ్గా పదిగంటలకు హాజరయ్యాను రేడియో ఆఫీస్‌వద్ద. నాకు ఎదురుసన్నాహంతో వచ్చిన ఆఫీస్ పిల్లవాడు బాద్షా చేతికి నేనుతెచ్చిన తామరపువ్వుల సజ్జ నిచ్చాను: "ఇవి అందరికీ ఇస్తావా?" అంటూ. అందరూ మీటింగ్‌లో ఉన్నారు.

మరి పావుగంటయ్యాక మళ్ళీ వచ్చి, తిన్నగా ప్రోగ్రామ్ డైరక్టర్ మూర్తివద్దకు వెళ్లాను. లేచి నిలచి, తన రెండుచేతులలోకి నాచేతులను పుచ్చుకుంటూ అన్నారు, మూర్తి; "మీరిచ్చిన తామరపువ్వులే చెప్పాయి, మీరు వచ్చారని. చాలా సంతోషము!" అన్నారు.

మళ్లా మద్రాస్ - మళ్లా తెలుగు కార్యక్రమాలు - మళ్లా 'మనవారు'. కాని, నిజానికి మనవారు కానివారెవ్వరు? అందరూ మనవారే; అందరూ నావారే!!

## ౧౭

తిరుచినాపల్లిలో ఉండగా, నేను ధరించే దుస్తులు దేశవాళీ పద్ధతి దుస్తులు. మల్లెపువ్వులా తెల్లగా, పాముకుబుసములా అతిపలుచగా ఎంతో అందమైన లాల్చీ, విశాలమైన పైజమా, ఊదా మఖమల్ చెడావులూ, భుజాన జలతారు ఖండువా. ఖండువా నేలకు జీరాడుతూ ఏ నిమిషమైనా భుజాలనుంచి జారిపోతుందేమో అనేటట్టుండేది. తరుచు, శ్రీరంగమునుంచి స్నేహితులు తెచ్చిన శ్రీచందనము మెడకూ చెంపలకూ రాచుకునేవాడను. కనుబొమలకు పునుగు, జవ్వాది. ఈ వేషముతో రేడియోనిలయపు పచ్చికబయలు మధ్య ఉన్న పద్మాకరము నీటి అంచున నిలచుని, అప్పుడే వికసించిన ఎఱ్ఱతామరపువ్వుకేసి చూస్తూ ఉండిపోయేవాడను ఎంతోసేపు. ఆ ఎఱ్ఱతామరపువ్వు ఏవేవో కలలను ప్రేరేపించేది, నాలో. ఒకసారి, ఇలా పువ్వుకేసే చూస్తూ నిలచిపోయిన నన్ను, రేడియోనిలయపు మేడపైనుంచి చూచి, మా నిలయపు డైరక్టర్, గోపాలన్, అక్కడనుంచి సైగచేశారు నాకు, "అలాగే ఉండు, అలాగే కదలకుండా" అని. గబగబవచ్చి, తన కామెరాతో ఫోటో తీశారు, నన్ను. ఆ ఫోటో మొన్నటివరకూ ఉన్నది, నావద్ద. జీవితమంతా అలా ఆ పువ్వుకేసే చూస్తూ అలాగే ఉండిపోలేనా, అనుకునేవాణ్ణి, ఆ బొమ్మను చూచినప్పుడల్లా. రవీంద్రుని మాటలు జ్ఞాపకము వచ్చేవి :

''చిన్నిపూవా! చిరప్రవాసక్లేశమున నా కన్నులనుండి రాలే బాష్ప బిందువులు! నీ లేత ముఖమును మలిన పరుస్తున్నవి - ఏమీ అనుకోకు!" - అని.

మద్రాస్ రేడియోకేంద్రములో మళ్లా ప్రవేశించీ ప్రవేశించడముతోనే, ఆ పరిస్థితి మారిపోయింది, ఒక్క నిమిషములో. అప్పటి డైరక్టర్ పరంజ్యోతికి ఆఫీస్‌లో అందరూ ఇంగ్లీష్ దుస్తులను ధరించడమే అవసరము. అందరూ ఎ. ఐ. ఆర్. నెక్‌పై వేసుకోవాలి, విధిగా. బసకువెళ్ళి, నాపెట్టెపై అడుగునఉన్న

సూట్ తీసి, వేసుకున్నా - ఆఫీస్‌వారిచ్చిన నెక్‌టై సహా. వెంటనే, తిరుచినాపల్లి డైరక్టర్ - నా స్నేహితులు - వారికి టెలిగ్రామ్ ఇచ్చాను : ఐ యామ్ ఫైడ్!" అని - అంటే నా అర్థము : "ఇచ్చట పనిలో హాజరయ్యాను ఇచటి నిబంధనలను పాటిస్తున్నాను," అని. కాని, జీవితములో అంతవరకూ నేను పడిన ఇకార ప్రకారమంతా తెలిసిన గోపాలన్ ఇదేమో హృదయసంబంధమైన క్రొత్తలంకె అనుకుని, ఇంకా ఎన్ని కష్టాలను తెచ్చిపెట్టుకుంటాడో ఈ వెర్రిమనిషి అను కున్నారట!

వెంటనే, పనిలో నిమగ్నుడనైపోయాను. మూర్తిగారు ప్రోగ్రామ్ డైరక్టర్‌గా మారినందున తెలుగు కార్యక్రమాలన్నీ ఒక్క వీరభద్రరావే చూస్తు న్నారు. ఆయన ఎంతో శ్రద్ధతో, ఎంతో చురుకుగా పనిచేస్తున్నా, తలమునిగి పోయేటంత పని మిగిలిపోయింది. "దేవునిలా వచ్చావు! మిగిలిపోయిన ఈ పని అంతా, నీవు చక్కచెయ్యాలి. చేస్తావనే నా నమ్మకము" అన్నారు, పరంజ్యోతి.

ఆరోజు కూర్చుని నూటఏబది నాటకరచనలను పరిశీలించాను. వీనిలో ప్రసారార్హమైనవానిని అంగీకరించాలి. పనికిరానివి రచయితలకు పంపివేయాలి వారిమనస్సును నొప్పింపకుండే ఉత్తరాలను జతపరచి. ఇతరఆఫీస్‌పనీ, ప్రోగ్రా ములపనీ కూడా ఎంతో ఉన్నది. ఐనా, రాత్రి పదిగంటలవరకూ కూర్చుని, ఈ పరిశీలన పూర్తిచేశాను. ఆపనిలో నాకు ఎంతో ఆసక్తి ఉన్నదికాబట్టీన్నీ, ఎంతో కొంత విచక్షణను అలవరచుకున్నాను కాబట్టీన్నీ, ఆపని నాకంత కష్టమనిపించ లేదు సరికదా, మీదుమిక్కిలి, ఇన్నాళ్ళు దూరప్రాంతములో ఉండి, తెలుగు వారితో సంపర్కములేని నాకు, ఈ తీరున, ఒక్కసారిగా, ఇంతమంది యువకరచ యితలతో పరిచయము కలగడము చాలా సంతోషదాయకమే ఐనది. ఆ రచన లలో చాలాభాగము కావలసిన పరిణితిని చెంది ఉండకపోయినా, రచయితల హృద యాలలో ఏదో ఆరాటమూ, జీవితములో తమకు కలిగిన ఏదోఒక అనుభవాన్ని ఇతరులతో పంచుకోవాలి అనే యాతనా స్ఫురించాయి నాకు.

ఆ మొదటిరోజు నేను పరిశీలించిన నాటకరచనలలోనే నేను రేడియో కొరకు ఇద్దరు మంచి రచయితలను కనుక్కున్నాను: పన్యాల రంగనాధరావూ, చందూరి నాగేశ్వరరావూ. చందూరి నాగేశ్వరరావే 'ఎన్. ఆర్. చందూర్' అయ్యాడు, తరువాత.

పన్యాల రంగనాధరావు రచనలో ఒకానొక నవ్యత్వమూ ఎంతో వేలతనమూ మనదృష్టిని అరికట్టే మనఃపూర్వకత్వమూ - ఇంగ్లీష్‌లో సిన్సియరిటీ అంటారు - కనిపిస్తాయి. తరువాత తరువాత, అతను ఎన్నో కథానికలూ, ఎన్నో నాటికలూ రచించాడు. మన ప్రాచీన సంస్కృతిని ఇప్పటి పరిభాషలో వ్యక్తపరుపాలనే ఆశయము అతని రచనకు వన్నెదెస్తుంది. కొంతకాలము తర్వాత, అతను ఢిల్లీ వెళ్ళి 'ఆకాశవాణి, తెలుగులో వార్తలు' చెపుతూ, తెలుగు వారికి మిక్కిలి ప్రీతిపాత్రుడయ్యాడు. చిరసహవాసంవల్లా, నాయందు అతనికి నిండుకున్న అనురాగాతిశయంవల్లా, కొంత భక్తిభావంవల్లా, కాబోలు, అతను శ్రోతలను పిలుస్తూంటే, అచ్చంగా నేను పిలచినట్లే వినిపిస్తుంది, అతనిమాటతీరు. ఇది ఒకరీతి భ్రమరకీట న్యాయమేమో!

ఎన్. ఆర్. చందూర్ మొదటి రచన, రేడియోకోసం నేను పరిశీలించినది, 'శేషుతో షికారు.' ఇది, ఇంగ్లీషులో నేనుచదివిన ఏ.ఎస్. నీల్ రచనను పోలి ఉంటుంది, చాలా అందంగా, ఎంతో ఆప్యాయంగా. తన మేనకోడలు శేషుతో షికారువెళుతూ ఆ చిన్నారివేసే లక్షప్రశ్నలకు ఓపికతో జవాబు చెపుతాడు మామయ్య. ప్రశ్నలు ముద్దు వస్తూంటాయి. జవాబులూ అంతటి ఆప్యాయంగానూ ఉంటాయి. నేను చదివిన రచనను అనుసరించి ఒకశీర్షికగా మరికొన్ని ఘట్టాలు వ్రాయమని కోరాను, చందూర్‌ను. ప్రసారమైన ఆ శీర్షిక శ్రోతలను చాలా ఆకర్షించినవి. ఈవిధంగా, రేడియో ఆవరణలోకి ఆకర్షింపబడిన చందూర్ ఆతర్వాత మద్రాస్‌కేంద్రములో ఉద్యోగముకూడా చేశాడు. కాని, ఆ ఉద్యోగము మూడునాళ్ళ పట్టపగలే! మిక్కిలి స్వేచ్ఛాజీవి ఐన అతనికి ఆ వాతావరణం, అభిప్రాయ ప్రకటనలలోనూ, రచనావిధానంలోనూ సర్కార్‌సంస్థవారు విధిగా తగి

లించే సంకెళ్ళూ - అవి ఎంత బంగారపు సంకెళ్ళు ఐనా - అతనికి నచ్చలేదు. ఇది తెలియవచ్చిన నేను అతను మంచిపనిచేశాడు అనుకున్నాను. దేవులపల్లి కృష్ణశాస్త్రి గేయము స్ఫురణకు వచ్చింది :

"పక్షినని పాడగలనని ప్రణయవీధి
నిత్యలీలావిహారముల్ నెరపుదునని
పక్షముల దూల్చి బంధించి పంజరాన
గానమును బ్రాణము హరింప బూనినారు !"

—అని.

చంద్రూర్‌కు ఈ గండము తప్పడము మంచిదే ఐనది. చిత్రం ఏమిటంటే, కృష్ణ శాస్త్రి మాత్రము, తానే వెళ్ళి పంజరంలో కూర్చున్నాడంటారు. ఎంత నిజమో?

ఆ చంద్రూర్‌కు స్నేహితురాలూ, మంత్రీ, భార్యా, మహిళాప్రపంచక మంతా మమతతో మెచ్చుకునే మాలతీ చంద్రూర్. ఈనాడు ఆమె ఇంటింటా ఒక ప్రేమపాత్రురాలైన స్నేహితురాలుగా వెలసినదీ అంటే అది వారిద్దరి మానవ సేవాపరత్వమూ, నిరంతర కార్యదీక్షా సూచిస్తుంది. అనేకసందర్భాలలో, మాలతీ చంద్రూర్ మరీ మరీ జ్ఞాపకము చేసుకోవలసిన వ్యక్తి. అపరిమితమైన సర్వజన స్నేహభావమూ మితిమీరిన హితజనప్రేమా ఉన్నా, ఆమె ఇతరులలోని లోపా లను-ముఖ్యంగా. తనకు ఆప్తులైనవారిలోని లోపాలను - ఆవగింజంతైనా సహింప లేదు. ముఖప్రీతికోసము, మాలతి, నలుపును తెలుపనలేరు, ఎన్నటికిని. నలుపు నలుపే, తెలుపు తెలుపే - మనకు ఇష్టమైనాసరే, కష్టమైనాసరే. ఎటొచ్చీ, ఆ చెప్పేతీరులో కొంతతీవ్రత ఉంటుంది. నావంటివానిని ఆ తీవ్రత కాస్త బాధ పెడుతుంది.

## సాగుతున్న యాత్ర

"మీరు పెద్ద రేడియో ఉద్యోగే కావచ్చును; కాని, ఈవిషయంలో మీరు నోరు తెరువకూడదు!" అంటే, ఎదుటివారి మనస్సు చివుక్కుమంటుంది. కాని, ఆమాట వారు తీవ్రమైన ఆత్మపరీక్షచేసుకోడానికి కారణమై, చివరకు మేలే చేస్తుంది.

స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కులుకావాలి అనే వాదనతో కాలయాపనచేయరు, మాలతి. "మా హక్కులు మాకు ఉండనే ఉన్నవి. లేవన డానికి మీరెవరు?" అంటారు, ఆమె. ఈవిషయములో ఆమె దుర్గాబాయ్ పోలిక. కొమర్రాజు అచ్చమాంబా, పెద్దాడ కామేశ్వరీ, గంధం అమ్మన్నరాజా, ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ - ఈ నలుగురుకూడా, స్త్రీల హక్కులకోసము పోట్లాడిన వారే. అచ్చమాంబ మాటల తుపానుముందు మనమాట నిలువలేదు. కామేశ్వరి తన విపరీతపు మంచితనము వల్లా ఒకరీతి నిస్సహాయతవల్లా తన వాదనను సాధిస్తారు. అమ్మన్నరాజా వాదన ఒకగొప్ప హుందా, ఎంతో ఆరిందాతనమూ. 'తాపట్టిన కుందేటికి మూడేకాళ్ళు' అనే పట్టుదల - పీనివల్ల జయిస్తుంది. లక్ష్మీకాంతమ్మ పాండిత్యప్రకర్షణా, ముందుగానే యుద్ధభూమికి దూసుకురావడమూ, విపరీతపు ఆవేశమూ ఆమెకు విజయకారణాలు.

కాని, పైకి మనలను ఎంత నిశితంగా విమర్శిస్తూన్నట్టు కనిపించినా. నవనీతహృదయ మాలతీ చందూర్. "మా ఊరినుంచి స్నేహితులు సీతాఫలపు పళ్ళు తెచ్చారు. సీతాఫలాలు మీకు చాలా ఇష్టముగా - వెంటనే రమ్మంటున్నారు" అని చందూర్ కబురుచేస్తే, వెంటనే బయలుదేరుతూ, "అయ్యో! ఎంత ఆప్యాయతతో పిలిచారు మనలను" అనుకుంటూ, త్రోవలో, పూలఅంగడివద్ద ఆగి ఒక వంద గులాబీపువ్వులు సజ్జలోప ట్టుకువెళ్ళి ఇస్తే: "సజ్జ చాలా బాగుంది; కాని, అన్ని పువ్వు లెందుకు? వృధా ఖర్చు!" అంటే, ఎలా ఉంటుంది ఇవతలవారికి! కాని, ఈ 'సాదించడము' మన మంచికోసమే.

ఇక, అక్కడ ఉన్నంతసేపూ ఏక సాహిత్యగోష్ఠే! వారిద్దరూకూడా విస్తారంగా చదువుతారు. అచ్చయిన ప్రతికొత్త - చెప్పుకోతగిన - పుస్తకమూ వారివద్దకు చేరుతుంది. ఒక్కసారి భూప్రదక్షిణము చేసి వస్తుంది, మా సాహిత్య

చర్చ. ఇటీవల వెలువడిన సినీమాల గురించిన్నీ చర్చ సాగుతుంది. ఎప్పుడో ఒకప్పుడుగాని, మా అభిప్రాయాలు ఏకీభవింపవు. ఏకీభవిస్తే ఆశాభంగముకూడా నేమో, ఆమెకు!

....తిరుచ్చినుంచి మద్రాసుకు వచ్చిన ఆరోజే సాయంత్రము గ్రామస్థుల కార్యక్రమములో వివరాలు చూడవలసివచ్చింది, నేను. 'త్యాగరాయకృతి - జంత్రసమ్మేళనము' అని ఒక అంశము ఉండగా "ఏమికృతి?" అని ప్రశ్నించాను నేను, సంగీతనిర్వాహకుడు లింగప్పను. ఆయన "ఇంకా ఏదీ ఆలోచింపలేదు" అనగా, నేనన్నాను: "ఎంతని నేవర్ణింతు, శబరీ భాగ్యము బాగుంటుందేమో"నని. లింగప్ప నావేపు నిదానించి చూచారు. "ఎందుకలా చూస్తారు?" అనేసరికి ఆయన నన్ను కౌగలించుకొనే టంతటి సంతోష ఉత్సాహములతో అన్నారు: "ఇన్నాళ్ళకు కనిపించారు, పాతసాంప్రదాయములందు ప్రీతిగలవారు. నాకూ, ఆ కృతి చాలా ఇష్టము. వాద్యబృందాన్ని తర్ఫీదుచేస్తాను, వెంటనే!" అని. ప్రసారము చాలా చక్కగా నడిచింది. ఆ భక్తిపారవశ్యము ఒక వింతఅనుభూతి!

ఆ తర్వాత, కొన్నాళ్ళకు, త్యాగరాయకృతులతో కూర్చిన 'గోవింద మారార్' అనే రూపకము ప్రసారము చేశాము. గోవిందమారార్ అనే తిరువాన్కూర్ రాజాస్థాన ప్రధాన సంగీతవిద్వాంసుడు తిరువాయూరునందున్న త్యాగరాజస్వామిని చూడడానికి వస్తారు. ఆయనకు షట్కాల గోవిందమారార్ అనే బిరుదు. వీణపైన ఆయన షట్కాలమున వాయించేవారట. ఈ నేర్పుగలవారు ఆయన ఒక్కరే. కన్యాకుమారినుండి కావేరీతీరమువరకూ ఆయన దాటివచ్చిన ప్రతిపల్లెలోనూ త్యాగరాయకృత సంగీతమును వింటూ గోవిందమారార్ త్యాగరాయ ప్రతిభను గురించీ ఆ ప్రతిభ అశేష జనానీకపు ఆదరణను పొందిన దానిని గురించీ విస్తుబోతారు. తామ్రపర్ణీనది దాటుతూఉంటే పడవవారు 'రామచంద్ర నీదయా!' అనే త్యాగరాయగేయమును పడవపాటగా పాడుతారు. బాటప్రక్కన ఉన్న చిన్న ఆలయంలో 'తులసీ దళములతో' అనే కీర్తన వినిపిస్తుంది. మధుర రాజాంతఃపురములో 'ఉయ్యాలలూగవయ్యా' అనే జోలపాట వింటారు గోవింద మారార్. తంజావూరు ప్రవేసిస్తుంటే 'సుఖి యెవ్వరో' అనే కీర్తన పాడుతూ

ఉంటాడు తత్త్వవేత్తయైన బిచ్చగాడు. త్యాగరాజును సందర్శించినపుడు ఆయన కోరికపైన గోవిందమారార్ వీణపై తన ప్రతిభను ప్రదర్శిస్తారు. అతని అప్రతిమాన కౌశల్యానికి మెచ్చుకుని, పరవశత్వముతో 'ఎందరో మహానుభావులు' అనే కీర్తన గానము చేయును త్యాగరాజు. ఈ రూపకమును తరువాత కొన్నేళ్ళకు మలయాళభాషలోనూ చిత్రించాము. త్యాగరాజప్రతిభకు నా పుష్పాంజలి ఇలా రాణించింది.

అలాగే మహిళామండలికార్యక్రమాలలోనూ ఆ కార్యక్రమాలలో పాల్గొంటూన్న జమునాబాయీ, నిర్మలా మరీమరీ ఆశ్చర్యపోయేవారు నేను, ఏరిఏరి 'పాత' కీర్తనలనే వారిచేత ప్రసారము చేయిస్తూంటే. 'మంచి కంచికామాక్షి' అనీ, 'ఓ రంగశాయీ' అనీ, 'ఆరగింపవే, పాలారగింపవే' అనీ, - ఇటువంటి రచనలు మహిళామండలి జంత్రసమ్మేళమునకు ఎంతో వన్నెదెస్తూండేవి.

ఆ రోజులలో రేడియోనాటకాలలోనూ, సంగీత నాటకాలలోనూ ఇద్దరు పిల్లలు తరుచు పాల్గొంటూ ఉండేవారు. ఇద్దరూ ఇంచుమించు సమాన వయస్కులు. విమలకుమారికి తొమ్మిదేళ్ళు, వరలక్ష్మికి పదేళ్ళు. ఎంతో సావాసకత్తెలైనా, స్టూడియోలో ఎప్పుడూ ఏదో ఒకమిష మీద కజ్జాలు తెస్తూండేవారు. వారి తగాదాలు తీర్చడములో కొంత కాలయాపన ఐపోయేది, నాకు. కాని, నేనంటే వారికి కొంత భయమూ కొంత ప్రేమా - ఎంతో చనువూ. రేడియో కార్యక్రమాలలో పొరపాటువస్తే మండిపడతాననే భయమూ తమ పాత్రలను చక్కగా నిర్వహిస్తే మనసార మెచ్చుకుంటానని చనువూ. వారిద్దరికీకూడా మంచి సంగీతజ్ఞానము. కలిసి పాడుతూన్న వారి కంఠస్వరము ఎంతో నిండు నిచ్చేది రేడియో సంగీతనాటకాలకు. వచనమున్నూ చాలా బాగా చదివేవారు వారిద్దరూ. విమలకుమారిని చూస్తూ, నాకే కుమార్తెఉంటే, ఈ ఈడుపిల్లే ఉంటుంది అనుకుంటూ, ఆమెను నేను పెంచుకుంటాను అంటూ ఉండేవాడను ఆమె తల్లి గారితో. రవీంద్రుని 'సన్యాసిన్' అనే నాటికను అనుసరించి నేను వ్రాసిన నాటికలో అనాథబాలికగా నటించినది విమలకుమారి. సన్యాసి, నేనూ. సర్వసంగపరిత్యాగి ఐన ఆ సన్యాసి ఈ అనాథబాలిక పిలుపు వినక తప్పదు. ఆమెకు ఆశ్రయ

మిస్తాడు తన కుటీరములో. ఆమె జిలిబిలి మాటలూ తేనెలొలుకు పాటలూ అతనిని ఆకర్షింపక తప్పదు. కాని, ముక్తికాముడైన ఆ సన్యాసి తన్ను కట్టివేయబూనిన ఆ మమకారపు సంకెళ్ళను త్రెంపుకోవాలని బదరీయాత్రకు వెళ్ళుతాడు అమ్మాయిని తనశిష్యుని పోషణలో ఉంచి. కాని, కృష్ణా గోదావరీ కెరటాలలో అతను ఆ బాలిక ముఖమేచూస్తాడు. ప్రయాగ సంగమస్థానంలోనూ ఆ పాప చిరునవ్వే అతని కళ్ళయెదుట తాండవిస్తుంది. ఋషీకేశంలో గంగానదిలో మునుగుతూండగా అమ్మాయి తన రెండుచేతులూ చాచి "దాదా! రావా?....రావా? దాదా!!" అని గొంతెత్తి పిలచినట్లనిపిస్తుంది అతనికి. ఆ మతిభ్రమను అరికట్టలేక, అతడు వెంటనే తన ఆశ్రమానికి వచ్చివేస్తాడు అంచీలపైన. వచ్చేసరికి, తీవ్రజ్వరముతో బాధపడుతూన్న ఆ అనాధబాలిక అతనికోసము ప్రలాపిస్తూ ఉంటుంది. "దాదా! రావా?....రావా? దాదా!!" అంటూ. "వచ్చాను తల్లీ! ఇక నిన్నువిడిచి వెళ్ళను!" అంటూ, సన్యాసి ఆమెను బ్రతికించుకుంటాడు. ఈ ఘట్టమున విమలకుమారి చాలా నేర్పుతో నటించినది. చాలాచాలా జాలిగా పిలచింది నన్ను. నేను ఏడుపు ఆపుకోలేకపోయాను, మైక్రొఫోన్ ముందు!

ఆమధ్య ఎప్పుడో, పిల్లలతల్లిగా ఒకరింట పేరంటానికివచ్చిన విమలకుమారి, బయట కార్‌లో కూర్చున్న నన్ను చూడడానికి గుమ్మందాకావచ్చి "బాబయ్యా! చిన్నప్పుడు నన్ను పెంచుకుంటాను అనేవారు!" అన్నదట మా వాళ్ళతో!

వరలక్ష్మికిన్నీ నేనంటే ఎంతో ఆప్యాయము. ఎన్నో రేడియోనాటకాలలో మిక్కిలి ప్రవీణతతో నటించిన ఆమె, తరువాత, గొప్ప సినిమాతారగా రాణించినది. కాని, నాయందు అభిమానము అల్లాగే ఉన్నది, ఆమెలో. ఇప్పటికీ ఆమె నటిస్తూన్న ఏ సెట్‌పైకి ఐనా, నేను రావడం తటస్థిస్తే, వెంటనే, తనపని ఆపి, నావద్దకువచ్చి ప్రణమిల్లుతుంది, ఎంతో భక్తితో ఆమె. మారువేషంలో ఉన్న ఆమెను నేను వెంటనే గుర్తింపలేకపోతే "ఏమండీ! నన్నే మరచిపోయారా!!" అంటుంది ఎంతో ఆప్యాయంగా, కొంత అధిక్షేపణగా. ఆమె కంఠస్వరము వినగానే, కాలచక్రము ఒక్కసారి రివ్వుమని ఇరువదేళ్ళు వెనక్కు తిరిగి

పోతుంది. విమలకుమారీ వరలక్ష్మి ఏదో చిలిపివిషయం గురించి వాదులాడుకుని, నావద్దకు "చూడండీ! ఈ అమ్మాయి...." అంటూ ఫిర్యాదుచేస్తూ రావడం జ్ఞాపకం వస్తుంది. ఎప్పటిమాటో! - నిన్నలా తోస్తుంది!

ఆరోజులలో, ఒక పర్యాయము, నేను రచించిన 'పునరాగమము' అనే నాటికలో ప్రధాన స్త్రీ పాత్రను నిర్వహించడానికి ఒక క్రొత్త నటికోసం స్నేహితుడు గూడవల్లి రామబ్రహ్మానికి టెలిఫోన్ చేశాను. "ఫోన్‌లో ఏమి మాట్లాడుతావు! ఒక్కసారి వచ్చివెళ్ళరాదా - నిన్నుచూచి చాలారోజులైంది.... తిరుచినాపల్లినుంచి ఎప్పుడు వచ్చావు?" అన్నారు రామబ్రహ్మం. నేను వెంటనే వారివద్దకు వెళ్ళాను. 'పల్నాటి పౌరుషము' సినీమాతీసే రోజులవి అనుకుంటాను. నేను వెళ్ళేసరికి, రామబ్రహ్మంతో ఒక యువకుడు మాట్లాడుతున్నాడు. అతి విశాలమైన నెన్నుదురు; ఉంగరాలు తిరిగిన నల్లని దట్టమైన జుత్తు; కొంత అశాంతితోనూ, కొంత తిరుగుబాటుతోనూ, కొంత తెలుసుకోవాలనే తీక్షణమైన కుతూహలంతోనూ, మెరిసిపోతూన్న కళ్ళు; స్వచ్ఛమైన ఖద్దరు దుస్తులు. కంటి మెడ లాల్చీకి పైబొత్తాము పెట్టుకోలేదు. (తరువాత చాలాసార్లు ప్రయత్నించాను ఆ పైబొత్తామును పెట్టించడానికి అతనిచేత. నా ప్రయత్నం విఫలమైంది. "పోనిస్తురూ! ఎవరు చూడొచ్చారు?" అంటాడు, అతను.)

ఆ కళ్ళు నన్ను చాలా ఆకర్షించాయి. ఆ కళ్ళలోకి అల్లాగే చూస్తూ ఉండిపోయాను, నేను.

రామబ్రహ్మం అన్నారు : "ఎందుకలా చూస్తావు? ఇతనిని ఎరుగవా నీవు? మీరిద్దరూ ఒకకోవకు చెందినవారే, మరి. ఒకరినొకరు ఇదివరకే కలుసుకొని ఉండాలి. ఈయనే త్రిపురనేని గోపీచంద్!" అని, "ఈయనే గాలిమేడల (ఏ ఆ ఆర్) వారు, ఫలానా!" అంటూ నన్ను పరిచయం చేశారు.

అల్లా కలిగిన ప్రథమపరిచయము, అతి శీఘ్రకాలములో, ఒకరి నొకరము విడిచి ఉండలేనంత స్నేహంగా పరిణమించినది. మిక్కిలి ఆప్యాయతతో పునఃపునః స్మరింపతగిన ఒకానొక మధురసహవాస స్మృతిగా నిలచిపోయింది,

నా శేషజీవితములో. గోపీచంద్‌కూ నాకూ అనేకవిషయాలలో ఐక్యభావము ఏర్పడ్డది - అప్పటి మా ఇద్దరి దృక్పథాలలో ఏమంత తేడా లేకపోబట్టి. అప్పటికి అతనికి సినిమాప్రపంచకము క్రొత్త. అందువల్ల మానవనైజముపై అపనమ్మకము అతని మనస్సును పాడుచెయ్యలేదు, ఇంకా. సాహిత్యవిషయాలలోనూ పరిసరప్రపంచకమును గురించిన విమర్శలోనూ, మేము, తరుచు, ఒకే అభిప్రాయాన్ని ఇంచుమించు ఒకే మాటలలో, ప్రకటిస్తూ ఉండేవారము, ఒకరితో నొకరు. అప్పటి మా రచనా పద్ధతులలోనూ విపరీతమైన పోలిక ఉండేది. నాకు బాగా జ్ఞాపకము: ఈపోలిక ఎంత గొప్పగాఉండేదీ అంటే: మానవజీవితాన్ని ఒకానొక మహానది చరిత్రతో పోల్చి చిత్రించే ఒక చక్కని రూపకమును అతని చేత రచింపించాను నేను రేడియో ప్రసారముకొరకు. మిక్కిలి పనితొందరలలో ఉన్న అతనికి తగినంత అవకాశము లేక, ఆ రూపకములో కొన్నిభాగాలు నేను రచింపవలసి వచ్చింది. ఇప్పుడు ఆ రచనను తీసిచూస్తే, అతనిమాటలు ఏవో, నామాటలు ఏవో, నేను చెప్పకోలేను! అంతటి సమైక్యత కుదిరింది ఆ రోజులలో, మా భావాలలోనూ ఆ భావాలను వ్యక్తపరచే పద్ధతిలోనూ.

ఐతే, ఒక చిన్న వ్యత్యాసము మాత్రము కన్పించసాగింది క్రమక్రమంగా. అతను, జీవితంలో ఉండే మంచినీ, చెడుగునూ కూడా వివరంగా చూడకలిగి, ఆ చెడుగును నిర్మూలించాలనే ఉద్దేశంతో తన కథానికలలోనూ, తన వ్యాసాలలోనూ ఆ చెడుగును ప్రస్ఫుటంగా చిత్రింపసాగాడు - ఒకొక్కప్పుడు కొట్టవచ్చినంత ప్రస్ఫుటంగా ఉండేది ఆ వాస్తవికత! మాటవరుసకు, అతను ఒక కథలో, బిచ్చగాండ్లు తాము ఇంకా బాగా తిరిపెమెత్తుకోడానికి వీలుగా, తాము డబ్బిచ్చి కొనుక్కున్న పసికందుల కళ్ళు వాతబెట్టి, ఆ పాపలను గ్రుడ్డివారిని చేస్తారనీ, ఆ గ్రుడ్డిపిల్లలను ప్రదర్శించడమువల్ల వారు ఇంకా ఎక్కువ సంపాదిస్తారనీ, గోపీచంద్ ఒక కథలో వ్రాశారు. ఇది నిజమే కావచ్చును. కాని, ఒళ్లు కంపరము కలిగించే ఈ సత్యాన్ని గురించి, నేను అలా వ్రాయలేను. అసలు అట్టివిషయాన్ని గురించి వ్రాయాలనే తోచదు నాకు. అతని వ్రాతవల్ల ఆ దురాచారము మారిందనీ నమ్మలేను, నేను - ఎవరైతే ఆ దురాచారానికి ఒడిగట్టుతున్నారో వారికి అతనిమాటలు వినబడవు కాబట్టి.

ఆ రోజులలో మాత్రము, రోజుకు రెండు మూడుసార్లయినా కలుసుకుంటూ ఉండేవారము మేము. తనతో ప్రసక్తి కలిగిన స్త్రీపురుషుల వివిధ నైజముల గురించి నాతో చెపుతూ ఉండేవాడు, అతను. "ఈవ్యక్తి ఇలా ఎందుకు ప్రవర్తించాలి? వంకరటింకర ఆలోచనలే అలవాటా ఏమిటి, ఇటువంటి వారికి?" అనేవాడు, నాతో, వారి వింతప్రవర్తన అతనికి ఎంతో ఆశాభంగమును కలిగించినట్టు. మానవనైజములో నాకున్న స్థిరవిశ్వాసము అతనికి లేకపోయింది, కొన్నాళ్ళకు. ఆ విశ్వాసము లేకపోవడమే ఇంకా ఇంకా ఎక్కువై అతని 'అసమర్థుని జీవయాత్ర'లో రూపుదాల్చినది, అనుకుంటాను.

కాని, 'అసమర్థుని జీవయాత్ర' సాహిత్యరీత్యా ఒక గొప్ప యత్నము. మొదట, పత్రికలో వారం వారం ప్రచారమై, తరువాత పుస్తకంగా వెలువడిన ఈ గ్రంథాన్ని ఖాసా సుబ్బారావుగారి వద్దనుంచి నేను తీసుకున్నాను, వారి ఇంగ్లీషు స్వతంత్రలో విమర్శిస్తాను అంటూ. ఆ విమర్శలో నేను ఇంచుమించు ఈ అభిప్రాయాన్ని వెల్లడించాను :

"గోపీచంద్ ఆధునిక ఆంధ్రవచనరచనలో ఒక క్రొత్తపద్ధతిని ఉపక్రమించారు. చెప్పవలసిన విషయాన్ని అతిసూటిగా చెప్పడమూ, ఏమాత్రమూ 'పులుముడు' లేకపోవడమూ, వర్ణించిన ప్రతిసంఘటనా ఏదో ఒక విశిష్టమైన సందేశమును అందియ్యడమూ, మిక్కిలి చురుకైన సంభాషణా ఆయన రచనలలోని ఉత్తమ గుణాలు," - అంటూ వ్రాశాను.

ఇంగ్లీష్ స్వతంత్రలోని నావిమర్శ ముగిస్తూ ఈ మాటలు అన్నాను : "ఆధునిక ఇంగ్లీష్‌రచనలో జెరాల్డ్‌కర్ష్ ఎటువంటి ప్రతిభను వెల్లడిస్తాడో అంతటి ప్రతిభా కనిపిస్తుంది గోపీచంద్ తెలుగు రచనలో, వారిద్దరి రచనలలోనూ చాలా పోలికలున్నాయి" - అని.

ఈ విమర్శనుచూచి, ప్రచురించడానికి అనుజ్ఞ ఇయ్యవలసిన రేడియోలో నాపైఅధికారి - ఆయన మాతృభాష తెలుగు కాకపోయినా, బాగా అవ

గాహన, ఆయనకు, తెలుగు రచనావిధానము; ఇంగ్లీష్ రచనలూ చాలా చదివిన వారు ఆయన - ఆయన ఇలా 'రిమార్క్' వ్రాశారు:

"ప్రసిద్ధి గాంచిన జరాల్డ్‌కర్ష్ రచనలు ఏమీ చదువలేదు నేను. గోపీచంద్ తెలుగును గురించి నాకు కొంత తెలుసు. జరాల్డ్‌కర్ష్ రచన గోపీచంద్ రచనలాఉంటే, కర్ష్‌ప్రతిభ గొప్పదే అయివుండాలి," అని.

....కాలక్రమేణా, తప్పనిసరిగా, గోపీచంద్ జీవితమూ నా జీవితమూ వేరు వేరు మార్గాలను అనుసరించాయి. అప్పుడప్పుడు ఏదో ఒక మజిలీలో ఈ మార్గాలు ఒకానొక సాయంత్రపువేళ, కలుసుకుంటాయి. కాని, తెల్లవారేసరికి అతనిదో త్రోవ; నాదో త్రోవ.

పోలికలు గుర్తించడము సాహసమే కావచ్చుగాని, మా ఇద్దరిజీవితాలను పోల్చి చూచుకుంటే, మా ఇద్దరిజీవితాలున్నూ వింత వింత అనుభవాలతో నిండి ఉన్నా, అతనిలో ఉన్న 'అన్వేషణాసక్తి' నాలోనూ ఉన్నా, నాకంటే జీవితములో ఎక్కువ సుఖాన్ని పొందకలిగాడు, గోపీచంద్, అనవచ్చు.

కాని, గోపీచంద్‌కంటే ఎక్కువ మనశ్శాంతిని పొందకలిగాను, నేను! ఇది వట్టి భ్రమకాదు; నిజము!!

## ౧౮

శ్రీ అడివి బాపిరాజు 1942 లో ఒకరోజు మా నిలయానికి వచ్చారు. వారితో కూడా కూచిపూడి నాట్యకళావేత్త శ్రీ వేదాంతము లక్ష్మీనారాయణశాస్త్రి వారి శిష్యులూ వచ్చారు. రేడియోలో కూచిపూడినాట్య సంప్రదాయపు ఉషాపరిణయ నాటకమును ప్రదర్శింపబోతున్నారు.

బాపిరాజుబావ కూచిపూడి నాట్యవిశిష్టతను గురించి చెప్పారు, నాతో. శాస్త్రిగారు కొన్ని హస్తములూ, కొన్ని ముద్రలూ చూపారు. వారు తరిఫీదుచేసిన శిష్యులు దశావతారములను ఒప్పించారు ఎంతో నిపుణతతో. నేను ముగ్ధుడనైపోయాను ఆ కళాపరిపూర్ణతను కన్నులారా చూచి.

ఉషాపరిణయనాటకములో ప్రధాన స్త్రీపాత్ర ధరిస్తున్న అమ్మాయిని నాకు పరిచయం చేశారు, బాపిరాజు బావ. మిక్కిలి సుకుమారి, ఆమె. ఆమె కన్నులలో విపరీతపు అలసత్వమూ ఎంతో మిగిలిపోయిన బాధా కనిపించాయి. ఆమె కంఠస్వరము మిక్కిలి మృదువైనా మాటలు చాలా స్పష్టంగా చెప్పకలిగేది. ఒకొక్కభావమూ హృదయపూర్వకంగా అనుభవిస్తూ వెల్లడింప కలిగేది, లక్ష్మీదేవి.

ఒకొక్కరి ఎడల, వారిని చూచీ చూడడముతోనే విపరీతపు సానుభూతి కలుగుతుంది, మనకు. ఇది పూర్తిగా భౌతికాతీతమే అనుకుంటాను, నేను. వారికీ మన ఎడల నెంతో విశ్వాసము కలుగుతుంది. మన సానుభూతికీ వారి విశ్వాసానికీ కారణాలు వెతుక్కున్నా కనిపించవు. ఒకవేళ మన మాటతీరూ మన ప్రవర్తనా ఈ విశ్వాసభావానికి దోహదమిస్తాయేమో.

నాలో ఒక్క గొప్ప లోప మున్నది - అన్నిటికంటే ఎక్కువైనదన్న మాట : నేను చేసే స్నేహాలలో అంతరాలు పాటింపలేను. పరిచయముకాకుండా

ఉండాలిగాని, పరిచయమై, కొన్ని సమాన అభిరుచులూ కొన్ని సమాన ఆశయాలూ స్ఫురించాయీ అంటే, ఇక అంతే! వారు నాకు ఇట్టే స్నేహితులై పోతారు. కొందరు తమ స్నేహవర్గములో ఆంతస్థులను నిలబెట్టుకోగలరు. కాని, నేను అలా హెచ్చు తగ్గులను పాటింపలేను. ఎవరో ఒకరిద్దరు మరీ ముఖ్యమైన వారు మినహా, ఇక అందరినీ ఏక రీతినే మిత్రులుగా భావిస్తాను. నా జీవితంలో కలసిపోతారు వారు - వారి జీవితంలో నేను కొంతవరకే కలసినా. అతిశీఘ్రకాలములో వారు నాకు మిక్కిలి ఆప్తులైపోతారు. కొన్ని ఆదర్శ పరిస్థితులలో, ఇందులో ఏమంత ప్రమాదములేదు. కాని, ప్రస్తుతము, ఇలా, చప్పున, మిక్కిలి ఎక్కువగా స్నేహము కావడము అనేకమైన ఇబ్బందులను కొని తెచ్చుకోవడమవుతుంది.

ఇంకో విషయం : అపరిమిత సానుభూతివేరూ ఆప్తస్నేహము వేరూ. ఇందు మొదటిది రెండవదానికి కారణము కావచ్చు. కాని, బుద్ధిమంతులు వానిని వేరువేరుగా ఉంచకలుగుతారు. నావంటివారు ప్రయత్నించరు అలా ఉండాలని.

లక్ష్మీదేవి జీవితవిశేషాలను తెలిసికొనినకొలదీ, నాకు ఆమెయందు విపరీతపు సానుభూతి కలిగింది. పద్మాకరంలో దట్టపునాచులో చిక్కుకుపోయిన సుకుమారపద్మములా కనిపించినది నాకు, ఆమె. ఎల్లాగైనా, ఆమెను ఆ వాతావరణమునుంచి బయటకు రప్పించాలనే సంకల్పము కలిగింది, నాలో. మాబావ బాపిరాజున్నూ ఈ యత్నముచేసి, ఆమెలో విపరీతపు సంస్కారమును కలుగజేయ కలిగారు కాని, ఆమెను పరివేష్టించి ఉన్న పరిస్థితులనుండి ఆమెను తప్పింప లేక, విఫలులైనారని నాకు చాలా తరువాతగాని తెలియలేదు.

రేడియోనాటికలలో పాల్గొంటూ, ఎంతో వన్నెతెచ్చేది, లక్ష్మీదేవి, మా కార్యక్రమాలకు. ఎటువంటి సన్నివేశాన్ని ఐనా, ఇట్టే అర్థముచేసుకో కలిగేది, ఆమె. రేడియో తొలిరోజులలో, మేము ప్రసారము చేసిన 'కచదేవయాని' నాటికను మళ్లా ప్రసారంచేస్తూ, అందు దేవయానిపాత్రను లక్ష్మీదేవికిచ్చాము, వినేవారు బొటబొట కన్నీరు కార్చారు, దేవయానిగా ఆమె వ్యక్తపరచిన భగ్న

హృదయ భావమును అనుభవిస్తూ, అంటే, ఏమాత్రమూ అతిశయోక్తి కాదు. కచుని శపిస్తూన్నప్పుడు ఆమెలో కలిగిన విపరీతపు ఆవేశాన్ని భరింపలేక "అమ్మా!" అంటూ భూమికి వ్రాలిపోతుంది, దేవయాని. స్టూడియోలో, మైక్రోఫోన్ ముందు నటించిన లక్ష్మీదేవిని మా భానుమతి పట్టుకోవలసినంత పని ఐనది. అంతటి తన్మయత పొందకలిగినది. లక్ష్మీదేవి!

ఆ తరువాత, మల్లవరపు విశ్వేశ్వరరావు రచించిన సుగాత్రినాటికలో సుగాత్రిగానూ ఇంకా ఎన్నో నాటకాలలోనూ పాల్గొన్నది లక్ష్మీదేవి. కాని, కొంతకాలానికి, సినీమాలో రాణించాలి అనే పిచ్చివ్యామోహంతో, బొంబాయి వెళ్ళిపోయినది ఆమె. అక్కడ ఆమె ఆశ నిరాశలు అగుటయేగాక, ఆమెకు చాలా జబ్బుచేసింది, పాపము. ఆ జబ్బుతోనే ఆమె మద్రాస్‌కు తిరిగివచ్చినది. ఇక, రేడియో కార్యక్రమాలలో పాల్గొనలేనందుకు చాలా నిరుత్సాహపడినది, ఆమె. శక్తివంచనలేక, నా స్నేహితులైన గొప్పవైద్యులచేత వైద్యముచేయించాను, ఆమెకు. ఆ వైద్యమువల్లా, ఎల్లాగైనా ఒళ్ళు బాగుచేసుకుని మళ్లా రేడియోకార్యక్రమాలలో పాల్గొనాలి అనే గొప్ప అసక్తివల్లా. ఆమెకు కొంతనయమైనా, ఇతర కారణాలవల్ల, ఆమె మద్రాస్ విడిచి వెళ్ళిపోయినది.

ఆమెను నేను ఆఖరిసారిచూస్త రైల్వేస్టేషన్‌లో. నేను రేడియోపని మీద బొంబాయి వెళుతున్నానని తెలిసి, త్రోవలో వారిఊరి స్టేషన్‌లో నన్ను కలుసుకున్నది. అప్పటికీ త్వరలో తనకు ఎప్పటి ఆరోగ్యము కలుగుననీ, మళ్ళీ, రేడియోనాటకాలలో పాల్గొనకలననీ చాలా ధైర్యముతోనే మాట్లాడినది. కాని, దైవము మరోవిధముగా తలపెట్టడమువల్ల, అలా జరుగలేదు. మరికొన్నాళ్ళకు, వ్యాధి తిరుగపెట్టడమువల్ల ఆమె తిరిగి మద్రాస్ రావలసివచ్చినది. ఈసారి, ఆమె వచ్చినట్లు నాకు చాలాకాలానికిగాని తెలియలేదు. అదీ, ఆమె వైద్యుడు ఒకరిచేత పంపిన కబురువల్ల తెలిసింది. వైద్యము ఫలించలేదనీ, ఏనిమిషమైనా ఆమె కనులుమూయవచ్చుననీ, ఆ స్థితిలో నేను వెళ్ళి ఆమెను పలుకరించగలిగితే ఆమెఆత్మకు ఎంతో శాంతికలుగుతుండ**ని** చెప్పారు, కబురు తెచ్చినవారు.

కాని, అప్పటికి నా ఆశ్రమము మారి, నాకు నేనే నియమించుకున్న సాంఘికమైన ఒకానొక కట్టుబాటువల్ల, ఆ సమయములో, మృత్యుముఖమున ఉన్న ఆ వ్యక్తిని, వెళ్ళి, చూడలేకపోయాను, నేను.

ఆ నిమిషపు పిరికితనానికి జీవితమంతా బాధపడుతున్నాను, నేను.

కాని, మళ్ళా అనుకుంటూ ఉంటాను, ఏలోకములోఉన్నా, ఆ ఆత్మకు నా పరిస్థితులు అవగతమనీ, నా పొరపాటును ఇదివరకే, ఆ నిర్మలాత్మ క్షమించి ఉంటుందనీ.

అపరిమిత స్వార్థత్యాగానికి ఆనవాలుగా ఉండిపోయింది, ఆ సుకుమారి జీవితము!

* * * *

తిరుచినాపల్లిలో ప్రసారమైన కొన్ని నాటికలనూ రూపకాలనూ తెలుగు చేసి మద్రాస్‌నుంచి ప్రసారము చేశాము. వీనిలో మొదటిది 'వీరఅభిమన్య'. ఇచ్చటా అభిమన్య నేనే. ఉత్తరకోసము స్నేహితుడు రామబ్రహ్మం వద్దకు వెళ్ళగా, ఒక 'తార'ను నాకు పరిచయముచేస్తూ "ఈమె వృద్ధిలోకి రాతగిన ఆమె. రేడియోవారే తరిఫీదు చెయ్యాలి!!" అన్నారు, రామబ్రహ్మం. రేడియోవాచక మన్నా రేడియోప్రసారపద్ధతి అన్నా అంతటి విలువ ఉండేది రామబ్రహ్మానికి. ఉత్తరపాత్రను ఆమె చాలా చక్కగా నిర్వహించారు. కంఠస్వరమూ మంచి కంఠస్వరము. మహనీయ ప్రేయసిగానూ, మహావీరపత్నిగానూ చక్కగా ఒప్పించారు.

ఆమె అంత ఎక్కువగా రేడియో కార్యక్రమాలలో పాల్గొనలేదుగాని, సినిమాలో మాత్రము చాలా గొప్పపేరు తెచ్చుకున్నారు. ఆమె నటించిన 'ఇల్లాలు' చిత్రమును నేను చాలా ప్రశంసిస్తూ సమీక్షచేశాను కూడా. ఇటీవల ఆమె నటించిన 'ముద్దుబిడ్డ' చిత్రపు 'ప్రీవ్యూ' చూచిన నేను, ప్రదర్శన ఐనవెంటనే, ఆమె

వద్దకు వెళ్ళి "అమ్మాయీ! చాలా బాగా నటించావు!" అంటూ మెచ్చుకొనగా, ఆమె ఎంతో వినయముతో అన్నారు : "నాదేమున్నదండీ! అంతా మీ ఆశీర్వచన ప్రభావము. అభిమన్యనాటిక నేను మరచిపోలేదు!!" అని.

ఆమెయే, లక్ష్మీరాజ్యము.

ఋష్యేంద్రమణినీ ఆరోజులలో మా నాటకాలలో తరుచు పాల్గొంటూ ఉండేవారు. ఆమె వచనము చదువుటలో ఒకానొక విశిష్టత ఉన్నది. కంచుగీసి నట్టు ఉంటుంది ఆమె కంఠస్వరము. పద్యమూ చాలా బాగా చదువుతారు, ఆమె. సంగీతవిషయంలో, ఆమెకు కర్ణాటక, హిందుస్థానీ రీతులలో సమానప్రతిభ ఉన్నది.

నేను రచించిన చిన్నచిన్న నాటికలలో ఋష్యేంద్రమణి చాలా బాగానటి స్తుండేవారు. 'పేరులో ఏమున్నది!' అనే ప్రహసనంతో నా అక్కగా వేషమేశారు ఆమె. భావుకుడైన మోహన్ ఒకమ్మాయి నాజూకు పేరువల్ల ముగ్ధుడై, ఆమెతో పరిచయముకోసము, తన అక్కగారి సహాయాన్ని అర్థిస్తాడు. తమ్ముని పూర్తిగా అర్థముచేసుకున్న అక్కగారు అతనియందు ఎంతో సానుభూతి చూపినా, అతని వెర్రిని మందలిస్తుంది. ఈ నాటికలో ఋష్యేంద్రమణి చాలా చలాకీగా నటించారు. నా పూర్వజీవితంలోని కొన్ని అంశాలను ఎరిగిన ఆమె నారచనలో నేను అనుకోని కొన్ని అర్థాలను కల్పించుకొని, అక్కగా నన్ను చాలా అధిక్షేపించారు, నాటికలో. ఈ అధిక్షేపణ చాలా సహజంగా అమరి, నాటకానికి ఎంతో వన్నె తెచ్చినది. నాటకము పూర్తిఐనాక, నేను ఆమెకేసి జాలిగా చూస్తున్నాను అనుకొని, ఆమె "ఏమీ అనుకోకండి. నన్ను మీరు అంతగా ఎరుగకపోయినా, నేను మిమ్మల్ని చాలా బాగా ఎరుగుదును; ఆ చనువుచేత అలా మాట్లాడాను; అంతే! నిజంగా, నేను మీ అక్కయ్యనే అనుకొంటే ఆమె ఇక్కడుంటే మీ ఆటలు సాగేవా!" అన్నారు, ఎంతో ఆప్యాయంగా.

తరువాత, అనేకసార్లు కలుసుకున్నా. ఆమెను చూచినపుడల్లా ఎక్కడో ఢిల్లీలో ఉన్న మాఅక్కయ్య జ్ఞాపకము వస్తూఉంటుంది. అక్కయ్యను చూచి

నట్టే ఉంటుంది, ఆమెను చూస్తే. మొన్న ఈమధ్య వారి అమ్మాయికి పెండ్లి ఐనప్పుడు, పనికట్టుకు వచ్చి, నన్ను పెళ్ళికి పిలచి వెళ్ళారు ఆమె, ఎంత పని ఉన్నా, మీకోడలు పెళ్ళికి మీరు రాక తప్పదు అంటూ.

మంచి సమయస్ఫూర్తి ఉన్నది, ఋష్యేంద్రమణికి. ఒక పర్యాయము, మేము అనుకున్న ఒక నాటకము, ఏదో కారణమువల్ల, ఆఖరి నిమిషంలో మాని వేసి, ఆ నాటకానికి బదులు, వరూధిని నాటకము వెయ్యవలసి వచ్చింది. ఆ అసలు నాటకములో కథానాయకిగా నియమితురాలైన ఋష్యేంద్రమణి అప్పటికప్పుడు, ఏమాత్రమూ రిహార్సల్ లేకనే, వరూధినిమాటలూ ఆ పద్యాలూ చదువవలసి వచ్చింది. కాని, తన అసమాన చాకచక్యం వల్లనూ, సమయస్ఫూర్తివల్లనూ ఆపేశ మాట దక్కించారు, మాకు, ఆమె. ఇదివరకు ఏమాత్రము పరిచయమూ లేక పోయినా మనుచరిత్రలోని పద్యాలు, ఒక్కతప్పు లేకుండా, చాలా రసవంతంగా చదివారు ఆమె.

నేను రచించిన తెలుగుమీరాలోనూ మీరాబాయిగా అద్భుతంగా ఒప్పించారు ఆమె. వచనమూ బాగా చదివారూ, మీరా కీర్తనలూ హిందీలో చాలా బాగా గానము చేశారు. ఆమెలో ఒక గొప్ప నేర్పు ఉన్నది: అవసరమైన భావోద్రేకాన్ని అర నిమిషములో తెచ్చుకోగలరు ఆమె. ఈ గుణము రేడియోకు అమూల్యమైనది.

ఋష్యేంద్రమణి స్నేహితురాలూ, ఇటీవల బంధువూ, శ్రీమతి కన్నాంబ. కన్నాంబను మొట్టమొదట రేడియోకి నేను తీసుకొనివచ్చినది, 'వెండి తెర' అనే శీర్షికను, సినీమావిషయాలు గురించి విమర్శించడము కోసము. చాలా బాగా మాట్లాడుతారు, ఆమె. ఆ ప్రసంగపు సందర్భంలో కొన్ని పద్యాలున్నూ చాలా బాగా చదివారు ఆమె. ఆమె నటించిన సినీమాలు నేను కొన్ని చూచినా, సినీమాలో ఆమెనేర్పు అంతా ఒక ఎత్తూ, ఎన్నో ఏండ్లక్రితము, నాటకరంగము పైన ఆమె చూపిన నటనాకౌశల్యము ఒక ఎత్తూను.

## సాగుతున్న యాత్ర

నాకు బాగా జ్ఞాపకము : 1934 ఆ ప్రాంతాలలో, విజయవాడలో, ఆమె నటించిన కృష్ణతులాభార నాటకమును చూచిన అనుభవము. ఆ నాటకములో సత్యభామ, ఆమె. సన్నగా శలాకలా ఉండేవారు ఆమె, ఆ రోజులలో. సత్యభామ నైజాన్ని చాలా బాగా అర్థముచేసుకుని, ఆ పాత్రకు చక్కని జీవము పోశారు ఆమె. చక్కగా పాడేవారు ఆమె. పాటకంటే కూడా ఆమె పద్యము చదివేతీరు మిక్కిలి సొంపుగా ఉండేది. ఆమె పాడిన 'భ్రమరంబు-భ్రమరికి' అనే పద్యము రికార్డ్ నేను ఎన్ని వందలసార్లు మా ఇంట్లో గ్రామఫోన్‌పైనవేసి విన్నానో! అంత ఇష్టము నాకు, ఆమె పద్యమును చదివేతీరు.

కన్నాంబ రంగస్థలాన నటిస్తున్నప్పుడు, ఎదుట మరో స్త్రీ పాత్రను ధరించిన పురుషపుంగవుడు మిక్కిలి పేలవంగా కనిపించేవాడు. నాకు అర్థ మయ్యేది కాదు, అలా ధైర్యంగా నిలబడి ఆమెఎదుట స్త్రీపాత్రను నిర్వహించ డానికి ఎలా సాహసింపగలరో ఏ మగవారైనా, అని. అసలు, మగవారు ఆడ వేషాలు వెయ్యడమే తప్పు. అందూ, ఎదుట, ప్రవీణురాలైన ఒక నటీమణి నటి స్తూన్నప్పుడు స్త్రీ వేషధారిఐన నటుడు అలా దిష్టిపిడతలా కనిపించడము మరీ ఘోరము.

*　　*　　*　　*

1941 లో నాజీవితములోకి ఒక క్రొత్త ప్రభావము వచ్చినది. తత్ఫలితము నాతరువాత జీవితాన్నంతా పూర్తిగా ఆవహించినది. ఈ క్రొత్తవెలుగు అప్పుడు నేను ఒక పునర్జన్మ నెత్తినట్లనిపించింది. మనము ఒకరికి కావాలి, మనలను చూచీ చూడడముతోనే ఒకరి కండ్లు ఉత్సాహముతో వికసిస్తవి, మన రాక ఆలస్యమైతే అనిమిషనేత్రులై, వారు నిరీక్షిస్తుంటారు - అనే భావము వింత బలాన్ని ఇస్తుంది జీవికి. ఇదివరకు జరిగిన ఆశాభంగమూ ఇదివరకు ఆవరించిన నిస్పృహా జ్ఞాపకం వచ్చి, నవ్వువస్తుంది కూడా అటువంటప్పుడు. కాని, అంతటి అపరిమితానంద సమయంలోనూ నేను నా హృదయాంతర హృదయంలో నిలుపు

కున్న బంగారపుబొమ్మను ఆరాధిస్తూనే ఉన్నాను. ఆ సంగతి అవతల వారికి తెలుసు కూడాను.

ఆ రోజులలోనే నేను 'వడ్డాణము' అనే కథ వ్రాసింది. ఈ కథలో శ్రీరంగములోనూ కావేరీతీరానా, నాకు కలిగిన కొన్ని అనుభవాలు కథకు కావల సిన వాతావరణము కల్పించినా, కథావస్తువు మాత్రము జీవితములోని ఒక అధ్యా యమే. వడ్డాణానికి తరువాత కథగా 'మంగళము' అనే కథకూడా వ్రాశాను.

'వడ్డాణము'లో సుకుమార్ అనే ఆదర్శజీవి, తన ప్రాణమిత్రుడైన సంపత్ భార్య, మంగళాన్ని చూచి, ఆమెను తన ఆదర్శ స్త్రీమూర్తిగా భావించు కుంటాడు. సంపత్తూ మంగళమూ మిక్కిలి ఉదారమనస్కులు. వారు సంపూర్ణ మైన సానుభూతితో సుకుమార్‌ని తమవానిగా గ్రహిస్తారు. సంపత్ దృష్టిలో అతని జీవితంలో, భార్యయైనమంగళానికి యెంత గొప్ప స్థానమున్నదో ఆప్త స్నేహితుడైన సుకుమార్‌కీ అంత స్థానమూ ఉన్నది. స్నేహమంటే అదే అత నికి. ఆ స్నేహానికి స్త్రీపురుష భేదములేదు - ఆ అనురాగము పూర్తిగా ఆత్మ సంబంధమైనది కాబట్టి. మంగళమున్నూ భర్త అభిప్రాయాలని అర్థము చేసుకుని వానిని ఆచరణలో పెట్టడానికి ప్రయత్నిస్తుంది - ఆమెకూడా చాలా సంస్కారము గల వ్యక్తి కాబట్టి.

ఒక విచిత్ర సన్నివేశంలో, సుకుమార్ మిక్కిలి గాఢంగా ప్రేమిస్తున్న అతని చనిపోయిన తల్లి స్థానాన్ని వహింపజూస్తుంది మంగళము - తద్వారా, గాయపడిన అతని హృదయానికి కొంత ఉపశమనమును కలిగింపవచ్చును అను కుంటూ. సుకుమార్ తన కన్నీటితో మంగళము నడుమున ఉన్న వడ్డాణానికి అభిషేకము చేస్తాడు. ఆమెపాదాల పసుపుని తీసి కనుల కద్దుకుంటాడు. కాని, ఉత్తరక్షణము, ఏదో గొప్ప తప్పుచేసినవానిలా అక్కడనుంచి పారిపోతాడు. తర్వాత, సంపత్తూ మంగళమూ అతనికొరకు చాలా బాధపడతారు. సుకుమార్‌కి వడ్డాణమంటే తగనిప్రేమ అని తెలిసిన వారు మంగళము నడుమున ఉంచుకున్న వడ్డాణాన్ని తీసి సుకుమార్‌కి పంపుతారు. వడ్డాణాన్ని అందుకున్న సుకుమార్ :

"ఏదో చిత్రపటాన్ని చూస్తున్నట్టు, వడ్డాణాన్ని రెండు చేతులతో ముందుకు పట్టుకుని, కిటికీవేపు వెళుతాడు. ఎవరి మెళ్ళోనో పూలహారం వేస్తున్నట్టు ముందుకువంగి, కిటికీమధ్యగా వడ్డాణాన్ని ఉంచి చూస్తాడు :

చుట్టూ బంగారపు చక్రము; మధ్య ఆకాశము. ఆకాశము! అంతే!!" అని ముగిస్తుంది కథ.

"తరువాత కథ 'మంగళము'లో మంగళము సుకుమార్ వెళ్ళిపోయిన కొంత కాలానికి అతనికోసము చాలా ఆందోళనపడుతుంది. అతనిస్నేహమూ అతనితో సహచర్యా తనకు అత్యవసరమనుకుంటుంది. కాని, సంపత్ ఎంతగా చెప్పి ఉన్నా ఇలా సుకుమార్ సహచర్యాన్ని ఆపేక్షించడము పాపము అనుకుంటూ ఉంటుంది. సంపత్ మళ్ళా ఒక పర్యాయము ఆమెకు బోధిస్తాడు, స్నేహములో స్త్రీ పురుష భేదములేదనీ ఆమె, ధైర్యంగా, సుకుమార్ తన స్నేహితుడని అంగీకరించాలనీ. ఆ సమయంలోనే, సుకుమార్‌కు ప్రాణంమీదికి వచ్చినట్లు తెలిసి, వారిద్దరూ అతనివద్దకు వెళ్ళుతారు. మొదట, మంగళము తాను రానంటుంది. "నీవు రాకపోతే మన సుకుమార్ బ్రతుకడు!" అని ఆమెను ఒప్పించి, తనతో తీసుకువెళతాడు సంపత్ తనభార్యను, సుకుమార్ వద్దకు. ఆమె రాకవలన సుకుమార్ ప్రాణము నిలుస్తుంది. ఒళ్ళు నయమైన సుకుమార్‌ని వారిద్దరూ తమతో తమఊరు శ్రీరంగము తీసుకువెళ్తామంటారు. అతను "తర్వాత వస్తాను" అంటాడు. కాని, రాడు. ఉత్తరం మాత్రం వస్తుంది :

"నేను హిమవత్ పర్వతాలకు వెళుతున్నాను. కొంచెము బలము చేకూరాక, మీఊరు వస్తాను. మీ ఇంట నవతరింపబోయే రంగనాయకిని నాకు పెంపివ్వాలి!" అంటూ.

కాని, రంగనాయకికి ఐదేళ్ళు వచ్చినా, సుకుమార్ మాత్రం రాడు.

మంగళం అనుకుంటుంది : "హిమవత్ పర్వతానికి వెళ్ళినవారికి ఎన్నాళ్ళకు బలము వస్తుందో !" అని.

# సాగుతున్న యాత్ర

ఈ రెండు కథలూ నాచేత వ్రాయించినవారు ఆప్తస్నేహితులు ఎస్. జి. ఆచార్యా. ఏదో ఒక రేడియో ప్రసంగపు సందర్భంలో నాకాయన పరిచయము కలిగినది. అదివరకు వారు నన్నుగురించి చాలా వినిఉండడమువల్లా, నేనూ వారి దేశసేవాతత్పరతను గురించి తెలిసిఉన్నందువల్లా, చప్పున స్నేహితులుగా మాట్లాడుకున్నాము. తర్వాత, ఆయనభార్య అన్నపూర్ణాదేవితోనూ పరిచయమైనది నాకు. వారిద్దరూ బాగా చదువుకున్నవారు. మిక్కిలి సంస్కారవంతులు. అయన అప్పుడు 'ప్రజాబంధు' అనే పత్రికను నడుపుతూండేవారు. ఇదివరకు నేను రచించిన కథానికలూ, రేడియోనాటికలూ వ్యాసాలు చదివిఉన్నారు వారిద్దరునూ. ఆచార్య నన్ను మరీమరీ అడిగారు తమ ప్రజాబంధు విశేషసంచికకు ఏదైనా వ్రాయమని. వారి ప్రోద్బలమువల్లనే 'వడ్డాణము' అవతరించింది. తరువాత, కొన్నాళ్ళకు, అన్నపూర్ణాదేవి తాను నడుపుతూన్న 'చిత్రాంగి' కోసము ఏమైనా వ్రాయాలి నేను, తప్పదు, అంటే, 'మంగళము' కథ వ్రాశాను. ఈ రెండురచనలనూ వారు చాలా మెచ్చుకొన్నారు. 'చిత్రాంగి'కి ఇంకాకొన్ని రచనలూ ఇచ్చాను నేను, ఆ తర్వాత. వానిలో ముఖ్యం 'మెయిల్ అగని స్టేషన్' అనే రచనా 'జ్ఞాపకాలు' అనే రచనా.

'మెయిల్ ఆగని స్టేషన్'లో, "మా ఊరిస్టేషన్‌లో మెయిల్ ఆగదు. కాని, తీగ సంపెంగపువ్వులు పూస్తాయి" అంటూ ప్రారంభించి, మెయిల్ ఆగని స్టేషన్ హృదయము, పాపము, కొందరి జీవితాలలాగే, బిక్కు బిక్కు మంటూ ఉంటుందని వర్ణించాను.

'జ్ఞాపకాల' లో మన జ్ఞాపకాలయొక్క విలువా, అవి మన జీవితాన్ని ఎంత విపరీతంగా కమ్మివేసేదీ వివరించాను.

ఎస్. జి. అచార్యతోటి నాస్నేహమును ఈ జన్మలో మరచిపోలేను, నేను. ఉత్తమ పురుషుడు అతను. అతనివంటివారు చాలా అరుదు. దేవుడు మంచి వారిని ముందుగానే తనవద్దకు లాక్కుపోతాడు, అంటారు. అల్లాగే, ఎస్. జి. ఆచార్య పిన్నవయస్సులోనే మనలను విడిచి వెళ్ళిపోయారు.

## సాగుతున్న యాత్ర

ఎవరుపోయినా నేను దుఃఖించను. ఒక అవతారమును చాలించటము ఆ ఆత్మమేలుకోసమే అని నాభావము. కాని, ఎస్. జి. ఆచార్య భౌతికదేహాన్ని భూస్థాపితము చేస్తుండగా అక్కడనిలుచున్న నేను, నాదుఃఖాన్ని ఆపుకోలేక పోయాను. ఇంతమంచి మనిషి ఇక మనకులేడుకదా అని దుఃఖించాను. అన్నపూర్ణాదేవి జీవితమును కమ్ముకున్న కటిక చీకటిని తలచుకొని నాకడుపు చెరువైంది.

ఆఫీసుకువచ్చి, ఆంధ్రప్రభ వారికి ఫోన్‌చేసి, ఆచార్యను గురించిన నా 'అశ్రుతర్పణ' వ్యాసమును పంపాను. ఆ వ్యాసమును ఇలా ప్రారంభించాను:

"వేయిమందిలో గుర్తునాకు, ఆ చిరునవ్వు.

లక్షమందిలో జ్ఞాపకము నాకు ఆకంఠస్వరము"—అంటూ.

ఆ వ్యాసములో, ఎస్. జి. ఆచార్యతో నా పరిచయాన్నిగురించీ సాహిత్యరీత్యా నాకు వారివలన కలిగిన ప్రోత్సాహాన్ని గురించీ వివరించాను.

ప్రచురణకు ముందు వ్యాసాన్ని చూచిన మా అసిస్టెంట్ డైరక్టర్ ఎస్. ఎన్. మూర్తి అన్నారు నాతో: "సరేకాని, ఈ వ్యాసము వారిని గురించి గాక, మిమ్ములనుగురించే ఎక్కువగా ఉన్నదే!" అని.

నిజమే! వారిని గురించి చెప్పాలీ అంటే నా గురించీ అంతగా చెప్పక తప్పదు—మా ఇద్దరిస్నేహమూ అటువంటిది. అంతగా పెనవేసుకుపోయాయి, ఆ రోజులలో, మా ఇద్దరి జీవితాలు, మరి!!

## ౧౯

పరిపరి వ్రాయు హస్తమది, వ్రాసిన నావల
బోవు; నీ చమ
త్కారణముగాని ధర్మరతిగాని మరల్పగ
లేదు దానిలో
నరసగమేనియుందుఘువ! ఆ లిఖితం
బున నొక్క ముక్కయున్
చెరగదు నీదు భాష్పములు చేర్వాయి
వాగయి వెల్లి వోయినన్!!

రాయప్రోలు సుబ్బారావు

"విరుచుకుపడే సముద్రకెరటపు శిఖరంలాగ విరగబడి నవ్వుతూ పెనుగాలికి ఆల్లలాడే పోకమొక్కలాగ ఇటూ అటూ ఊగిపోతూ అట్టహాసంతో అడిగింది చంచల నన్ను; 'మీరు నవ్వరేమి'? అని. ఆమె విపరీతపు నవ్వును ఆ గదిలో ఉన్న నలుగురైదుగురు మొగ గొంతుకలూ ప్రతిధ్వనించాయి. చంచల మళ్లా అడిగింది నన్ను: 'మీరు నవ్వరేమి?'అని.

ఏమని చెప్పను? 'చంచలా! నీవు ఇక్కడనుంచి వెళ్లిపో! ఈ వాతావరణం నీకు సరిపోదు. కాకినాడ వెళ్లిపో, చంచలా! అక్కడ మళ్లీ నా కాదంబరివి కావచ్చును నువ్వు' అని ఎలా చెప్పను?"

—నా కథచదువుతున్నాను స్నేహితులముందు. నేను రచించిన కథ, నా కథ. అవి యుద్ధపు రోజులు. చీకటిపడేసరికి బొగులుమెగులుమంటూ ఉంటుంది

అంతటి మహాపట్నమున్నూ! మసగచేసిన దీపాలమధ్య బిక్కు-బిక్కు-మంటూ, ఇంట్లో ఉండబుద్ధికాలేదు. అదీ ఏదోవిషయము మనస్సును కలతపెడుతూంటే అసలే ఉండలేము, ఒంటరిగా, ఇంట్లో. ఏమీతోచక, దుర్గాబాయ్‌గారింటికి వెళ్లాను. అమే ఆమెతల్లి కృష్ణవేణమ్మగారూ నన్ను చాలా దయతో ఆహ్వానించారు. ఆమె తమ్ముడు నారాయణరావు, అన్నారు: "ఇప్పుడే మిమ్మల్నిగురించి అనుకుంటున్నాము. మా ఆవిడ మీమాటే జ్ఞాపకంచేస్తోంది" అంటూ తిమ్మాబాయ్‌కేసి చూశారు. తిమ్మాబాయ్ అన్నారు: "అవును! మా ఇంట్లో కందా బచ్చలకూర చేసుకున్నాము, ఈపూట. మీకు చాలా ఇష్టంగా. మీరుకూడా ఉంటే, ఎంత బాగుండును.... ఈ చీకటిలో మీకెలా కబురు చెయ్యడము, అనుకుంటున్నాము. మాటలోనే వచ్చారు, మీరు!" అని,

భోంచేసి అందరమూ మేడమీదికి వెళ్ళాము, వారు నలుగురూ, వారితో కూడా వారి దగ్గరబంధువురాలు, లలితాబాయమ్మా ఇరుగుపొరుగున ఉన్న ఆంధ్ర మహిళాసభ బృందమువారు ఇద్దరు ముగ్గురున్నూ. అందరూ సావధానంగా వింటున్నారు నా కథను. ముఖ్యంగా, లలితాబాయ్. లలిత కాకినాడలో బి. ఏ. చదివి మద్రాస్ ప్రెసిడెన్సీ కాలేజ్‌లో ఎమ్. ఏ. చదువుతున్నారు. చాలా చలాకీ; మంచిరూపసీ కూడా. స్త్రీల హక్కులకోసము విపరీతముగా యుద్ధముచేసే ఉత్సాహవంతురాలు, ఆమె. ఆమెను చూచినపుడల్లా నాకు రాణీ ఝూన్సీలక్ష్మీబాయ్ స్ఫురణకు వచ్చేది. అందువలననో, ఏమో, ఆ రోజులలో మేము ప్రసారంచేసిన కాకతీయాభ్యుదయములో రుద్రమదేవిగాను, ప్రమీళార్జునీయములో ప్రమీళగానూ నటింపించాను, ఆమెచేత.

లలిత శ్రద్ధగా వింటున్నారు, నా కథను:

"....వేసవిలో గోదావరి, శోషిల్లిన సెలయేరు, చంచల; గాఢనిద్రలో ఉన్నది, ఆమె. పైపెదవి మునిపంట అదిమి ఉండడమువల్ల, అంతమేరా పాలిపోయి, మిగతాపెదవి మరింత ఎర్రగా ఉన్నది, అతికించిన దానిమ్మపువ్వురేకులాగ. నుదుట, కరిగిన బొట్టుకు క్రిందుగా, మూడేమూడు మంచిముత్యాలు.

చంచలను లేపకుండా, ముందుకువంగి, మంచిముత్యాలను ముద్దుపెట్టుకున్నాను. కళ్ళు తెరవకుండానే, "వచ్చారా!" అంటూ, తన రెండుచేతులూ పైకి చాచి దగ్గరకు తీసుకుంది, నన్ను, చంచల. నన్ను గట్టిగా కవుగిలించుకుంది, చంచల.

క్షణంలో మామిడిచెట్టును అల్లుకుపోయింది, మాధవీలత.

దూరాన, ఎంతోదూరాన, మరోలోకంలోంచి, ఐనా, స్పష్టంగానే, వినిపిస్తున్నాయి ఒకొక్కమాటా :

మామిడీ చెట్టునూ అల్లుకొన్నదీ మాధవీ
లతొకటి;
ఏమూ రెండిటి ప్రేమా, ఇతింతనలేమూ !

....అని.

కాని, మరుక్షణములో ఆ మాటలకంటే ఇంకా బిగ్గరగా, ఏదో సముద్రపు రొదలాగ మనస్సును కలవరపెడుతూ వినిపించింది, మరీ బిగ్గరగా :

చూడలేని పాపిష్టితుపానూ ఊడబీకె లతనూ
...ప్రోడై, మామిడీచెట్టూ, మాధవీలతతో
మాయలో కలిసిందీ!...

....అంటూ.

"....మళ్ళీ శుక్రవారం వస్తాను" అంటూ వెళ్ళిపోయింది, చంచల. శుక్రవారం, రాలేదు. ఆపై శుక్రవారమూ రాలేదు. తరువాత ఎన్నాళ్ళకో ఉత్తరం వచ్చింది. ఒక్క పంక్తే: "అమ్మ రానియ్యలేదు. మేము ఇప్పుడు కరాచీలో ఉన్నాము. నన్ను మరచి పొండి!" అని,

# సాగుతున్న యాత్ర

మరచిపోవడము అంత సులభమా !

నేను ప్రతిరాత్రీ, తెల్లవారుజామున కలగంటాను, ప్రతిరాత్రీ; తెల్లవారు జామున: కాశ్మీరపు సరస్సులో, వికసించిన ఎర్రతామరలమధ్య త్రోవజేసుకుంటూ వస్తోంది, నావైపు పట్టుకుచ్చులతో సింగారించిన పడవ. పడవ ముందుభాగాన కూర్చుని, తన పాదాలతో గిలకొట్టుతోంది కొలని నీటిని, చంచల, కిలకిలా నవ్వుతూ. పడవ నావైపే వస్తోంది. నేను ఆమెకేసే చూస్తున్నాను. కాని, ఆమె నన్ను గుర్తించడములేదు....ఇంతట్లోకి, ఆమెపడవకు ఎదురుగా మరో పెద్దపడవ వస్తుంది - మేళవాద్యాలతో, గాయనీ గాయకులతో - మహారాజుగారి పడవ. ఆ పడవ ముందరిభాగాన కూర్చున్న యువరాజు చంచలకేసి చూచి ఆమె నిరుపమాన లావణ్యానికి నివ్వెరపోతాడు. ఆమెపైపే కన్నులప్పగించి చూస్తూ ఉంటాడు, యువరాజు. పడవ ముందుకు సాగిపోతూంటే వెనక్కు తిరిగి తిరిగి చూస్తాడు, మరీ వెనక్కుతిరిగి చూస్తాడు తనవైపే నవ్వుతూ చూస్తున్న చంచలకేసి - యువ రాజు ఇంకా వెనుకకు తిరిగేసరికి, అతనికాళ్ళు తేలిపోయి, అతను దబుక్కున నీళ్ళలో పడిపోతాడు. యువరాజు ధరించిన చీని చీనాంబరాలు తడిసి ముద్దవుతాయి.

పడిపోయిన యువరాజును చూచి ఫక్కున నవ్వుతుంది, చంచల.... అతను ఆమెకేసి జాలిగా చూస్తూంటే, మరీ బిగ్గరగా నవ్వుతుంది ఆమె - మరీ బిగ్గరగా, విరుచుకుపడే సముద్ర కెరటంలా, ఎంతో అట్టహాసంతో నవ్వు తుంది, చంచల.

వారిని చూస్తూ నేనూ నవ్వుతాను - గట్టిగా, మరీ గట్టిగా, ఇంకా గట్టిగా !

అలవాటు ప్రకారము వేకువనే నాకు టీ తెస్తున్న రాముడు నా వెర్రి నవ్వుకు బెదిరి, చేతిలోని కప్ దబ్బున జారవిడుస్తాడు. కప్ వేయి ముక్క లవుతుంది.

## సాగుతున్న యాత్ర

నేను గట్టిగా నవ్వుతాను, మరీ గట్టిగా!

నా నవ్వు వినిపించడములేదూ ?

మీరు నవ్వరేమి ?

....కథ ముగిసిన ఒక్క-క్షణము నిశ్శబ్దము. వెంటనే, గది అంతా ప్రతిధ్వనించింది, కరతాళ ధ్వనులతో. లలిత చప్పట్లు కొడుతోంది, ఎంతో ఉత్సాహంతో. కథ వింటూన్న అందరూకూడా ఆమెతో కలసి చప్పట్లు కొడుతున్నారు. నా కథ చదువడములో నిమగ్నుడనై ఉన్న నేను అప్పుడు, మళ్ళీ, ఈ లోకంలోకి వచ్చాను, కాశ్మీరపు పద్మాకారము నుంచి.

"ఎంత బాగా వ్రాశారండీ!" అన్నది, లలిత. అందరూ అమాటే అన్నారు.

నన్ను సాగనంపడానికి నాతో క్రిందికివచ్చిన దుర్గాబాయ్ నన్ను వేరే పిలచి, కూర్చోమని చెప్పి; "నిజం చెప్పు!....ఆ అమ్మాయి ఎవరో. వెంటనే నీకామెను పెళ్ళిచేయిస్తాను!!" అన్నారు. నేను చిరునవ్వు నవ్వాను.

దుర్గాబాయ్ అన్నారు : "నవ్వుకాదు. నీవు నిజముగా ఆమెను గాఢంగా ప్రేమిస్తున్నావు. ఆమె అదృష్టవంతురాలు. ఎవరో చెప్పు. నాకుతెలిసిన అమ్మాయే ఐ ఉంటుంది, తప్పకుండా. మిమ్మల్ని, ఇద్దరినీ ఓ ఇంటివారినిచేసే బాధ్యత నాది! చెప్పు!!....నీవు సుఖపడడమే మాకందరికీ కావలసినది. నీవు ఇలా ఆరాటపడడము మేము సహించలేము!" అని.

ఇంతటి ఆప్యాయత ఉంటుందా లోకంలో! కన్నులు చెమ్మగిల్లాయి నా కొరకు ఆమెపడే ఆదుర్దాను గుర్తించి. లేనిచిరునవ్వును తెచ్చుకుంటూ అన్నాను, ఆమెతో :

"మీరు పొరబడుతున్నారు. ఈ కథ అంతా నిజముకాదు. కొంత కల్పనా, కొంత నిజమూను. చంచల ఒక వ్యక్తికాదు. ఒక వ్యక్తికి నేను ఆరోపించుకున్న ఎన్నో ఎన్నో సుగుణాలతోపాటు ఎందరి సుగుణాలనో పంచుకున్న ఊహాకన్య, ఆమె. ఆమె మనకు దొరుకదు, ఎంత వెతికినా!" అన్నాను.

దుర్గాబాయ్ నాకేసి తీక్షణంగా చూస్తూ అన్నారు: "నాదగ్గర దాస్తున్నావా?" అని.

"మీదగ్గర దాపరికమా....మీదగ్గర!" అంటూ సెలవు పుచ్చుకున్నాను.

తరువాత చాలా పర్యాయాలు జ్ఞాపకము చేసుకునేవాడను ఆసంభాషణను.

అపరిమితమైన సోదరీభావంతో ఆమె నా సౌఖ్యముకోసము పడిన ఆదుర్దా నాహృదయాన్ని ద్రవింపజేస్తుంది, ఎంతో కృతజ్ఞతతో, మరీమరీ. కాని, ఆ జ్ఞాపకముతోపాటు, 'విధి లిఖించినట్లే కావాలి, మరేతీరునా జరగడానికి వీలులేదు!' అనే భావము ప్రస్ఫుటంగా అవతరించేది:

"అలిఖితంబు నొక్క ముక్కయున్ చేరగదు
నీదు భాష్పములు చెర్వయి, వాగయి, వెలి
వోయినన్!"

యుద్ధము మరీ ఉమ్మరమైనది. ఏ నిమిషమైనా జపాన్‌వారు మద్రాస్ తీరాన దిగవచ్చు. ఊరు ఊరంతా యుద్ధరంగపు పొలిమేరగా మారిపోయింది. రాత్రిళ్ళు మేము వంతులువారిగా రేడియో కేంద్రములో పడుకునేవారము ఏ. ఆర్. పి. రక్షకులుగా.

ఒకరాత్రి మా డైరక్టర్ గోపాలన్ నేనూ, కలసి ఏ. ఆర్. పి. డ్యూటీలో ఉన్నాము. నాలుగైదు ఆటలు చదరంగము ఆడి, ఇక నిద్రపోదాము

అని పడుకున్నాము - ఆఫీస్ బల్లలపైననే. గదిలో ఉన్న స్పీకర్‌పైన చర్చిల్ ఉద్భోదన వినిపిస్తోంది. మరీ క్లిష్టపరిస్థితులైనా, అతని అతి గంభీరసింహనాదము ఎంతో ఉత్సాహాన్ని కల్పిస్తోంది. ఆ మాటలు వింటూ, నేను మాగన్నుగా నిద్ర పోసాగాను.

ఇంతట్లోకి, నైట్‌వాచ్‌మన్ క్రిందనుంచి కేకవేశాడు : రేడియోనిలయానికి ఫర్లాంగుదూరాన ప్రవహిస్తున్న కూవమ్‌నది పొంగి నీరు మా కాంపౌండ్‌లోకి వస్తోంది, వెల్లువగా.

గోపాలనూ నేనూ క్రిందికివెళ్ళి చూతుముకదా మహా జలార్ణవమై ఉన్నది ప్రదేశమంతా. రోడ్‌మీదుగా లోనికివచ్చే నీరేగాక, బిల్డింగ్‌చుట్టూన్న ప్రదేశంలోంచి గుడగుడమంటూ పైకి ఉబ్బుకు వస్తోంది, నది, పాతాళగంగలాగ! పైన ఎక్కడో ఏదో చెరువు గండిపడి ఆ నీరంతా కూవంలోకి వస్తోందని తెలుసు, మాకు. కాని, ఇలా ఆ ప్రళయము మాపైన విరుచుకు పడుతుందనుకోలేదు మేము. నిమిషనిమిషమూ నీరు ఎక్కువవుతోంది. ఇక, ఒక అరగడియలో స్టూడియోలోకి నీరు రాసాగింది. అప్పుడు, గోపాలన్ చప్పున ఫోన్‌వద్దకువెళ్ళి ఏ. ఆర్. పి. మార్షల్ బెటాలియన్‌వారిని పిలిపించారు. వారు వచ్చేలోగా స్టూడియోలోఉన్న వస్తువులను అన్నిటినీ మేడమీదికి జేరవేయసాగాము మేమిద్దరమూను, వెల్లువతో పోటీ చేస్తూ. మార్షల్లు వచ్చి పియోనోవంటి బరువైనసామానులను అతిపదిలంగా మేడమీదికి మోసుకువెళ్ళారు. స్టూడియోలు ఖాళీచేసేపని వారికి ఒప్పగించి, కంట్రోల్‌రూమ్‌కు వెళ్ళి, అక్కడున్న ఇంజనీయర్‌నులేపి గోపాలన్ ట్రాన్స్‌మిటర్ యంత్రాన్ని బల్లలపైకి ఎత్తిపెట్టి భద్రపరచారు. నీరు ఇంకా ఇంకా ఎక్కువవుతోంది. కంట్రోల్‌రూమ్‌కు అంత దిట్టమైన కట్టడములేదు. వెల్లువ ఎక్కువై ఏ నిముషమైనా కూలిపోవచ్చును. అందుచేత, గోపాలన్ ట్రాన్స్‌మిటర్ యంత్రాల లోని వివిధభాగాలనూ గబగబా విప్పివేసి, మిక్కిలి విలువగల అయంత్రపరికరాల్ని తానే స్వయంగా కొంతదూరాన ఉన్న మరో భవనము పైభాగాన భద్రపరచారు. మిగిలిన రాత్రి, ఒక్క నిమిషము నిద్రలేదు, మాకు. కోడికూసే సరికి, స్టూడి

యోలో మొలలోతు నీరు! టెలిఫోన్‌రూమ్ జలమయమైంది. గోపాలన్ ఆ నీళ్ళ లోనే పనిజేస్తూ టెలిఫోన్ మెయిన్ కనెక్షన్ మేడమీదికి మార్చారు. అక్కడనుంచే బహిర్ ప్రపంచకంతో మాట్లాడసాగారు. తెల్లవారేసరికి, ఇతర ఆఫీసర్లూ ఇంజనీయర్లూ వచ్చారు. ఈ భవనము అతి పురాతనమైనది; ఏనిమిషమైనా దభాలున కూలిపోవచ్చును; మేడ పైభాగములో ఉన్న ఆఫీస్‌కాగితాలూ, ఇతరసామాన్లూ అన్నీ మరో భవనంలోకి తీసుకుపోవాలి అన్నారు ఇంజనీయర్లు. పదిగంటలయ్యే సరికి తతిమ్మా ఆఫీస్‌జనమంతా వచ్చారు. అందరూ కలసి పూచికపుల్లయినా పోకుండా, అంత సామగ్రినీ అవతల భవనంలోకి జేరవేశారు, అంచీలపైన. ఈ పని రోజురోజంతా పట్టింది. రేడియోనిలయముచుట్టూ జలమయము. రోడ్ మీద నీరు నదిలా ప్రవహిస్తోంది. అవతల, వంతెనపైనుంచే పారుతోంది నది! ఎలాగో అతికష్టంమీద, మరో చుట్టుదారిని వెళ్ళి ఇందరకూ అన్నపానీయాలు ఏర్పాటు చేశారు గోపాలన్.

సాయంత్రమయేసరికి శోషవచ్చినట్లు పడిపోయి నిద్రలో మునిగి పోయాను నేను. కాని, పూర్తిగా డస్సిపోయినా నిద్ర కూరుకువస్తున్నా పెద్దబాధ మనస్సులో : అయ్యో! ఒక్క రోజురోజంతా రేడియోప్రసారము లేదే! లక్షలాది జనము ఏమనుకుంటారో! ఏనిమిషమైనా జపానువారు మద్రాస్‌తీరాన దిగుతారు అనే వదంతులు బయలుదేరిన సమయంలో ఇలా రేడియో మూగబోతే, జనులు ఒక్కటే అనుకుంటారు : 'దేశము శత్రువశమైనద'ని. .... ఎంత చప్పున నీరు తీసిపోతుందా ఎంత చప్పున రేడియోప్రసారము తిరిగి ఉపక్రమింప వచ్చునా అని యావ, నాలో.

అదృష్టవశాత్తూ రాత్రి ఏ రెండుజాములవేళనో నీరు తిరుగుమొగము పట్టింది. వెంటనే, గోపాలనూ ఇంజనీయర్లూ కంట్రోల్‌రూమ్‌కు వెళ్ళి, మోకాలు లోతు నీటిలో పనిచేస్తూ, విప్పివేసిన యంత్రసామగ్రిని ఒక్కొక్కటే తిరిగి అమర్చసాగారు. ఈపని చాలా కష్టము. తీసివేయడం సులభం. మళ్లా జతకూర్చ

డం కష్టం. ఎన్నో సీలలు బిగించాలి, అతి జాగ్రత్తతో. కాని, గోపాలన్ సమయ స్ఫూర్తి అద్వితీయము! అన్నిచోట్లా తానేఐ అందరకూ తానే సలహాలనిస్తూ సూర్యోదయ సమయానికి, తీసివేసిన ట్రాన్స్‌మిటర్‌ను మళ్లా నెలకొల్పారు!

నాకు బాగా జ్ఞాపకము: ఆల్ ఇండియా రేడియో నిలయపు ప్రసారాలను గుర్తుపరచే 'సిగ్నేచర్‌ట్యూన్' గల రికార్డ్‌ను సిద్ధంగా ఉంచుకున్నాను నేను, - ప్రసారసమయానికి ముందుగా రెండునిమిషాలు శ్రోతలకు వినిపించడానికి. ఇంజనీయర్లు అందరూ వారివారి పనులలో నిమగ్నులై ఉన్నారు, ఒక్కొక్కమారా సరి జూచుకుంటూ. ఏడుగంటలకు ఇక ఐదు నిమిషాలు. గోపాలన్ ఇంకా ఏదో సీల బిగిస్తూనే ఉన్నారు....ఇక మూడు నిమిషాలు....గోపాలన్ కళ్ళలో ఒకవంక గొప్ప ఉత్సాహము; ఒకవంక 'ఏమవుతుందో' అనే గొప్పబెంగ!....ఇక రెండు నిమిషాలు. నాకు సైగచేశారు గోపాలన్. వణికే చేతులతో, తిరుగుతూన్న రికార్డ్‌పైన ముల్లు ఉంచాను. సరిగ్గా ఆ నిమిషానికే, చూరులోంచి త్రోవజేసుకొని ఉదయసూర్యుని కిరణజాలము ఒకటి పెళ్ళుమంటూ ప్రకాశించింది రికార్డ్‌పైన! ఆ నిమిషానికే వయొలిన్ తంబూరా సమ్మేళనమైన దివ్య నినాదము చేరువనే ఉన్న రేడియోసెట్‌పైన వినిపించింది. మా స్టేషన్!! గోపాలన్ కళ్ళు మెరిసిపోతున్నాయి. ఆయన ఆస్తికుడుకాడు; కాని, ఆ నిమిషం 'థాంక్ గాడ్!' అన్నారు ఆయన, స్పష్టంగా!!

నేను సరేసరి. విపరీతమైన ఉత్సాహముతోనూ అనిర్వచనీయమైన కృతజ్ఞతా భావముతోనూ పులకాంకితుడనై పోయానన్నమాట....రేడియో గడియారము టంగుటంగున ఏడుగంటలు కొట్టింది. మైక్రోఫోన్ దగ్గరగా ముఖాన్ని ఉంచి, విశ్వప్రయత్నాన నా తొట్రుపాటును కప్పిపుచ్చుకొని, మామూలు కంఠస్వరంతోనే, ఎంతో ఆనందంతో అన్నాను : "ఆల్‌ఇండియా రేడియో మద్రాస్ కేంద్రము. ఉదయప్రసారము ప్రారంభము" - అంటూ. ఇక ఆ తర్వాత రికార్డ్‌ల కార్యక్రమమూ తెలుగులో వార్తలూ అనుసరించాయి. స్టూడియోలు జలమయమైనందున చాలావరకు రికార్డ్‌లూ రిలేలూ ఏవో కొన్ని అతి ముఖ్యమైన ప్రసంగాలూ కంట్రోల్ రూమ్‌నించే ప్రసారము చేశాము.

## సాగుతున్న యాత్ర

ఒక్క ఇరవైనాలుగు గంటలే, ప్రసారంలో విరామము కలిగింది అంతటి మహాప్రళయము విరుచుకుపడినా!

*  *  *  *

యుద్ధపు వాతావరణం మరింత విషమించినది. మద్రాస్‌నగరము ఇంచుమించు యుద్ధభూమిగా మారిపోయింది. శత్రువులువచ్చి పైనబడితే వారి చేతికి ఏదీ చిక్కకుండా మనమే నాశనం చేయడానికి యత్నమంతా సిద్ధమైంది. తప్పనిసరిగా పట్నంలో ఉండవలసినవారు తప్ప, జనమంతా ఊరు ఖాళీచేశారు.

ఎటుపోయి ఎటువస్తుందో అని, ఎటువంటి పరిస్థితులలోనూ రేడియో నిలయము శత్రుహస్తగతం కాకుండా, రూపుమాపడానికి చేయవలసిన ఏర్పాటులు సిద్ధంగా ఉన్నాయి - బటన్ నొక్కితే మందుగుండు ప్రేలి, ఇంత మహాయంత్రమూ మసి అయిపోవచ్చు. యుద్ధము, మరి!

కొద్దిరోజులలో, తమిళులకూ, తెలుగువారికీ ప్రత్యేకసౌకర్యము కోసము ఒక ట్రాన్స్‌మిటర్‌ను కేటాయించి, 'ఎడిషనల్ సౌత్ ఇండియన్ సర్వీస్' అంటూ ఢిల్లీ నుంచే తమిళములోనూ, తెలుగులోనూ వివిధ కార్యక్రమాలు ఏర్పాటు చేయవలసిన అగత్యం ఏర్పడింది. ఆ సర్వీస్‌లో పనిచేయడానికి నన్ను ఢిల్లీకి పంపారు.

సాధారణ పరిస్థితులలో నేను సంతోషంతో వెళ్ళిఉందును - ఢిల్లీ కే గాదు, పెషావర్‌కైనా. కాని, అంతకుముందు కొన్నినెలలుగా నన్ను ఆవరించిన అనురాగపులతను తొలగించుకోలేక పోయాను, నా మనస్సునుండి. ఎంత ప్రయత్నించినా, ధైర్యము వహింపలేకపోయాను. చూపులేకరవు అవడము ఒకబాధ; ఎటువంటి క్లిష్టపరిస్థితులు ఏర్పడతవో-అప్పుడు, ప్రాణమునకుప్రాణమైన వారిని నేను అంతదూరాన ఉండి ఎలా కాపాడుకోగలను అనే బెంగ అంతకంటె ఎక్కువ బాధ. కాని, నేను వెళ్ళకతప్పదు. అది నావిధి; ఉద్యోగధర్మము.

## సాగుతున్న యాత్ర

బరువు గుండెతోనే ఢిల్లీ వెళ్ళాను. స్టేషన్‌కు మా చెల్లెలు ప్రమీళ వచ్చి నన్ను తన బసకు తీసుకువెళ్ళింది. త్రోవలోనే అడిగింది "అలా ఉన్నావేమి అన్నయ్యా!" అని. నేను ఏమీ అనలేదు.

ఢిల్లీలో ఉన్న స్నేహితులువచ్చి నన్ను కలుసుకున్నారు. క్రొత్త రేడియో కేంద్రానికి కావలసిన ఏర్పాట్లు తీవ్రంగా సాగుతున్నాయి - నేను మాత్రము ఇంట్లో ఏడుస్తూ కూర్చున్నాను. ప్రమీళ నాపై కోపగించింది. ఆమె కనుక్కొంది, ఇది ఏదో హృదయసంబంధమైన బాధ అని. ఆమె అన్నది: లోకంలో ప్రేమికులు లేరా? వారు విరహం అనుభవింపరా? ఎక్కడా చూడలేదు, ఈ విపరీతపు భీరుత్వము!" అని.

"ఇక ఈ ఊళ్ళో ఒక్క నిమిషం ఉండలేను ప్రమీళా!" అంటూ రైలుకు ప్రయాణమయ్యాను, నేను.

నాకు సెలవు ఎలా ఇచ్చారో, ఎలా వెళ్ళనిచ్చారో ఆఫీస్‌వారు, నాకు తెలియదు. నాలో ఒక్కటే ఆలోచన: వాయువేగాన మనప్రాంతాలకు వచ్చి వ్రాలాలని - ఏది ఎలా పోయినా సరే! మళ్ళీ ఒక పర్యాయము నాలో మనస్సుకీ హృదయానికీ వచ్చిన సంఘర్షణలో హృదయమే జయించినది.

ఆ ప్రయాణములో పూజ్యులు శ్రీ ఎస్. సత్యమూర్తీ ఆయన కుమార్తె లక్ష్మి, నాతో ఉన్నారు. సత్యమూర్తి మాపిన్ని రుక్మిణమ్మగారికి సన్నిహితులు; లక్ష్మి మా చెల్లెళ్ళనిద్దరినీ బాగా ఎరుగును. ప్రయాణము కులాసాగానే గడిచి పోయింది. త్రోవపొడుగునా చాలాచాలా మాట్లాడాను సత్యమూర్తితో. సమకాలిక రాజకీయ విషయాలను గురించీ, కాంగ్రెస్ చరిత్రను గురించీ, మన స్వాతంత్ర్య సమరాన్ని గురించీ ఆయనకు తెలిసినంత శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యకు తెలుసు; అంతే. ఎటొచ్చీ, ఆ విషయాలను గురించి చెప్పేతీరు వేరు వేరు, వారిద్దరిలోనూ. సత్యమూర్తి గొప్ప వక్త ఐనా, ఆయన మాట్లాడుతూంటే మనము మధ్యమధ్య ఒకొక్కమాట, మనకు తోచినది, అంటూ ఉండవచ్చును. పట్టాభి

సీతారామయ్య విషయంలో, మనకు అటువంటి అవకాశము ఉండదు. ఏమాత్ర మూను! ఆయన నిరంతర వాగ్ధారముందు మనము నోరు కదుపలేము!!

దక్షిణ ప్రాంతాలకు వచ్చాను; కాని, నేను అనుకున్నట్టు జరుగలేదు. అలా జరుగకపోవడమే గాకుండా, పరిస్థితులు తారుమారై నేను విపరీతంగా తిరస్కరింపబడ్డాను. ఇది కోరి కోరి తెచ్చిపెట్టుకున్న తిరస్కరణ ఐనా, కొండ విరిగి నెత్తిమీద పడినట్లు ఐనది నాకు. తప్పు నాదే! నదిలో ఎదురీతకు సాహసించేవారు తాము ప్రవాహంలో కొట్టుకుపోవచ్చు అని తెలియకపోవడము అజ్ఞానము.

ఆప్యాయంతో పెంచిన స్నేహలత పుటుక్కున తెగిపోయింది, ఒక్క కత్తివేటుతో, అనిపించింది, ఆ నిమిషము. పెద్ద సముద్రకెరటము నామీద విరుచుకుపడి, వెనక్కు వెళుతూవెళుతూ నా పాదాలక్రింది భూమిని సాంతమూ దొల్చుకుపోయింది. ఎలా నిలబడకలిగానో, అమాంతంగా ఆ నిరాశాసముద్రంలోకి లాగుకొని పోబడకుండా!....

నేనుకాదు, నాపేరుగల మరెవరో తిరిగి రైలు ఎక్కారు, అర్ధరాత్రి, కుమిలిపోతున్న హృదయాన్ని అరచేతితో అదుముకుంటూ.

ఆత్మహత్య మహాపాతకమంటారు. కాని, రైలుప్రయాణము అంత సేపూ నాకు మరో ఆలోచన లేదు. నాతో ఉన్నవారు దీపాలు ఆర్పివేసి హాయిగా నిద్ర పోతున్నారు. నేను మాత్రము, మేలుకునే ఉన్నాను, నా భగ్నహృదయగాథ తోడుగా. ఎంతసేపు నిలుచున్నానో తలుపుదగ్గర! బయట గాఢాంధకారము. రైలు వేగంలో, నక్షత్రాలుకూడా కనిపించడములేదు.

చటుక్కున, తలుపు తెరచుకొని బయట అడుగు పెడితే? ఆ శూన్యంలో కలిసిపోతే? ఎంత శాంతి కలుగుతుందీ, కాలిపోతున్న ఈ మెదడుకు!!

కాని, ఒక ఆలోచన మెరపులా మెరసింది : 'ఎప్పుడో ఒకప్పుడు, ఈ విపరీతపు పరిస్థితులు మారి, అవతలవారికి నేను అవసరమైతే, అపు డెల్లాగ ? ఆ పిలుపు నేను వినలేకపోతే, ఆ అవతలవారేమై పోతారు। అప్పుడు, నా లేమి, వారి శేషజీవితాన్ని చీకటిమయము చేయదూ? నన్ను క్షమిస్తారా ఇక, అప్పుడు?' అని.

ఆ ఆలోచనే బలమై, తీయబోయిన రైలుతలుపును గట్టిగా బిగించాను. కాని, తలుపుపక్కనే నిలుచున్నాను, మిగిలిన రాత్రంతా.

ఐతే, ఆ నిమిషం కొండంత బలము కావలసివచ్చింది - చనిపోవడానికి కాదు, బ్రతుకడానికి!!

## ౨౦

అంత తెగించి, గోడివడు ఆకసముంగని,
"చిమ్మచీకటిన్
సుంతయు దారి కన్పడక సోలు ప్రజాళికి
బాటచూప ఏ
కాంతులకాగడా కలదు కాలపుహస్తమునం
ద"దటన్న, "వి
భ్రాంతుడ! అంధతుల్యమగు భక్తియె
సు"మ్మని మారు వాకొనెన్;

రాయప్రోలు సుబ్బారావు

నా మనస్సు ఏమీ బాగులేదు. నాకు పిచ్చెక్కిపోతుందేమో నను కున్నాను, కొన్నిసమయాలలో, అప్పుడు. ఏవిషయాన్నీ అంత గాఢంగా అశించ కూడదు, మరి. తరువాత కొన్నాళ్ళకుగాని తెలుసుకోలేదు నేను: "ఏవిషయము నందూ, అదిపోతే, మనకు లోకమే పోయినంత వెర్తిని కల్గించేటంతటి విపరీత మైన అనురక్తిని ఉంచుకోకూడదు," అని.

ఇంతటి గొప్ప ఆశాభంగము కలిగినాక, ఇతర విషయాలు వేనియందూ ఆసక్తిని ఉంచుకోలేకపోయాను. అన్ని ఆలోచనలూ తిరిగి తిరిగి, మళ్లా మళ్లా, ఒకే అంశముపైపుకి కేంద్రీకరించేవి. ఆ ఆలోచనలనుండి పారిపోవాలన్నా, పారి పోలేకపోయాను. నేను సెలవుమీద ఉన్నాను. కాని, మళ్లా ఢిల్లీ వెళ్ళడానికి మనస్కరించడము లేదు. వెళ్ళడానికి ధైర్యమూ లేదు! మద్రాస్‌లోనూ ఉండా లనిపించలేదు. బెంగుళూరుకు ప్రయాణమయ్యాను, బెంగుళూరుకూ, అక్కడ నుంచి మైసూరుకూ. రైల్లోంచే రెండు ఉత్తరాలు వ్రాశాను: ఒకటి, తిరుచ్చినా

పల్లి స్టేషన్ డైరక్టర్ శ్రీ శాస్త్రికి. ఒకటి, మద్రాస్ స్టేషన్ డైరక్టర్ శ్రీ గోపాలన్‌కి. శ్రీ శాస్త్రియెడ నాకు ఉద్యోగరీత్యానే గాకుండా, వ్యక్తిగతంగాకూడా మిక్కిలి భక్తిభావమూ ఎంతో అనురాగమున్నూ. వారికీ నాయందు గొప్ప సద్భావము. కాని, నాలోని లోపాలున్నూ వారు అతినిశితంగా విమర్శించేవారు. ధర్మ నిర్వహణయందు ఉండవలసింత ఆసక్తి నాకు లేదని వారి నిశ్చితాభిప్రాయము. అంతేగాక, ఏవేవో పిచ్చిపిచ్చి ఊహలతో మనస్సును కలతపరచుకుంటూ ఏకాగ్రతను పోగొట్టుకుంటున్నానని వారి అభిప్రాయము. అది చాలవరకు నిజమే. ఏపని ఐనా ఎంతబాగాచేసినా, అంతకంటె ఇంకా కొంచెము బాగాచేసి ఉండవచ్చును అనేవారు. కాని, కొన్ని ముఖ్యమైన పనులు నిర్వహించడానికి నన్నే నియమిస్తూండేవారు. కొన్నేళ్ళ తర్వాత, వల్లభ్భాయి పటేల్ మద్రాస్‌కు విచ్చేసినతరి, వారు ఉపన్యసించే బహిరంగసభలో, సభావేదికపైన వల్లభ్భాయి ప్రక్కనే నిలచి ఆయన మాట్లాడవలసిన మైక్రొఫోన్‌ను వారిఎదుట అమర్చేపని నాకు ఒప్పగించారు శాస్త్రి. ఈపని చాలా సున్నితమైనది. ఉపన్యాసకుని ఏమాత్రమూ ఇబ్బంది పరుపకుండా, వారిమాట ఒక్కమాట పోకుండా, మైక్రొఫోన్ అమర్చాలి. వల్లభ్భాయి ఉపన్యసిస్తూంటె చీమ చిటుక్కుమన్నా, వారు మండిపడతారనే భావముండేది - అంతటి చండశాసనుడు ఆయన. అటువంటివారి ప్రక్కన నిలబడే బాధ్యతా, గౌరవమూ, నాకు అందజేశారు శ్రీ శాస్త్రి. ఆ నిమిషాలు నేను చాలా గర్వింపతగిన నిమిషాలు. నా ఉద్యోగపు దుస్తులలో మైక్రొఫోన్ చెంత నిలుచున్న నన్నుచూచి వల్లభ్భాయి చిరునవ్వు నవ్వారు. మైక్రొఫోన్ వారి ఎదుట అమర్చగా, మిక్కిలి సౌజన్యంతో వారు అడిగారు నన్ను: "ఇంత దగ్గరగా కూర్చుంటే సరేనా?" అని.

శ్రీ శాస్త్రికి తాను అన్ని విషయాలలోనూ తన విద్యుక్తధర్మాన్నే పాటించాలి అనే గొప్పదీక్ష విపరీతంగా ఉండేది. ఈ ధర్మపరిపాలనలో చుట్టాలనీ, స్నేహితులనీ, అధికారులనీ ఏమాత్రము పక్షపాతముగాని, దాక్షిణ్యముగాని పనికిరాదు వారికి. తనవద్ద ఉన్న ఉద్యోగస్తులు, ముందు, ఆఫీస్‌పని ఏమాత్రము లోపమూ లేకుండా చెయ్యాలి - ఆతర్వాతనే కబుర్లూ, కులాసాలు. ఒకపర్యాయం

ఆయన నిర్మొహమాటాన్నీ, నిర్దాక్షిణ్యాన్నీ విమర్శిస్తూ ఆయనను, విక్టర్ హ్యూగో చిత్రించిన యావర్ట్ అనే పోలీస్ ఇన్స్పెక్టర్‌తో పోల్చాను నేను. అది తెలిసి ఆయన ఆ తరువాత, ఎప్పుడైనా, నాకంత ప్రియముగాని ఉత్తరువును ఇస్తూన్నప్పుడల్లా "ఇది యావర్ట్ ఉత్తరువు!" అని చెప్పేవారు. కాని, వ్యక్తిగతంగా నాకు ఉత్తరము వ్రాసినప్పుడుమాత్రము ఉత్తరము ఇంగ్లీష్‌లో ఉన్నా, సంతకము తెలుగులో ఉండేది 'తమ్ముడు!' అంటూ - వయస్సులో, ఆయన నాకంటె కొన్నేళ్ళు చిన్న.

అటువంటి శ్రీ శాస్త్రికి ఉత్తరము వ్రాశాను నేను, బెంగుళూరు వెళుతూ, అలా నామనసు బాగులేక, మద్రాస్ వచ్చివేశాననీ ఏపరిస్థితులలోనూ తిరిగి ఢిల్లీ వెళ్ళలేననీ, ఎల్లాగైనా నన్ను తిరుచ్చినాపల్లికి బదిలీ చేయించమనీ.

శ్రీ గోపాలన్‌కీ అల్లాగే వ్రాశాను: నాకు ఢిల్లీ వెళ్లాలని లేదనీ ఇక్కడే ఉండిపోవాలని ఉన్నదనీ వీలైతే నన్ను తిరుచ్చినాపల్లి పంపమనీ. గోపాలన్ నన్ను నా అడయార్ చదువు అప్పటినుంచీ చాలా బాగా ఎరుగుదురు కాబట్టి, ఆయనకు నా మానసిక వ్యధను గురించి మరింత విపులంగా వ్రాశాను.

వారిద్దరూ జవాబులు వ్రాశారు.

శాస్త్రి అన్నారు : మొన్ననే విన్నాను నీకు ఢిల్లీ బదిలీ ఐనదని. ఇవ్వాళ నీ ఉత్తరం అందుకొని నీ 'నెపోలియానిక్' ప్రయాణాలను చూచి విభ్రాంతుడనైనాను. ఇప్పుడు నీవు నా ఆధీనములో లేవు. కనుక, నేను ఎట్టి సహాయమునూ చేయలేను. నీ ఉత్తరము ప్రతిఅక్షరము వెనుక, నీకన్నీటిని గుర్తిస్తున్నాను. కొందరి జీవితమే అంత! విషాదాన్ని కోరి తెచ్చుకొంటారు వారు. ఈ పరిస్థితులలో నీవు నీకు అత్యవసరమైన మనోబలాన్ని చేకూర్చుకోగలవని ఆశిస్తున్నాను" అని.

గోపాలన్ ఒక్క వాక్యమే వ్రాశారు : "నీతో నా ఇన్నాళ్ళ పరిచయమునుబట్టి నీవు నీ వ్యక్తిగత సమస్యలకంటె ఉద్యోగరీత్యా నీ విద్యుక్తధర్మానికే ఎక్కువ విలువనిస్తావనీ ఎటువంటి పరిస్థితులలోనూ రేడియోసంస్థయెడగల నీ బాధ్యతలను పాటిస్తావనీ అనుకున్నాను నేను" అని.

ఈమాట వాడిసూదిమొనలా గ్రుచ్చుకున్నా. నేను తిరిగి ఢిల్లీకి వెళ్ళడానికి సంసిద్ధుడను కాలేకపోయాను. అప్పటి నా మనోదౌర్బల్యం అటువంటిది!

మైసూరులో ఉండగా ఆఊరి రేడియోనిలయపు నిర్వాహకుడు శ్రీ గోపాలస్వామిని చూచాను. వారు నాకు చాలా ఆప్తులు. అప్పటికి మైసూరు 'ఆకాశవాణి' ఇంకా ఏ. ఐ. ఆర్. లో చేరలేదు. గోపాలస్వామితో రోజూ రేడియోనిలయానికి వెళ్ళి వాస్తుండేవాడను నేను. అనేక విషయాలలో నా సలహాను తీసుకుంటూన్న ఆయనతో ఒకసారి నేను నామనస్సు విప్పి, అన్నాను , "ఈ పరిస్థితులలో నేను బహుశా ఏ. ఐ. ఆర్. ను వదులుకోవలసి వస్తే, మీసంస్థలో పని జేయనిస్తారా నన్ను" అని. ఆయన అన్నారు : "అలా ఎప్పటికీ జరుగదు. ఐనా నిన్ను మేము భరింపగలమా?" అని.

మైసూరునుంచి శ్రీరంగపట్టణము వెళ్లాను. కావేరీనదిలో ద్వీపము ఏర్పడిన ప్రతిచోటా శ్రీరంగనాధస్వామి దేవాలయము ఉంటుంది. ఇచ్చట రంగనాధుని దర్శించేసరికి నాకు తిరుచ్చినాపల్లికి సమీపాన ఉన్న శ్రీరంగములోని రంగనాధస్వామి స్మృతికివచ్చి, ఆ రోజులూ ఆ వాతావరణమూ పెల్లుబికివచ్చింది నాలో. నేను వివశుడనైపోయాను. ఏదో వెర్రిగా ప్రార్థించాను రంగనాథుని సమక్షాన ఇచ్చట. అల్లాగే రంగనాయకి ఎదుటకూడా మోకరిల్లి, నా హృదయవిదారగాథను చెప్పుకొని, మొరబెట్టుకున్నాను. మన ఇష్టదేవతను ప్రార్థించేటప్పుడు ఇది సబబు, ఇది సబబుకాదు అనే ఆలోచనేలేక, మన మనస్సులోని కోరికను నెరవేర్పమని వెర్రిగా, అతివెర్రిగా అర్థిస్తాము. అమ్మను అడిగినట్టే దేవినీ, మొండిపట్టుతో! అప్పటి పరిస్థితులలో నేను ఆశించినది జరుగుట అసంభవమని నా మనస్సు చెపుతుంది. కాని, హృదయము? హృదయము కోరే కోరికకు హద్దు నియమాలున్నాయా?

## సాగుతున్న యాత్ర

హృదయపూర్వకంగా, మనసారా, నా కన్నీటిసరులదొంతరలను కానుకగా ఇచ్చి అర్థించాను రంగనాయకిని, కుందేటికొమ్మును ఇప్పింపమని. ఇల్లా దేవి ఎదుట నాగోడు చెప్పుకోవడము మాత్రము నాకెంతో మనశ్శాంతిని ఇచ్చింది, ఆ నిమిషము.

*     *     *     *

నా అదృష్టవశాత్తూ మరెవరినో ఢిల్లీకి పంపవలసి వచ్చి నన్ను మద్రాస్ కేంద్రములో జేరమన్నారు. నేను జేరాను వెంటనే. తిరిగి, రేడియో కార్యక్రమాలలో నిమగ్నుడనయ్యాను. కార్యక్రమాలు ఎక్కువైనవి. ఊపిరి సలుపనంత ఎక్కువ పని కలిగింది.

....కొన్నిగాయాలు మానవు. కాని, వానిచుట్టూ 'శిల' వేసి పోతుంది. ఆ శిల అల్లాగే ఉండిపోయి ఏదో జ్ఞాపకమువచ్చినపుడు 'కరేల్' 'కరేల్' మంటూ పోటు కలిగినా, గాయము మాత్రము పైకి కనిపింపదు....యధావిధిని రేడియో వ్యాసంగము జరిగిపోతోంది. ప్రసంగములు ఏర్పరచడమూ నాటికలు ప్రదర్శించడమూ నాటికలు రచించడమూ ఇతరుల రచనలకు మెరుగుపెట్టడమూ - ఇలా చేతినిండాపని. అరోజులలోనే దేవులపల్లి కృష్ణశాస్త్రి రచించిన - కాదు, అతని చేత నేను రచియింపించిన - 'శర్మిష్ఠ' సంగీతనాటకము ప్రసారమైనది.

కృష్ణశాస్త్రిచేత నాటకము వ్రాయించి ప్రసారముచేయడము ఒక మహా యజ్ఞము చేసినంతపని. అంతటి ఫలమూ ఉంటుంది కూడా. ఇతరుల నాటికలూ, నాటకాలూ, వాని ప్రతులు ఒక మూడునెలలైనా ముందుగా వచ్చి ఉంటవి. వానిని నిర్ణీతసమయానికి తగిన రిహర్సల్స్‌తో ఎంతో కొంత అందంగా ప్రసారము చెయ్యవచ్చు. కృష్ణశాస్త్రి విషయంలో మాత్రము, అల్లా కాదు. అసలు ఫలానా నాటకము వ్రాయడానికి అతనిని ఒప్పించడమే ఒక మహాయత్నము. అథవా, అతను ఒప్పుకున్నా, అతనిపేరు కార్యక్రమాల పత్రికలో అచ్చులో చూచాకనే, అతను రచనను గురించి ఆలోచిస్తాడు. ఆలోచించడానికీ, వ్రాత మొదలుపెట్ట

డానికీ మధ్య ఎంత లేదన్నా ఒక చంద్రసంక్రమణము కావాలి - అదీ, ఎంతో పోరితేనే. ప్రతినాటకమూ ఒక గండము - కాని, ప్రతినాటకమూ అద్భుతంగా పరిణమిస్తుంది. అతని వద్దనుంచి నాటకము రాదు, రాదు, అని నిరాశచేసుకునే నిమిషంలో అతను అవతరిస్తాడు మన ఎదుట. అతనితోకూడా అతని ముద్దుల పట్టి, కుమార బుజ్జాయిన్నీ. చేతిలో ఎంతపని ఉన్నా, అదంతా వదలి అతనివద్దకు రావాలి, నేను. కుశలప్రశ్నలతోటీ, ఎత్తిపొడుపులతోటీ, వెటకారపు మర్యాదలతోటీ కొంత కాలయాపన జరుగుతుంది. ఇంతసేపూ బుజ్జాయిని సినీమాకు తీసుకువెళ్ళనందుకు అతనికి లంచముగా ఏమియ్యాలో అనే బేరము ఒక ప్రక్కన సాగుతూనే ఉంటుంది.

ఇంతట్లోకీ "శర్మిష్ఠపాడే పాట ఎంత బాగా వచ్చిందనుకున్నావు!" అంటూ, పాడ నారంభిస్తాడు, కృష్ణశాస్త్రి. అది పాటకాదు; అమృతధార! అద్భుత కవనము!! ఆ పాట వ్రాయడానికి సాధారణ కాగితము పనికిరాదు. నేను ప్రాణతుల్యముగా దాచుకున్న సుందరాతిసుందరమైన లెటర్ పేపర్‌ను తెచ్చి అతని ముందు ఉంచితే, కాగితాన్ని మెచ్చుకుంటూ, నేను తొడుగుకున్న మస్లిన్ చొక్కా అందాన్ని మెచ్చుకుంటూ, వ్రాస్తాడు, అతను, ఆపాట. నాలుగుపంక్తుల్లో, ఆరు పంక్తుల్లో, అవతరిస్తాయి, ముత్యాలకోవలవంటి అక్షరాలతో. అంతే! ఇక ఆవేళకు అంతే !!

నాటకంలో వచనభాగం కృష్ణశాస్త్రి చెప్పగా వ్రాయడానికి అతనికి ప్రియమైన లేఖకుడు కావాలి. అందరూ పనికిరారు అతనికి. కృష్ణశాస్త్రియందు అభిమానముగల అతని మేనల్లుడో మరెవ్వరో కావాలి. వారు దొరకరు, ఆ నిమిషము. కనుక, మరునాడు అదే వేళకని వాయిదా పడుతుంది. కాని, మరునాడు అదేవేళకు కార్‌లో అతనికోసము వెళితే, "ఎక్కడికో వెళ్లారు. కాటూరి వెంకటేశ్వరరావు గారితో; ఆపని చూచుకుని, తిన్నగా, రేడియోస్టేషన్‌కే వస్తానన్నారు!" అంటారు, ఇంట్లోవారు. కాని అతను ఆవేళ రాడు. మరునాడూ రాడు.

ఇక, ఇల్లా కాదని, ఈసారి ఎల్లాగైనా అతనిచేత కాస్త ముందుగానైనా వ్రాయించాలి నాటకము అనీ, నాటకప్రదర్శన సక్రమంగా జరిపించాలీ అనీ,

దీక్షతో నేను అతనిని, పూర్వం ఋష్యశృంగుని పట్టి తెచ్చినట్టు, తీసుకువచ్చి నేనున్న హోటల్‌లో విడిఖయిదుగా బంధించాను, అడిగనప్పుడల్లా కాఫీ ఇస్తూ, అడక్కపోయినా ఐస్‌క్రీం ఇస్తూ. అతను కొడుకు తనకోసము బెంగపెట్టుకుంటా డేమోననే నెపాన పారిపోతాడేమోనని, అతనితోకూడా బుజ్జాయినీ తీసుకు వచ్చాము నా బసకు. ఇక, కృష్ణశాస్త్రి శర్మిష్ఠనాటకము వ్రాయక తప్పదు. ఇక అతనికి సాయము, మాటలు వ్రాయడానికి శివరామం, పాటలు సంగీతముతో అన డానికి అవసరాల గిరి, ఆ సంగీతాన్ని స్వరపరచడానికి ఒక శ్రుతిలో బాలాంత్రపు రజనీకాంతరావూ, ఇంకో శ్రుతిలో మల్ల సూర్యనారాయణా; - నా ఆఫీస్ నా బసలోనే !

ఆ రోజులలో, ధూమపానము ఉంటేనేగాని కవితాస్రవంతి ప్రవహించేది కాదు కృష్ణశాస్త్రికి. నాకూ అప్పుడప్పుడు ఆ అలవాటు ఉండేది. నేను వాడుకగా వాడే స్టేట్ ఎక్స్‌ప్రెస్ సిగరెట్లే వీరికిన్నీ! భోజనాలూ, కాఫీలూ ఫలహారాలూ ఐస్ క్రీమ్ ఫ్రూట్‌సాలడ్‌లూ మా హోటల్‌లోనే. ఇలా, నాలుగురోజులు అహో రాత్రులూ కష్టపడగా, తయారైంది అద్భుతమైన శర్మిష్ఠ నాటకము! ఆ నెల నా హోటల్‌బిల్ ఒక ఎనభై రూపాయలు అదనంగా ఐనది. కాని, శ్రమ ఫలించింది. తెలుగుతల్లికి అమూల్యమైన ఒక క్రొత్తనగ సమకూరింది. తరతరాలవారూ గర్వంగా చెప్పుకోతగ్గ సాహిత్యరచన శర్మిష్ఠ!

రిహార్సల్స్ చురుకుగా సాగినవి. నాటకము ఒక రూపానికి వచ్చాక, కృష్ణశాస్త్రి విపరీతపు ఆవేశమూ ఉత్సాహమూ అందరినీ కమ్మివేస్తుంది. మూడు రోజులు నిరంతరాయంగా సాగాయి రిహార్సల్స్. రాత్రి పదీపదకొండూ అయ్యేది. శర్మిష్ఠ సూర్యకుమారి; దేవయాని పద్మావతి; యయాతి గిరి; ఇక, బృందగాన ములో కోకిల కంఠస్వరముతో చిన్నపిల్లలు విమలకుమారీ వరలక్ష్మి, మరి కొందరూ. ఆ యా సన్నివేశాలలో రాగోద్దీపనము కోసము, తగిన వాద్యవిశేషాలు అమర్చాము. సంగీతపర్యవేక్షణ రజనీకాంతరావు. తను పాడవలసిన పాటలూ చాలా చక్కగా పాడాడు రజని.

ఆ నాటకములో పద్మావతి నటనా నైపుణ్యము పరమావధి నందు కొన్నది. నాటకాభినయనములో, నటించేవారు తాము నిరూపించేపాత్రలో ఎంత వరకు తాదాత్మ్యమును పొందవలెను అనేది ఎప్పటికీ చర్చనీయాంశమే. కాని, ఆరాత్రి రేడియోప్రదర్శనలో పద్మావతి నూటికినూరుపాళ్ళు దేవయాని ఐయారు! యయాతిని విడిచి వెళుతూన్నప్పుడు ఆమె ప్రకటించిన దైన్యభావము రాళ్ళను సైతము కరగింప శక్తికలది!!

నాటకము అంత గొప్పగా రాణించినందులకు తబ్బిబ్బైపోయాను, నేను. ప్రదర్శన ముగిసినవెంటనే, ఇందరితోనూ, అయ్యగారి వీరభద్రరావూ, సూర్యనారాయణమూర్తీ, నేనూ కలసి మా బసకువెళ్ళి, అక్కడ బ్రహ్మాండమైన విందు అమర్చినాము. నా జీవితములో ఒకానొక పున్నమరాత్రి, శర్మిష్ఠ నాటక ప్రదర్శన !

* * * *

తోటమాలి కదలలేదు....ఉషాబాల కన్నులలోకి అలాగే చూస్తున్నాడు.

....రాజమాత కూతురుభుజాన చెయ్యిఉంచి మళ్లా అన్నది : "ఎవ రితను?" అని.

"ఎవరు నువ్వు!........మాట్లాడవేమి!!....ఎవరు నువ్వు?"

—ఎవరివీ మాటలు? ఉషాబాలే! ఉషాబాలే! బిగ్గరగా :

"ఎవరు నువ్వు!....ఎవరు నువ్వు!!" అని, పాలగచ్చు అంతా ప్రతిధ్వనించింది. తోటమాలి కదలలేదు.

రాజకుమారుడు ఓ అడుగు ముందుకు వచ్చాడు.

## సాగుతున్న యాత్ర

ఉషాబాలచేతిలోని దండను చూచిన రాజమాత వడివడిగా కొడుకు దగ్గరకు వచ్చి అతనిచెయ్యి పట్టుకుంది. ఆగంతకునివైపు చూచి, వెళ్ళిపొమ్మని సైగ చేసింది.

ఉషాబాల తల వంచుకుంది....

ఇందాకటి నల్లమేఘము ఇప్పుడు లేదు. చంద్రునిలోని మచ్చమాత్రము వెండి పళ్ళెము అంతా ఆవరించింది!

నిద్దురకళ్ళతోనే పెంపుడులేడి తోటమాలిని తోటలోకి ఆహ్వానించింది. కొడుకుకోసము తండ్రి మేలుకొని ఉన్నాడు....భూమిలోకి కుంచుకుపోతూ వచ్చిన తోటమాలిని తండ్రి సందిటిలోకి తీసుకుని "నాయనా!" అన్నాడు; ఇక మాట్లాడలేక పోయాడు.

తన తోటలోని పువ్వులన్నీ నిద్రపోతాయి....తన తోటలోని పక్షులన్నీ నిద్రపోతాయి....మేలుకొని, మేలుకొని, పెంపుడులేడి అతని పాదాలమీద తల వాల్చి నిద్రపోతుంది....

కాని, తోటమాలికి మాత్రము నిద్దురలేదు. ఉదయభానుని చూస్తూ వజ్రపుటుంగరంతో తన ఎర్రని కళ్ళను తుడుచుకుంటాడు ఇప్పటికీ, ఎప్పటకీని, తోటమాలి!!

—అని పూర్తిచేశాను, ఆరోజులలో ఒకరాత్రి రేడియోస్టేషన్‌లో నాపని చూచుకుంటూనే నేను వ్రాసిన 'తోటమాలి' అనే కథను.

బసకు వెళ్ళి, భోంచేసి పరున్నాను. కాని, నిద్దురపట్టలేదు. నేను వ్రాసిన కథను మరీమరీ చదువుకున్నాను. అందు, ఎంత కల్పితమో ఎంత నిజమైన సంఘటనో, అనే వ్యత్యాసము అంతరించేటంతగా ఒక్కొ-క్క-మాటా నాలో నేను వల్లించుకున్నాను వచనమైనా.

## సాగుతున్న యాత్ర

తోటమాలి క్రిందటి రేయి విపరీతపు గాలివానకు నేలకువ్రాలిన మాలతీ తీగను మామిడిచెట్టుపైకి ఎక్కించడానికి ఎత్నిస్తుండగా రాజకుమార్తె ఉషాబాల అవతరిస్తుంది, అతని కట్టెదుట. దేవతాస్త్రీ ఏమో ఆమె అనుకుంటాడు తోటమాలి, మొట్టమొదట. కాని, ఆమె అతనిని పలుకరించి, మాలతీతీగెను మామిడికొమ్మపైకి ఎక్కించడానికి సాయపడుతుంది. ఇలా కలసిన వారి స్నేహము నానాటికి అతిశయిల్లి, పున్నమరాత్రి వచ్చేసరికి వారిద్దరూ తోటలోని వాగు ఒడ్డున ఇసుకతిన్నెలలో పిచ్చుకగూళ్ళు కట్టుకుంటూ ఆడుకునేటంతటి ఆప్యాయతగా అభివృద్ధిజెందుతుంది. ఆ పున్నమవెన్నెలలో రాజకుమార్తె తొడుగుతుంది తోటమాలి వ్రేలున వెలలేని తన వజ్రపుటుంగరాన్ని. తోటమాలికి తల్లి లేదు. తల్లి ఐనా తండ్రిఐనా పెద్దమాలే. పెద్దమాలి కొడుకువ్రేలున వజ్రపుటుంగరాన్ని చూచి కొడుకును ఆవహించిన ఆ విపరీతపు ప్రేమను గురించి శంకిస్తాడు. కొడుకును వారింప యత్నిస్తాడు. కాని, అతనిమీది పితృవాత్సల్యంవల్ల ఏమీ అనలేకపోతాడు.....మళ్ళీ పున్నమరేయి. తోటమాలి వాగువద్ద వెన్నెలలో కూర్చుని రాజకుమార్తెను తలచుకుంటూ ఈ గుప్పిటిలో ఇసుక ఆ గుప్పిటిలో పోసుకుంటూ ఉండగా రాణివాసమునుంచి పరిచారిక చంపకము సందేశమును తెస్తుంది, "దేవిగారి సెలవైనది; దక్షిణపువేపు కోటద్వారము తెరచి ఉంటుంది; నేను అక్కడే ఉంటాను" అంటూ. ఆ సందేశాన్ని పాటించి తన తోటలోని పువ్వు లన్నిటిలోనూ మిక్కిలి శ్రేష్ఠమైనవానిని దండలుగా గ్రుచ్చి తీసుకొని, తోటమాలి రాణివాసమువైపు బయలుదేరుతాడు. తండ్రి కొడుకును వారింపజూస్తాడు. కాని "నాయనా!" అనకలుగుతాడు. ఇక మాట రాదు. తండ్రివైపు దీనంగా చూస్తూ వెళ్ళిపోతాడు తోటమాలి. తోట పొలిమేరవరకూ సాగనంపుతుంది నిద్రుళ కళ్ళతో పెంపుడు లేడి అతనిని.

కోటలో ప్రవేశించిన తోటమాలి అనేక ప్రాకారాలుదాటి, రాజకుమార్తె ఉన్న సౌధమునుజేరి, తనకై నిరీక్షిస్తూన్న ఉషాబాల దోసిలిలో తా నల్లిన దండల నుంచుతాడు. అతనుతెచ్చిన దండలను ఆమె తన తలలో సంతరించుకుంటూం

డగా అవతల ద్వారము తెరువబడి, రాజమాతా రాజకుమారుడూ ప్రవేశిస్తారు. రాజమాత ప్రశ్నిస్తుంది: "ఎవరు నువ్వు! ఎవరు నువ్వు!!" అని. తోటమాలి పలుకడు.

ఇలా జరిగిన కథను వల్లించుకుంటూ కథను గురించే ఆలోచిస్తూ మేలుకొనే ఉండిపోయాను నేను తెల్లవారుజాము వరకూ.

అప్పుడు, నాకు విపరీతపు ఆవేశము కలిగింది, వెంటనే ఈకథను ఎవరికైనా వినిపించాలి అని. ఎవరికి వినిపించను? ఎవరిని లేపను ఈ తెల్లవారు జామున!

నాకు ఆ మహాపట్నంలో ఒక్క స్నేహితుడే జ్ఞాపకం వచ్చాడు: గోపీచంద్. గోపీచంద్ ఒక్కడే ఆ నిమిషం నన్ను ఆదుకోతగ్గవాడు.

వెంటనే, గోపీచంద్ ఇంటికి వెళ్లాను కాలినడకను. నాలుగుమైళ్ళు తెల్లవారుజామున. ఆ చలిలో, ఆ చీకటిలో. ఎలుగెత్తి పిలిచాను గోపీచంద్‌ను రెండుసార్లు, మూడుసార్లు. మూడవసారి పిలచేసరికి అతను మేలుకొని ఎవరూ అని ప్రశ్నింపకుండానే తలుపుతీసి నన్ను లోనికి తీసుకువెళ్లాడు.

"ఇదేమిటి! ఏదీకానివేళ ఇంతవేకువనే ఇలా వచ్చారు!" అనలేదు గోపీచంద్. నన్ను కుర్చీలో కూర్చోమని ఎదుట తాను కూర్చొని సిగరెట్ వెలిగించాడు, అతను.

"క్రొత్తకథ వ్రాశాను వింటారా?" అంటూ నా కథ చదవసాగాను నేను.

శ్రద్ధతో విన్నాడు గోపీచంద్, కథ సాంతమూను.

కథ సాంతమూ విని, "మనస్సులోని భారము తీరిందా?....ఇక వెళ్ళి పడుకుంటారా?....మళ్లా అంతదూరము వెళ్ళడమెందుకూ? ఇక్కడే పడుకోండి. ఇక నిద్రపడుతుంది!" అన్నాడు, గోపీచంద్, నావైపు చూచి చిరునవ్వు నవ్వుతూ.

## సాగుతున్న యాత్ర

నిజమే! అతనికి నా కథ వినిపించాక ఎక్కడలేని మనశ్శాంతి కలిగింది నాలో!!

'తోటమాలి' కథను భారతివారు ప్రచురించారు, ఆ తర్వాత కొన్నాళ్ళకి. రేడియోలోనూ ప్రసారము చేశాము మరికొన్నాళ్ళకు, అచ్చటచ్చట అందమైన సంగీతపు హంగులు ఏర్పరచి.

ఆ రోజులలో పూజ్యులు శ్రీ రాయప్రోలు సుబ్బారావుకు ఉత్తరం వ్రాశాను నేను, రేడియోకార్యక్రమాల సందర్భంలో. "భారతిలో 'తోటమాలి' చదివే ఉంటారు" అన్నాను ప్రస్తావవశంగా.

శ్రీ సుబ్బారావు జవాబువ్రాస్తూ అన్నారు :

"తోటమాలి చదువకుండా ఉంటానా?....కాని మనకూ అంతే; నిరంతర నిరీక్షణే మనవంతున్నూ; మనకూ నిద్దురలేదు. ఉదయభానుని చూస్తూ, వజ్రపుటుంగరముతో మన ఎర్రని కళ్ళను తుడుచుకుంటూ ఉండవలసినదే మనమున్నూ, ఇప్పటికీ, ఎప్పటికీని" అని వ్రాశారు, శ్రీ రాయప్రోలు సుబ్బారావు.

౨౮

చందురుని చంగలువ వలచేని
జలధరుని చాతకము తలచేని
చలి తుసానుల కలువ మడిసేని
చందురుడు చంగలువ చూచేనా
జలధరుడు చాతకము గాచేనా;
ఏటికో ఈ క్షణిక ప్రణయాలు
సాటిలేనిది రాధప్రణయమ్మా!

బాలాంత్రపు రజనీకాంతరావు (రజని) తన చండీదాస్ గేయనాటికను పంపాడు రేడియో ప్రసారం నిమిత్తము. నాపేర ఉత్తరమున్నూ వ్రాశాడు, అతను. "ఈ సంగీతనాటకము ఊరికే కులాసాకోసము వ్రాసినదికాదు. ఇది అతి విలువైన ఆత్మానుభూతి. ఆ విధంగానే పరిగణింపతగినది. ఒక్కొక్కభావమూ పూర్తిగా అనుభవించి పొందుపరచినది, సంగీతవిషయమును గురించిన్నీ అతి ప్రస్ఫుటమైన ఆకారమున్నది, నా మనస్సులో," అంటూవ్రాశాడు, రజని, ఎంతో హృదయపూర్వకంగా.

తనరచనను గురించి అతను అంతటి మనఃపూర్వకత్వాన్ని వెలిబుచ్చడంలో ఆశ్చర్యములేదు. బాలాంత్రపు వేంకటరాయకవి కుమారుడైన రజనికి కవిత్వము ఉగ్గుపాలతో పెట్టినది. బాల్యమునుంచీ వారింట్లో వాతావరణం అంతా కవిత్వపు వాతావరణే. ఓలేటి పార్వతీశ మహాకవీ, దేవులపల్లి కృష్ణశాస్త్రీ, వేదుల సత్యనారాయణా, శివశంకరస్వామీ - వీరి ప్రతిభ ఆతనిపైన బాగా ప్రసరించింది. బెంగాలీభాషలో తండ్రికంటే కూడా ఎక్కువ అభిరుచేమో రజనికి; ఇందుకుతోడు,

అతను విశ్వవిద్యాలయంలో చదువుకున్నాడు కాబట్టి, పాశ్చాత్యసాహిత్యరీతుల లోనూ మంచిపరిచయము అలవడినది. సంస్కృతజ్ఞానము సరేసరి. ఇంతటివాని హృదయములో అవతరించిన చండీదాస్‌కావ్యము ఎందుకు బాగుండదు!

రేడియో ప్రదర్శన కూడా చాలా గొప్పగా రాణించినది. రాజేశ్వరరావు సంగీత నిర్వహణకు పూనుకున్నాడు. అతను సాధారణ మ్యూజిక్-డైరక్టర్‌గా పనిచెయ్యలేదు. ఈ ప్రదర్శనలో పాటలలోని ప్రతిఅక్షరమూ మళ్ళా మళ్ళా చదివించుకుని ప్రతిమాటా పూర్తిగా అవగాహనచేసుకునే ఆ అభిప్రాయాలకు తగినట్లు రాగవరుసలకు రూపకల్పన చేయసాగాడు, ఎంతో భక్తితో, ఎంతో ఉత్సాహంతో. పాత్రధారులున్నూ చాలా శ్రద్ధతో, పూర్తిగా అనుభవిస్తూ, నిర్వహించారు.

నాకు సంగీతములో చాలా అభిరుచి ఉన్నా, శాస్త్రమురాదు కాబట్టిన్నీ, ఈసంగీత నాటక దర్శకత్వము పూర్తిగా రజనే స్వయంగాచూస్తున్నాడు కాబట్టిన్నీ ఆఫీస్‌లో నా ఇతరపనులను చూచుకొని చండీదాస్‌నాటకము ఇంకొక్క పదినిమిషాలకు ప్రారంభమవుతుంది అనగా లేచి నాబసకు బయలుదేరాను - అక్కడే, నా రేడియోలో నాటకమును వినవచ్చుగదా అని. కాని, మేడమెట్లు దిగుతూండగా, మా అసిస్టెంట్ డైరక్టర్ త్యాగరాయశాస్త్రి ఎదురై "ఎక్కడికి వెళుతున్నావు? ఇంక ఒక్క క్షణములో చండీదాస్‌నాటకము ప్రారంభమవుతోంది! స్టూడియోలో ఉండవలసినవాడవు ఇక్కడున్నావేమి? వెళ్ళు, వెంటనే, స్టూడియోలోకి!" అన్నారు.

నన్ను చూడగా రజనిముఖ మింతైంది. నేను చేయతగినది ఏమీలేదు, నిజంగా, ఈ నాటకములో! కాని, నేను అతనితోకూడా ఉండడమే రజనికి కొండంత ధైర్యాన్ని ఇస్తుంది. నాకూ అంతే! రజని నాతోటిఉంటే కృష్ణుడు కలసిన అర్జునునిలా ఎంతైనా సాధింపగలను, నేను.

చండీదాస్ సంగీతనాటకము అద్భుతంగా రాణించినది. ఆఖరి బృందగానము పూర్తిఐ స్టూడియోలో ఎర్రదీపము ఆరిపోవడమే తడవుగా రజని స్టూడియో

తలుపు తీసుకొని బయటకు వెళ్ళిపోవడము చూచి, నేను గబగబ అతనివెనకాలే వెళ్లాను. రజని తిన్నగా తన ఆఫీస్ బల్లవద్దకు వెళ్ళి, నాటకము వ్రాతప్రతి బల్లపై పడవేసి కుర్చీలో చతికిలబడి, భోరున ఏడ్వసాగాడు! ఆ నిమిషము స ప్తసము ద్రాలూ కట్టతెంచుకు ఉప్పొంగినట్లనిపించింది, నాకు. విశ్వప్రయత్నము చేసిగాని నేను అతనిని సముదాయించలేకపోయాను. ఎంత అనునయించానో నేను! "అబ్బే! అబ్బే!! ఇంత అధైర్యపడతారా ఎవరైనా? నాటకము బ్రహ్మాండముగా ఉన్నది! నేను అనుకున్నదానికంటే పదిరెట్లు, వందరెట్లు, అద్భుతంగా ప్రసార మైంది!" అన్నాను, నేను.

ఏడ్పు ఆపుతూ అన్నాడు, రజని: "నేను అనుకున్నదానికంటే పది రెట్లు పేలవంగా ఉంది. నా భావాలను ఎంతో గొప్పగా ఒప్పించవచ్చును అను కున్నాను. ఒక్కటీ సరిగ్గా నిరూపించలేకపోయాను!" అని.

ఈ అసంతృప్తి సహజమే.

ఇటువంటి అసంతృప్తి ఉండబట్టే, అతను కళాశీలిగా నానాటికీ ఇంకా ఇంకా గొప్ప పరిణితికి రాగలుగుతున్నాడు, అనుకుంటాను.

రజనీ నేనూ కలిసి, చాలాచాలా కార్యక్రమాలు ప్రసారం చేశాము. మేము కలిసి పనిచేసిన మొదటిరూపకము 'శ్రీకృష్ణదేవరాయలు' అనుకుంటాను. బండెడు చారిత్రాత్మక విషయములనుండి కథావస్తువును సేకరించాము, మేము, ఎన్నో శాసనాలను తిరుగవేసి. అందు ముఖ్యమైనవి కొన్ని ఏరి, ఆ శాసనాలను చదివిస్తూ కొంత కథ చెప్పించాము, తగిన వాద్యవిశేషముతో జతపరచి. ఈశాస నాలు చదివించడము అద్భుతమైన వాతావరణమును కల్పించినది. విజయనగరంలో వేణుగోపాలస్వామిఆలయమునకు రాయలవారు దయచేసిన శాసనమూ, అమరావతి శాసనమూ, సింహాచలశాసనమూ, తిరుపతిశాసనమూ ఇవన్నీ ఆయా ప్రదేశాలకు ఆ యా ఘట్టాలకు అనుకూలమైన నేపథ్యసంగీతముతో వింటూంటే ఒళ్ళు పులక రించేది అన్నమాట! రాయవాచకమునుండి కొన్నిభాగాలను తీసి, తద్వారా కథ

చెప్పించాము. మనుచరిత్ర, పారిజాతాపహరణము, ఆముక్తమాల్యద, వీటి లోని పద్యాలను తీసుకున్నాము. శ్రీకృష్ణదేవరాయలు పారేపల్లి సుబ్బారావు; తిమ్మరుసు ముంజులూరి కృష్ణారావు; పెద్దనామాత్యుడు పారేపల్లి సత్యనారాయణ; తెనాలిరామకృష్ణుడు ప్రయాగ నరసింహశాస్త్రి. పోర్చుగీస్ రాయబారిగా విప రీతపు యాసతో నేను మాట్లాడాను. రాయలను వైతాళిక బృందము మేలుకొలిపే దృశ్యమూ, తిమ్మరుసుతో మంత్రాలోచనమూ, సభారంగమూ, యుద్ధరంగములూ. ఉత్తరదిగ్విజయయాత్రా, తదుపరి ధనుష్కోటివరకూ దక్షిణదిగ్విజయయాత్రా ఇవన్నీ కన్నులకు కట్టినట్టు చిత్రింపకలిగాము. చివరకు, భువనవిజయమున కవి సన్మానమూ, వినోదాలూ వేడుకలూ జగజ్జేగీయమానంగా జరిగినవి.

ప్రసారమైన ఒక్కొక్క రేడియోకార్యక్రమమును గురించీ డ్యూటీ ఆఫీసర్ తన అభిప్రాయాన్ని వెంటవెంటనే క్యూషీట్‌పైన పొందుపరచడము, రివాజు. ఈప్రదర్శన జరుగుతూండగా, మధ్యలోనే త్యాగరాయశాస్త్రి మేడ దిగి వచ్చి "ఏదీ క్యూషీట్!" అని, అడిగి పుచ్చుకుని, శ్రీకృష్ణదేవరాయలు - సంగీత రూపకము అనే అంశానికి ఎదురుగా బీ ప్లస్ అనేగుర్తు ఉంచి తన సంతకాన్ని పొందుపరచి, వెళ్ళిపోయారు. 'ఏ ఒన్' ఒక ఆశయముమాత్రమే కాబట్టి ఆ మార్కు ఎవరికీ లభింపదు. ఈ ప్రదర్శనానికి అందరికంటే పైఅధికారి అతను స్వయంగా అంత గొప్పమార్కు ఇవ్వడము ఎంతో గొప్ప. అందుకు తగినట్లు గానే, ఆ మరునాడూ ఆ తరవాతరోజూ ఎంతలేవన్నా ఒక నూటఏబది ఉత్త రాలు వచ్చాయి, ప్రదర్శనను ప్రశంసిస్తూ. ఆంధ్రదేశము నాలుగుమూలలనుండి వచ్చిన ఈ అభివందనములు మమ్మెంతగానో హర్షింపచేసినవి.

ఆ తరువాత కొన్నాళ్ళకు, కాకతీయాభ్యుదయమూ రచించి ప్రసారము చేశాము. ఈ రచనకు అందమిచ్చే మంచిమంచి పాటలు వ్రాశాడు రజని. కాక తీయవైభవాన్ని చాలా చక్కగా చిత్రింపకలిగాము.

# సాగుతున్న యాత్ర

రజని రచించిన ఒక గొప్ప నాటకము 'దివ్యజ్యోతి' అనే బుద్ధుని జీవితగాథ. ఇందు ఒక్కొక్కపాటా ఒక తేనెవానగా ప్రసారమయింది. ప్రతి సంభాషణా ఎంతో ఉదాత్తత కలిగించినది. రేడియోచరిత్రలో ఎన్నటికీ మరువ రానిది, ఈ దివ్యజ్యోతి నాటకప్రదర్శనము.

రజనీ నేనూ కలసి చేసిన రేడియోకృషి మిక్కిలి ఆప్యాయతతో మరీ మరీ జ్ఞాపకముచేసుకోతగినది. మా ఇద్దరిమధ్యా ఎంతలేదన్నా ఒక పదిహేనే ళ్ళైనా వ్యత్యాసమున్నా మా ఇద్దరిమనస్సులూ ఇద్దరిహృదయభావాలూ వింతగా కలిసిపోయినవి. నేను ఒకభావాన్ని చూచాయగా వెల్లడిస్తే చాలు, రజని వెంటనే ఆ భావానికి తగిన గేయమో, పద్యమంత అందమైన వచనమో సృష్టించేవాడు. అతనికి సంస్కృతము బాగా వచ్చునుకాబట్టి, అతను తోడ్పడ్డరచన ఎంతో ఉదాత్తతో నిండివుండేది. భర్తృహరి సుభాషితాలను ఆధారంగా తీసుకుని 'తృష్ణ' అనే రూపకమును రచించి, ప్రదర్శించాము, మే మిద్దరమూను. పుట్టుకతోనే తృష్ణతో పుడుతాడు మానవుడు. పొత్తిళ్ళలో ఉండగానే, తల్లిప్రేమకై తృష్ణ; పసిబాలునిగా తోడిపిల్లలతో ఆడుకుంటూన్నప్పుడే వారిలో తాను మేటి కావాలి అనేతృష్ణ; విద్యార్థిదశలో గొప్పగొప్ప 'డిగ్రీ'లను పొందాలనే తృష్ణ; ఆ తరువాత ఉద్యోగమూ, సిరిసంపదలూ, కీర్తి, వీనికై తృష్ణ. కానీ, వీటిని అన్నింటినీ మర పించేతృష్ణ ప్రేమసాఫల్యతృష్ణ. ఇది, ధనకాంక్షకంటే కీర్తికాంక్షకంటేకూడా ఎక్కువైనతృష్ణగా తోస్తుంది. విధివశాన, ఈ ప్రేమ విఫలమైతే భరింపనలవి కాని నిస్పృహ కలుగుతుంది. కాని, కొండంతబెంగతో కుమిలిపోతూన్నా ఆ అవతలివారి ఆనందమే ఆశించి, ఆమెకు మేలుచేస్తూ, ఆమెకోరిన ప్రియునితోనే సమాగమము కల్పిస్తాడు, కథానాయకుడు, విజయసారధి. ఐతే, ఆ తరువాత మిగిలిన ఒంటరితనము కాల్చుకుతింటుంది, మనిషిని: "ఎందుకూ ఈ పాడు బ్రతుకు!" అనిపిస్తుంది. అన్నీవదలి పారిపోవాలనిపిస్తుంది. అప్పుడే, చచ్చి స్వర్గానఉన్న, తండ్రిగొంతుక వినిపించి, విజయసారధిఆత్మకు గొప్పఉద్బోధన కలిగిస్తుంది. జన్మసార్థకమైన మానవసేవాకాంక్ష కలుగుతుంది, అతనిలో. శేష

జీవితమును ఇందుకొరకే వినియోగిస్తాడు అతను. ఇక, మానవసేవాతృష్ణా త్యాగ తృష్ణా. జీవితంలో మనము పాటింపవలసిన కొన్ని కొన్ని ముఖ్యమయిన విలువ లను చాలా చక్కగా నిరూపించగలిగాము ఈ రూపకముద్వారా. శ్రోతలున్నూ ఈ రూపకాన్ని తరువాత అనేకపర్యాయాలు జ్ఞాపకంజేసుకున్నారు.

ఆరోజులలో, ఒకనాడు, మధ్యాహ్నము నేను డ్యూటీలో ఉండగా, మాపై అధికారి శ్రీ సూరి నారాయణమూర్తి నాకుఫోన్‌చేశారు: "చూడండి! 'తిష్యర క్షిత' అనే ఏకాంకికను చూచారుకదూ? ఆ నాటికను ప్రసారము చెయ్యడము లేదన్నారు, మీరు. సరే; ఆ నాటికను రచించిన శివరాజు సుబ్బారావు అనేఆయన వస్తున్నారు మీ వద్దకు. ఆయన వ్రాతప్రతి ఆయనకు ఇచ్చివేస్తూ, ఎందువల్ల మనము ఆ నాటికను వినియోగింపలేకపోతున్నామో ఆయనకు తెలియచెప్పండి. ఆయన బాగా చదువుకున్నవారు. ఇంకా ఎన్నోరచనలు ఉన్నాయట వారివి. వానిలో మనకు ఏవైనా పరిశీలనార్థము పంపిస్తారేమో కనుక్కోండి" అంటూ.

శివరాజు సుబ్బారావు నా ఎదుట వచ్చి నిలబడ్డాడు. ఆయనే 'బుచ్చి బాబు'. ఆయనను ఉచితరీతిని సత్కరించి, ఈమాటా ఆమాటా మాట్లాడసాగాను ఆయనతో. అప్పటికే ఆయన కథానికలు కొన్ని నమ్మాళ్వార్ పుస్తకంగా అచ్చు వేశారు. ఆ సంపూటాన్నిగురించి శ్రీశ్రీ విమర్శ చదివాను. కాని, పుస్తకం చదువలేదు, నేను....బుచ్చిబాబునుగురించి కొన్ని వివరాలు కనుక్కున్నాను. ఆతను ప్రెసిడెన్సీ కాలేజ్‌లో ఆనర్స్ చదివాడనీ, ప్రస్తుతం, అనంతపురం కాలే జ్‌లో లెక్చరర్‌గా ఉన్నాడనీ తెలుసుకున్నాను. ఆతరువాత, ఆతను రచించిన 'తిష్యరక్షిత' ను గురించి చెబుతూ అన్నాను: "శైలీ రచనాశిల్పమూ చాలా గొప్పగా ఉన్నవి. ఇంగ్లీష్ ఏకాంకికకు కావలసిన హంగులన్నీ ఉన్నాయి. కాని కథావస్తువుమాత్రం కొంతవరకు సారంగధరను పోలివున్నదేమో. సారంగ ధర నాటకము అట్టే అంత ప్రదర్శనాయోగ్యంకాదు, మరి. మహారాజుభార్యకు సవతికుమారునిపై మోహము జనించడము ఏమంత ప్రదర్శింపతగిన అంశము కాదు. అందుకు ఆమె పశ్చాత్తాపపడినట్లూ కనుపించదు, మీ రచనలో. ఈ సన్ని వేశాన్ని రేడియోలో ప్రదర్శించడము సాహస మవుతుందేమో" అన్నాను.

బుచ్చిబాబు ఏమీ అనలేదు. అతను నాతో ఎంతో కొంతైనా వాదిస్తాడేమో అనుకున్నాను - వాదన నాకు అట్టే అంత ఇష్టము లేకపోయినా. అసలు, నా మాటలు అతను వినినట్లే లేదు. కొంతసేపు ఊరుకుని, నిట్టూర్చి, అన్నాడు: "మీరన్నది నిజమే కావచ్చును," అని. అంతే! చెయిచాచి తన వ్రాతప్రతిని తీసుకుని వెళ్ళిపోబోయాడు. నేను అతనిని ఇంకాకాసేపు ఉంచి అతను రచించిన మరేవైనా నాటికలు ఉంటే, పంపమన్నాను. ఈమాటా ఆమాటా చెబుతూ కొంత కలుపుకోవాలని ప్రయత్నించాను. కానీ అతను ఎక్కువగా మాట్లాడలేదు, అప్పుడు.

అప్పుడు అతనూ అనుకోలేదు, నేనూ అనుకోలేదు, మరికొంత కాలానికి, అతనుకూడా రేడియోఉద్యోగి అవుతాడనీ, ఆ ఉద్యోగములో మేమిద్దరమూ మిక్కిలి స్నేహితుల మవుతామనీ!

....ఒకరోజున నేను నా బల్లవద్ద కూర్చుని ఆఫీస్‌పని చూచుకుంటూ ఉండగా నాసహోద్యోగి బుచ్చిబాబుకంఠస్వరంతో "సుబ్బులూ! ఇల్లా!" అనే మాటలు వినిపించి, నేను తలయెత్తి చూచేసరికి, బుచ్చిబాబు ఆతనిభార్య సుబ్బలక్ష్మమ్మగార్కి నన్ను పరిచయం చేస్తున్నాడు: "ఈయనే జానకిరామ్!" అంటూ.

ఆ నిమిషాన్ని నేను ఎన్నటికీ మరువలేను.

లేచినిలుచున్న నావేపు ఆ భార్యాభర్తలిద్దరూ ప్రసరించిన అనురాగవీచికలు ఇప్పటికీ తలుచుకున్నప్పుడల్లా ఒకముఖమల్ దుప్పటిలాగ నన్ను ఆవరించి కాపాడుతవి. అంతటి ఆప్యాయత స్ఫురించినది వారిద్దరి చూపులలోనూ "నీవు మావాడవు; మేమున్నాము - నీకేమీ ఫరవాలేదు!" అన్నట్లు. అప్పుడు నేను అనుకున్నాను నాలో: "ఎంతచక్కని దాంపత్యమును కూర్చాడు బ్రహ్మ! అనుకూల దాంపత్యమంటే ఇదేనేమో!" అని.

తరువాత, బుచ్చిబాబుకూ నాకూ మధ్య, సాహిత్యవిషయాలలో ఒక కొంత భేదాభిప్రాయము అప్పుడప్పుడు వస్తున్నా, చాలవరకు మా ఇద్దరి దృక్ప

థాలూ చాలా ఏకీభవిస్తూండేవి. మేము ఆప్తస్నేహితుల మయ్యాము. నాతో మిక్కిలి మనసిచ్చి మాట్లాడనారంభించాడు, అతను. నేనూ ఆతనిని తరుచు కలుసు కుంటూ, ఎటువంటి దాపరికమూ లేకుండా నా గురించి సర్వమూ చెప్పివేశాను, అతనితో. జీవితంలో నేను ఆశించిన ఆశలూ, నేను పొందే నిరాశా, నేను చేసిన పొరపాట్లూ, అంతా వివరించాను ఆతనితో. ఒకసారి అన్నాడు అతను: "నాకు తెలియనే తెలియదు మీ జీవితంలో ఇంత చరిత్ర ఉందని!" అని.

తదుపరి జీవితంలో కొన్నికొన్ని విశేషాలకుగాను నేను బుచ్చిబాబుకు మిక్కిలి బాధ్యుడనై ఉన్నాను. అందు ఒకటి: చిత్రరచనలో నాకు ఆసక్తీ నేర్పూ కలుగుట అతనిమూలాననే. ఆ రోజులలో అప్పటికే అతను మంచిమంచి బొమ్మలు చిత్రించేవాడు. ఒకరోజు ఆ ప్రస్తావనవచ్చి, అతను అన్నాడు నాతో "మీరుకూడా ప్రయత్నింపరాదా? చిత్రకళను గురించి మీకు చాలా తెలుసు. మీరు కాస్త ఎత్నిస్తే, మీరూ మంచిబొమ్మలు చిత్రిస్తారేమో" అని. మరునాడు, చిత్రరచ నకు కావలసిన కొన్నిపరికరాలనుతెచ్చి ఇస్తూ వానిని ఎలా ఉపయోగించాలో చెప్పాడు కూడా. ఆవిధంగా నేను ప్రారంభించిన చిత్రరచన నా జీవితానికే ఎంతో వన్నె తెచ్చింది.

రెండవ విషయము: బుచ్చిబాబే నాకు టి. ఎస్. ఎలియట్‌ను గురించి నిజంగా పరిచయము చేస్త. మానవునికీ మానవునికీ మధ్యఉన్న ఆప్యా యత ఇంకాఇంకాఎక్కువకావాలి, అని బుచ్చిబాబూ నేనూ అనుకుంటుండగానే ఒకపర్యాయం అతను అన్నాడు: "అన్నట్లు, ఈవిషయాన్నిగురించి టి. ఎస్. ఎలియట్ ఎంతో చక్కగా చెప్పాడు. మీరు ఎలియట్ రచన లేమైనా చది వారా?" అని.

నేను అంతకుముందే ఎలియట్‌ను గురించి కొంత వినిఉన్నాను. ఢిల్లీలో ఉండగా అందరి చేతులలోనూ ఎలియట్ రచనలే చూచి "ఇదేదో కొత్త ఫేషన్" అనుకొని, ఉదాసీనతతో ఆవైపు వెళ్ళలేదు నేను. బుచ్చిబాబు చెప్పాక, ఎలియట్ రచనలు ఒక్కొక్కటే శ్రద్ధతోచదివి, అవగాహనచేసుకో నారంభిం

చాను. ఇది ఒక గొప్పఅనుభూతి. ఎలియట్ రచనలద్వారా నాకెంతో జ్ఞానోదయమైనది. త్వరలోనే, ఎలియట్‌ను నేను ఆధునికులలో ఆదర్శ రచయితగానేకాక ఆదర్శపురుషునిగాకూడా పరిగణింప సాగాను. ఆ తర్వాత, ఒకసారి మహాత్ముని జన్మదినోత్సవ విశేషకార్యక్రమంగా "సత్యాన్వేషణ" అంటూ ఎలియట్ ప్రవచనలను ఆధారంగా మహాత్ముని సందేశమును విశదపరుస్తూ ఒక నాటికను వ్రాసి ప్రసారము చేశాను కూడా. మన ఉపనిషత్తులలో ఇమిడిఉన్న సత్యాలనే ఎంతో అందంగా ఎంతో నిపుణతతో నేటిపరిభాషలో చెప్పగల మహాకవి టి. ఎస్. ఎలియట్. కాబట్టి, నా కతనియందు అంతటి మక్కువ కలిగింది. ఇటువంటి మహాభాగ్యము నా జీవితములోకి రావడానికి కారకుడు బుచ్చిబాబు.

తరువాత ఒకనాడు, బుచ్చిబాబు తానురచిస్తూన్న ఒక క్రొత్త నవలను గురించి నాతో చెపుతూ కథావిషయము చెప్పి, "ఈ నారచనకు 'ఏకాంతము' అనే పేరు పెడదామనుకొంటున్నాను; మీ రేమంటారు?" అన్నాడు.

నే నన్నాను: "మీరు మీరచనలో జీవితపువిలువలను కొన్నిటినివివరంగా పరిశీలిస్తున్నారు. ఈకాలపు ఒకానొక యువకుని జీవితంలో కలిగే సమస్యలను వర్ణిస్తూ, కేవలమూ ఆదర్శజీవిఐన అతని ఆశలూ యత్నాలూ ఒక్కటీ ఫలింపకపోవడము చూపిస్తూన్నారు. అప్పుడు నాలాంటివానిలో వచ్చే ప్రశ్నఏమిటంటే: ఇట్టివిపరీతపు అన్వేషణలో, ఈ మహాయత్నములో చివరకు మిగిలేది ఏమిటి - అని. అంచేత మీనవలకు 'చివరకు మిగిలేది' అనేపేరు పెడితే బాగుంటుందేమో" అన్నాను, నేను.

నాసూచనను వెంటనే అంగీకరించాడు బుచ్చిబాబు.

రోజు రోజూ తనకథ ఎంతవరకు సాగినదీ నాకు చూపిస్తూండేవాడు బుచ్చిబాబు. మిక్కిలి ఆసక్తితో చదివి, నాకు తోచిన సూచనలను చేస్తూ ఉండేవాడను నేను. ఇందుకొన్ని ఆతనికి నచ్చేవి. ఆసూచనలను ఆమోదించేవాడు. తరుచు నావిమర్శ అతని శైలిని గురించి ఉండేది. "మీ భాష, లిపి - తెలుగైనా,

శైలి ఇంగ్లీష్‌శైలిలా ఉంటుంది. మాఅందరికంటే ఎక్కువగా, మీరు ఇంగ్లీష్‌లోనే ఆలోచిస్తూ ఉంటారు; అందువలననే ఇంగ్లీష్‌తీరున ఉంటుంది, మీరచన," అనేవాడను.

కాని, కొన్నికొన్ని చోట్ల, 'చివరకు మిగిలేది.' నవలలో వచనము పద్యమంత అందంగానూ ఉంటుంది.

"కన్నీటితో గడ్డిపోచలు తడిసినవి. ప్రాణానికి ఎట్టివిలువ ఉంది? గడ్డిపోచకు ఎంతో, అంతే!

....సముద్రాలను సహితం ఇముడ్చుకున్న కన్నీటిబిందు; ఆకాశాన్ని ముంచివేసే కన్నీరు, ఆనందంతో ఉబికిపోతోంది....

....కోమలి కనుబొమ్మలో కోపం పెదవుల మీదికి దిగజారి, నవ్వుకోసం బుగ్గలు ఆశ్చర్యంతో కదిపింది.

....అతనిదగ్గరకెళ్ళి, తలవంచి అతని రెండు కళ్ళల్లోకి చూచింది. నీళ్ళకు బదులు, రక్తం పోసి పెంచిన రోజాపుష్పంలా కనిపించింది ఆమె మొహం! —

....అట్లా గడ్డిపోచలమధ్య గంతులేస్తూ ఆకాశాన్నీ భూమినీ బుజ్జగిస్తూ, స్నేహం చేసుకుంటూ ఉండవలసిన వ్యక్తి కోమలి! ....ఆకలి దాహాలు లేని అయోమయపు ఆశ, దారుణాలు ఎరుగని దైవత్వం, హద్దులు లేని అనుభవం ఆమె.

....పరిమళం బరువుకి, ఒత్తిడికి తట్టుకోలేక ఊడిపడిపోయిన అడవి పువ్వు; పర్వతశిఖరాల్నుంచి జారి విడిపోయిన మంచుముద్దలోని నిర్మలత్వం; నిశీథిలో సృష్టి వేసుకున్న మంటలో నడిజ్వాల; అర్ధరాత్రి, జీవులుకన్న స్వప్నంలోని మూగబాధ....

## సాగుతున్న యాత్ర

....ఆనాడు సౌందర్యం తనయాత్రను ముగించుకొని పన్యశిస్తోంది!"

ఈ తరము నవలల్లో అతిముఖ్యస్థానాన్ని అలంకరిస్తుంది బుచ్చిబాబు రచించిన 'చివరకు మిగిలేది' అనే నవల! ఈ నవలలో ప్రధాన వ్యక్తులు ఇద్దరే ఐనా తతిమ్మా వారున్నూ ఒక్కొక్కరు ఒక్కొక్క విశిష్టస్వరూపాన్ని ప్రతి బింబిస్తారు. అందువలన, నవలకు ఒకగొప్ప పరిపూర్ణత కలుగుతుంది. కథా సంవిధానము కంటే మానసిక ప్రవృత్తీ పరిశీలన ఎక్కువ, ఈ నవలలో. అడు గడగునకూ ఆత్మపరిశోధనే. చివరకున్నూ విపరీతపు ఆత్మపరిశోధనే! కథా నాయకుడు దయానిధి అనుకుంటాడు ఆఖరున: "తను సంఘాన్ని మార్చలేడు; మనుష్యుని మార్చలేడు; మారిస్తే బాధ, పగ, యుద్ధం. తనతోతాను సమాధాన పడాలి. అది ఈనాటికి సాధించాడు. ఒక ప్రశాంతత, మహత్తరమైన ఆనందం అతనిలో ఉద్భవించింది. అది బాహ్యప్రపంచంలో లేదు. మంటనిపల్లార్చే మంచుకణాల ప్రవాహం అతని హృదయం" అని.

కొన్ని నవలలు అతి పలుచని ఉత్తరీయము కప్పిన ఆత్మకథలు అంటారు, సూక్ష్మదృష్టితో పరిశీలించే విమర్శకులు. చిత్రమేమిటంటే, 'చివరకు మిగిలేది' ఎంతవరకు బుచ్చిబాబు ఆత్మకథో చెప్పలేను, నేను; కాని, నవలాంత ములో నిధి అనుకున్న ఆమాటలు పూర్తిగా నాకే వర్తిస్తాయి అనుకుంటూ ఉంటాను, నేను. ఇల్లాగే, "ఈ నవలను గురించి ఊహించే రోజులలో బుచ్చి బాబుకు నాపరిచయం లేకపోయినా నన్ను ఎంత గొప్పగా చిత్రించాడు బుచ్చి బాబు, తన నవలలో!" అనుకుంటూ ఉంటాను నేను, ఆ నవల ప్రతిపేజీలోనూ!

ఎటొచ్చీ, బుచ్చిబాబు దయానిధి మాటలుగా అనిన: "మంటను చల్లార్చే మంచుకణాల ప్రవాహం నాహృదయం!!" అనలేను నేను, నన్ను గురించి, ఇంకా;—అలా అనాలి, నిజంగా, అనే ఆరాటం, ఎంతో, నాలో ఉన్నా.

## ౨౨

ఇదిగో! ఇంకా నిద్రలేవని
మంచుతడి ఆరని పారిజాతాలు!!
ఈ ధవళిమ నా భావాల స్వచ్ఛత,
ఈ ఎరుపు నా అనురాగపు రక్తిమ,
ఈ పరిమళము మన స్నేహసౌరభము!!
అందుకోవూ!
నీ వెక్కడున్నా నీవద్దకే వస్తాను -
భిక్షాపాత్రతోగాని,
నవరత్నాలుకూర్చిన కంఠమాలతోగాని!

జానకిరామ్

సత్యవోలు కామేశ్వరరావుతో నా స్నేహము మిక్కిలి ఆర్ద్రవంతమైన మధురస్మృతి. అతను నా జీవితములో అడుగుపెట్టిన రోజును పండుగరోజుగా భావిస్తాను, నేను, ఇప్పటికీ!

ఆవేళ దుర్గాబాయ్ పినతల్లికూతురు లలితాబాయ్‌గారి ఇంటికి వెళ్లాను నేను. లలిత నాకు కబురుచేశారు: "మాఅన్నయ్య మీకథ 'మీరు నవ్వరేమి?' వినాలంటున్నాడు, నాకూ మరోపర్యాయం వినాలని ఉన్నది. మాఇంటికి మీరు ఎప్పుడూ రాలేదు. ఒకసారి వస్తారా?" అని. కబురు అందుకుని, నేను వెళ్లాను వారి ఇంటికి. అవతల కచేరీసావడిలో వాళ్ళ అన్నయ్య ఏదో చదువుకుంటున్నారు.

## సాగుతున్న యాత్ర

నేను గుమ్మంలో అడుగుపెట్టేసరికి, లలిత అద్దముముందు నిలుచుని బొట్టు పెట్టుకోబోతూ బజారునుంచి తెచ్చిన మంగుహారు కుంకుమపొట్లాన్ని విప్పి ఆ కుంకాన్ని వెండిభరిణలో పొయ్యబోతున్నారు. అద్దంలో, ఆమెవెనుక నా ముఖముచూచి, "వచ్చారా!" అంటూ, ఇటు తిరుగుతూ చేతిలోని కుంఖంపొట్లాన్ని క్రిందికి జారవిడిచారు, ఆమె.

"అయ్యో!" అంటున్నాను, నేను, నేలకు రాలిన కుంఖంకేసి చూస్తూ.

అప్పుడు, శృంగారమేజాకు ఒకప్రక్కన నిలుచుని ఏదో చదువుతున్న ఒక ఇరవైఏళ్ళ అబ్బాయి, స్ఫురద్రూపి, చటుక్కున భూమికివంగి, కుంఖాన్ని అంతా తీసి వెండిభరిణలో ఉంచసాగాడు.

"నామూలాననే జరిగింది; అయామ్ వెరిసారీ!" అన్నాను, నేను.

లలిత అతనికి నన్ను పరిచయం చేశారు : "ఇతనే కామేశ్వరరావు, నిన్ననే కాకినాడనుంచి వచ్చాడు, ఈఊళ్ళో, చరిత్రలో పరిశోధన చెయ్యడానికి," అంటూ. కామేశ్వరరావు ఎమ్. ఏ. ప్యాసై డాక్టరేట్‌కి చదువడానికి ఈ ఊరు వచ్చాడు.

నా చేతిని చాచి అతని కుంకుమచేతిని నాచేతిలోకి తీసుకున్నాను. మా ఇద్దరిచేతులూ ఇన్నేళ్ళూ అలాగే కలిసిఉండిపోయాయి.

అతను ఇప్పుడు పెద్ద సర్కార్ ఉద్యోగి. రోజూ బల్లమీదికి ప్రోగైన బండెడు అర్జంట్ ఆఫీస్‌కాగితాలతో అతనికి తీరిక ఉండదు, స్నేహితులకు ఉత్తరాలు వ్రాయడానికి. ఐనా, నాచేతినిమాత్రము వీడలేదు, అతను.

....తరువాత, ప్రతిరోజూ కలసి కొనేవారము మేము - ఒకొక్కప్పుడు రోజుకు రెండు, మూడు పర్యాయాలున్నూ.

## సాగుతున్న యాత్ర

నేను ఆరోజులలో ఆఫీస్‌లో రాత్రి చాలాసేపటివరకూ పనిచేస్తూ ఉండి పోయేవాడను. అతను ఏ సాయంత్రపువేళనో మా ఆఫీస్‌కువచ్చి అలా నా ఎదుటనే కూర్చొని ఉండిపోయేవాడు. నేను నా ఆఫీస్‌పని చూచుకుంటూనే అతనితో మాట్లాడుతూండేవాడను. కాదంబరినిగురించీ, కుందమాలనుగురించీ, మేఘసందేశాన్ని గురించీ.

అతను సంస్కృతంలో ఎమ్. ఏ. ప్యాసైయ్యాడు. అతని తాతగారు గొప్ప పండితులు. ఆయన కాదంబరికి చక్కనివ్యాఖ్య వ్రాశారు. కావ్యవిషయాలనుగురించి కామేశ్వరరావుకు తెలియనిఅంశము లేదు.

మా పరిచయమైన కొద్దిరోజులలోనే అంతవరకూ నేను రచించిన రచనలన్నీ చదివాడు కామేశ్వరరావు. దానికితోడు, రాత్రింబవళ్ళు నాకథ వినేవాడు, నేను చెప్పగా. అప్పటి నా శిథిలజీవితములోని విషాదాన్ని పూర్తిగా పంచుకున్నాడు, నాతో, కామేశ్వరరావు.

తనకథా చెప్పాడు, నాతో, అతను : ఎంతో అందమైన ఫలశ్రుతిని పొందవలసిన అతని ప్రేమగాథ. కాని, ఎక్కడో, ఎవరో పొరపాటు చేయడమువల్ల - అంటే, అవసరమైన నిమిషాన ఉదాసీనత చూపడమువల్ల - అలా జరుగలేదు. నాలాగుననే అతనికీ ఒక స్వర్ణసీత.

ఆ రోజులలోనే నేను 'స్వర్ణసీత' వ్రాశాను:

స్వర్ణసీత ఒక ఆరాధన; అనుభవ పరంపర,
స్వర్ణసీత.
...స్వర్ణసీత ఒక తీరనికోరిక; ఒక ఎడతెగని
అన్వేషణ.
ఒక అంతమేలేని ఆవేదన స్వర్ణసీత!

అంటూ.

## సాగుతున్న యాత్ర

కామేశ్వరరావు వ్రాశాడు, నారచనకంటె అందమైన రచన, తన స్వర్ణసీతను. అతనికున్న సంస్కృత భాషాజ్ఞానంవల్ల అతనిరచన మరింత ప్రౌఢంగాకూడా కుదిరింది. అతని తెలుగూ చాలా బాగుంటుంది. కొన్నాళ్ళ తర్వాత, అతను 'నెలవంకసాక్షిగా' అంటూ మరీ అందమైన రచన రచించాడు. నెలవంకతో ప్రారంభించి, పౌర్ణమీ రాత్రివరకూ రోజుకో గాథ - ఆ ప్రేమగాథల సంపుటి, ఆ రచన, చాలా ఆర్ద్రమైనది.

సమకాలిక పాశ్చాత్యరచయితలను గురించిన్నీ చాలాచాలా ముచ్చటించుకునేవారము మేము. ఆ రోజులలో నేను చార్లెస్ మార్గన్ రచించిన 'ది వాయేజ్' అనే గొప్పనవలను చదువుతూండేవాడను. మానవజీవితాన్ని అంతులేని ఒక పడవప్రయాణముతో పోలుస్తాడు మార్గన్, జీవితపువిలువలను మిక్కిలి నిపుణతతో విశదపరుస్తూ. ఈ నవలనుగురించి చాలా ఎక్కువగా మాట్లాడుకునేవారము మేము. తరువాత అతను తాను చదివిన 'ఫాంటెన్' అనే నవలను గురించి చెప్పాడు, నాతో, చాలా.

మా మాటల సందర్భంలో నేను కామేశ్వరరావుతో ఎవరైనా ఒక రచయితను గురించి కొంచెము ఎక్కువగా చెప్పితే మరునాడు అతను నన్ను కలుసుకునే లోపల అతను ఆ రచయితను గురించి పూర్తిగా తెలుసుకోవడమే గాకుండా, ఆ రచయిత రచించిన సరిక్రొత్త పుస్తకాన్ని కొని తెచ్చిఇచ్చేవాడు నాకు, కామేశ్వరరావు.

ప్రతిరోజూ నన్ను ప్రశ్నించేవాడు కామేశ్వరరావు 'ఏమైనా క్రొత్త రచనవ్రాశారా!' అని.

ఒక రోజున అన్నాను: "ఆ! ఇదుగో!! 'ఇంతటి త్యాగమా'! అనే క్రొత్తరచన. ఇది ఇదివరకు నీవు చదివిన నా తోటమాలి కథకు పర్యవసానము" అంటూ చదువసాగాను. నాక్రొత్తరచనను:

## సాగుతున్న యాత్ర

"చంద్రునిలోని మచ్చ అల్లా వెండిపళ్ళెమంతా వ్యాపించిపోయిన ఆ రాత్రిని ఎన్నటికినీ మరువలేదు తోటమాలి. సెలయేటి ఇసుక తిన్నెలలో, పిచ్చుకగూళ్లను కట్టుకుంటూ ఆడుకుంటూండగా, రాజకుమార్తె తన వ్రేలిని తొడిగిన వజ్రపుటుంగరము, ఎంతమరచిపోవాలన్నా ఆమెను మరచిపోనియ్యదు," - అంటూ ప్రారంభించింది కథ.

పెద్దమాలి చాలా ప్రయత్నిస్తాడు. కొడుకును ఎల్లాగైనా మన ప్రపంచములోకి మరల్పడానికి; కాని, లాభంలేదు. కొడుకు పలుకడు. నిట్టూర్పు ఐనా లేదు. గంటల తరబడి వజ్రపుటుంగరములోకి అల్లాగేచూస్తూ ఉండిపోతాడు తోటమాలి....కాలమే మాన్పాలి ఈగాయాన్ని!

ఉన్నట్టుండి, ఒకనాడు తోటమాలికి, ఏదో స్ఫురించి, అతను చటుక్కునలేచి, గంగగోవును పాలుపితికాక, తోట త్రవ్వడము ప్రారంభిస్తాడు. మిట్ట మధ్యాహ్నము ఒక అరగడియసేపు విశ్రమించాడో ఏమో అంతే! - ప్రొద్దు గ్రుంకేసరికి, పూలమొక్కలన్నీ త్రవ్వివేస్తాడు తోటమాలి. ఒక్క మొక్కైనా ఉండదు, ఇక, తోటలో!

"మాలతీతీగవద్ద మాత్రం, ఒక్కక్షణం అనుమానిస్తాడు. ఎంతో ప్రయత్నాన, ఆవేళ, మామిడిమొక్కపైకి రాజకుమార్తే తనూకలిసి ఎక్కించిన తీగ. ఆకాస్తపనికే అలసిపోయింది, ఆమె....ఒక్కదెబ్బతో తెగిపోయింది, తీగ. ఒక్క గునపపుపోటుతో పెల్లగిలి వచ్చింది, వేరు.

....మళ్లా పున్నమ్మ వచ్చేసరికి, తోటంతా పువ్వులతో నిండిపోతుంది. అన్నీ ఎర్రటిపువ్వులే, ఏవంక చూచినా ఎర్రటిపువ్వులే! అదీ, అప్పుడు తగిలిన గాయములోంచి ద్రవించే రక్తపు ఎరుపు!

ఆ నదీగర్భంలో ఒక చలువరాతి మందిరాన్ని నిర్మిస్తాడు తోటమాలి. ఆమందిరంలో "రత్నఖచితమైన ఆమెగాజుల మ్రోతను వింటూనే నిర్మిస్తాడు తోటమాలి ఆమెలాంటి ప్రతిమనే....వాడి, నేలకు వాలిన తీగను పైకిఎత్తుతూ

ఆమె చూపిన అలసత్వాన్ని తలుచుకుంటూనే చెక్కుతాడు ఆమె నేత్రాలను.... మొట్టమొదటిసారి వాగులోని నీటిని తనదోసిలిలోంచి రుచిచూస్తూ 'ఎంతతియ్యగా ఉన్నాయి!' అనిన ఆమెనోటిని చూస్తూనే దిద్దుతాడు చలువరాతి పెదవులను.

తోటమాలి తీయనికలలన్నీ రూపుదాల్చి వెలసినది, ఆ చలువరాతి ప్రతిమ - ప్రతిమకాదు, హృదయాన్ని చీల్చుకువచ్చిన పాట!

ఉదయాస్తమాన సమయాలలోనూ, మధ్యాహ్నమూ ఆ ప్రతిమముందు నిలుబడి, తన భగ్నహృదయ వినిర్గత శోకగీతమే ఆలాపిస్తూ ఆరాధిస్తాడు ఆ వ్యర్థప్రేమికుడు.

తోటలోని తామరపువ్వులకోసం వచ్చిన పరిచారిక చంపకం చూస్తుంది, ఒకనాడు, ఆమందిరాన్నీ, ఆ పూజారినీ.

మరునాడు, ఊరు ఊరంతా సాటిపోతుంది: లోయతోటలోని వాగులో చలువరాతి మందిరంలో తోటమాలి పూజచేసే దేవతావిగ్రహము రాజకుమార్తే - రాజకుమార్తే! అని.

తోటను చూడవలెననే మిషమీద అక్కడకు వచ్చిన రాజమాతను ముసలిమాలి, కొడుకును గురించి కొండంత బెంగతో, ఆహ్వానిస్తాడు. పెద్దమాలిని తమపూజకోసం తామర పువ్వులు తెమ్మనే నెపాన పంపివేసి, రాజమాత వాగులోని మందిరం వైపు నడుస్తుంది.

దూరాన్నుంచే ఆమెరాకను గమనించిన తోటమాలి చరచరా నడుస్తాడు మందిరంవైపు.

రాజమాత ప్రవేసింపరాని స్థలంలేదు. కాని, ఈ మందిరపు మెట్లు ఎక్కడానికి ఎంతో సందేహించింది, రాజమాత.

ఒక్కొక్క అడుగుకూ గంపెడంత ధైర్యం కావలసివచ్చింది....

ఎంత అద్భుతమైన నగిషీపని! నిజంగా దేవతలే చెక్కారు. ఈమకర తోరణాలు!! మందిరంలో ప్రవేశించింది, రాజమాత, వణికే గుండెలను చేతితో అదుముకుంటూ.

పైనున్న గవాక్షమునుంచి రెండు జంటకిరణాలు వెలుతురు బాణాలులా వేదికపై ప్రసరిస్తున్నాయి. ఆ వెలుతురుకు ఒక్కక్షణం కళ్ళుమూసుకుంది రాజమాత!....

కళ్ళువిప్పి, చూచింది, రాజమాత.

వేదికపైన ప్రతిమలేదు!

జీవకళ ఉట్టిపడుతోంది అనుకున్న తనకూతురి విగ్రహంలేదు!!

విగ్రహము ఉండవలసినచోట గుండ్రనికాంతిలో ఉన్నవి, రెండు దోసిళ్ళ పారిజాతపు పువ్వులు.

దగ్గరకు వెళ్ళిచూచింది, రాజమాత.

తెల్లటి రేకలపైన మంచుముత్యాలు - వేయికన్నీటి చుక్కలు. పారిజాతపు గొట్టాలన్నీ ఆమె కేసే చూస్తున్నాయి - వేయి ఎర్రని సూది మొనలలాగ! ఎర్రని సూదిమొనలలలాగ !!

రాజమాత పెదవులు అదరినవి.

"ఇంతటి త్యాగమా!....ఇంతటి త్యాగమా!!" అన్నది రాజమాత - అని, నాకథ ముగించాను నేను.

మరెదో ప్రపంచంలోంచి భూమికి దిగివచ్చినట్టు, కళ్ళుతెరచి, కామేశ్వరరావు అన్నాడు నాతో! "రాజామాతనుకాదు; నన్ను గ్రుచ్చుకున్నాయి ఎర్రని సూదిమొనలలాగ ఆపారిజాతపు గొట్టాలు! అబ్బ! ఎలా వ్రాయకలిగారండీ ఈ కథను!" అని,

ఈ నిస్పృహను పొగొట్టుకోడానికి ఏమార్గమూ కనిపింపలేదు, నాకు. ఎంతవరకనీ నా ఉద్యోగపుపనిలో లీనమైపోవడము! అందుకూ ఒక మితి అంటూ ఉంటుంది, కూడా.

ఒకరోజు, మరీ పిచ్చిఎత్తినట్లుఐతే, ఆలా పార్థసారథిగుడికి వెళ్ళాను గుడిలో దేవీవిగ్రహము ఎలా ఉంటుందో చూచివద్దామని.

ఆశ్చర్యం! శ్రీరంగంలో నేను చూస్తూవచ్చిన శ్రీ రంగనాయకి విగ్రహ మంత అందంగానూ ఉన్నది, ఇచ్చటి వేదవల్లి విగ్రహము, మరింత సుకుమారంగా ఉన్నది కూడా, శిల్పము. ఆలా హృదయంలో నిలచిపోయినవి వేదవల్లి స్వరూపమూ, ఆదేవి దివ్యనామాక్షరాలూను.

నే తెచ్చిన గులాబీమాలలు దేవిమెళ్లో సంతరిస్తుంటే, వేదవల్లి చిరునవ్వు నవ్వినట్లనిపించింది. ఆ చిరునవ్వు ఏవేవో జ్ఞాపకాలను తెచ్చింది - 'ఆమె' చిరునవ్వు వేదవల్లి చిరునవ్వులాగే ఉంటుంది!

అప్పటినుంచీ ప్రతి శుక్రవారమూ సజ్జనిండా గులాబీపువ్వులతో ప్రత్యక్షమయ్యేవాడను, దేవిముందు. వేదవల్లితో చెప్పుకునేవాడను, ఇతరు లెవ్వరితోనూ చెప్పుకోలేని మాటలను, నా గాయపడినహృదయగాథను. ఎంత ఓపికతో వినేది, ఆదేవి!

నా బసలో, పూజామందిరంలో, అందమైన చిన్న ఇత్తడి సెమ్మెను అమర్చి, ఆరని జ్యోతిని వెలిగించుకున్నాను. ఆజ్యోతిని చూస్తూ అట్టే ఉండిపోయేవాడను, ఎంతోసేపు.

*　　　*　　　*　　　*

....నాకు ప్రమోషన్ వచ్చింది.!

ఇది, లోకచారరీతిని, ఎంతో దొడ్డవిషయము!!

కాని, ఎవరితో చెప్పుకోను, ఈ గొప్ప? ఎవరైతే అతిముఖ్యంగా వినాలో ఎవరైతే నా జీవిత సౌభాగ్యాన్ని నాతో పంచుకోవాలో వారిని నేను చూడనైనా చూడరాదు. ఉత్తరప్రత్యుత్తరాలే కరువైనవి....ఆజ్యోతినిచూస్తూ, పల్లించాను, పదిసార్లు, ఇరవైసార్లు: "నా జీవితములో ఎటువంటి శుభములు కలిగినా, అవి నీమూలాననే నీమూలాననే!" - అంటూ.

పని ఉండి, ఆఫీస్‌కి వెళ్ళగా, మా డైరక్టర్ గోపాలన్ అన్నారు: "నీకోసమే కనిపెట్టుకున్నాను, శ్రీమతి కాంతారావ్ డ్యాన్స్‌కు వెళ్ళాలి మనము," అని.

డ్యాన్స్‌నుంచి, తిన్నగా వారింటికి తీసుకువెళ్ళారు నన్ను గోపాలన్, "ఈపూట మాఇంట్లోనే భోంచేద్దువుగాని, నువ్వు!" అని.

భోంచేస్తూంటే అన్నారు, ఆయన, ఆయన భార్యతో: "మన జానకి రామ్‌కి ప్రమోషన్ వచ్చింది, తెలుసా!" అని. మూర్తీభవించిన సౌజన్యరాశి, ఆమె, అన్నారు: "అయ్యో! ఒక్కమాట ఫోన్‌లో చెప్పలేకపోయారా, పరమాన్నమైనా చేసేదాన్ని! అని. మా అమ్మ జ్ఞాపకం వచ్చింది, నాకు.

....ఇన్నేళ్ళుఐనా, పరమాన్నమును రుచిచూచినపుడల్లా, గోపాలన్ భార్య, ఆ సాధ్వీమతల్లి, జ్ఞప్తికి వస్తూంటారు, నాకు.

కాని, అంత మంచిమనిషి నడువడానికి ఈలోకము తగదని, దేవుడు ఆమెను తీసుకు వెళ్ళిపోయాడు, తనవద్దకు, మరికొన్ని నెలలలోనే. మా అమ్మ చనిపోయిన జబ్బువల్లనే, ఆమె చనిపోయారు - ధన్వంత్రులవంటి వైద్యులు విశ్వప్రయత్నము చేసినా, ఫలింపక. ఆమె భౌతికదేహము పంచభూతములతో కలసిపోతుండగా నేను ఉన్నాను, అక్కడ.

ఎలా భరింపగలిగారో గోపాలన్, ఈ దారుణవియోగాన్ని! వారిద్దరూ సాధారణ భార్యాభర్తలు గారు. వారి జీవితములో ప్రతినిమిషమూ వారు కలసి జీవించేవారు. 'కరము కరమున గీలించి, కలసిమెలసి మనిన సహధర్మచారిణి, మధురమధురమూర్తి, ప్రియురాలు, సఖురాలు, పూర్ణరాగకలిత.' ఆమె. అతని బహిర్ప్రాణము! ఆ ప్రాణమే పోయినప్పుడు ఆయన ఎలా బ్రతుకకలిగాడో - ఎంతటి ధైర్యం కావాలి!!

ఆయన మహాయోగి అనుకున్నాను, నేను - లోకాచారరీత్యా పదకొండురోజులు సెలవుమీద ఉండి, పన్నెండవరోజున, ఎప్పటిలా ఉదయమే ఆఫీస్‌వేళకు ముందుగానే, రేడియోనిలయములో ఆయన నవ్వుముఖము కనిపించేసరికి. ఏమీ జరుగనట్లు, నిన్నరాత్రి ప్రసారమైన విశేషకార్యక్రమాన్ని గురించి ప్రశ్నించారు నన్ను, గోపాలన్!....అంతటి ధీరస్వభావము నాకెప్పటికన్నా అలవడుతుందా?

ఆఫీస్‌లో అన్నిపనులూ ఎథావిధిగా జరుగవలసినదే! ప్రతి చిన్న అంశమునుగురించీ గోపాలన్ పాటింపవలసినదే. గ్రామఫోన్‌రికార్డ్ వినిపించడములో రవంత అపస్వరము తోచినా, వెంటనే, టెలిఫోన్‌లో పిలుపు - ఇంటివద్దనుంచో ఆఫీస్‌నుంచో "ఏమైనది?" అంటూ, గోపాలన్.

ఆరోజులలో ఆఫీస్‌లో ఆయనకు తెలియకుండా జరిగిన ఒకానొక అన్యాయాన్ని గురించి నేను చాలా బాధపడుతూండగా గోపాలన్ అన్నారు, నాతో: "ఎంత పిచ్చివాడవు, నీవు! తన జీవితమే సత్యసాధనకోసము ధారపోసిన గాంధియే మనుష్యులనైజాన్ని మార్చలేకపోయాడు!! ఇక, నీవూ నేనూనా, మార్చేది?" అని. మార్చలేమేమో మరి.

* * * *

నన్ను ట్రెయినింగ్‌కు బొంబాయి వెళ్ళమన్నారు. కామేశ్వరరావు నన్ను రైలు ఎక్కించాడు.

బొంబాయిలో ఆ పదిరోజులూ చాలా ఉల్లాసంగా గడచినవి. ఎన్నాళ్ళనుంచో చూడాలనుకున్న బొంబాయి రేడియో దినకర్‌రావ్ సంగీతనిర్వహణాప్రతిభనుచూచి చాలా ఆనందింపకలిగాను. అతను గొప్ప ప్రజ్ఞావంతుడు. ఆ రోజున జయజయవంతి రాగంలో ఒక క్రొత్తకృతిని తన వాద్యబృందముచేత రికార్డ్ చేయించాడు అతను నాకోసము. వాద్యసమ్మేళనాన్ని అతి నిపుణతతో నిర్వహిస్తూనే తన వేణుగానముతో అద్భుతమైన రూపకల్పన చేయకల కళాశీలి దినకర్‌రావ్. జయజయవంతి రాగము చాలా గొప్పగా ఉంటుంది.

ఆప్తస్నేహితుడు డాక్టర్ భానూరాయ్‌శుక్లా ఇంట్లోనే నా బస. మళ్లా, ప్రభాబెన్‌తో ఎడతెగని మాటలు. పూర్వస్నేహితులనందరినీ మళ్లా కలుసుకున్నాను. ఇదివరకు ఒక పన్నెండేళ్ళక్రితము, ఎలాఉన్నారో అల్లాగే ఉన్నారు, ఏమీ మార్పులేదు. అదే ఆప్యాయత, అదే సౌజన్యము.

* * * *

ముఖ్యంగా, లక్షాధికారి రసిక్‌లాల్‌జవేరీ అతనిభార్య కుసుమ్‌బెన్నూ. కుసుమ్ అతి సుకుమారి. నేను అంటూఉండేవాడను, వారితో, "మా కాశీమజిలీ

కథలలో రాజకుమార్తె ఏడుమల్లెపువ్వుల ఎత్తే - కుసుమ్ ఒక్క మల్లెపువ్వు ఎత్తే ఏమో!" అని. ఆమె కిలకిలా నవ్వేది. ఒకసారి, భోజనాలయ్యాక, "కుసుమ్ నీకు తన నగలను అన్నిటినీ చూపించాలంటోంది. నీవు కళాశీలివిగా, రా!" అంటూ తమ పడకగదితోకి తీసుకువెళ్లాడు నన్ను, రసిక్‌లాల్. మల్లెపువ్వు లాంటి చిరునవ్వుతో ఒక్కొక్కనగా చూపించింది నాకు కుసుమ్: "ఇది చంద్ర హారము; ఇది ముత్యాలపేరు; ఇది పచ్చల పతకము - ఇవన్నీ మా పుట్టింటివారు నాకు ఇచ్చినవి" అంటూ. వారి పురాతనరీతి నగలు అచ్చంగా మనప్రాంతపు క్షత్రియస్త్రీలు అలంకరించుకునే నగలలా ఉంటవి : చామంతిపువ్వు; రాగిడీ; నాగ రము; బావిలీలు; నత్తు; అడ్డబాస; దండకడియములు; వంకీలు. "ఇవన్నీ మా పుట్టింటివారిచ్చినవే!" అంటూ గర్వంగా చెప్పింది నాతో, మళ్లా, కుసుమ్, భర్త కేసి కొంటెగా చూస్తూ.

రసిక్‌లాల్ నవ్వుతూ అన్నాడు ఆమెతో : "నీ ఏడువారాల సొమ్ములు చూపవేమి" అని. "అవి వీరిచ్చినవి! అందుకే అంత ఆసక్తి!!" అంటూ, తన ఏడువారాలసొమ్ములూ చూపించింది,కుసుమ్ ఒకొక్కరోజుకూ వేరువేరుగా అమ ర్చిన సందుగాలలోంచి తీస్తూ. నేను నవ్వుతూ అన్నాను : "మీకు వేరే క్యాలెం డర్ అక్కరలేదు. ఇవ్వాళ గజ్జలవడ్డాణము పెట్టుకున్నాముగనుక, ఇవ్వాళ శుక్ర వారం! - అనవచ్చు. అంతేనా!" అని. ఇన్ని చిన్ని ముత్యపుచిప్పలు కలబోసి నట్లు కిలకిలా నవ్వింది. కుసుమ్. ఆ నవ్వు ఈ నిమిషమూ ప్రతిధ్వనిస్తోంది, నా హృదయంలో.

నేను వచ్చివేస్తూంటే స్టేషన్‌కి వచ్చారు, వారిద్దరూను. రైలు కదల బోతూంటే నేను అడిగాను వారిని : "మా ఊరినుంచి ఏమి పంపను మీకు?" అని. అతను ఆమెకేసి చూశాడు ఏమంటుందో అని. కుసుమ్‌బెన్ అన్నది : "నాకు ఆంధ్రాఖద్దరు చాలా ఇష్టము. పంపడముకాదు; నీవే స్వయంగా తీసుకు రావాలి, పొందూరు ఖద్దరుచీర - ఐదుగజాల చీర చాలు నాకు, నీవే తీసుకు రావాలి, త్వరలోనే, నాకోసము!" అని.

నేను మళ్లా బొంబాయ్ వెళ్ళలేదు. వెళ్ళితేమాత్రము తప్పకుండా తీసుకువెళతాను పొందూరు ఖద్దరుచీర కుసుమ్‌బెన్ కోసము.

## సాగుతున్న యాత్ర

మద్రాస్‌కు తిరిగివచ్చిన కొన్నినెలలకే, నాకు, మళ్లా, ఢిల్లీకి ట్రాన్స్‌ఫర్ అన్నారు. నేను గోపాలన్‌తో అన్నాను : "ఇక్కడ ఏవేవో పనులను నెత్తిమీద పెట్టుకున్నాను. ఇవన్నీ వదలి వెళ్ళవలసినదేనా? ఢిల్లీలో ఆ శాఖలో తెలుగు కార్యక్రమాలులేవు, నేను అంతదూరం వెళ్ళడం వృథా!" అని. గోపాలన్ అన్నారు ముక్తసరిగా : "ఏమైతేనేమి - నీవు ప్రస్తుతం ఈ వాతావరణంనుంచి కొన్నాళ్ళు బైటకువెళ్ళడమే మంచిదేమో!" అని.

ఇక నాలుగైదురోజులలో నా ప్రయాణమనగా ఒకరోజు సాయంత్రం నేను ఆఫీస్‌పని చూచుకుంటూండగా నా గదిలోకి మా నాన్నగారు వచ్చారు.

ఆఫీస్‌పనిలో మునిగిఉన్న నన్ను చూచి నాన్నగారు అన్నారు : "ఏమీ లేదు; ఈ త్రోవనే షికారు వెళుతూ నీవు ఆఫీస్‌లోనే ఉంటావని తెలిసి, చూచి వెళదామని వచ్చాను. అన్నట్టు, నీకు ప్రమోషన్ లభించిందటగా! కులాసాగా ఉన్నావా, ఆరోగ్యం బాగున్నదా?" అని.

ఇంకా వివరంగా ప్రశ్నించారు నన్నుగురించి నాన్నగారు.

నేను నామనస్సులో ఉన్న వ్యథను ఉండబట్టుకోలేక. సర్వమూ చెప్పాను, ఆయనతో - నాలుగేళ్ళక్రితము నన్ను పూర్తిగా పెనవేసుకునిపోయిన స్నేహలతవిషయమూ, ఆ తీగ పుటుక్కుమని తెగినా, నలుసంతపట్టు ఉన్నదనే దృఢవిశ్వాసమే నన్ను బ్రతుకనిస్తూన్న విషయమూ. మా నాయనగారు వారిని బాగా ఎరుగుదురు; ఆయన కలుగజేసుకుంటే నా ఈప్సితము నెరవేరుతుంది, తప్పక, అన్నాను, అయనతో.

నాన్నగారు ఒక్కమాటే అన్నారు: "ఇందు మనము చేయవలసినది ఏమీలేదు; ఆమె గట్టిగా తలచుకుంటే, ఈ నిమిషాన నీముందు వ్రాలగలదు! ఆమెకుతోస్తే, ప్రపంచంలో ఏశక్తీ అడ్డగించలేదు, ఆమెను!!" అని.

....ఢిల్లీకి బయలుదేరుతూ ఒక ఉత్తరంవ్రాసి పోస్ట్‌చేశాను: "నేను చాలాదూరం వెళుతున్నాను. నేను నీకు అవసరమని తోస్తే నన్ను పిలు. ఫలానా చోట ఉంటాను" అంటూ. నాలుగేళ్ల ఉత్తరప్రత్యుత్తరాలు లేకపోయినా తెగించి వ్రాశాను ఆ ఉత్తరము.

# సాగుతున్న యాత్ర

వాస్తవిక జీవితము ఊహాజీవితముకంటే విచిత్రంగా ఉంటుంది, ఒకొక్కప్పుడు:

నేను ఢిల్లీచేరిన మరునాడే, ఆఫీస్‌కు వెళ్ళేసరికి, నాకు ఒక ఉత్తరాన్ని అందించారు. కానీకార్డు! ఆ కానీకార్డూ ఇద్దరి జీవితాలను పూర్తిగా మార్చివేసింది!! సందేశము నందుకొని, ఆ సాయంత్రమే మళ్ళీ రైలుఎక్కాను. ఇది రెండవసారి, నేను ఢిల్లీనుంచి పారిపోయి రావడము. కాని, ఈ సారిమాత్రం, నాఆశ నిరాశ కాలేదు. వేదవల్లికి నాపైన పరిపూర్ణమైన అనుగ్రహం కలిగింది.

మన జీవితములో సుఖదుఃఖాలు పూర్తిగా దైవనిర్ణయమే!..........మళ్ళా, ఇన్నాళ్ళకు మళ్ళాగృహస్థాశ్రమము - నా నలుబది ఐదవఏట.

నాకోసము కాకపోయినా, ఆ అవతలవారికోసము, జరిగిన నాజీవితము లోంచి ఒక ఇరవై ఏళ్ళు తీసివేస్తే!....జీవితము ఎంతబాగుంటుందీ అప్పుడు! పాతిక ఏండ్ల వయస్సులో, నేను!!

కాని, ఏ ఇరవై ఏళ్ళు తీసివెయ్యను?

అనీబిసెంట్ ప్రభావం నాపై ప్రసరించిన ఆ ఏళ్లు తీసివెయ్యనా?.... అరవిందునితో సల్లాపించిన ఆఏళ్లు తీసివెయ్యనా? మహాత్మునితో ఆ క్షణిక పరిచయమూ కల్గిన ఆ ఏళ్ళు తీసివెయ్యనా?....అన్నీ కావలసినవే! అన్నీ ఆప్యాయంతో దాచుకోవలసినవే!!

ఇరవై ఏళ్ళుకాదు, ఇరవై నిమిషాలు తీసివెయ్యలేను, ఈ జీవిత లోంచి! ప్రతినిమిషమూ విలువైనదే! ప్రతినిమిషములోనూ ఏదోఒక అమూల్యమైన అనుభవము ప్రకాశిస్తున్నది!!

ఎటువంటి జీవితము! ఎటువంటి జీవితము!!

* *
*

